- డా॥ అంబడిపూడి నాగభూషణం



# బాల వ్యాకరణము

## (అర్థదీపిక వ్యాఖ్య)

mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం – 533 101.

# అంకితము

బెదరు బేలతనంబు బెరయక కల నేని
నవరోధముల నెల్ల నవలఁ ద్రోచి,
విసుగువిరామమ్ముఁ బొసఁగనితలఁపుతోఁ
జేదోడుగా నెప్డు చెంత నుండి,
కష్టనష్టమ్ము లదృష్టమ్ము లని యెంచి
కర్తవ్యమతి మైత్రి గౌరవమున
ప్రతిఫలస్వోత్కర్షభావవిదూరతం
బను లెల్ల సఫలమ్ము లొనరఁజేసి,

'ధరఁ గలుగఁడు దిరుగ దాశరథి, యెపు డే
నెక్క డేనిఁ గోటి కొక్కఁ డగుచుఁ
దగులవచ్చు రాముతమ్ముఁ' డన్పించితి
పొలుగుళ్ల శ్రీనివాసరెడ్డి.

# నివేదనము

జననీజనకులు ఆదిలక్ష్మీప్రసాదులకు -

లక్షణాక్షరభిక్షఁ బెనిచి యాదరముతో నన్నివిషయములఁ
ప్రోత్సహించు
మాపూజ్యగురువర్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం గారికి -
పాదాభివందనములు.

ఈగ్రంథము కూర్పునకుఁ దోడ్పడినగ్రంథములకును,
తత్తద్గ్రంథకర్తలకును కృతజ్ఞతలు.

వివాదములు, చర్చలు మొద లైనవానికి ప్రసక్తి లేకుండ
విద్యార్థుల ఉపయోగము మాత్రమే ఉద్దేశించి
విద్యాలయపరీక్షలను దృష్టియం దుంచుకొని
అందుకు కావలసినఅంశములతో
దిక్ప్రదర్శనముగ ఈగ్రంథము కూర్పబడినది.

రూపప్రక్రియ, లఘువ్యాఖ్యలు(సాంకేతికపదవివరణము),
వాక్యవివరణము, వ్యాసప్రశ్నలు, అనుఅంశములు
'బాలవ్యాకరణదిగ్దర్శిని' గ్రంథమునఁ జూడఁదగును.

వ్యాకరణశాస్త్రముపై నభిమానము గలిగినవారికి,
అవసరము గలిగినవారికి,
ఇది ఏకొంచె మైన ఉపయోగించిన
ఈప్రయత్నము సార్థకమైన దని తృప్తిచెందుదు.

ఋ,ఋా తరువాతిఅచ్చులు కంప్యూటర్‌లో లేకపోవుటచే (లు,లూ')
అని చూపబడినవి. అట్లే జకారము ద్విత్వము రామి, దుజు ఇత్యాదులలో
ఒకజకారము మాత్రమే చూపబడినది. ఇట్టివి గమనించి గ్రహింపదగును.

గ్రంథమునందు గానవచ్చినపొరపాట్లను తెలియజేసి వానిని సరిచేసికొను అవకాశము గల్పింప విన్నపము.

**అంబడిపూడి నాగభూషణం**

శ్రీహయగ్రీవాయ నమః

కం. శ్రీలతకుం బ్రాఁ కయి వృష
శైలంబున వెలసి తనదుచాయ కెలయుధ
న్యాళి దగ మాన్చి కోర్కులు
చాలంగా నొసఁగుకల్పసాలము గొలుతున్.

కం. ఆనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

ఆ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వకవులలక్ష్య
ములను లాఁతిలక్ష్మములఁ గాంచి తక్కుల
క్షణ మెఱింగికొనుఁడు చతురమతులు.

– 000 –

కం. మును మదుపజ్ఞం బగుచుం
దనరినవ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్.

కం. తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బునమూలం బయినకృతిని బోలఁ గనఁ దగున్.

# పీఠిక

ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులు చేసినవి పెక్కులు కానఁబడుచున్నవి. కొన్ని లక్షణగ్రంథములపేర్లు మాత్ర మిప్పుడు వినఁబడుచున్నవి. కానఁబడుచున్నకొన్నిలక్షణగ్రంథములందు సంస్కృతసమములకు లక్షణములు బహుతరముగా రచింపఁబడినవి. కాని తక్కినభాషకు విశేషాకారముగా రచింపఁబడినవి కావు. కాఁబట్టి యాలక్షణగ్రంథములు చదువువారికి నిస్సందేహముగా వచనరచన సేయుకౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమము చేయక రానేరదు. భాషాసమష్టికి లక్షణగ్రంథము కుదిరినపక్షమం దంత శ్రమపడఁబనిలేదు. తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలనిలక్షణపరిజ్ఞాన మంత శ్లాఘ్యము కాదు. కాని తుదముట్ట సర్వలక్షణపరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానముచేతనే సాధించుట మిక్కిలి దుష్కరము. కాఁబట్టి యిట్టికొఱంత వారింపఁబూని పెక్కులక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని నానేర్పుకొలఁదిని సంస్కృతభాషలో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆగ్రంథము బాలురకు సుసాధము గాకుండువలన దానియందలిసూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృతగ్రంథరూపముగా రచించినాఁడ.

## కందము

**మానితపునడకపేరిమి**
**మానసమున కింపుఁ బెంప మనునంచలకున్**
**బోనిడి నీరసనీరము**
**జానుగ క్షీరంబు గొనుట సహజము కాదే.**

**పరవస్తు చిన్నయ సూరి.**

# బాలవ్యాకరణము

## సంజ్ఞాపరిచ్ఛేదము

**1. సంస్కృతమునకు వర్ణము లేఁబది.**

**అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ (ఌ, ౡ) ఎ ఏ ఐ ఓ ఔ అం అః, క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.**

**ఇం దకారాదు లచ్చులు. కకారాదులు హల్లులు.**

**అజ్ఝల్విభాగ మీలాఁగుననే మీఁద నెఱుంగునది.**

(పాణినీయాదులచే) సంస్కరింపబడినభాష కావున సంస్కృతము. ధ్వనులను వర్ణించునది గావున వర్ణము. సంస్కృతభాషకు వర్ణములు ఏఁబది. సంస్కృత భాషయందలిపదములు అన్నియు ఈఏఁబది వర్ణములతో మాత్రమే ఏర్పడును. వాఙ్మయమును విభాగించునపుడు (గ్రంథములు) వాక్యములుగను, వాక్యము పదములుగను, పదము అక్షరములుగను, అక్షరము వర్ణములుగను విడిపోవును. కావున ఏభాష కైనను మూలపదార్థము వర్ణమె. భాషకు వ్యాకరణము చెప్ప బూనినపుడు దానికి మూల మైనవర్ణములను గూర్చి ముందుగా చెప్పుట సక్రమము. ఆంధ్రభాషలో సంస్కృతసమములు అధికము. అం దుండునవి సంస్కృతవర్ణములు. కావున ఆంధ్రవ్యాకరణమున ముందుగా సంస్కృతవర్ణములు చెప్పబడినవి.

అకారము మొద లగునవి అచ్చులు. 'కకారాదులు హల్లులు' అనుటచే కకారమునకు పూర్వమువర కున్న '16' వర్ణములకు అచ్చులు అని సంజ్ఞ. అనుస్వారము, విసర్గ అనునవి ముందు స్వరము లేక పలుకుట కష్టసాధ్యము. ఇంకను అవి స్వరమును అనుసరించియె ఉండును. అందుకె అచ్చులలో మొదటి దగుహ్రస్వ మైనఅకారమును ముందు చేర్చి అనుస్వార, విసర్గములు అం, అః అని చూపబడినవి. కకారమునకు పూర్వమె నిర్దేశింపబడుటచే తెలుగున

అనుస్వారవిసర్గములు అచ్చులే అగును. కాని హల్లులు కావు. అచ్చతెనుగునందలి 'ఎ, ఒ, అరసున్న' అనుమూడు అచ్చులును సంస్కృతభాషలో లేవు.

కకారము మొదలుకొని ఉన్న 34 వర్ణములకు హల్లులు అని సంజ్ఞ. క్, ఖ్ అనువిధముగా పొల్లులకే హల్లు అని పేరు. పొల్లులను ఉచ్చరించుట కష్టము. అందుచేత సులువుగా ఉచ్చరించుటకై అనగా ఉచ్చారణసౌకర్యమునకై 'క్' మొద లగుహల్లులపై అచ్చులలో మొదటి దైనహ్రస్వ మగుఅకారమును చేర్చి, క ఖ ఇత్యాదిగా నిర్దేశించెను. 16 అచ్చులు, 34 హల్లులు. మొత్తము సంస్కృతమునకు వర్ణములు 50.

**2. ప్రాకృతమునకు వర్ణములు నలువది.**

**అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః. క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.**

**కొందఱమతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱమతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రము లని, ఐ ఔ లు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురు.**

ప్రాకృతభాషకు వర్ణములు నలువది. ప్రాకృతభాషయందలిశబ్దము లన్ని ఈ నలువదివర్ణములతో ఏర్పడును. సంస్కృతమునకు పిదప ప్రాకృతభాషనుండి శబ్దములు తెలుగులోనికి వచ్చుచున్నవి. కావున సంస్కృతమునకు పిదప ప్రాకృత వర్ణములు చెప్పఁబడినవి.

'అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః' అను పదివర్ణములును అచ్చులు. కకారము మొదలుకొని ళకారమువరకు ఉన్న 30 వర్ణములును హల్లులు. కాగా 10 అచ్చులు, 30 హల్లులు కలిసి ప్రాకృతమునకు వర్ణములు 40.

ప్రాకృతమున ఎ ఒ, అనుహ్రస్వములు సైతము కల వని కొందరు ప్రాకృత వైయాకరణులు చెప్పిరి. మరి కొందరు ఐ ఔ అనువర్ణములును ప్రాకృతమునందు కల వని చెప్పిరి. ప్రాకృతమున విసర్గమును, నకారమును లే వనియు కొందరు అందురు. స్వవర్గాక్షరములతో సంయుక్తము లయి ఙ, ఞ అనువర్ణములు ప్రాకృతమునందు కలవు.

సంస్కృతవర్ణములలోని ఋ ౠ (ఐ ఔ) అనుఅచ్చులును. (ఙఞ) శ ష అనుహల్లులును ప్రాకృతమునందు లేవు.

**3. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు.**

**అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ ఔ అం అఁ. క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.**

తెనుగుభాషకు సహజముగా ఉన్నవర్ణములు 36. అకారము మొదలుకొని అరసున్న వర కున్న 14 వర్ణములును అచ్చులు. అం అనుచోట నిండుసున్నవలె అఁ అనుచోట అరసున్న సయితము ముందు అచ్చు లేకుండ ఉచ్చరింపబడదు. కావున ఉచ్చారణసౌకర్యమునకై అచ్చులలో మొదటి దైనహ్రస్వ మగుఅకారమును అరసున్నకు ముందు చేర్చి, అఁ అని నిర్దేశించెను. సంస్కృతమునందు ఉన్న ఋ ౠ(ఌ,ౡ) విసర్గ అను 5 అచ్చులును తెనుగుభాషలో లేవు. తెలుగులో ఉన్న 'ఎ, ఒ, అరసున్న' అను 3 అచ్చులు సంస్కృతభాషలో లేవు.

కకారము మొదలుకొని ళకారము వర కున్న 22 వర్ణములకును హల్లులు అని పేరు. సంస్కృతభాషలో ఉన్న వర్గద్వితీయ (ఖఛఠథఫ), చతుర్థ (ఘఝఢధభ) అక్షరములు, ఙ,ఞ,శ,ష అను 14 హల్లులు తెలుగులో లేవు. తెలుగుభాషలో ఉన్నదంత్యచజలు సంస్కృతములో లేవు. రేఫముయొక్క అలఘూచ్చారణముచే ఏర్పడినది కావున శకటరేఫము (ఱ) ప్రత్యేకవర్ణముగా వర్ణమాలలో పరిగణింప బడలేదు. 14 అచ్చులు, 22 హల్లులు కలిసి తెలుగునకు మొత్తము వర్ణములు 36.

తెలుగుభాషలోనిపదము లన్ని ఈ 36 వర్ణములతోనే ఏర్పడును. దేశ్యములే కాక ప్రాకృతసమతద్భవశబ్దములు సైతము ఈ 36 వర్ణములతోనే ఏర్పడుచున్నవి.

**4. ఋ ౠ (ఌ ౡ) విసర్గ ఖ ఛ ద థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁ బడు.**

**ఋతువు పితౄణము క్లృప్తము (ౡ)కారము దుఃఖము ఖడ్గము ఘటము ఛత్రము ఝరము కంఠము ఢక్క రథము ధరణి ఫలము భయము పఙ్క్తి ఆజ్ఞ శరము షండము.**

తెనుగునకు వర్ణములు 36. వీనిలో ఎ, ఒ, అరసున్న, దంత్యచజలు అను 5 వర్ణములు సంస్కృతమునందు లేకుండ తెలుగున మాత్రమే విశేషముగా ఉన్నవి. ఇక మిగిలియున్న (36–5=31) వర్ణములును సంస్కృతమునం దున్నవి తెలుగునను కలవు. సంస్కృతమునందలి 50 వర్ణములలోను తెలుగున సమానముగా ఉన్న ఈ 31 వర్ణములు పోగా మిగిలియున్నవి 19. ఇవి

సంస్కృతసమములద్వారమున సంస్కృతమునుండి తెలుగుభాషలో వ్యవహరింప బడుచున్నవి.

ఋతువు, పితౄణము అనువిధముగా ఋకారము మొద లగునవి సంస్కృత సమశబ్దములం దుండి తెలుగులోనికి ప్రవేశించుచున్నవి.

తెలుగునకు సహజముగా ఉన్న 36 వర్ణములును, సంస్కృతసమముల ద్వారాన సంస్కృతమునుండి అధికముగా వచ్చి చేరు పై 19 వర్ణములును గలిసి, మొత్తము తెలుగుభాషకు వర్ణములు 55 అగుచున్నవి. సంస్కృతసమేతర మైనఆంధ్రభాషకు వర్ణములు 36. కాగా సంస్కృతసమసహిత మైనఆంధ్రభాషకు వర్ణములు 55. అందు అచ్చులు 19. హల్లులు 36.

'సంస్కృతసమంబులను గూడి' అనుటచే తెనుగున లేనివర్ణములు ప్రాకృత భాషయందు ఉన్నప్పటికిని ప్రాకృతసమములద్వారమున తెనుగులోనికి ప్రవేశింపవు. ప్రాకృతసమములో పై 36 వర్ణములకంటె వే రైనవర్ణ ముండదు. అందుచే ఈ 19 వర్ణములలో ఏఒక్కటి ఉన్నను ఆతెలుగుశబ్దము సంస్కృతసమ మని స్థూలముగా గుర్తింపవచ్చును.

ఈ 19 మాత్రమే కాక సంస్కృతమున మిగిలిన 31 వర్ణములును సంస్కృత సమములం దుండవచ్చును. విద్య, సీత. ఇట్లే ప్రాకృతసమములందును. సిరి రాణి. అయినను ఈవర్ణములు తెలుగులో సహజముగ కలవు. కావున విశేషముగా ప్రస్తావింపబడలేదు.

చంద్రుడు, చామరము అనువిధముగా అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లతో గూడిన తాలవ్యచజలు గూడ సంస్కృతసమములను గూడియె తెలుగున వ్యవహరింప బడును. అఅచ్చులతో గూడిన చజలు అచ్చతెలుగున దంత్యము లగును.

**5. కచటతపలు పరుషంబు లని గజడదబంబులు సరళంబు లని చెప్పంబడు.**

సంస్కృతసమములతో గూడిన మొత్తము ఆంధ్రభాషయందును క చ ట త ప అనువర్ణములు పరుషములు అనియు, గ జ డ ద బ అనువర్ణములు సరళములు అనియు చెప్పబడుచున్నవి. కచటతపాః పరుషాఖ్యాః, గజడదబా స్తు సరళాః అని ఆంధ్రశబ్దచింతామణియందు చెప్పబడెను.

కచటతప, గజడదబ అనుచోట్ల మీద ఉన్న అకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున పరుషము, సరళము అనుఈసంజ్ఞలు పొల్లులకె. క్ – పరుషము. గ్ – సరళము మొ.

'దంత్యతాలవ్యంబు లైనచజలు సవర్ణంబులు' అనుసూత్రము ననుసరించి

'కచటతపలు పరుషంబులు' అనుచోటి తాలవ్యచకారముచే దంత్యచకారము గ్రహింపబడును. కావున ఇచ్చట తాలవ్యచకారమునకు విధింపబడిన పరుషము అనుసంజ్ఞ దంత్యచకారమునకును సిద్ధించి, అదియు పరుషమె అగును. కచటతపలు అరును పరుషములు. ఇట్లే 'గజడదబలు సరళంబులు' అనుచోటి తాలవ్యజకారముచే దంత్యజకారమును గ్రహింపఁబడి అదియు సరళమె అగును. గజజడదబలు అరును సరళములు.

పరుష సరళసంజ్ఞలు అవ్యుత్పన్నములు.

**6. ఇతరము లగుహల్లులు స్థిరములు.**

**ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.**

ఇతరములు అనగా చెప్పగా మిగిలినవి. 'కచటతపలు పరుషంబు లని గజడదజలు సరళంబు లని చెప్పంబడు' అనుపూర్వసూత్రమున పరుషములు, సరళములు, చెప్పబడినవి. కావున కచచటతప అనుపరుషములును, గజజడదబ అనుసరళములును (12) గాక మిగిలినహల్లులకు స్థిరము లని సంజ్ఞ. ఇట్లు ఖ ఘ ఙ మొద లగు (36-12) 24 హల్లులకు స్థిరము లనుపేరు ఏర్పడినది.

ఇచ్చట గూడ ఖ ఘ మొద లగువానిలో మీదిఅకారము ఉచ్చారణ సౌకర్యమునకై చేర్పబడినది. కావున పొల్లులకే స్థిరసంజ్ఞ. ఖ్, ఘ్ మొ.

'ఇతరములు' అనుటచే పరుషసరళములకు స్థిరము లనుసంజ్ఞ లేదు.

సూత్రమున 'హల్లులు' అనుటచేత పరుషసరళములకంటె ఇతరము లైనను అచ్చులకు స్థిరసంజ్ఞ లేదు.

స్థిరము అనుసంజ్ఞయును అవ్యుత్పన్నమె.

ఖ ఘ జ ఇత్యాదిగా ఇచ్చట చూపుటనుబట్టి పూర్వము చెప్పినపరుషసరళ సంజ్ఞలును, ఇచ్చటి స్థిరసంజ్ఞయును అచ్ఛికములందే కాక సంస్కృతసమములందుఁ గూడ చెల్లుట స్పష్ట మగుచున్నది.

**7. దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు.**

**తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, దాలవ్యజకారంబు దంత్య జకారంబునకును గ్రాహకము లని తాత్పర్యము.**

చజలు తాలుస్థానీయములు. తాలువు అనగా నోటియదు పైభాగమున ముందరిదంతములకు లోపలివైపున కొంచెము పైనుండు ప్రదేశము. తాలువుతోపాటు దంతముల సహాయము గూడ గలిగి పలుకబడు చజలు

దంత్యచజలు, కేవలము తాలువుసహాయముతో పలుకబడు చజలు తాలవ్యచజలు. సవర్ణములు అనగా సమాసము లైనవర్ణములు. సంస్కృతమున చజలు తాలవ్యములు మాత్రవే అయిఉండును. దంత్యములు గూడ అగుట అచ్చతెనుగులో మాత్రమే. కావున అచ్చతెనుగులో ఉన్న దంత్యచజలును, ఎల్లెడల ఉన్న తాలవ్య చజలును పరస్పరము సమానము లైనవర్ణము లని సూత్రార్థము.

ఈసవర్ణతవలన లక్షణమునందు ఎచ్చట నైన తాలవ్యచకారము ప్రసక్త మైనపుడు అచ్చట నున్నతాలవ్యచకారముచే దంత్యచకారము గ్రహింపబడును. అనగా తాలవ్యచకారమునకు విధింపబడినకార్యము దంత్యచకారమునకు గూడ సిద్ధించుట సవర్ణతవలన ప్రయోజనము. 'కచటతపలు పరుషంబులు' అనుచోటి తాలవ్య చకారముచే ఇట్లు దంత్యచకారము గ్రహింపబడగా అచట తాలవ్యచకారమునకు విధింపబడిన 'పరుషము' అనుసంజ్ఞ దంత్యచకారమునకును కలిగి దంత్యచకారము పరుష మగును. ఇట్లే ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనుసూత్రముచే యథాక్రమముగా తాలవ్యచకారమునకు సిద్ధించుసకా రాదేశము దంత్యచకారమునకును గల్గును. 'అపుడు చనియె–అపుడు సనియె. మొ.

ఇట్లే దంత్యతాలవ్యజకారములు సవర్ణములు కావున తాలవ్యజకారమునకు విధింపబడినకార్యము దంత్యజకారమునకు సిద్ధించును. 'గజడదబలు సరళంబులు' అనుచోటితాలవ్యజకారముచే దంత్యజకారము గ్రహింపఁబడి ఆసూత్రముచే తాలవ్యజకారమునకు చెప్పబడినసరళసంజ్ఞ దంత్యజకారమునకు గల్గి, దంత్య జకారము సరళ మగుచున్నది.

**8. ఇఈఎఏలం గూడిన చజలు తాలవ్యంబులు.**

**చిలుక చీమ చెలి చేమ; జిల జీడి జెట్టి జేజె.**

చజలు అనుచోట మీదిఅకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున పొల్లులె గ్రహింపవలెను. తాలువు సహాయముచే ఉచ్చరింపబడునవి తాలవ్యములు. అచ్చతెనుగునందు, ఇ ఈ ఎ ఏ అనుఅచ్చులతో కలిసియున్న చకారమును, జకారమును తాలవ్యములు అగును. చ్+ఇ=చి. చిలుక, ఇచట ఇకారముతో గూడినది కావున చకారపుపొల్లు తాలవ్యము. ఇట్లే జ్+ఇ=జి. జిల. ఇచట ఇకారముతో గూడినది కావున జకారపుపొల్లు తాలవ్యము. ఇట్లే ఈ, ఎ, ఏ లతో గూడినవి తాలవ్యము లగును. చీమ, జేజె మొ.

**9. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔలం గూడినచజలు దంత్యంబులు.**

**చలి చాప చుక్క చూపు చొక్కు చోటు చౌక. జముఁడు జాతర జున్ను జూలు జోలి జౌకు. ఐదంతములు లయినచజలు సమేతరశబ్దములందు లేవు.**

తాలువుతోపాటు విశేషముగా దంతములయొక్క సహాయముతో ఉచ్చరింపబడు చజలు దంత్యచజలు. 'చజలు' అనుచో మీదిఅకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. అచ్చతెలుగుభాషలో అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ అనుఅచ్చులతో కూడి ఉన్నపుడు చకారపుపొల్లును, జకారపుపొల్లును దంత్యములు అగును. చ్+అ=చ. చలి. ఇచట అకారముతో కూడియున్నది. కావున చకారము దంత్యము. ఇట్లె జ్+అ=జ. జముఁడు మొ.

ఈనియమము అచ్చతెలుగుభాషలోనే. కావున అ ఆ ఉ ఊ ఓ ఔ (ఐ) లతో కూడియున్నప్పటికిని సంస్కృతసమములందలి చజలు తాలవ్యములే అగును. చంద్రుఁడు, జైత్రయాత మొ.

అచ్చతెలుగుభాషలో చకారము, జకారము అనుహల్లులు ఇ ఈ ఎ ఏ లతో కూడినపుడు తాలవ్యము లగును. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లతో కూడినప్పుడు దంత్యము లగును. ఇక మిగిలినఅచ్చులలో ఋ ౠ (ఌ, ౡ) విసర్గ అనునవి అచ్చతెలుగులో లేవు. కావున వానితో గూడినచజలు ఏ మగు నన్నప్రశ్న లేదు. అవి సంస్కృతమున గలవు. సంస్కృతమున చజలు తాలవ్యములు మాత్రమే. కావున ఋ ౠ (ఌ,ౡ) (విసర్గ)లతో కూడినచజలు తాలవ్యములే అగును. నిండుసున్న, అరసున్న అనుఅచ్చులు అచ్చతెలుగున కలవు. కాని అనుస్వారములు (విసర్గ) ఏదో ఒకఅచ్చునకు తరువాత ఉండునవే కాని, హల్లునకు పై నుండవు. అందుకే అం అఁ (అః) అని వర్ణమాలలో నిర్దేశింపబడుచున్నవి. కావున అనుస్వార (విసర్గ)సందర్భమున వానికి పూర్వమునం దున్నఅచ్చునుబట్టియే చజలు దంత్యములో తాలవ్యములో అగును. కాని అనుస్వార(విసర్గ)మునుబట్టి కాదు. చందము, చీఁకటి మొ. మిగిలిన అచ్చు ఐకారము. దానితో కూడిన చజలు అచ్చతెలుగులో లేవు. కావున ఐకారముతో కూడినచజలు దంత్యములా, తాలవ్యములా అన్నప్రశ్న లేదు. కాగా చజలు ఏయేఅచ్చుతో కూడినపుడు ఏ మగునో సమగ్రముగా చెప్పిన ట్లయినది.

**10. సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దముల యుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును.**

**ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లే వని తాత్పర్యము. ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందు వర్ణము, అర్చి-అర్చులు, రోచి-రోచులు, వీచి-వీచులు. రాజి-రాజులు, వాజి-వాజులు.**

**మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి.**

**ఇతరము లయినచజల కుదాహరణములు.**

**చంద్రుడు చామరము చక్రిక చూర్ణము చోరుఁడు చౌర్యము.**

**జయము జాతి జుగుప్స జూటము ఇత్యాదులు.**

సంస్కృతముతో తుల్యము లైనశబ్దములు సంస్కృతసమములు. ఇకారము చివర గలిగినశబ్దములు ఇకారాంతము లయినశబ్దములు. ఉపధ అనగా చివరి నుండి రెండవవర్ణము. ఇకారము చివర గలిగిన సంస్కృతసమశబ్దములలో ఉపధలుగా ఉన్న తాలవ్యము లైన చజలు బహువచనము పరముగా ఉన్నపుడు దంత్యములుగా మారును.

అర్చి అనుదానిపై ప్రథమావిభక్తియందు బహువచనమున లువర్ణము చేరి 'అర్చి+లు' అని ఉండగా 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, అర్చులు అని అగును. బహువచనము నందు ఉత్వముతో గూడినఈచకారము దంత్యము. ఇట్లే వాజి–వాజుల మొ.

'అచ్చతెలుఁగున' ఉత్వముతో గూడినచజలు దంత్యము లగుట సామాన్యము. 'సంస్కృతసమంబులందు' కూడ కొన్నియెడల అ ట్లగుట ఇందలివిశేషము.

రాజు అనుసంస్కృతసమశబ్దమునందు మాత్రము ఉత్వముతో గూడినజకారము దంత్య మగుచున్నది. ఇట్లే అచ్చు మొద లగుకొన్నింట దంత్యఉచ్చారణము గలదు.

సూత్రమున 'ఇకారాంతములు' అనుటచే విగతసంకోచులు, రవితేజులు ఇత్యాదులందు చజలు దంత్యములు కావు.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచేత ఏకవచనమునందు ఇవి తాలవ్యములే అగును. అర్చి, వాజి మొ.

'ఉపధాచజలు' అనుటచే ఖేచరి+లు=ఖేచరులు, రజని+లు=రజనులు మొద లగుచోట్ల (ఉపధ కాని)చజలు దంత్యములు కావు.

## 11. నకారంబు ద్రుతంబు.

నకారమునకు ద్రుతము అని సంజ్ఞ. ద్రుతము అనుసంజ్ఞకు ఒల్లనియెడ మఱిగిపోవునది అని అర్థము చెప్పుదురు. ఈసంజ్ఞ అవ్యుత్పన్నము.

నకారము అనగా పొల్ల ఐననకారము అనియే అర్థము. కావున పొల్లునకారము నకే ద్రుతము అనుసంజ్ఞను ఈసూత్రము పేర్కొనుచున్నది. అయినను చిన్నయసూరి ద్రుతకార్యములను చెప్పుసందర్భమున 'ను' అనుదానినె ద్రుతముగా చూపెను. ఆయాద్రుతప్రకృతికములద్రుతమును విధించుచోట్ల నువర్ణమునే విధించెను. ఇంకను 'లూట్టుడుఇఙ్లన కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు

లగు' అని సూత్రించి, మీకు మేలు గలుగుతను అని ఉదాహరించునపుడు ద్రుత మని చెప్పి, దానిని నువర్ణముగా చూపెను. దీనినిబట్టి నువర్ణమె ద్రుతము. నువర్ణమునందలి ఉత్త్వము ఇత్త్వ మయి 'ని' అని ఐనను (రాముని, హరిని మొ.) 'ను, ని' వర్ణములం దున్న అచ్చు లోపించి నకారము పొల్లుగా నున్నను (రామున్, హరిన్) ఏకదేశవికృత మనన్యవత్' అనున్యాయము ననుసరించి అది కూడ ద్రుతమె అగును.

ఎల్లయెడల నున్నది గాని, పొల్ల అయిననకారము మాత్రమే కాని ద్రుతము కానేరదు. ద్రుతప్రకృతికములచివరిద్రుతమును విధించు అయాలక్షణములు ఈ సూత్రమునందలి 'నకారంబు' అనుశబ్దముయొక్క అర్థమును ను (ని, న్) వర్ణము అని నియమించుచున్నట్లు గ్రహింపవలయును.

అయాద్రుతవిధానములను అనుసరించి ప్రత్యయమును, ఆగమమును ఐన నువర్ణమును, అవ్యయ మైననువర్ణము, వలెను మొద లగుశబ్దములలోని నువర్ణమును ద్రుతము అని గ్రహింపవలెను.

**12. ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు.**

**ప్రథమా కయి పట్టి యొక్కేతరము లయినవిభక్తులు, ఉత్తమ పురుషైక వచనంబులు, భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు, ఆశీరాద్యర్థంబు లయిన యెడుతవర్ణకంబులు, శతృతుమానంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులును, వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు.**

**నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్,**

**వత్తున్ - వచ్చెదన్. వచ్చెన్ - వచ్చున్ - వచ్చెడున్.**

**ప్రసన్ను లయ్యెడున్, కావుతన్.**

**కొట్టుచున్, కొట్టన్, కొట్టఁగన్, కొట్టుడున్, కొట్టినన్.**

**వలెన్ - ఎంతయున్ - అయ్యున్ - పోలెన్. ఇత్యాదు లూహ్యంబులు.**

ద్రుతము అంతమందు గలవి ద్రుతాంతములు, ద్రుతము అనగా నకారము. నకారము చివర గలిగిపదములకు ద్రుతప్రకృతికములు అని సంజ్ఞ. ఈసంజ్ఞయును అవ్యుత్పన్నమె. తెలుగుభాషలోనిద్రుతప్రకృతికములను ఇట్లు గ్రహింపవచ్చును.

**1. ప్రథమా కయి పట్టి యొక్క ఇతరము లయినవిభక్తులు :** ప్రథమావిభక్తి చివర గలిగినశబ్దములును, చతుర్థీవిభక్తి యగు 'కయి', పంచమీవిభక్తి యగు

'పట్టి' షష్ఠీవిభక్తి యగు 'యొక్క' అనునవి చివర గలిగినపదములును తప్ప మిగిలిన ద్వితీయాదివిభక్తులు అంతమందుఁ గలిగిన (ఏక బహువచనాంతము లగు) పదములు, ద్రుతప్రకృతికములు. నన్నున్ (ద్వితీయ), నాచేతన్, నాతోడన్ (తృతీయ), నాకొఱకున్ (చతుర్థి), నావలనన్, నాకంటెన్ (పంచమి), నాకున్, మాలోపలన్ (షష్ఠి), మాయందున్ (సప్తమి). మాలోపలన్, మాయందున్ అనునవి బహువచనములు గూడ అగుట గమనింపదగును.

**2. ఉత్తమపురుష ఏకవచనంబులు :** వర్తమానము మొద లగుఅర్థము లన్నిటి యందును ఉత్తమపురుషలో ఏకవచనాంతములు అయినశబ్దములు ద్రుత ప్రకృతికములు. నేను అన్నది కర్తగా కలిగినక్రియాపదములు ఉత్తమపురుష ఏకవచనములు. ఇవి ద్రుతప్రకృతికములు. (నేను) వత్తున్, (నేను) వచ్చెదన్.

**3. భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుష ఏకవచనంబులు :** భూతార్థమునందును తద్ధర్మము మొద లగుఅర్థములలోను, ఉన్న ప్రథమపురుషయందలి ఏకవచనాంతములు అయిన క్రియాపదములు ద్రుతప్రకృతికములు. నేను–మేము, నీవు–మీరు అనువానికంటె భిన్న మైనది కర్తగా గలిగిన, లిఙ్లోట్టుల ప్రథమపురుష ఏకవచనాంతపదము ద్రుతప్రకృతికము. (వాడు, మొ.) వచ్చెన్. (భూతార్థకము). (వాఁడు, మొ.) వచ్చున్, వచ్చెడున్ (తద్ధర్మాద్యర్థకము.)

**4. ఆశీరాద్యర్థంబు లయిన ఎడు త వర్ణకంబులు :** ఆశీస్సు, శాపము, సంప్రార్థనము అనుఅర్థములందు వచ్చు 'ఎడు', మరియు 'త' అనుప్రత్యయములు చివర గలిగిన క్రియాపదములు ద్రుతప్రకృతికములు. ప్రసన్ను లయ్యెడున్, (ఎడు), కావుతన్ (త).

**5. శతృతుమానంతర్యచేదాద్యర్థకంబులు:** 1) సంస్కృత మైన శతృప్రత్యయము యొక్క అర్థమునందు తెలుగున వచ్చు 'చు' అనుప్రత్యయము అంతమందుఁ గలవి (శత్రర్థకములు) ద్రుతప్రకృతికములు. కొట్టుచున్.

2) సంస్కృత మైన 'తుమున్' అనుప్రత్యయముయొక్క అర్థమునందు (ఇట్లే భావలక్షణార్థము) చెప్పబడిన 'నుజి' అనుప్రత్యయము చివర గలశబ్దములు ద్రుతప్రకృతికములు. కొట్టన్, కొట్టఁగన్.

3) అనంతర్యము అర్థమునందు చెప్పబడిన 'డు' అనుప్రత్యయము చివర గలిగినవి ద్రుతప్రకృతికములు. కొట్టుడున్.

4) చేత్, మరియు, వృత్తం బగుభావలక్షణము అనుఅర్థములందు విధింపబడిన 'న' అనుప్రత్యయము అంతమందు గల్గినవి ద్రుతప్రకృతికములు. కొట్టినన్.

ఇవి అన్ని అవ్యయములు.

**6. నేను తానుపదంబులు :** ప్రథమావిభక్తి చివర గలిగినశబ్దములలో నేను తాను అనునవి రెండుమాత్రము ద్రుతప్రకృతికము లగును, చేను, కను ఇత్యాదులందలినువర్ణము ద్రుతము కా దని అర్థము.

**7. వలెప్రభృతులు :** వలె మొద లగుఅవ్యయశబ్దములును ద్రుతప్రకృతికము లగును. వలెన్, పోలెన్, ఎంతయున్, అయ్యున్.

వలె ప్రభృతులలో చేర్చుకొనఁదగినశబ్దములను కవిప్రయోగముల ననుసరించి గుర్తింపవలెను.

## 13. ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు.

**రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - మేడ - అయ్య - అమ్మ. రామునికయి. జ్ఞానముఁబట్టి. నాయొక్క.**

**వచ్చిరి - వచ్చితివి - వచ్చితిరి - వచ్చితిమి. రాఁడు - రారు - రాదు - రావు - రాము. కొట్టక - తిట్టక. ఎత్తిలి ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి - అక్కట - ఏల. ఇత్యాదు లూహించునది.**

ద్రుతప్రకృతులు అనగా ద్రుతప్రకృతికములు. ద్రుతము చివర గలిగిన పదములు ద్రుతప్రకృతులు. ద్రుతప్రకృతులు కానివి అనగా చివర ద్రుతము లేనివి ఐనపదములకు కళ లని సంజ్ఞ. ఇట్లు భాషలోనిపదములు అన్ని ద్రుతప్రకృతులు, కళలు అని రెండుగా విభజింపబడినవి. కళ లయినపదములను ఇట్లు గుర్తింపవచ్చును.

1. ప్రథమా కయి పట్టి యొక్క ఇతరములు ద్రుతప్రకృతికములు. కావున ప్రథమా కయి పట్టి యొక్కలు చివర గలిగినపదములు కళలు. రాముఁడు, గోడ (ప్రథమ), రామునికయి, నాయొక్క మొ.

2. భూతతద్ధర్మాద్యర్థములందు ప్రథమపురుష ఏకవచనములు ద్రుతప్రకృతికములు. కావున ప్రథమపురుష బహువచనములు మొద లగునవి కళలు, వచ్చిరి (ప్రథమపురుషబహువచనము), వచ్చితివి, వచ్చితిరి (మధ్యమపురుష ఏకబహు వచనములు), వచ్చితిమి (ఉత్తమపురుషబహువచనము) మొ.

3. వర్తమానము మొద లగు అన్నిఅర్థములందును ఉత్తమపురుష ఏక వచనములు ద్రుతప్రకృతికములు. కావున ప్రథమపురుషైకవచనము (లిట్ లాట్టులందు తప్ప) మొద లగునవి కళలు. రాఁడు, రావు, రాము మొ.

4. శతృ తుమ్ ఆనంతర్య చేత్ ఆది అర్థకములు ద్రుతప్రకృతికములు. కావున తద్భిన్నము లగు క్త్వాంతములు మున్నగునవి కళలు. కొట్టి, తిట్టి కొట్టక, తిట్టక.

5. వలె ప్రభృతులు ద్రుతప్రకృతికములు గావున అందు చేరనిఇతరము లగుఅవ్యయములు కళ లగును. అక్కట, బళి, ఏల మొ.

ఇంకను ఇతరము లయిన కళ లగుశబ్దములను కవిప్రయోగములనుండి గుర్తింపవలెను.

**14. హ్రస్వమువీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును.**

**అడఁకువ – అడంకువ. అరఁటి – అరంటి. ఎఱుఁగుట – ఎఱుంగుట. బలఁగము – బలంగము. మగఁటిమి – మగంటిమి.**

ఖండబిందువు అనగా అరసున్న. పూర్ణబిందువు అనగా నిండుసున్న. వికల్పము లేదా వైకల్పికము అనగా విధింపబడినకార్యము వచ్చుటయు, రాకపోవుటయు అనురెండవస్థలు. హ్రస్వము, దీర్ఘము (ప్లుతము) అనుభేదము అచ్చులకే. ఖండబిందువునకు అనుచోటి షష్ఠీవిభక్తిచే 'షష్ఠీ స్థానే యోగా' అనుపరిభాష ననుసరించి దానిస్థానమున అని అర్థము వచ్చును.

హ్రస్వ మగుఅచ్చునకు మీద ఉన్న అరసున్నయొక్క స్థానమున నిండుసున్న వికల్పముగా వచ్చును.

అడఁకువ అనుచోట ప్రస్తుతసూత్రముచే అరసున్నస్థానమున నిండుసున్న వచ్చి అడంకువ అని అగును. వైకల్పికము అనుటచే నిండుసున్న రానిపక్షమున అరసున్న అట్లే యుండి అడఁకువ అనియు నుండును. ఇట్లు ఇతరములు.

'హ్రస్వముమీఁది' అనుటచే దీర్ఘముమీద నున్న అరసున్నకు నిండుసున్న రాదు. చీఁకటి, వీఁపు.

'ఖండబిందువునకు' అనుటచే పూర్ణబిందువు అట్లే ఉండును. బంతి, చేమంతి.

'ఖండబిందువు' అని సామాన్యముగా చెప్పుటచే శబ్దమునందు సహజసిద్ధ మైన అరసున్నకును, వ్యాకరణముచే సాధింపబడిన సాధ్యఖండబిందువునకును ఈవిధిచే నిండుసున్న వచ్చును. అడఁకువ–అడంకువ. వీటిఁడి– ఇచట 'ఇఁడి' అన్నది వ్యాకరణముచే విధింపబడినప్రత్యయము. కావున అందలి ఖండబిందువు సాధ్యము. దానికి పూర్ణబిందువు రాఁగా వీటిండి అనియు అగును.

**15. దీర్ఘమువీఁద సాధ్యపూర్ణము లేదు.**

**వాఁడు–వీఁడు–రాఁడు–లేఁడు–కాఁబోలు–కాఁబట్టి–గోఁగులు–రేఁగులు.**

పూర్ణము అనగా పూర్ణబిందువు. నిండుసున్న. వ్యాకరణముచే సాధింపబడిన పూర్ణము సాధ్యపూర్ణము. దీర్ఘ మైనఅచ్చునకు పైని వ్యాకరణముచే సాధింపబడు పూర్ణబిందువు ఉండదు.

రేఁగులు. రేను అనుశబ్దము బహువచనమున రేను+లు అని ఉండగా 'అట్లు రేసుగోనుశబ్దములనువర్ణంబు గు జగు' అనుసూత్రముచే సువర్ణము స్థానమున గుజు వచ్చి, రే+గులు అని అగును. గుజు జిత్తు కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే గువర్ణమునకు ముందు ఖండబిందువును, పూర్ణబిందువును రావలెను. పూర్ణబిందువు వచ్చినచో అది 'రే' అనుచో దీర్ఘముపై ఉండవలసి యుండును. లక్షణముచే సాధింపబడిన దగుటచే ఈపూర్ణబిందువు సాధ్యపూర్ణము. ప్రస్తుతసూత్రముచే దీర్ఘముమీద సాధ్యపూర్ణ ముండదు. కావున ఇచట నిండుసున్న రాదు. రేంగులు అనురీతిరూపము లుండవు. అరసున్న మాత్రము వచ్చి రేఁ గులు అని అగును.

'దీర్ఘముమీఁద' అనుటచే హ్రస్వముమీఁద సాధ్యపూర్ణ ముండును. రాముండు పూచెం గలువలు మొ.

'సాధ్య(పూర్ణము)' అనుటచేత దీర్ఘముమీద నైనను సిద్ధపూర్ణబిందువు ఉండవచ్చును. కాంచు, వాంచు మొ.

'(సాధ్య)పూర్ణము' అనుటచేత దీర్ఘముమీద వ్యాకరణముచేత సాధింపబడిన (సాధ్య)ఖండబిందువు ఉండవచ్చును. వాఁడు, రేఁగులు.

దీర్ఘముమీఁద సిద్ధఖండమునకు బాధయే లేదు. చీఁకటి. మొ.

అట్లే హ్రస్వముపైని సిద్ధఖండము, సాధ్యఖండమును ఉండుటలో బాధ లేదు. సిద్ధము – అడఁకువ, అరఁటి. సాధ్యము – రాముఁడు, పూచెఁగలువలు. మొ.

**16. సంస్కృతసమేతరము లయినతెలుఁగుశబ్దంబులయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది.**

**వంకర – కలఁకువ. మంచు – త్రాఁచు. దంట – దాఁటు. కొంత – కోఁత ఇత్యాదు లూహ్యంబులు.**

సంస్కృతముతో తుల్య మైనశబ్దము సంస్కృతసమము, సంస్కృతసమము కంటె వే అయినది సంస్కృతసమేతరము. అనగా ఆచ్ఛికము. బిందువు అని సామాన్యముగా చెప్పుటచే సిద్ధమును, సాధ్యమును ఐనఖండబిందువును, పూర్ణబిందువును గ్రహింపబడును. పరుషములు కచచటతపలు, సరళములు

గజజడదబలు. అచ్చతెనుగుశబ్దములందు అన్ని విధము లయినసున్నయును కచచటతప, గజజడదబ అనుహల్లులకు ముందు మాత్రమే ఉండును. ఉదా : త్రాఁచు(సిద్ధఖండము), ముంగర (సిద్ధపూర్ణము). కలఁకులు (సాధ్యఖండము), క్రొంబసిఁడి (సాధ్యపూర్ణము).

'సంస్కృతసమేతరములు' అనుటచే సంస్కృతసమములందు పరుష సరళేతరములకును ముందు బిందు వుండవచ్చును. కంఠము, కంసారి.

'పరుషసరళములకు' అనుటచే అచ్చతెనుగుశబ్దములలో పరుష సరళేతరములకు ముందు బిందు వెట్టి దయినను ఉండదు. 'కంసాలి' అని ఒక్కొక్కచో విని పించుశబ్దము 'కమసాలి'యే కాని కంసాలి కాదు.

**17. యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు.**

**ఎవఁడు, ఎక్కడ, ఏమి, ఏల. ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ. హరి యతఁడు, నిద్ర వోయె నిట్టిచోట్ల సంధివంశమున వచ్చినయకార వకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావు. వోఢృవోఢవ్యశబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వువూవో వర్ణాదు లగుశబ్దంబులు లే వని యెఱుంగునది. ఉదకము, ఊర్మిక, ఓదనము.**

వువూవొవో అనగా ఉఊఒఓలతో గూడినవకారము. 'సంస్కృతసమేతరంబు లయిన' అనుపూర్వసూత్రము ననుసరించి ఇచట తెలుగుమాటలు అనుదానికి సంస్కృతసమేతరము లయినతెలుగుమాటలు అని అర్థము గ్రహింపవలయును.

అచ్చతెనుగుశబ్దమునందు మొదట యకారము ఉండదు. అట్లే ఉ ఊ ఒ ఓ అను అచ్చులతో గూడిన వకారమును ఉండదు అని సూత్రమునకు అర్థము.

పదము మొదట ఇ ఈ ఎ ఏ అనుఅచ్చులు ఉన్నచోట అవి యి యీ యె యే అనువిధముగా యకారము మొదట గలిగి ఉచ్చరింపబడుచున్నవి. మిగిలినచోట్ల అచ్చతెనుగుపదముమొదట యకారము పొరపాటుగా కూడ లేదు. కావున యియీయెయేలు లే వనక యకారము లే దని సామాన్యముగా చెప్పెను. ఇఈఎఏలు గలచోట్ల గూడ పదముమొదట యకారము ఉండుట సరి కాదు. ఇఈఎఏ అనుఅచ్చులే ఉండవలెను. ఇతఁడు, ఈమె, ఎవఁడు, ఏమి.

అట్లే పదముమొదట ఉ ఊ ఒ ఓ అనుఅచ్చులు ఉన్నపుడు అవి వువూవొవో అనువిధముగా వకారముతో గూర్చి ఉచ్చరింపబడుచున్నవి. ఇది సరి కాదు. వుండ వూరు వొకఁడు వోడ అనురీతిగా పలుకుచోట్ల ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ అనువిధముగా ఉ ఊ ఒ ఓ అనుఅచ్చులే ఉండవలయును.

'యకారంబు(ను)' అని సామాన్యముగా చెప్పుటచే ఏఅచ్చుతో కూడిన దైనను యకారము అచ్చతెనుగుమాటకు మొదట ఉండదు. అతఁడు, ఇతఁడు మొ.

'వువూవొవోలు' అనుటచే ఉఊఒఓలకంటె వే రయినఅచ్చుతో గూడినవకారము మాటకు మొదట ఉండవచ్చును. వంకర, వాఁగు మొ.

'(సంస్కృతసమేతరము లయిన) తెలుఁగు(మాటలకు)' అనుటచే సంస్కృత సమములలో పదముమొదట యకారము ఉండవచ్చు. యముఁడు, యాత్ర,మొ.

ఇష్టము, ఈప్సితము మొద లగుచోట్ల సంస్కృతసమములయందును పదముమొదట యకారము ఉచ్చారణమునం దున్నను (అయిష్టము మొ.) అది సరి కా దని సంస్కృతము ననుసరించి గుర్తింపవచ్చును.

వువూవోలు సంస్కృతసమముసను పదముమొదట లేవు. ఉదకము, ఊర్మిక, ఓదనము మున్నగునవి. సంస్కృతమున వుకః, వోళికా ఇత్యాదిగ వు,వూ,వోలు ఉన్నను అట్టిపదములు తెలుగులో ప్రయోగింపబడవు. ఒ అనువర్ణము సంస్కృతభాషలోనే లేదు. కావున దానితో కూడినహల్లులు కొ ఇత్యాదిగా వొ అనునది కూడ పదముమొదటనే కాక, ఎచ్చటను సంస్కృతభాషయందే ఉండదు.

'మాటలకు' అనుటచే యొక్క, వు అనువిధముగా ప్రత్యయము మొద లగు అపదముమొదట యకారమును, వువర్ణమును ఉండవచ్చు. (వూవొవో వర్ణములు అపదములమొదట గూడ గానరావు.)

'మొదట' అనుటచే మాటలో అనాదియం దుండవచ్చును. కాయ, ఆవు.

**18. యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు.**

**హరి యతఁడు ఇత్యాదులం దాగమయకారము లఘువు.తక్కిన యకార మలఘువు.**

**విఱుగు మెఱు గిత్యాదులందు రేఫం బలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమతద్భవములందు లేదు. పెరుగు కరుగు ఇత్యాదులందు రేఫంబు లఘువు.**

**ఏళులు పాళులు త్రాళు లని బహుత్వమందు రలడల కాదేశ మయిన ళకార మఘువు. తల నెల ఇత్యాదులందలిలకారము లఘువు.**

**అతఁడు వలికె నిత్యాదులం దున్నపాదేశవకారము లఘువు.**

**తక్కినవకార మలఘువు.**

**వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరము గాని, యలఘు**

**ళకారము కా దని యెఱుంగునది.**

'య స్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః' అని సంస్కృతమున లఘూచ్చారణము వివరింపబడినది. ఏవర్ణము యొక్క ఉచ్చారణమునందు నాలుక చివరిభాగము, దానిసమీపభాగము, నాలుక నడిమిభాగము, మొదటిభాగము (బిగువుగా నుండక) శిథిలము (సడలు) అగునో ఆవర్ణము లఘువు. అట్టి శైథిల్యము లేనిఉచ్చారణము కలవర్ణము అలఘువు. యరలవ అనునాలుగువర్ణములును లఘువు, అలఘువు అనుభేదముతో ఒక్కొక్కటి రెండు విధము లైయున్నవి. యరలవ అనుచో యకారాదులకు మీద ఉన్నఅకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. కావున ఈభేదము య్, ర్, ల్, వ్ అనువిధముగా పొల్లులకు అనగా హల్లులకు మాత్రమే.

**1. యకారము – లఘువు :** సంధి లేనిచోట పరస్వరమునకు ఆగమముగా వచ్చినయకారము లఘువు. హరి **య**తఁడు.

**అలఘువు :** యడాగమయకారముకంటె వే రైనయకార మేది ఐనను అలఘువు, భుజి**యి**ంచు(యడాగమముకంటె వేరయినఆగమము), పో**యె**ను(ఆదేశము), కా**య** (సహజముగా ఉన్నది). మొ.

**2. రేఫము – లఘువు :** సాధురేఫము లఘువు. పె**రు**గు, క**రు**గు.

**అలఘువు :** శకటరేఫము (బండిఱా) అలఘువు. వి**ఱు**గు, మె**ఱు**గు.

**3.లకారము – లఘువు :** 'ల'కారము లఘువు. త**ల**, నె**ల**.

**అలఘువు :** బహువచనము పరముగా ఉండగా ర ల డ అనువానికి ఆదేశముగా వచ్చిన 'ళ'కారము అలఘువు. ఏరు+లు – ఏ**ళు**లు, పాలు+లు – పా**ళు**లు. త్రాడు+లు – త్రా**ళు**లు. ఇది దంత్యము. ళకారము వే రొకటి కూడ తెలుగుభాషయందు కలదు. అది మూర్ధన్యము. ఉదా. త**ళు**కు, బె**ళు**కు. మొ.

**4. వకారము – లఘువు :** గసడదవాదేశసందర్భమునందు పకారమునకు ఆదేశముగా వచ్చినవకారము లఘువు. అతఁడు+పలికె – అతడు **వ**లికె.

**అలఘువు :** పకారమునకు ఆదేశముగా వచ్చినది కాక మిగిలినవకారము ఎట్టి దైనను అలఘువు. చివురు (చిగురు గకారమునకు ఆదేశ మైనది), వంకర (సహజముగా ఉన్నది) మొ.

## 19. సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు.

| సంస్కృతము | - | సంస్కృతసమము |
| --- | --- | --- |
| రామః | - | రాముఁడు |
| విద్యా | - | విద్య |
| హరిః | - | హరి |
| ధేనుః | - | ధేనువు |
| భూః | - | భువి |
| పితా | - | పిత |
| గౌః | - | గోవు |
| నౌః | - | నావ |
| ద్యౌః | - | దివి |
| హృద్ | - | హృది |
| జగత్ | - | జగత్తు, జగము |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
| --- | --- | --- |
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| అటిః | ఆడీ | ఆడి |
| ఆలిః (పఙ్క్తి) | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది.

సంస్కృతముతోను ప్రాకృతముతోను సమానముగా ఉన్నతెలుగుభాషకు

తత్సమము అని సంజ్ఞ. దానితో (సంస్కృతప్రాకృతములతో) సమము అనుఅర్థమున ఈసంజ్ఞ వ్యుత్పన్నము. విశేషముగా చెప్పబడినచోట్ల తప్ప సంస్కృతమునందును ప్రాకృతమునందును ఏది ప్రకృతియో అది అట్లే తెలుగునందు గ్రహింపబడి ఆయావిభక్తులతో ఏర్పడినపదములకు తత్సమములు అనువ్యవహారము లాక్షణిక సమ్మత మై ప్రసిద్ధముగా గానవచ్చుచున్నది. కర్తృ – కర్త్రి. హలంతములు మొదలగునవి విశేషములు. అట్లే గుణవంత అన్నది తత్సమ మని సూరి ఒకచో చెప్పెను.

సంస్కృతముతో తుల్య మైనభాష సంస్కృతసమము. విద్యా – విద్య. ప్రాకృతముతో తుల్య మైనభాష ప్రాకృతసమము. సిరీ – సిరి మొ. సంస్కృత సమము ప్రాకృతసమము అనురెండింటిని గలిపి తత్సమము అని వ్యవహరింతురు. ఇందు ప్రాకృతసమము 'అచ్చతెనుగు'(ఆచ్ఛికము)లో చేరుచున్నది.

తత్సమము, సమము అనునవి అరుదుగా సంస్కృతసమము అనుఅర్థమున వ్యవహరించుట కలదు. 'తత్సమంబులం గోటిపిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడి'. 'ఐదంతము లయినచజలు సమేతరశబ్దములందు లేవు'. మొ.

ఆలిః పఙ్క్తౌ అనుటచే పంక్తి అనుఅర్థముననే ఓలి. చెలి అనుఅర్థమున 'ఓలి' కాదు.

**20. సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు.**

| సంస్కృతము | | సంస్కృతభవము |
|---|---|---|
| **ఆకాశః** | **–** | **ఆకసము** |
| **కుడ్యమ్** | **–** | **గోడ** |
| **చన్ద్రః** | **–** | **చందురుఁడు** |
| **తమఙ్గః** | **–** | **తమగము** |
| **తామరసమ్** | **–** | **తామర** |
| **నారాచః** | **–** | **నారసము** |
| **నిభః** | **–** | **నెపము, నెవము** |
| **ముఖమ్** | **–** | **మొకము, మొగము** |
| **మృగః** | **–** | **మెకము, మెగము** |
| **వక్రః** | **–** | **వంకర** |

| | | |
|---|---|---|
| వేసరః | - | వేసడము |
| సముద్రః | - | సంద్రము |
| సూచీ | - | సూది |
| స్మరః | - | మరుఁడు |
| హరణమ్ | - | అరణము |
| హరితాళమ్ | - | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| ఆఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | వనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము - పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | వెణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

సంస్కృతమునుండియు ప్రాకృతమునుండియు పుట్టినభాషకు తద్భవము అని సంజ్ఞ. వాని(సంస్కృతప్రాకృతముల)నుండి పుట్టినది అనుఅర్థముతో ఈసంజ్ఞ వ్యుత్పన్న మగుచున్నది. సంస్కృతము, ప్రాకృతమందలి ప్రకృతిసైతము మార్పులు పొందుచుండుటచే సామ్యము తగ్గుటవలన వానినుండి పుట్టినదిగా తద్భవము గుర్తింపదగియున్నది. విభక్తి సంబంధించినవికారములు తత్సమతద్భవములు

రెండింట యథార్థముగా సమానమే అనదగియున్నను, తెలుగున ప్రవేశించునప్పటికే సంస్కృతప్రాకృతప్రకృతులు మార్పులు చెందియుండుట తద్భవశబ్దములందలి విశేషము.

సంస్కృతమునుండి పుట్టినతెలుగుపదము సంస్కృతభవము. ఆకాశః – ఆకసము మొ.

ప్రాకృతమునుండి పుట్టినభాష ప్రాకృతభవము. ప్రయాణం – పయనము మొ.

సంస్కృతభవము, ప్రాకృతభవము అనురెండును గలిసి 'తద్భవము' అను సంజ్ఞతో వ్యవహరింపబడును.

**21. త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు.**

**ఊరు – పేరు. ఇల్లు – ముల్లు. కోట – పేట. దూడ – మేడ. కోఁత– లేఁత. తావి – మోవి. ఇత్యాదు లరయునది.**

శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము అనుమూడును త్రిలింగము లనియు అవి గలదేశము త్రిలింగదేశము అనియు అందురు. త్రిలింగదేశమునందలి జనులయొక్క వ్యవహారమునుండి సిద్ధించుభాషకు 'దేశ్యము' అని సంజ్ఞ. 'దేశే భవమ్ దేశ్యమ్' అని ఈసంజ్ఞ వ్యుత్పన్నము. తత్సమతద్భవశబ్దములకు మూలము సంస్కృతము లేదా ప్రాకృతమునుండి తెలియవచ్చును. దేశ్యములకు మూలము ఆదేశజనులవ్యవహారము మాత్రమె. ఉదా, ఊరు, పేరు మొ. ఇట ఊరు అనుశబ్దముయొక్క మూలస్వరూప మేది? ప్రకృతిప్రత్యయాదులు ఎట్లు? మొద లగువిషయములు తెలియుటకు సంస్కృతప్రాకృతములలో ఎట్టిఆధారము లభింపదు. జనులవ్యవహారము మాత్రమే ఆధారము. ఇట్లు దేశ్యము (త్రిలింగ) దేశవ్యవహారసిద్ధ మగుచున్నది.

అన్యదేశ్యము అనుఒకవిభాగమును సూరి పేర్కొనలేదు. కావ్యప్రయోగార్హ మగుఆంధ్రభాషను, తత్సవము, తద్భవము, దేశ్యము అని మూడుభాగములుగా సూరి నిరూపించెను. ప్రాచీనాంధ్రవాఙ్మయమును అనుసరించి తత్సమతద్భవేతర మయి కావ్యప్రయోగార్హ మగుఆంధ్రభాష దేశ్యముగా స్థూలముగా గుర్తింపవచ్చును.

'త్రిలింగదేశ' అనుటచే ఇతరదేశవ్యవహారమునకు ఇచ్చట దేశ్యసంజ్ఞ చెల్లదు.

**22. లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు.**

**వస్తాడు– తెస్తాడు. వచ్చేని – తెచ్చేని. వచ్చేవాడు – తెచ్చేవాడు. వచ్చేటివాడు– తెచ్చేటివాడు. ఈభాష ప్రయోగంబున కనర్హంబు.**

లక్షణ మనగా వ్యాకరణము. వ్యాకరణమునకు విరుద్ధముగా నున్నభాషకు గ్రామ్యము అని సంజ్ఞ. వ్యాకరణము ఏశబ్దమువిషయమున లక్షణమును ఏర్పరచినదో అలక్షణమునకు భిన్నముగా నున్నఆశబ్దము గ్రామ్యము అగును.

రాఁగలఁడు లేక వచ్చును అన్నవి లక్షణము ఏర్పరచినరూపములు, కాగా ఆ అర్థమునందు శబ్దము 'వస్తాడు' అనువిధముగా ఉండుట వ్యాకరణమునకు అనుగుణము కాదు. లక్షణమునకు విరుద్ధము. కావున గ్రామ్య మగును. ఇట్లే వచ్చెడువాఁడు లేక వచ్చెడివాఁడు అనులక్షణబద్ధమునకు విరుద్ధముగా నుండుటచే వచ్చేవాడు, వచ్చేటివాడు అనునవి గ్రామ్యము లగుచున్నవి.

ఏశబ్దమువిషయమున వ్యాకరణశాస్త్రమున లక్షణము చేయబడలేదో ఆశబ్దము గ్రామ్యము కాదు. ఆశబ్దమునకు లక్షణమే లేకపోవుటచేత లక్షణముతో విరోధమును ఉండదు. కావున అది గ్రామ్యసంజ్ఞను పొందదు. పాలించుకొఱకు, ప్రోవఁగదవె కలుగఁబట్టి మొద లగుశబ్దములను గూర్చి బాలవ్యాకరణమున ఏమియు చెప్పబడ లేదు. కావున అవి బాలవ్యాకరణపక్షమున గ్రామ్యము లగు ననరాదు.

### 23. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.

**పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపందగు నని తాత్పర్యము. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలగడ్డము, కపిలజడలు.**

ఆర్యులు అనగా పెద్దలు. ఇచ్చటి వ్యవహారము కావ్యవ్యవహారము. మహాకవులయొక్క కావ్యములందు ప్రయోగములలో కనబడినచో మాత్రము గ్రామ్యము గ్రహింపదగినది. లక్షణబద్ధ మైనభాష ఎచ్చట నైనను గ్రాహ్యమే. పూర్వసూత్రము లక్షణవిరుద్ధ మైనభాష గ్రామ్యముగా చెప్పుచు అది కావ్యములందు ప్రయోగించుటకు తగనిదిగా పేర్కొన్నది. కావున ప్రకరణమును అనుసరించి మహాకవిప్రయుక్త మైయున్నపుడు గ్రామ్యము సైతము గ్రహింపవలె నని ఈసూత్రమునకు అర్థ మగుచున్నది.

కఱకంఠుఁడు అనుచోట కఱ అనుఅచ్చతెనుఁగుశబ్దమునకు కంఠము అను సంస్కృతసమముతో మిశ్రబహువ్రీహిసమాసము కల్గుట లక్షణమునకు విరుద్ధము. ఇట్లె కపిల అనుకేవలసంస్కృతశబ్దమునకు కన్నులు, గడ్డము, జడలు అనువికృతి శబ్దములతో సమాసము లక్షణమునకు విరుద్ధము. కావున కపిలకన్నులు మొద లగుఈసమాసములు గ్రామ్యము లయినవి. అయినను నన్నయ, తిక్కన, శ్రీనాథుడు

మున్నగుమహాకవులు ప్రయోగించుటచే ఇవి గ్రామ్యము లైనప్పటికిని గ్రహింప దగును. అనగా వీనిని గ్రహించి ప్రయోగించుకొనవచ్చును. ఇట్టివానిని కొందరు అనింద్యగ్రామ్యములు అందురు. గ్రాహ్యగ్రామ్యము లనదగును.

'ఆర్యవ్యవహారంబుల' అనుటచే మహాకవులగ్రంథములం దున్నపుడే గ్రామ్యములు గ్రహింపదగును. ఆర్యులు అనార్యులు అనునిర్ణయము కష్టసాధ్యమె. అయ్యును దక్షిణాంధ్రయుగగ్రంథములందు ప్రచుర మైయున్నగ్రామ్యభాష ప్రమాణీకరింపరా దనుటలో తప్పు లేదు.

'దృష్టంబు' అనుటచే మహాకావ్యములం దుండి కనబడినదానిని మాత్రమె గ్రహింపవలయును. జాగరూకతతోచూచి గుర్తింపవలె నని అభిప్రాయము. ఇ ట్లనుటవలన ఆపద్ధతిలో స్వతంత్రముగా కల్పించి ప్రయోగింపరాదు. 'జీవగఱ్ఱ' అన్నది కవిసార్వభౌములు ప్రయోగించిరి గాన గ్రహింపదగును. కాని ఆపద్ధతిలో అల్పదండు, అనేకమాఱులు అనురీతిగా స్వతంత్రించి ప్రయోగింపరాదు. గౌరవముతో మహాకవిప్రయుక్త మైయున్నగ్రామ్యమునకు మాత్రమె ప్రయోగార్హత అంగీకరింపబడుచున్నది.

**ఇది సంజ్ఞాపరిచ్ఛేదము**

# సంధిపరిచ్ఛేదము

**1. ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు.**

**పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.**

**రాముఁడు + అతడు = రాముఁ డతడు**

**సోముఁడు + ఇతఁడు = సోముఁ డితడు**

**మనము + ఉంటిమి = మన ముంటిమి**

**అతఁడు + ఎక్కడ = అతఁ డెక్కడ**

**ఇతఁడు + ఒకఁడు = ఇతఁ డొకఁడు**

ఉత్తు అనుచో హ్రస్వ మైనఉకారమునకు పరముగా తకారము (ఉ–త్) చేర్ప బడినది. ఇట్లు తకారము పరముగా చేర్చుటను తపరకరణము అందురు. 'తపర స్తత్కాలస్య' అనుపాణినీయలక్షణము ననుసరించి ఉత్తు అనగా హ్రస్వ మైన ఉకారము.

పూర్వపరస్వరములకు పరస్వర మేకాదేశ మగుట సంధి. మొదటిశబ్దము చివర ఉన్నఅచ్చునకును పైనున్నశబ్దము మొదటిఅచ్చునకును రెండింటిస్థానమునను పరముగా నున్న రెండవశబ్దము మొదటిఅచ్చు వచ్చి నిలుచుట ఈసూత్రమునందలి సంధిశబ్దమునకు అర్థము.

హ్రస్వ మైనఉకారమునకు అచ్చు పరముగా నున్నపుడు సంధి అగును.

రాముఁడు+అతఁడు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే సంధి జరుగును. రాముఁడ్+ఉ = అతఁడు అనుచోట ఉ, అ అనుపూర్వపరస్వరములు రెంటి స్థానమునను పరస్వర మగు 'అ' అనునది ఆదేశముగా వచ్చి, రాముఁ డతఁడు అని అగును. ఇట్లె సోముఁడు+ఇతఁడు – సోముఁ డితడు మొ.

'ఉత్తు' అనుచోటితపరకరణమువలన దీర్ఘము(ఊకారము)నకు సంధి లేదు. ఎట్టూ+అని = ఎట్టూ యని.

'అచ్చు పరం బగునపుడు' అనుటచే హల్లు (లేదా అవసానము) పర మైనపుడు సంధి లేదు. రాముఁడు కలఁడు.

'అగు' అనుటచే సంధి నిత్యము. కావున సంధి జరుగక, 'రాముఁడు యతఁ డు' అనువిధముగా యడాగమము వచ్చినరూపములు ఉండవు.

**2. ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగును.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **నన్నున్** | **+** | **అడిగె** | **:** | **న న్నడిగె,** | **నన్ను నడిగె.** |
| **నాకొఱకున్** | **+** | **ఇచ్చె** | **:** | **నాకొఱకిచ్చె,** | **నాకొఱకు నిచ్చె.** |
| **నాకున్** | **+** | **ఆదరువు** | **:** | **నా కాదరువు,** | **నాకు నాదరువు.** |
| **నాయందున్** | **+** | **ఆశ** | **:** | **నాయం దాశ,** | **నాయందు నాశ.** |
| **ఇందున్** | **+** | **ఉన్నాఁడు** | **:** | **ఇం దున్నాఁడు,** | **ఇందు నున్నాఁడు.** |
| **ఎందున్** | **+** | **ఉంటివి** | **:** | **ఎం దుంటివి,** | **ఎందు నుంటివి.** |
| **వచ్చుచున్** | **+** | **ఉండెను** | **:** | **వచ్చు చుండెను,** | **వచ్చుచు నుండెను.** |
| **చూచుచున్** | **+** | **ఏఁగెను** | **:** | **చూచు చేఁగెను,** | **చూచుచు నేఁగెను.** |

ప్రథమకంటె ఇతరము లైనవిభక్తులు ప్రథమేతరవిభక్తులు. అనగా ద్వితీయ మొద లగునవి. సంస్కృత మగు 'శతృ' అనుప్రత్యయముయొక్క అర్థమునందు విధింపబడినచువర్ణము శత్రర్థచువర్ణము. పూర్వసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది అనువర్తించును.

ద్వితీయ మొద లగువిభక్తులలోను, శత్రర్థచువర్ణములోను ఉన్న ఉకారమునకు అచ్చు పరముగా ఉండగా సంధి వికల్పముగా వచ్చును. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి నిత్యముగా కావలసియుండగా ఇవి ద్రుతప్రకృతికములు కావున 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనుసూత్రముచే సంధి రాదు. కాని నిరవకాశ మగుఆవిధిని బాధించి సావకాశ మగుప్రస్తుతవిధిచే ఇచట సంధి వికల్పముగా వచ్చును. సంధిలో పూర్వపరస్వరములు రెండింటిస్థానమునను పరస్వరము ఏకాదేశము కావలయును. అట్టియెడల వానినడుమ నున్నద్రుతము నిల్చుట కుదురదు. కావున పూర్వపర స్వరములు, నడుమ ఉన్నద్రుతము అనుమొత్తమునకు పరస్వరము ఆదేశ మగును. (నన్న్+ఉన్+అ+డిగె – న న్నడిగె.)

మొత్తము ఆంధ్రభాషలో నన్ను–మమ్ము, నిన్ను–మిమ్ము, తన్ను–తమ్ము అను ఆరుస్థలములలో మాత్రమే ద్వితీయలో ఉకారము విభక్తికి సంబంధించిన దై యున్నది. మిగిలినవిభక్తులలో కొఱకు, కు, అందు అనుమూఁడిఁటిలో మాత్రమే చివర ఉకారము కలదు. కావున 'ప్రథమేతరవిభక్తి' శబ్దముచే వైకల్పికసంధి వీనియందే. సూరి ఇందు, ఎందు అనుఅవ్యయములను గూడ ఇచట చూపెను. అట్టిదే అయిన 'అందు' ఇట చేర్పదగును.

నన్నున్+అడిగె అని యుండగా ప్రస్తుతసూత్రముచే సంధి వచ్చినపక్షమునందు (నడుమ నున్నద్రుతముతో గూడ పూర్వపరస్వరమలకు పరస్వరము ఏకాదేశ మయి) న న్నడిగె అని అగును. వైకల్పికము అనుటచే సంధి రానిపక్షమునందు పొల్లు ఐనద్రుతము పై నున్నఅచ్చుతో కలిసి 'నన్ను నడిగె' అని అగును.

'ప్రథమేతర' అనుదళముచే ప్రథమావిభక్తులందలిఉకారమునకు ఈ సూత్రముచేత సంధి రాదు. రాముఁ డతడు, వన మేగెను. మొద లగువిధముగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే నిత్యసంధి అగును.

'విభక్తి' (యం దున్నఉకారము) అనుదళముచే ఉకారము విభక్తికి చెందిన దైనపుడే ఈసూత్రముచే సంధి వచ్చును. వనమున్+ఏఁగెను అనుచోట అది ప్రథమేతర(ద్వితీయ)విభక్తియే ఐనను ప్రాతిపదికమునకు చెందిన దగుటచే వనము అనుచోటి ఉకారమునకు ఈసూత్రముచే సంధి రాదు. 'ఉత్తునకు' అని ప్రాప్తించునిత్యసంధి ఇఁకాదిసూత్రముచే నిషేధింపబడుటచే రాదు. కావున వనము నేఁగెను.

'ఉకారమునకు' అనుదళముచేత ఉకారముకంటె వే రయినఅచ్చునకు ఈ సూత్రముచేత సంధి ప్రాప్తింపదు. అతనికంటెన్+ఇతఁడు–అతనికంటెనితఁడు.

**3. సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు.**

**ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.**

**మా + అమ్మ : మాయమ్మ.**

**మీ + ఇల్లు : మీయిల్లు.**

**మా + ఊరు : మాయూరు.**

స్వరము అనగా అచ్చు. యట్+ఆగమ అనుచోట టకారము ఇత్తు. టకారము ఇత్తుగా గలది కావున 'య'కారము టిత్తు అగును, 'ఆద్యన్తౌ టకితౌ' అనుపాణినీయ పరిభాష ననుసరించి టిత్తు అయినది దేనికి విధింపబడినదో దానికి అద్యవయవముగా అనగా విధింపబడినదానికి ముందుగా వచ్చి చేరును. ఇత్తు కావున సంస్కృతసంప్రదాయము ననుసరించి టకారము లోపించును. 'యట్'లో మిగిలినయవర్ణమునందు అకారము (య్+అ) ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున అది తొలగిపోవును. కాగా యకారపుపొల్లు మాత్రమె ఆగమముగా వచ్చును.

సంధి లేనిస్థలములలో అచ్చుకంటె పరముగా నున్నఅచ్చునకు ముందు యకారపుపొల్లు ఆగమముగా వచ్చును.

మా+అమ్మ అనుచోట సంధి ప్రాప్తించుట లేదు. కావున ప్రస్తుతసూత్రముచే పరస్వరమునకు పూర్వమునందు యకారము చేరి, మా+య్ + అమ్మ, మా యమ్మ అని యగును.

'సంధి లేనిచోట' అనుటచే రాముఁ డతఁడు మొద లగు సంధి జరుగు స్థలములందు యడాగమముప్రసక్తి లేదు.

'స్వరంబుకంటెన్' అనుటచే ద్రుతప్రకృతికములకు సంధి లేనిసందర్భమున (పరస్వరము ద్రుతమునకు అనగా నకారపుపొల్లు హల్లునకు పరముగా నుండుటచే) యడాగమము రాదు. నన్నున్+అడిగె, నన్ను నడిగె,

'అగు' అనుటచే యడాగమము నిత్యము. కావున మాఅమ్మ అనురీతిగా కావ్యవ్యవహారమునందు ఉండదు.

'పరం బయిన స్వరంబునకు' అని యడాగమమును పరస్వరమునకు చెప్పుటవలన అయ్యాశ్వము. ముయ్యేడు మొద లగుచోట్ల ద్విత్వము సిద్ధించుటలో ఔచిత్యము కల దందురు.

**4. అత్తునకు సంధి బహుళముగా నగు.**

**మేన + అల్లుడు = మేనల్లుఁడు, మేనయల్లుఁడు.**

**పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు.**

**చూడక + ఉండెను = చూడ కుండెను, చూడక యుండెను.**

**బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లేదు.**

**అమ్మ + ఇచ్చెను = అమ్మ యిచ్చెను**

**దూత + ఇతఁడు = దూత యితఁడు**

**చెలువుఁడ + ఇందము = చెలువుఁడ యిందము.**

**సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిఁ బూర్వకావ్యములందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునిక కృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు. గం గనుకాసె, నెలఁ తిచ్చెను. వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకము చేతనే యని యూహించునది.**

అత్తు అనుచోటి తపరకరణమువలన అత్తు అనగా హ్రస్వ మైన అకారము.

క్వచిత్ ప్రవృత్తిః, క్వచి దప్రవృత్తిః, క్వచిద్ విభాషా, క్వచి దన్య దేవ, విధే ర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి' అని సంస్కృతమున బహుళపదార్థము వివరింపబడినది. ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యము అనునాలుగు అవస్థలు బహుళపదముచే సంగ్రహింపబడును. వీనిలో ఏ రెండు ఉన్నను అచట 'బహుళ' విధానము సార్థక మగును. మొదటిసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది పూర్వసూత్రమును తప్పించి మండూకప్లుతితో ఈసూత్రములోనికి అనువర్తించును.

హ్రస్వ మైన అకారమునకు అచ్చు పర మగుచుండగా సంధి బహుళముగా వచ్చును.

**1. ప్రవృత్తి :** సూత్రమున విధింపబడినకార్యము నిత్యముగా వర్తించుట. కొన్నియెడల నున్న హ్రస్వ మైన అకారమునకు సంధి నిత్యముగా వచ్చును. వండుచున్న+వాఁడు అనుచోట తచ్ఛబ్దవకారము లోపించి, వండుచున్న+ఆఁడు అని యుండగా అచ్చటిఅత్తునకు ఈసూత్రముచే సంధి నిత్యముగా జరిగి వండుచున్నాఁడు అని అగును. వండుచున్నయాఁడు అనువిధ మైన సంధి రాని రూపము ఉండదు.

**2. అప్రవృత్తి :** సూత్రమున చెప్పబడినకార్యము అసలు వర్తింపకుండుట. కొన్నియెడల ఉన్న హ్రస్వ మైనఅకారమునకు సంధి లేనేలేదు. వెల+ఆలు - వెల యాలు. ఇచ్చట వెలాలు అనురీతిగా సంధి కాదు.

**3. విభాష :** సూత్రమున చెప్పబడినకార్యము వికల్పముగా వచ్చుట. కొన్ని యెడల నున్న హ్రస్వ మైన అకారమునకు సంధి వికల్పముగా వచ్చును.

మేన+అల్లుఁడు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే సంధి వికల్పముగా వచ్చును. సంధి జరిగినపక్షమునందు మేనల్లుఁడు అని అగును. సంధి జరుగనిపక్షమునందు 'సంధి లేనిచోట' అనుసూత్రముచే యడాగమము వచ్చి, మేనయల్లుఁడు అని అగును.

**4. అన్యకార్యము :** సూత్రమునందు చెప్పినచోట్ల గాక ఇతరస్థలములందు ఆకార్యము అగుటయు, సూత్రమునందు చెప్పినది గాక ఇతర మైనకార్యము అగుటయు అన్యకార్యము. తామర+ఆకు - తామరపాకు. అనుచోటి పుగాగమమును ఇట్లు అన్యకార్యముగా సాధించుకొనవచ్చును. (ఇట్లె బొమ్మ+ఇల్లు= బొమ్మరిల్లు, (పాము) పాఁప+అమ్మ=పాఁపరమ్మ (సమా. 20) మొద లగుచోట్ల రుగాగమము మొద లగునవి.

'అత్తు' అనుచోటితపరకణముచే దీర్ఘ మగు'ఆ'కారమునకు ఈసూత్రముచే

సంధి రాదు. మా+ఇల్లు - మాయిల్లు.

'అచ్చు పరం బగునపుడు' కావున హల్లు పర మైనచో సంధిప్రసక్తి లేదు. మేనకోడలు. మొ.

**5. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు.**

**ఏమి - మఱి - కిషష్ఠి.అది - అవి, ఇది - ఇవి, ఏది - ఏవి. ఇది యాకృతిగణంబు.**

**ఏమి + అంటివి = ఏ మంటివి, ఏమి యంటివి.**

**మఱి + ఏమి = మఱేమి, మఱి యేమి.**

**హరికిన్ + ఇచ్చె = హరి కిచ్చె, హరికి నిచ్చె.**

ఏమి మొద లగునవి ఏమ్యాదులు. ఏమి, మఱి, షష్ఠీవిభక్తి అయిన కి వర్ణము మొద లగునవి ఏమ్యాదులు. ఇత్తు అనుచోటితపరకరణముచే ఇత్తు అనగా హ్రస్వ మగుఇకారము. 'అచ్చు పరం బగునపుడు' అనునది పూర్వమునుండి అనువర్తించును.

ఏమి మొద లగుశబ్దములలోని(చివరి)హ్రస్వ మైనఇకారమునకు అచ్చు పరముగా ఉన్నపుడు సంధి వికల్పముగా వచ్చును.

ఏమి + అంటివి అని ఉండగా ప్రస్తుతసూత్రముచే సంధి వచ్చినపక్షమున 'ఏ మంటివి' అని అగును. వైకల్పికము అనుటచే సంధి రానిపక్షమున 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'ఏమి యంటివి' అని అగును.

కి షష్ఠి ద్రుతప్రకృతికము. 'ఇఁకాదులకుఁ దప్ప' అనుసూత్రముచే ప్రాప్తించు సంధినిషేధమును బాధించి ఏమ్యాదులలో పఠించినసామర్థ్యముచే ఈసూత్రముచే కిషష్ఠియందు సంధి వైకల్పికముగ జరుగును.

ఏమ్యాదిగణము ఆకృతిగణము. అనగా ప్రయోగములలో ఏశబ్దమునందలి ఇకారమునకు సంధి కలదో ఆశబ్దమును, ఏమి మొద లగువానిలో చేర్చుకొన దగును.

'ఏమ్యాదులు' అనుటచేత ఏమ్యాదులలో చేరనిశబ్దమునకు ఈసూత్రముచే సంధి రాదు. హరి+అతఁడు = హరి యతఁడు. తల్లి+ఉన్నది = తల్లి యున్నది.

ఇకారమునకు అన్నమాత్రమున దీర్ఘ మగుఈకారమునకు సంధి వచ్చు అవకాశము లేదు. ఏమ్యాదులలో ఉండున వన్నియు హ్రస్వ మైనఇకారము చివర గలిగినశబ్దములే. కావున ఇత్తునకు అనుతపరకరణమునకు స్పష్టతయును, లాఘవమును ప్రయోజనములు అనదగును.

'అచ్చు పరం బగునపుడు' కావున హల్లు పర మైనపుడు సంధిప్రసక్తి లేదు. ఏమి మాటలు, మఱి కొంత మొ.

**6. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.**

**వచ్చిరి + అప్పుడు = వచ్చి రప్పుడు, వచ్చిరి యప్పుడు**

**వచ్చితిమి + ఇప్పుడు = వచ్చితి మిప్పుడు; వచ్చితిమి యిప్పుడు**

'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్నగు' అనుసూత్రముచే విధింపబడిన 'డుఙ్' మొద లగుక్రియావిభక్తులు చివర గలిగినశబ్దములు క్రియాపదములు. ఇత్తు అనగా హ్రస్వ మైనఇకారము. పూర్వమునుండి 'ఉత్తునకు' అనుసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది ఇం దనువర్తించును.

క్రియాపదములందలి హ్రస్వ మైనఇకారమునకు అచ్చు పర మగునపుడు సంధి వికల్పముగా వచ్చును.

వచ్చిరి+అపుడు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే సంధి వచ్చి, 'వచ్చి రపుడు' అని అగును. 'వైకల్పికము' అనుటచేత సంధి రానిపక్షమునందు 'సంధి లేనిచోట' అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'వచ్చిరి యపుడు' అని అగును.

మధ్యమపురుషక్రియలలో ఇత్తునకు సంధి నిత్యముగా పిదప చెప్పబడుచున్నది. కావున వానికి ఇచ్చట వైకల్పికసంధి లేదు.

తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనములందును, భూతార్థమున ఉత్తమపురుషైక వచనములందును ఉన్నఇత్తునకు ఈసూత్రముచే సంధి ప్రాప్తించుచున్నను అవి ద్రుతప్రకృతికములు గావున 'ఇఁకాదిసూత్రముచే సంధినిషేధము గలుగును. కావున ఉండెడిన్ + అతడు, వచ్చితిన్+అనెను, మొద లగుచోట్ల ఈసూత్రముచే సంధి రాదు. అందుచేత మొత్తముమీద భూతార్థకప్రథమ, ఉత్తమపురుష బహువచనములును, వర్తమానార్థమున అమహదర్థమున ప్రథమ పురుషైక వచనములలో మాత్రమె ఇట సంధి జరుగుచున్నది. వీని నేమ్యాదులలో చేర్చినను సిద్ధింపగలదు. స్పష్టతకై వేఱుచేసి చెప్పియుండును.

'క్రియాపదములందు' అనుటచే ఇత్వము క్రియాపదమునకు సంబంధించిన దైనపుడే సంధి అగును. వండమి+అగును అనుచో ప్రయుక్త మైన ఇత్తునకు సంధి రాదు. వండమి యగును.

'ఇత్తునకు' అనుతపరకరణము స్పష్టతతోను, లాఘవముతో నున్న దని గుర్తింపదగును. క్రియాపదములలోను దీర్ఘ మగుఈకారము చివర గలవి లేవు.

**7. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును.**

**ఏలితివి + అపుడు = ఏలితి వపుడు.**

**ఏలితి + ఇపుడు = ఏలి తిపుడు.**

**ఏలితిరి + ఇపుడు = ఏలితి రిపుడు.**

యుష్మదర్థకము (నీవు, మీరు) కర్త(కర్మ)గా కలిగినక్రియలు మధ్యమ పురుష క్రియలు. ఇత్తు అనగా హ్రస్వ మైనఇకారము. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనుసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది అనువర్తించును.

మధ్యమపురుషక్రియాపదములందలి హ్రస్వ మైనఇకారమునకు అచ్చు పర మగునపుడు సంధి నిత్యముగా అగును. క్రియాపదములలో మధ్యమపురుషయందు చివర ఇత్వము ఉండుట భూత(తద్ధర్మ)అర్థమున మాత్రమే సంభవించును. కావున అచ్చటనే ఈసంధి జరుగును. ఇవి క్రియాపదములు గావున 'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' అనుసూత్రముచే రావలసియున్న వైకల్పిక సంధిని బాధించి, ప్రస్తుతసూత్రముచే సంధి నిత్యముగా వచ్చును.

ఏలితివి + అపుడు అని ఉండగా 'క్రియాపదంబులం దిత్తునకు' అను సూత్రముచే సంధి వికల్పముగా రావలసియుండగా దానిని బాధించి ప్రస్తుత సూత్రముచే సంధి నిత్యముగా జరిగి, 'ఏలితి వపుడు' అని అగును.

'మధ్యమపురుషక్రియలయందు' అనుటచే ఇతరము లయినప్రథమ, ఉత్తమ పురుషక్రియలలో ఈసూత్రముచే సంధి రాదు. 'క్రియాపదంబులం దిత్తునకు' అనుసూత్రముచే సంధి వైకల్పికముగా వచ్చును. వచ్చి రపుడు, వచ్చిరి యపుడు.

ఈసూత్రమునందును ఇత్తు అనుచోట తపకరణము స్పష్టత, లాఘవముకే అని గుర్తింపదగును.

'అగును' అనుటచే సంధి రాకుండుటకు అవకాశము లేదు. కావున ఏలితివి యపుడు అనువిధ మైన సంధి రానిరూపములు ఉండవు.

**8. క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు.**

**వచ్చి + ఇచ్చెను = వచ్చి యిచ్చెను.**

సంస్కృతమునందలి 'క్త్వా' అనుప్రత్యయముయొక్క అర్థమున తెలుగున 'ఇ' అనుప్రత్యయము చెప్పబడినది. క్త్వా అనుదానిఅర్థమునందు వచ్చినది కావున ఈ 'ఇ' వర్ణము క్త్వార్థము. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనుసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది ఇందు అనువర్తించును.

క్త్వార్థ మైన హ్రస్వ మగుఇకారమునకు అచ్చు పర మగునపుడు సంధి జరుగదు.

'ప్రాప్తిపూర్వకో హి నిషేధః' అనుపరిభాషను అనుసరించి ఏ దైనకార్యము ప్రాప్తించుచున్నపుడే నిషేధము చేయవలయును "అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱచుగ నగు' అనుసూత్రముచే ఆమ్రేడితము పర మైనపుడు క్త్వార్థక మగుఇత్తునకు సంధి ప్రాప్తించుచున్నది. ఈసూత్రము దానిని వారించు చున్నది. ఏఁగి యేఁగి.

ఆమ్రేడితము కాక ఇతరశబ్దము పర మైనపుడు క్త్వార్థక మైనఇత్తునకు సంధి ప్రాప్తియే లేదు. అయినను 'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః' (అవసర మైనచోటితోపాటు అనవసర మైనచోట గూడ మేఘము వర్షించుట) అనున్యాయము ననుసరించి అవసరము లేకున్నను ఆమ్రేడితము కానిది పర మైనచోట కూడ క్త్వార్థకేకారమునకు సంధిని ఈసూత్రము వారించును.

వచ్చి + ఇచ్చెను అని ఉండగా ప్రస్తుతసూత్రము ననుసరించి సంధి రాదు. కావున 'సంధి లేనిచోట' అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'వచ్చి యిచ్చెను' అని అగును.

'క్త్వార్థం బయిన' అనుటచే క్త్వార్థము కాని ఇకారమునకు ఈనిషేధము లేదు. యథావకాశముగా సంధి రావచ్చును. వచ్చి రపుడు మొ.

**9. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు.**

**ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.**

**వచ్చున్ + ఇపుడు = వచ్చు నిపుడు.**

**చూడన్ + అయితి = చూడ నయితి.**

**ఉండెడిన్ + అతఁడు = ఉండెడి నతఁడు.**

**ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని, ఈయువి యిఁకాదు లని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.**

ఇఁక మొద లగునవి ఇఁకాదులు, ఇఁక, ఇఁగ, ఎట్ట కేలకు, ఎట్ట కేని అనునవి ఇఁకాదులు. ఇవి ద్రుతప్రకృతికములు. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనుసూత్రమునుండి 'అచ్చు పరం బగునపుడు' అనునది ఇం దనువర్తించును.

ఇఁక మొద లగుశబ్దములకు తప్ప మిగిలినద్రుతప్రకృతికములకు అచ్చు పర మగునపుడు సంధి లేదు.

'ప్రాప్తిపూర్వకో హి నిషేధః' అనుపరిభాషను అనుసరించి నిషేధము ప్రాప్తి పూర్వకము కావలెను. ద్రుతప్రకృతికములకు ప్రాప్తించుచున్నసంధిని ఈసూత్రము

నిషేధించుచున్నది.

వచ్చున్ + ఇపుడు అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి నిత్యముగా ప్రాప్తించుచుండగా ప్రస్తుతసూత్రము నిషేధించుచున్నది. కావున సంధి రాదు. ద్రుతము మీదిఅచ్చుతో కలిసి 'వచ్చు నిపుడు' అని అగును. సంధి నిషేధముచే 'వ చ్చిపుడు' అనురూపము ఉండదు.

చూడన్ + అయితి అనుచో 'అత్తునకు సంధిబహుళంబుగా నగు' అనుసూత్రముచేతను, ఉండెడిన్+ అతఁడు అనుచోట 'క్రియాపదంబుల దిత్తునకు' అనుసూత్రముచేతను ప్రాప్తించుచున్న వైకల్పికసంధిని ఈసూత్రము నిషేధించు చున్నది. ఇట్లు సూరి ఉత్వ, అత్వ, ఇత్వసంధులు విధించినక్రమములో ఆసంధి ద్రుతప్రకృతికములలో లేకపోవుటను ఉదాహరించుచు ఈనిషేధము ప్రాప్తిపూర్వక మగుటను స్పష్టము చేసెను.

'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః' అనున్యాయము ననుసరించి, వచ్చెన్+ఎవడు, భక్తిమైన్+అడిగె, శ్రీన్+ఇచ్చె మొద లగుసంధిప్రాప్తి లేనిస్థలములందును ఈ నిషేధశాస్త్రము ప్రవర్తించును. వచ్చె నెవడు మొ.

**10. అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు.**

**ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనఁబడు. తఱుచుగ ననుటచే నొకానొకచోట వైకల్పికసంధియుం గల దని తాత్పర్యము.**

**ఔర + ఔర = ఔ రౌర**

**ఆహా + ఆహా = ఆ హాహా**

**ఎట్టా + ఎట్టా = ఎ ట్టెట్టా**

**ఓహో + ఓహో = ఓ హోహో**

**ఏమి + ఏమి = ఏ మేమి, ఏమి యేమి.**

**ఏఁగి యేఁగి యనుచో క్త్వార్థం బగుట సంధి లేదు.**

ఒకే శబ్దము రెండుసార్లు ఉచ్చరింపబడినపుడు అందు రెండవశబ్దమునకు ఆమ్రేడితము అని పేరు. ఆమ్రేడితము మొదటిఅచ్చు పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునందు (మొదటిపదముచివర) ఉన్న అన్ని అచ్చులకును సంధి తఱచుగా వచ్చును.

ఔర + ఔర అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనుసూత్రముచే సంధి బహుళముగా రావలసియుండగా దానిని బాధించి ప్రస్తుత సూత్రముచే సంధి నిత్యముగా జరిగి, 'ఔరౌర' అని అగును.

'అచ్చునకు' అని సామాన్యముగా చెప్పుటచే దీర్ఘములతో గూడ అచ్చు లన్నిటికిని ఇచట సంధి వచ్చును. ఎట్టూ+ఎట్టూ – ఎట్టెట్టూ, ఓహో+ఓహో– ఓహోహో.

'అచ్చునకు' అనుటచే హల్లునకు పర మైనచో సంధి రాదు. ఉండున్+ఉండున్. ఇచట ఆమ్రేడితము పరముగా ఉన్నను అచ్చునకు గాక హల్లునకు పర మగుటచే ఈకార్యము లేదు. ఉండు నుండున్. అరుగు నరుగున్. మొ.

'ఆమ్రేడితంబు పరం బగునపుడు' అనుటచే ఎట్టూ+అనె మొద లగువిధముగా ఆమ్రేడితము పరముగా లేనపుడు ఈసూత్రముచే సంధి లేదు. ఎట్టూ యనె.

'అచ్చు పరం బగునపుడు' కావున హల్లు పర మైనచో సంధికి ప్రసక్తియే లేదు. కలఁడు+ కలఁడు – కలఁడు కలఁడు.

'తఱుచుగ' అనుటచే అరుదుగా వైకల్పికసంధి కల దని సూరియే స్పష్టము చేసెను. ఏమి+ఏమి. ఇచట అచ్చునకు ఆమ్రేడితము పర మయినను ఈసూత్రముచే సంధి రాదు. ఇంక 'ఏమ్యాదులయిత్తునకు' అనుసూత్రముచే వైకల్పికముగా సంధి వచ్చును. సంధి వచ్చినచో 'ఏ మేమి'. సంధి రానిపక్షమునందు 'ఏమి యేమి'.

**11. అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు.**

| | | | | |
|---|---|---|---|---|
| **మూర** | **+** | **ఎఁడు** | **=** | **మూ రెఁడు** |
| **వీసె** | **+** | **ఎఁడు** | **=** | **వీ సెఁడు** |
| **అర్థ** | **+** | **ఇంచు** | **=** | **అర్థించు** |
| **నిర్జి** | **+** | **ఇంచు** | **=** | **నిర్జించు.** |

**అంద్వవగాగమంబులు పరంబు లగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు – రాములయందు, హరియందు, ఎనిమిదవది– ఎనిమిదియవది.**

పదము కానిది అపదము. ప్రత్యయము, ఆగమము మొద లగునవి అపదములు. అందు అనునది సప్తమీవిభక్తి. అవ(క్) అనునది సంఖ్యావాచకములకు పూరణార్థమున వచ్చు ఆగమము. అందు, అవ, అనునవి తప్ప మిగిలినఅపదముల మొదట ఉన్నఅచ్చు పర మైనపుడు అన్ని అచ్చులకును సంధి నిత్యముగా వచ్చును.

మూర+ఎఁడు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అను

సూత్రముచే సంధి బహుళముగా రావలసియుండగా దానిని బాధించి ప్రస్తుత సూత్రముచే సంధి నిత్యముగా జరిగి, మూరెఁడు అని అగును.

'అచ్చునకు' అని సామాన్యముగా నిర్దేశించుటచే అన్ని అచ్చులకును సంధి వచ్చును. అర్థ+ఇంచు – అర్థించు, వీసె+ఎఁడు – వీసెఁడు.

'అపద' అనుటచేత పదము పర మైనచో ఈసూత్రముచే సంధి రాదు. 'మూర+ అంత' అనుచో 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనుసూత్రముచేతనే వికల్ప సంధి అగును. మూరంత, మూర యంత.

'ఆదిస్వరము' అనుట స్పష్టత కని యెంచదగును. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అన్నట్లుగా ఈసూత్రమున గూడ 'అంద్వవగాగమంబులం దప్ప నపదంబు పరం బగునపుడు' అన్నను బాధ లేదు. వండు(+)ట, రాము(+)నకు మొ.

'అచ్చునకు' అనుటచే హల్లునకు సంధి రాదు. కాని హల్లునకు అపదాదిస్వరము పర మగుటయు సంధికి ప్రసక్తి గలుగుటయు ఎచ్చట నైన గల దేమో వెదుక వలయును.

'అగు' అనుటచే సంధి రాకుండుటకు అవకాశము లేదు. అనగా సంధి నిత్యమె. కావున 'మూరయెఁడు' అనువిధ మైన సంధి లేనిరూపముల కవకాశము లేదు.

**12. కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఁడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు.**

| | | | | |
|---|---|---|---|---|
| **కుఱు** | **+** | **ఉసురు** | **=** | **కుట్టుసురు** |
| **చిఱు** | **+** | **ఎలుక** | **=** | **చిట్టెలుక** |
| **కడు** | **+** | **ఎదురు** | **=** | **కట్టెదురు** |
| **నడు** | **+** | **ఇల్లు** | **=** | **నట్టిల్లు** |
| **నిడు** | **+** | **ఊరుపు** | **=** | **నిట్టూరుపు.** |

కుఱుచ, చిఱుత, నడుము, నిడుపు అనుశబ్దములలోని చివరిఅక్షరములును, కడున్ అనుదానిలో చివరిద్రుతమును సమాసమునందు లోపించును. సూత్రము నందు కుఱు చిఱు ఇత్యాదిగా అంతిమవర్ణలోపముతో నిర్దేశించుటనుబట్టి, సమాస మై, చివరివర్ణము లోపించినవానిని మాత్రమె ఇచట గ్రహింపవలయును. 'ఁడ'లు అనగా (కృదంత. 1.సూత్రమునందువలె) అచ్చుతో గూడిన, శకటరేఫ డకారములు, అనగా ఱుడులు గ్రహింపవలయును. 'ఁడలకు' అనుచోటిషష్ఠిచే 'షష్ఠీస్థానే యోగా'

అనుపరిభాష ననుసరించి ఋడులస్థానమున అని అర్థ మగును. రెండుసార్లు ఉచ్చరింపబడినటకారము ద్విరుక్త టకారము. అనగా ట్+ట్= ట్ట్ అనువర్ణము.

అచ్చు పరముగా ఉన్నపుడు సమాసమునందు చివరివర్ణములు లోపింపగా మిగిలియున్న కుఱు చిఱు కడు నడు నిడు అనుశబ్దములందున్న ఱు, డు, అనువర్ణములస్థానమున 'ట్ట్' అనువర్ణము ఆదేశముగా వచ్చును. ఈవిశేషవిధి ఉత్వసంధిని, టుగాగనువిధిని బాధించి వర్తించును.

కుఱు+ఉసురు అని యుండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అను సూత్రముచే సంధి రావలసియుండగా దానిని బాధించి సంధి.28 సూత్రముచే వచ్చుటుగాగమమును బాధించి, ప్రస్తుతసూత్రముచే ఱువర్ణము స్థానమున 'ట్ట్' అనునది వచ్చి, కుట్ట్+ఉసురు – కుట్టుసురు అని అగును.

'కుఱు...' మొద లగునిర్దేశమువలన ఈకార్యము సమాసమునందే. కావున సమాసము కానపుడు ద్విరుక్తటకారము రాదు. కడున్+అడలు – కడునడలు.

'అచ్చు పరం బగునపుడు' అనుటచే కుఱుమాపు, చిఱుచాప మొద లగువిధముగా హల్లు పర మైనపుడు ద్విరుక్తటకారము లేదు.

'అగు' అనుటచే ఈకార్యము రాకుండుటకు అవకాశము లేదు. అనగా ద్విరుక్తటకారము నిత్యముగ వచ్చును. కావున ద్విరుక్తటకారము రాని 'కుఱుసురు, కడెదురు' అనురీతిరూపము లుండవు.

**13. ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళముగా నగు.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **వాఁడు** | **+** | **కొట్టె** | **=** | **వాఁడు గొట్టె,** | **వాఁడు కొట్టె** |
| **అపుడు** | **+** | **చనియె** | **=** | **అపుడు సనియె,** | **అపుడు చనియె** |
| **నీవు** | **+** | **టక్కరివి** | **=** | **నీవు డక్కరివి,** | **నీవు టక్కరివి** |
| **మీరు** | **+** | **తలఁడు** | **=** | **మీరు దలఁడు,** | **మీరు తలఁడు** |
| **వారు** | **+** | **పోరు** | **=** | **వారు వోరు,** | **వారు పోరు.** |

**అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థ మని యెఱుంగునది. ఈకార్యము కళ లగుక్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **రారు** | **+** | **కదా** | **=** | **రారు గదా,** | **రారు కదా.** |
| **వత్తురు** | **+** | **పోరురు** | **=** | **వత్తురు వోదురు,** | **వత్తురు పోదురు.** |

'పరుషములకు' అనుచోటిషష్ఠీవిభక్తిచే 'షష్ఠీస్థానే యోగా' అనుపరిభాష

ననుసరించి పరుషములస్థానమున అని అర్థ మగును. పరుషము లనగా కచటతపలు.

ప్రథమాంతమునకు పై నున్న కచటతపలస్థానమున క్రమముగా గసడదవలు బహుళముగా ఆదేశముగా వచ్చును. క-గ, చ-స, ట-డ, త-ద, ప-వ, అని యథాక్రమముగా ఆదేశము లగును. 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనుసూత్రము ననుసరించి ఇచట తాలవ్యకారమునకు వచ్చు సకారము దంత్యచకారమునకును వచ్చును, బహుళము అనుటచే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యము అనునాలుగవస్థల కవకాశము గలదు.

ప్రవృత్తి : లెస్స+కాను = లెస్సగాను, మొద లగుచోట్ల ఈఆదేశము నిత్యముగా వచ్చును.

అప్రవృత్తి : సీత చంద్రముఖి, రాముడు పరమపావనుడు మొద లగుచోట్ల ఈఆదేశమునకు అప్రవృత్తి. అనగా గసడదవలు రా వని అందురు.

విభాష : వాఁడు+కొట్టె అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ఆదేశము వికల్పము. ఆదేశము వచ్చినచో వాఁడు గొట్టె అనియు, రానిపక్షమున వాఁడు కొట్టె అనియు రెండు విధములుగ రూపములు ఉండును.

అన్యకార్యము: రారు కదా – రారు గదా మొద లగువిధముగా క్రియాపదముల పైని ఈఆదేశము వచ్చుటను అన్యకార్యముగా చెప్పుదురు.

'ప్రథమమీఁది' అనుటచే ఇతరవిభక్తులమీదిపరుషములకు ఈకార్యము లేదు. రామునికయి కన్య, రామునియొక్క కొడుకు మొ. తాను నేను అనునవి ప్రథమాంతములె ఐనను ద్రుతప్రకృతికము లగుటచే వాని పైని పరుషములు సరళము లగును.

'పరుషంబులకు' అనుటచే పరుషములకంటె ఇతరము లగువర్ణములకు ఈకార్యము లేదు. అది అందము, వాడు జంభారి.

## 14. తెనుఁగులమీఁదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు.

**వాఁడు + కంసారి = వాఁడు కంసారి**

**వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి**

**ఆయది + టంకృతి = ఆయది టంకృతి**

**అది + తథ్యము = అది తథ్యము**

**ఇది + పథ్యము = ఇది పథ్యము**

సంస్కృతమునకు సంబంధించినది సాంస్కృతికము. కచటతపలు పరుషములు. కంసారి. ఇచటకకారము సంస్కృతశబ్దభాగమునకు చెందినది కావున సాంస్కృతికపరుషము. తెనుగులు అనగా అచ్చతెనుగుశబ్దములు. 'ప్రథమ మీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ప్రాప్తించుచున్న గసడదవలను ఈసూత్రము నిషేధించుచున్నది.

ప్రథమాంతము లగుఅచ్చతెనుగుశబ్దములకు పైనున్న సంస్కృతమునకు సంబంధించిన కచటతపలకు గసడదవాదేశము లేదు.

వాఁడు + కంసారి అని ఉండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనుసూత్రముచే గకారము రావలసియుండగా ప్రస్తుత సూత్రముచే నిషేధింపబడినది. కావున రాదు. 'వాడు కంసారి' అనియె ఉండును.

'తెనుఁగులమీఁది' అని ప్రత్యేకముగా చెప్పుటనుబట్టి అచ్చతెనుగులమీదనె ఈనిషేధము. సంస్కృతసమములును తెనుగులే. కాని సంస్కృతసమములమీద గూడ నిషేధము కల్గుచో 'సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అని మాత్రమే సూత్రించిన చాలును. కావున సంస్కృతసమములమీది సాంస్కృతిక పరుషములు గసడదవలు అగుటకు నిషేధము లేదు. రాజ్యశ్రీ వాలింపగ, రాజ్యశ్రీ పాలింపగ.

'సాంస్కృతికపరుషములకు' అనుటచే తెనుగులమీది ఆచ్ఛికపరుషములకు, ఈనిషేధము లేదు. వాఁడు గొట్టె, వాఁడు కొట్టె. అట్లే సంస్కృతసమములమీద నున్న ఆచ్ఛికపరుషములకును ఈనిషేధము లేదు. రాముడు గాంచెను, రాముడు కాంచెను, మొ.

'రావు' అనునిషేధము నిత్యము. కావున ఇచట గసడదవాదేశము వచ్చిన రూపములు అసలు ఉండవు. వాడు గంసారి అనురీతిరూపములు అసాధువులు.

## 15. ద్వంద్వంబునం బదంబుపయిపరుషములకు గసడదవ లగు.

**కూర + కాయ = కూరగాయలు,**

**కాలు + చేయి = కాలుసేతులు**

**టక్కు + టెక్కు = టక్కుడెక్కులు**

**తల్లి + తండ్రి = తల్లిదండ్రులు**

**ఊరు + పల్లె = ఊరువల్లెలు**

ఉభయపదార్థప్రధాన మగుసమాసము ద్వంద్వము. పరుషములు కచటతపలు. పరుషములకు అనుచోటిషష్ఠిచే పరుషములస్థానమున అని అర్థము.

ద్వంద్వసమాసమునందు పూర్వపదమునకు మీద నున్న కచటతపలస్థానమున క్రమముగా గసడదవలు వచ్చును. సవర్ణతచే దంత్యచకారము స్థానమునను సకారము వచ్చును.

కూర+కాయ అని ఉండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనుసూత్రముచే గకారము బహుళముగా రావలసియుండగా ప్రస్తుతసూత్రముచే నిత్యముగా వచ్చి, కూరగాయ అని యగును. పిదప బహువచనముతో 'కూరగాయలు' అని అగును.

'ద్వంద్వంబున' అనుటచే ద్వంద్వమునకు భిన్న వైనస్థలములలో ఈసూత్రముచే గసడదవలు రావు. నల్లనికలువ, రామునితమ్ముఁడు మొ.

'పదంబు పయి' అనుటచే ఉత్తరపదము మొదటిపరుషములకే గసడదవలు అగును. పూర్వపదమునందలిపరుషములకు గసడదవలు రావు. కూరగాయలు, గూరగాయ లని కాదు.

'పయి' అనుటవలన పూర్వపదమునకు పరముగా నున్న పరుషమునకె ఈ ఆదేశము వచ్చును. ఆతరువాతిపరుషములకు గసడదవలు రావు. టక్కుడెక్కు లనుచో టెక్కులు అనుదానిలోని కకారమునకు గకారము రాదు.

'అగు' అనుటచే ఈఆదేశము నిత్యము. కావున 'కూరకాయలు' అనువిధముగా ఆదేశము రానిరూపములు ఉండవు.

ఈకార్యము తెలుగున చేసినద్వంద్వసమాసములందే. సిద్ధద్వంద్వములం దనగా సంస్కృతమున ఏర్పడినద్వంద్వసమాసములందు ఉండదు. మాతాపితలు.

**16. ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు.**

| | | | | |
|---|---|---|---|---|
| **పూచెను** | + | **కలువలు** | = | **పూచెను గలువలు** |
| **తోఁచెను** | + | **చుక్కలు** | = | **తోఁచెను జుక్కలు** |
| **చేసెను** | + | **టక్కులు** | = | **చేసెను డక్కులు** |
| **నెగడెను** | + | **తమములు** | = | **నెగడెను దమములు** |
| **మొగిడెను** | + | **పద్మము** | = | **మొగిడెను బద్మము** |

ద్రుతాంతములు అయిన పదములు ద్రుతప్రకృతికములు. ద్రుతము అనగా నకారము. కచటతపలు పరుషములు. గజడదబలు సరళములు. 'పరుషములకు' అనుచోటిషష్ఠీవిభక్తిచే పరుషములస్థానమున అని అర్థ మగును.

ద్రుతప్రకృతికమునకు పైనున్న (తరువాతిపదముమొదటి) కచటతపల స్థానమున వరుసగా గజడదబలు ఆదేశముగా వచ్చును. దంత్యచకారము

స్థానమున దంత్యజకారము ఆదేశ మగును.

పూచెను + కలువలు అని ఉండగా ఈసూత్రముచే కకారముస్థానమునందు గకారము ఆదేశముగా వచ్చి, పూచెను గలువలు అని అగును. పిదప ద్రుతమునకు బిందువు మొద లగుకార్యములు వచ్చును.

'ద్రుతప్రకృతికముమీఁది' అనుటచే కళలకు పర మైనపరుషములకు సరళములు రావు. రామునికయి + కన్య – రామునికయి కన్య అని అట్లే ఉండును.

'పరుషములకు' అనుటచే పరుషేతర మగువర్ణములకు ఈకార్యము లేదు. వచ్చెను ఋషి. మొ.

'అగు' అనుటచే ఈఆదేశము రాకుండుటకు వీలులేదు. అనగా నిత్యము. అందుచే 'పూచెను కలువలు' అనురీతిగా పరుషములు అట్లే యుండుట ఒప్పదు.

## 17. ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.

**సంశ్లేషం బనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట.**

**పూచెను + గలువలు = పూచెం గలువలు, పూచెఁ గలువలు, పూచె న్గలువలు**

**తోఁచెను + జుక్కలు = తోఁచెం జుక్కలు, తోఁచెఁ జుక్కలు, తోఁచె న్జుక్కలు**

**చేసెను + దక్కులు = చేసెం దక్కులు, చేసెఁ దక్కులు, చేసె న్దక్కులు.**

**నెగడెను+దమములు = నెగడెం దమములు, నెగడెఁ దమములు, నెగడె న్దమములు**

**మొగిడెను+బద్మము = మొగిడెం బద్మము, మొగిడెఁ బద్మము, మొగిడె న్బద్మము**

**పక్షంబున స్వత్వం బగు. స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము.**

ఆదేశముగా వచ్చినసరళములు ఆదేశసరళములు. 'ద్రుతప్రకృతికము మీఁదిపరుషములకు సరళము లగు' అనుసూత్రముచే పరుషములకు ఆదేశముగా వచ్చినసరళములు. బిందువు అని సామాన్యముగా చెప్పుటచే అరసున్నయు, నిండుసున్నయు రెండును గ్రహింపబడును. విభాష యనగా వికల్పము.

ఆదేశముగా వచ్చినసరళములకు పూర్వమునం దున్న ద్రుతముయొక్క స్థానమున అరసున్నయును, నిండుసున్నయును విభాషగా వచ్చును. బిందువులు రానిచో ద్రుతము విభాషగా పైనున్న హల్లుతో కూడును. అది సంశ్లేషము. అదియు కానిచో ద్రుతము అట్లే యుండును. అదే స్వత్వము. ఇట్లు ఆదేశసరళపరకత్వమున

ద్రుతము నిండునున్న, అరసున్న, సంశ్లేషము, స్వత్వము అను నాలుగు విధము లైనరూపములతో నుండును.

పూచెను+కలువలు అని ఉండగా 'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు' అనుసూత్రముచే పరుషమునకు సరళ మై,'పూచెను గలువలు' అని యగును. ఈసూత్రముచే ద్రుతముస్థానమున నిండుసున్న వచ్చిన (1)పూచెం గలువలు అనియు, అరసున్న వచ్చిన (2)పూచెఁగలువలు అనియు సంశ్లేషము వచ్చిన (3) పూచె న్గలువలు అనియు అగును. విభాష అనుటచే బిందు సంశ్లేషలు రానిచో ద్రుతము స్వత్వముతో (4)పూచెను గలువలు' అని నాలుగు రూపములు ఉండును.

'ఆదేశసరళము' లనుటచే సహజసరళములు లేదా స్థిరములు మొద లగునవి పర మైపుడు ఈకార్యము లేదు. 'పాడెఁ గంధర్వుడు' అనురీతిగా ఉండవు.

'ద్రుతమునకు' అనుటచే ద్రుతము కానిదానికి ఈకార్యము లేదు. ప్రమా(ను)న్+పడు – ప్రమాన్పడు. విన్పడు మొ.

**18. ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు.**

**వచ్చెను + గోవులు = వచ్చె గోవులు, వచ్చె న్గోవులు, వచ్చెను గోవులు.**

**మెఱసెను+ఖడ్గము=మెఱసె ఖడ్గము, మెఱసె న్ఖడ్గము,మెఱసెను ఖడ్గము.**

గజడదబలు సరళములు, కచటతపలు గజడదబలు. ఇవి కాక మిగిలి యున్నహల్లులు స్థిరములు, ఆదేశసరళములు పర మైనపుడు ద్రుతమునకు కలుగు కార్యములు 'ఆదేశసరళములకు ముం దున్న' అనుపూర్వసూత్రమున చెప్పబడినవి. కావున ఇచ్చట సరళము లనగా సహజముగా నున్నవి. 'అదర్శనం లోపః అని లోప మనగా కనబడకుండపోవుట, సంశ్లేష మనగా ద్రుతము మీదిహల్లుతో గూడుకొనుట. విభాష అనగా వికల్పము.

శబ్దమున సహజముగా ఉన్న సరళము గాని, స్థిరము గాని పర మైనపుడు దానికి పూర్వమునం దున్నద్రుతమునకు లోపమును సంశ్లేషమును విభాషగా వచ్చును. లోపసంశ్లేషలు రానపుడు ద్రుతము అట్లే ఉండును. అది స్వత్వము.

వచ్చెను+గోవులు అని ఉండగా ఈసూత్రముచే ద్రుతమునకు లోపము వచ్చిన 'వచ్చె గోవులు' అని అగును. సంశ్లేషము వచ్చినచో 'వచ్చె న్గోవులు' అని అగును. విభాష అనుటచే లోపసంశ్లేషలు రెండును రానిపక్షమున ద్రుతము అట్లే ఉండి స్వత్వముతో 'వచ్చెను గోవులు' అని యుండును.

'ద్రుతంబునకు' అనుటచే ద్రుతము కానిదానికి ఈకార్యము లేదు. పేను పెద్దది, మీనుమ్రింగిన–మీన్మ్రింగిన, మినువడు–మిన్వడు, కనుపట్టు–కన్పట్టు.

'సరళస్థిరంబులు' అనుటచే ఇతర మగువర్ణము పర మైనచో ఈకార్యము లేదు. వచ్చెను+కాంతుడు – వచ్చెం గాంతుడు మొ. 'సరళ'శబ్దముచే సహజసరళము గ్రహింపబడును. కావున ఆదేశసరళములు పర మైనపుడు ఈసూత్రము వర్తింపదు. 'పూచె గలువలు' అనురీతిగా ద్రుతము లోపించిన రూపము లుండవు.

**19. వర్గయుక్సరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి.**

**వచ్చెన్ + ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి**

**పాడెను + గంధర్వుడు = పాడెం గంధర్వుఁడు**

**కన్ + దోయి = కందోయి.**

వర్గలయందలి రెండవవర్ణములకును(ఖచఠథఫ) నాల్గవవర్ణములకును (ఘఝఢధభ) వర్గయుక్కులు లేదా వర్గయుగ్మములు అని పేరు. వర్గలలోని మూడవవర్ణము లగు గజడదబలకు సరళములు అని పేరు. 'ద్రుతమునకు' అనుచోటిషష్ఠీవిభక్తిచే 'షష్ఠీస్థానే యోగా' అనుసంస్కృతపరిభాష ననుసరించి ద్రుతముయొక్క స్థానమున అని అర్థ మగును.

వర్గలలోని 2, 3, 4 వర్ణములు పరముగా నున్నపుడు, ద్రుతముస్థానమున నిందుసున్న వచ్చుట అరుదుగా కవిప్రయోగములలో కనబడుచున్నది.

పాడెను+గంధర్వుడు అని యుండగా ఈసూత్రముచే ద్రుతమునకు పూర్ణబిందువు వచ్చిన, 'పాడెం గంధర్వుడు' అని అగును. 'ద్రుతమునకు సరళ స్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనుసూత్రముచే లోపసంశ్లేషస్వత్వములతో పాడె గంధర్వుడు, పాడె ఙ్గంధర్వుడు, పాడెను గంధర్వుడు అనురీతిరూపములు సాధారణముగా ఏర్పడును.

'వర్గయుక్సరళములు' అనుటచేత వానికి భిన్న మైనవర్ణము పర మైనపుడు పూర్ణబిందువు రాదు. వచ్చెను రాముడు మొ.

'ఒకానొకచోట' అనుటచే ఇట్లు పూర్ణబిందువు వచ్చుట అరుదు. కావున లోప, సంశ్లేష, స్వత్వములతోడిరూపములే ప్రచురముగా ఉండును.

'పూర్ణబిందువు' అని బిందువును పూర్ణముగా ప్రత్యేకముగా నిర్దేశించుటచే ఇచట ఖండబిందువు రాదు. పాడెఁ గంధర్వు డనువిధ మైన రూపము లుండవు.

'పూర్ణబిందువును' అనుచోటిసముచ్చయార్థకనుశబ్దముచేత వర్గయుక్ సరళములు పర మైనపుడును లోపసంశ్లేషస్వత్వములు సాధారణముగ నుండుట సిద్ధించుచున్నది.

'కానంబడియెడి' అనుటచేత కవిప్రయోగములలో ఇట్టిచోట్ల నిండుసున్న కనిపించినవి గ్రహింపవలయును. కాని స్వేచ్ఛగా ప్రయోగింపరాదు.

**20. అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు.**

**వాఁడు వచ్చెన్ - వాఁడు వచ్చె - వాఁడు వచ్చెను.**

**ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయియుండు. గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబు లేదు.**

**అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.**

పిదప వర్ణము లేవియు లేకుండుట అవసానము. చివర అని అర్థము. ద్రుతమునం దున్నఅచ్చు ద్రుతస్వరము.

వాక్యము (పదము) చివర నున్న ద్రుతమునందలిఅచ్చునకు గాని, లేదా ద్రుతము మొత్తమునకు గాని బహుళముగా లోపము వచ్చును.

వాఁడు వచ్చెను. ఇచట 'ను' అనుద్రుతము చివర నున్నది. కావున ఈ సూత్రముచే ద్రుతమునందలిఅచ్చు లోపించినచో 'వాఁడు వచ్చెన్' అని అగును. కాక ద్రుతము మొత్తము (ను) లోపించినచో 'వాఁడు వచ్చె' అని అగును. బహుళము అనుటచేత ద్రుతస్వరము గాని ద్రుతము గాని లోపింపక, వాఁడు వచ్చెను. అనువిధముగా ద్రుతము స్వత్వముతో అట్లే ఉండును.

'అవసానంబునందు' అనుటచేత వాక్య (పద్య)మున నడుమ నున్న ద్రుతమునకు ఆయావర్ణములు పర మైనపుడు ఆయాకార్యములె వచ్చును. పూచెం గలువలుమొ.

'ద్రుతస్వరంబున కేని, ద్రుతంబున కేని' అనుటచే ఈరెండు కార్యములు ఒకటి రానపుడు మరొకటి వచ్చును. కాగా, ద్రుతమునందలినకారము మాత్రమే లోపించి ద్రుతముమీదిస్వరము నిలిచియుండుట ఉండదు. అనగా వాఁడు 'వచ్చె+ఉ' – వాడు 'వచ్చు' అనురీతిగా ఉండదు.

'బహుళ' శబ్దముచే అన్యకార్యముగా అచ్చు పర మైనపుడు ద్రుతస్వరమునకు తఱుచుగా లోప మగు నని గ్రహింపదగును. నన్నును+అడిగె – నన్నున్+అడిగె మొ. అంటిని నిందఱకు అనురీతిగా అచ్చు పర మైనపుడు ద్రుతస్వరము

లోపింపకుండుట అరుదు.

ఈలోపము పద్యములచివర గణములను అనుసరించి ఉండును. అనగా సర్వలోపము, ద్రుతలోపము, స్వత్వము అనువానిలో ఏకార్యము జరిగినచో గణములు సరిపడునో అచ్చట ఆకార్యమె నియతముగా జరుగును.

ఉదా. అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్. ఇచట చివర గురువు ఉండవలసివచ్చుటచే ద్రుతస్వరము తప్పక లోపించును. ద్రుతలోపము, లేదా స్వత్వము రావు.

## 21. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. అదియును న్గాక - దివంబునుం బోలె.

కొన్నిచోట్ల ద్రుతమునకు పైని నకారము కనబడుచున్నది. 'నకారంబు ద్రుతంబు' అని చెప్పినను సూరి ద్రుతమును ను(ని) అనుఆకారము గలదిగా సాధించెను. కావున ను(ని) అనుద్రుతముపై పొల్లనకారము వచ్చును. ఈవచ్చిన పొల్లనకారము గూడ ద్రుతమె.

అదియును+కాక అని ఉండగా ఈసూత్రముచే ద్రుత మగు 'ను'వర్ణముపై నకారము వచ్చి, అదియును+కాక అని అగును. పిదప ద్రుతకార్యములు జరిగి 'అదియును న్గాక' అని అగును.

'కొన్నియెడల' అనుటచే ద్రుతముపై నకారము వచ్చుట సార్వత్రికము కాదు.

'కానంబడియెడి' అనుటచే ఇట్టివానిని కవిప్రయోగములను అనుసరించి గ్రహింపవలెను.

'ద్రుతంబుమీఁద' అనుటచే అతనిని+జయింతుము - అతనినిన్ జయింతుము అని 'ని' ద్రుతముపై నకారము చేరును. ఇట్లె సర్వమున్+అతని, సర్వమున్నతని అనురీతిని పొల్లునకారముపై గూడ నకారము చేయుఅవకాశము ఉన్నది. ఇందు నిమిత్తము చెప్పబడకుండుటచే అంటిని+ ఇందఱకు = అంటిని నిందఱకు అనురీతిగా అచ్చు పర మైనపుడును, అదియును న్గాక అనురీతిగా హల్లు పర మైనపుడును, 'వానికంటెనున్' అనురీతిగా అవసానమునందును ద్రుతముమీద నకారము చేయవచ్చును. 'నకారము' అనుటచే నకారపుపొల్లే అగును గావున స్వత్వస్థితిలోను 'అదియునున్ గాక' అనురీతిగా పొల్లనకారమె ఉండును. 'అదియునును గాక' అనువిధముగా ను(ని) అనుఆకారములో ఉండదు.

ఇట్టిచోట్ల సముచ్చయాద్యర్థవిశేషములందు ప్రయోగింపబడు '(యు)ను' అనుఅవ్యయశబ్దము పాదపూరణమునందు వచ్చిన దని సమన్వయించుట కూడ కలదు.

**22. అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు.**

**ముంగొంగు – క్రొంబసిఁడి – కన్దోయి.**

నుడి అనగా మాట. అఁట ఇఁక, చుఁడు అనుశబ్దములలో తప్ప పదమునందు మొదటిహ్రస్వమునకు పైని సిద్ధ మైనను సాధ్య మైనను ఖండబిందువు ఉండదు. ఇఁకాదులలో సూరి చూపిన ఇఁగ శబ్దమును ఇట్టిదె. కావున అఁట, ఇఁక, ఇఁగ, చుడు అను నాలుగుపదములలో మాత్రమె మొదటి హ్రస్వముపై అరసున్న ఉండును.

ముందు+కొంగు అని ఉండగా ప్రాతాదిసంధికార్యములతో మును+కొంగు అని యై, ద్రుతకార్యములు జరుగునపుడు మను+గొంగు అనుచోట 'ఆదేశ సరళములకు ముం దున్న' అనుసూత్రముచే ఖండబిందువు రావలసియుండగా ప్రస్తుతసూత్రముచే అది నిషేధింబడినది. కావున నిండుసున్న మాత్రమే వచ్చి, 'ముంగొంగు' అని అగును.

'నుడి' అనుటచే ప్రత్యయాదు లగు అపదములలో తొలిహ్రస్వముపై ఖండబిందు వుండవచ్చును. ఎఁడు, ఇఁడి మొ.

'తొలి' అనుటచే మొదటిది కానిహ్రస్వముపై ఖండబిందువు ఉండవచ్చును. అరఁటి, రాముఁడు.

'హ్రస్వముమీఁద' అనుటచే నుడితొలిదీర్ఘముపై ఖండబిందు వుండవచ్చును. చీఁకటి, వాఁడు.

'ఖండబిందువు' అనుటచే నుడితొలిహ్రస్వముపై సిద్ధమును, సాధ్యమును ఐన పూర్ణబిందువు ఉండవచ్చును. బంతి, ముంగొంగు మొ.

నుడి తొలిహ్రస్వముపై నున్నద్రుతమునకు లోపము గూడ రా దని సూత్రము ఇంకొకఅంశము చెప్పుచున్నది.

కన్+దోయి అని యుండగా 'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనుసూత్రముచే ద్రుతమునకు లోపము రావలసియుండగా ప్రస్తుతసూత్రముచే నిషేధింపబడినది. కావున రాదు. సంశ్లేషము వచ్చి, 'కన్దోయి' అని యైనది.

'నుడితొలి' అనుటవలన మొదటిది కానిహ్రస్వముపై ద్రుతము లోపింప వచ్చును. వచ్చె గోవులు. (అపదమునందు తొలిహ్రస్వముపై ద్రుతము గల దేమో వెదుకవలెను.)

'హ్రస్వముమీఁద' అనుటచేత నుడితొలిదీర్ఘముపై ద్రుతమునకు లోపము రావచ్చును. నే వింటిని.

'ద్రుతంబునకు' అనుటచే ద్రుతము కానిదానికి లోపము రావచ్చును.

'లోపంబును' అనుటచే లోపముకంటె ఇతర మైనకార్యములు వచ్చుటకు నిషేధము లేదు. కన్దోయి, చందోయి. మొ.

**23. తాను నేనుపదంబులద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.**

**తాను + చదివె = తాఁజదివె, తాను జదివె**

**తాను + వినె = తా వినె, తాను వినె.**

**దీర్ఘంబుమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.**

సంశ్లేషము అనగా ద్రుతము మీదిహల్లుతో కూడుకొనుట. ఇచ్చట నిమిత్తము చెప్పబడలేదు. నిషేధము ప్రాప్తిపూర్వకము కావలెను. కావున సంశ్లేషము ప్రాప్తించునట్టి అన్నిచోట్ల ఈనిషేధము వచ్చును.

ఆదేశసరళములు, సరళస్థిరములు పర మైనపుడు ద్రుతమునకు రావలసిన సంశ్లేషము తాను నేను అనుపదములలోనిద్రుతమునకు లేదు.

తాను+చదివె అని ఉండగా సరళాదేశము వచ్చి, తాను+జదివె అని కాగా 'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనుసూత్రముచే ఖండబిందు వైన, 'తాఁ జదివె' అని అగును. సంశ్లేషము ఈ సూత్రముచే రాదు. కావున స్వత్వముతో 'తాను జదివె' అని యిం కొకరూప ముండును.

'తానునేనుపదంబుల' అనుటచే ఇతరములందు ఈనిషేధము లేదు. చల్లగా న్గనియె.

'సంశ్లేషంబు' లే దనుటవలన ఇతరము లైన బిందులోపస్వత్వములు యథార్థ్థముగా కలుగును. తాఁ జదివె, తా వినె, తాను జదివె మొ.

'ద్రుతంబునకు' అనుట స్పష్టత కనదగును. తానునేనులలో ద్రుతము కానిదానికి (తా, నే అనువానికి) సంశ్లేషమునకు ప్రాప్తియే లేదు.

'లేదు' అనునిత్యనిషేధమువలన తాన్జదివె, తాన్వినె అనురీతిగా సంశ్లేషము ఉండుటకు అవకాశము ఎప్పుడును లేదు.

**24. సమానంబునయందు ద్రుతంబునకు లోపం బగు.**

**ఎల్లయర్థములు, ఎల్లకలుషములు. సర్వపర్యాయం బయిన యెల్లశబ్దంబు**

**ద్రుతాంతం బయినయవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.**

'సమర్థంబు లగుపదము లేకపదం బగుట సమాసంబు' సమాసములలో ద్రుతమునకు లోపము వచ్చును.

ఎల్లన్ అనువిశేషణమునకు అర్థములు అనువిశేష్యముతో (కర్మధారయ) సమాసము చేయగా ఎల్లన్+అర్థ(ములు) అనుచోట ఈసూత్రముచే ద్రుతము లోపించి, ఎల్ల+అర్థ(ములు) అని అగును. సంధి లేకపోవుటచే యడాగమము వచ్చి 'ఎల్లయర్థములు' అని అగును.

'సమాసంబు' అని సామాన్యముగా చెప్పుటచే అన్నివిధము లైనసమాసముల లోను ద్రుతము లోపించును. కువలయంబునన్+వారు. అనుచో అలుక్సమాసమున విభక్తి లోపింపకున్నను ఈసూత్రముచే ద్రుతము లోపించి, 'కువలయంబునవారు' అని అగును.

'సమాసంబునయందు' అనుటచే సమాసము కానిచోట ఈసూత్రముచే ద్రుతమునకు లోపము రాదు. 'అర్థము లెల్లన్'.

'ద్రుతంబునకు' అనుటచే ద్రుతము కానిదానికి లోపము లేదు. ఎల్లయర్థములు.

'అగు' అనుటచేత లోపము రాకుండుటకు వీలు లేదు. అనగా లోపము నిత్యము. కావున 'ఎల్లనర్థములు' అని యుండదు.

**25. సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.**

**ఇచటం బరుషంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడు రూపంబులు. సరళంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషపూర్ణబిందువుల చేత మూఁడు రూపములు. విధానసామర్థ్యము వలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.**

**చిగురు+కయిదువు= చిగురుంగయిదువు,**

**చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు**

**తళుకు+గజ్జెలు = తళుకుంగజ్జెలు, తళుకుగజ్జెలు, తళుకున్గజ్జెలు**

**సింగపు+కొదమ = సింగపుంగొదమ. సింగపుఁగొదమ, సింగపున్గొదమ**

**ఉన్నంతపు+గొడుగు=ఉన్నతంపుంగొడుగు,**

**ఉన్నతంపుగొడుగు, ఉన్నతంపున్గొడుగు**

**నలుగడాదుల నీయాగమంబులే దంద్రు. ఈయాగమం బొకానొకచోట స్థిరంబు పరం బగుచోఁ గానంబడియెడి. గఱువపున్మరువు.**

హ్రస్వ మగుఉకారము చివర గలశబ్దములు ఉదంతములు. ప్రథమావిభక్తి ఏకవచనము లోపించు అచ్చతెనుగుశబ్దములు స్త్రీసమములు. ఆగమము అనగా అధికముగా వచ్చి చేరుట. నుక్+ఆగమ అన్నప్పుడు కకారము ఇత్తు. కావున అది లోపించును. ఆగమముగా వచ్చునది నువర్ణము. కకారము ఇత్తుగా గలది. కావున 'ను' వర్ణము కిత్తు. కావున 'ఆద్యన్తౌ టకితౌ' అనుపాణినీయపరిభాషను అనుసరించి విధించినదానికి అంత్యావయముగా అనగా చివరగా నువర్ణము వచ్చి చేరును.

సమాసములలో కచటతపలు గాని, గజడదబలు గాని పర మైనపుడు హ్రస్వ మైనఉకారము చివర గలిగినశబ్దములకును, ముువర్ణకమునకు ఆదేశముగా వచ్చిన పుం, పు అనువర్ణములకును చివర 'ను' అనువర్ణము ఆగమముగా వచ్చును.

చిగురు+కైదువు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే నువర్ణము ఆగమముగా వచ్చి, చిగురును+కయిదువు అని కాగా, ద్రుతకార్యములు జరిగి, చిగురుం గయిదువు, చిగురుఁ గయిదువు, చిగురున్గయిదువు అనురూపములు ఏర్పడును.

'సమాసంబుల' అనుటచే వ్యస్తతలో ఈఆగమము లేదు. చిగురు చక్కగా నుండెను.

'ఉదంతంబుల' అనుటచే ఉదంతములు కానివానికి ఈఆగమము లేదు. నల్లకలువ.

'స్త్రీసమము' అనుటచే స్త్రీసమములు కానివానికి ఈఆగమము లేదు. ముద్దు సేయుకొడుకు.

'పరుషసరళంబులు పరంబు లగునపుడు' అనుటచే ఇతరములు పర మైనపుడు ఈఆగమము లేదు. చిగురురంగు.

'అగు' అనుటచే ఆగమము రాకుండుటకు వీలు లేదు. అనగా నిత్యము. 'చిగురుకయిదువు' అని యుండదు.

**26. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు.**

స్వత్వము అనగా ద్రుతమునకు పకృతిభావము. అనగా ద్రుతము ఎట్టి మార్పులను పొందక సహజ మైనరూపముతో ఉండుట. ఇది సాధారణముగా

ను, ని అనురూపములతో ఉండును.

సమాసములందలిద్రుతమునకు స్వత్వస్థితి అనగా ను, ని అనురూపము ఉండదు.

తలను+ప్రాలు – తలంబ్రాలు. చిగురును + కయిదువు – చిగురుఁగయిదువు. అనువిధముగా సమాసమునం దున్నద్రుతము బిందువు మొద లగుమార్పులను పొందునే కాని తలనుబ్రాలు, చిగురునుగయిదువు అనురీతిగా స్వత్వరూపముతో ఉండదు.

ఇట్లే ఒడిని+ప్రాలు మొద లగుచోట్ల ద్రుతము 'ని' అనుస్వరూపముతో ఉండదు. ఒడినిబ్రాలు అని యుండదు.

'సమాసంబులందు' అనుటచే సమాసము గానిచోట్ల ఈనిషేధము లేదు. పూచెను గలువలు.

'సమాసంబులందు' అనుచోట బహువచనసామర్థ్యముచే తద్ధితవృత్తియందును స్వత్వ ముండదు. తెల్లనుదనము అనురీతిరూపము లుండవు.

'ద్రుతంబునకు' అని సామాన్యముగా చెప్పుటచే ఆగమముగా వచ్చిన దైనను (చిగురును+కయిదువు), సహజముగా నున్న దైనను (తలను+ప్రాలు), ఎట్టి దయినను ద్రుతమునకు సమాసమున స్వత్వ ముండదు.

'స్వత్వంబు లేదు' అనుటచేత సమాసమునం దున్నద్రుతమునకు బిందువు మొద లగుఇతరకార్యములు అగుటలో బాధ లేదు. తలంబ్రాలు, ఒడిన్బ్రాలు. మొ.

**27. తలంబ్రాలు మొద లగుసమాసంబులద్రుతమునకు లోపము లేదు.**

**తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంది, ఉరఁబిచ్చిక తోడఁ బుట్టువు, తోఁబుట్టువు, ఒల్లఁబాటు – ఒడఁబాటు ఇత్యాదులు.**

తలఁబ్రాలు మొద లగుసమాసములందలిద్రుతమునకు లోపము రాదు. 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అని ద్రుతమునకు ప్రాప్తించు చున్నలోపము తలంబ్రాలు మొద లగువానియందు లేదు.

తలను+ప్రాలు అని ఉండగా 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనుసూత్రముచే ద్రుతమునకు లోపము రావలసియుండగా ఈసూత్రముచే లోపము నిషేధింపబడినది. కావున మీదిపరుషమునకు సరళమును, ద్రుతమునకు బిందుసంశ్లేషములును రాగా, తలంబ్రాలు, తలఁబ్రాలు అని అగును. 'సమాసంబు లందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు'. కావున 'తలనుబ్రాలు' అని ఉండదు.

'తలఁబ్రాలు మొద లగుసమాసముల' అనుటచే తలఁబ్రాలు మొద లగు

వానిలో చేరనిసమాసములందు ఈనిషేధము లేదు. కావున ద్రుతము లోపించును. ఎల్లకలుషములు. కవిప్రయోగములను అనుసరించి ద్రుతలోపము లేని సమాసములను తలఁబ్రాలు మొద లగువానిలో చేర్చుకొనదగును.

**28. కర్మధారయంబునం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు.**

**కఱకు + అమ్మ = కఱకుటమ్మ**

**నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము**

**సరసపు + అలుక = సరసపు టలుక.**

విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసము కర్మధారయము. (ఉత్) తపరకరణముచే ఉత్తు అనగా హ్రస్వ మగుఉకారము. టుక్+ఆగమ. అనుచో టుక్కులో కకారము ఇత్తు. కావున అది లోపించును. కకారము ఇత్తుగా కలది గావున టువర్ణము కిత్తు. కిత్త్వముచే ఈఆగమము విధించినదానికి (ఉత్తునకు) చివర వచ్చును. టువర్ణములో ఉకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్చబడినది. కావున టకారపుపొల్లు వచ్చును. కర్మధారయసమాసములలో అచ్చు పరముగా ఉన్నపుడు హ్రస్వ మైనఉకారమునకు చివర టకారపుపొల్లు ఆగమముగా చేరును.

కఱకు+అమ్మ అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి రావలసియుండగా దానిని బాధించి, ఈసూత్రముచే టుగాగమము వచ్చి, కఱుకుట్+అమ్మ – కఱకుటమ్మ అని అగును.

'కర్మధారయంబులందు' అనుచోటిబహువచనస్వారస్యముచే కర్మధారయేతర సమాసములలోను టుగాగమము వచ్చును. వేలుపుయొక్క ఆవు. వేలుపు+ఆవు, వేలుపుటావు.

'కర్మధారయంబులందు' అనుటచే ఇతరస్థలములందు ఈఆగమము లేదు. కఱ కైనవాఁడు.

'ఉత్తునకు' అనుటచే ఉత్తుకంటె వే రైనఅచ్చునకు టుగాగమము లేదు. ఎల్లయర్థములు. దుక్కిటెద్దు, పల్లెటూరు ఇత్యాదులలో అరుదుగా వినిపించుచున్నది.

'అచ్చు పరం బగునపుడు' అనుటచే హల్లు పర మైనచో టుగాగమము లేదు. సరసపుమాట.

'అగు' అనుటచే టుగాగమము రాకుండుటకు అవకాశము లేదు. కావున నిత్యము. కఱకమ్మ అని ఉండదు.

కాని 'ఆగమశాస్త్ర మనిత్యమ్' అనుపరిభాషను అనుసరించి కాఱడవి

(కాఱు+అడవి), పాడిల్లు (పాడు+ఇల్లు) మొద లగుకొన్నిచోట్ల టుగాగమము లేకపోవుట సాధింపవచ్చును.

**29. కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు.**

**పేరు + ఉరము = పేరుటురము, పేరురము**

**చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు**

**పొదురు + ఇల్లు = పొదరుటిల్లు, పొదరిల్లు**

విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసము కర్మధారయము. పేరు మొద లగుశబ్దములు పేర్వాదిశబ్దములు. టుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కావున లోపించును. టువర్ణమునందు ఉకారము ఉచ్చారణార్థము చేర్పబడినది. కి త్తగుటచే టకారముపొల్లు పేర్వాదులకు చివర వచ్చును. కర్మధారయసమాసములో అచ్చు పరముగా ఉన్నపుడు పేరు మొద లగుశబ్దములకు చివర వికల్పముగా పొల్లుటకారము వచ్చి చేరును. 'కర్మధారయంబులం దుత్తునకు' అనుసూత్రముచే నిత్యముగా రావలసినటుగాగమము, పేరు మొదలగువానికి వికల్పముగా అగును.

పేరు+ఉరము అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనుసూత్రముచే ప్రాప్తించుచున్నసంధిని బాధించి 'కర్మధారయంబులం దుత్తునకు' అనుసూత్రముచే నిత్యముగా ప్రాప్తించుచున్నటుగాగమమును బాధించి ప్రస్తుతసూత్రముచే టుగాగమము వికల్పముగా వచ్చును. టకారము వచ్చినపక్షమునందు పేరుట్+ ఉరము పేరుటురము అని అగును. 'విభాష' అనుటచేత టుగాగమము రానిచో ఉత్వసంధి జరిగి, పేరురము అని అగును.

'కర్మధారయమునందు' అనుటచేత కర్మధారయము గానిచో టుగాగమము లేదు. చిగురు చూచెను.

'పేర్వాదిశబ్దంబులకు' అనుటచేత పేరు మొద లగువానిలో చేరనిఉదంత శబ్దములకు 'కర్మధారయంబులం దుత్తునకు' అనుసూత్రముచే టుగాగమము నిత్యముగా వచ్చును. కఱకుటమ్ము.

'అచ్చు పరం బగునపుడు' అనుటచేత హల్లు పర మైనపుడు టుగాగమము లేదు. చిగురుసవురు.

**30. పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు.**

**పేద + ఆలు = పేదరాలు.**

**బీద + ఆలు = బీదరాలు.**

**పేద - బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ - మనుమ గొడ్డు. ఇట్టివి పేదాదులు, ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది. 'ఏకాంతమునందు నున్నజవరాంధ్ర' నని కవి ప్రయోగము.**

పేద మొద లగుశబ్దములు పేదాదిశబ్దములు. ఇవి అచ్ఛికములు. విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసము కర్మధారయము. రుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కకారము ఇత్తుగా గలది. కావున రువర్ణము కిత్తు, ఆద్యన్తౌ టకితౌ' అను పాణినీయపరిభాషచే కి త్తయిన ఈఆగమము, విధించిన దానికి అనగా పేదాదులకు చివరగా వచ్చి చేరును. రువర్ణమునందు ఉకారము ఉచ్చారణముకొరకు ఉంచబడినది. కావున రేఫము మాత్రమె ఆగమము. కర్మధారయసమాసములో ఆలు అనుశబ్దము పర మైనపుడు పేద మొద లగు శబ్దములకు చివర 'ర్' అనునది ఆగమముగా వచ్చును.

పేద+ఆలు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనుసూత్రముచే బహుళముగా సంధి రావలసియుండగా దానిని బాధించి, ప్రస్తుతసూత్రముచే రేఫము ఆగమముగా వచ్చి, 'పేదర్+ఆలు - పేదరాలు' అని అగును.

'ఆలుశబ్దము పరం బగునపుడు' అనుటచేత పేదయతివ, బీదయాపె మొద లగుఇతరస్థలములందు రుగాగమ ముండదు.

'కర్మధారయంబునందు' అనుటచేత ఇతరస్థలములలో రుగాగమము ఉండదు. పేద(వాని)యొక్క ఆలు - పేదయాలు.

**31. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబున రుగాగమంబు నగు.**

**ధీర + ఆలు = ధీరురాలు.**

**గుణవంత + ఆలు = గుణవంతురాలు.**

**ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.**

విశేషణమునకు విశేష్యముతో సమాసము కర్మధారయము. సంస్కృత (ప్రాకృత)ముతో తుల్య మైనది తత్సమము. (ఇచట ప్రాకృతసమము గ్రహించుట కవకాశము కానరాకున్నది. తత్సమశబ్దము సంస్కృతసమము అనుఅర్థమున ప్రయోగించుట కలదు.) రుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. రువర్ణమునందు ఉకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున కిత్త్వముచే రేఫము

హల్లు మాత్రమె తత్సమములకు చివర వచ్చిచేరును.

కర్మధారయసమాసమునందు 'ఆలు' అనుశబ్దము పరముగా నున్నపుడు సంస్కృతసమ మైనపూర్వపదమునందు చివర ఉన్న హ్రస్వ మైనఅకారము స్థానమునందు హ్రస్వ మైనఉకారము ఆదేశముగా వచ్చును. దానికి పైని రేఫము ఆగమముగా వచ్చును.

ధీర యైన ఆలు అనుఅర్థమున కర్మధారయసమాసము కలిగి, ధీర+ఆలు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ఉత్వమును (ధీరు)తరువాత రేఫమును వచ్చి, ధీరుర్+ఆలు ధీరురాలు అని అగును.

'కర్మధారయంబునందు' అనుటచే కర్మధారయేతరస్థలములలో ఈఆగమము రాదు. ధీరుయొక్క ఆలు - ధీరునాలు.

'తత్సమంబులకు' అనుటచేత ఆచ్ఛికములకు ఈకార్యము లేదు. అంద మైన ఆలు అందపుటాలు. బల్లిదాదులు ఆచ్ఛికము లైనను సంస్కృతతుల్యములు గావున వానికి ఉత్వరుగాగమములు వచ్చును. బల్లిదురాలు, బెట్టిదురాలు మొ.

'ఉత్వంబును రుగాగమంబును' అనుచోట్ల నున్న సముచ్చయార్థక 'ను'శబ్దములచే ఉత్వరుగాగమములు రెండును కలిసియే వర్తించును. ఒకటి వచ్చి, ఒకటి రాకుండుట జరుగదు. కావున ఉత్వము మాత్రమే వచ్చి, 'ధీరుఆలు' (ధీరాలు) అని కాని, రుగాగమము మాత్రమే వచ్చి, ధీరరాలు అని కాని ఉండదు.

తత్సమములకు ఉత్వము మాత్రమే కాక, రుగాగమమును గూడ విధించుటచే పేదాదులలో సంస్కృతసమములు లే వని గుర్తింపవచ్చును. (పేదాదులలో సంస్కృతసమములును చేరినచో ఈసూత్రమున అత్వమునకు ఉత్వము మాత్రము చెప్పిన చాలును.)

**32. కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు.**

**సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట**

**విరసము + వచనము = విరసపువచనము, విరసంపువచనము.**

విశేషణమునకు విశేష్యముతో సమాసము కర్మధారయము. వర్ణకము అనగా ప్రత్యయము. 'మువర్ణకంబునకున్' అనుచోటి షష్ఠీవిభక్తిచే 'షష్ఠీస్థానే యోగా' అనుపరిభాషను అనుసరించి మువర్ణకముస్థానమున అని అర్థము.

కర్మధారయసమాసములో పూర్వపదమునం దున్న 'ము' అనుప్రత్యయము యొక్క స్థానమున 'పు' అనునదియు, 'ంపు' అనునదియు వచ్చును.

'పు, ంపు' లు రెండును మువర్ణకముస్థానముననే రావలసియుండుటచే ఒక

పక్షమునందు 'పు' వర్ణము రాకుండుటయు, అపుడు మువర్ణకమునకు 'ంపు' వర్ణము వచ్చుటయు గుర్తింపవలెను. పుంపువిధానసామర్థ్యముచేతనే సమాసము నందు ఈ 'ము'విభక్తి లోపింపదు. 'అగు' అనుటచే 'పు' లేదా 'ంపు' ఏదో ఒకటి తప్పక వచ్చును గాని మువర్ణకము మాత్రము ఉండదు.

సరస మైనమాట అనువిగ్రహముచొప్పున కర్మధారయసమాసము ఏర్పడి, సరసము+మాట అని ఉండగా ఈసూత్రముచే మువర్ణముస్థానమున 'పు' వర్ణము వచ్చి, 'సరసపుమాట' అని అగును. 'ంపు' విధానముచే పువర్ణము రాక సరసము+ మాట అని యుండగా మువర్ణముస్థానమున 'ంపు' వర్ణము వచ్చి, 'సరసంపుమాట' అని అగును. ఇట్లే 'విరసపువచనము, విరసంపువచనము' మొ.

'కర్మధారయంబులందు' అనునప్పటిబహువచనముచే తత్పురుషసమాసము లందును పుంపులు వచ్చుట గలదు. సింగముయొక్క కొదమ–సింగపుఁగొదమ.

'కర్మధారయంబులందు' అనుటచే ఇతరస్థలములందు ఈకార్యము లేదు. మచ్చెకంటి. ఈసమాసమునందు మువర్ణకము లోపించినది. 'మాట సరసము' అనుచో వ్యస్తతలో మువర్ణకము నిలిచియున్నది.

'మువర్ణకంబునకు' అనుటవలన ప్రత్యయము (ఆగమము) కాని మువర్ణము నకు పుంపులు రావు. ముత్తెపుముగ్గు.

'అగు' అనుటవలన నిత్యము. కావున పుంపులు రెండును రాక, 'సరసముమాట' అను విధముగా మువర్ణము నిలిచియుండదు.

## 33. ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు.

**చేయు + అతఁడు = చేయునతఁడు,**

**చేసెడు + అతఁడు = చేసెడునతఁడు.**

ధారువుయొక్క ధర్మము తద్ధర్మము, తద్ధర్మార్థమును ఇచ్చునది అగు విశేషణము తద్ధర్మార్థకవిశేషణము, ఆక్రియయొక్క ధర్మము కర్తగా గలిగినది. హ్రస్వ మైన ఉకారము అంతమందు గలది ఉదంతము. తృవర్ణకార్థమునందు, ఎడి, ఎడు, వానికి లోపమును చెప్పబడినవి. ఈతద్ధరార్థకవిశేషణములలో ఎడుప్రత్యయము గలదియును, ఎడి, ఎడులు లోపించినదియు ఉదంతములు. నుగాగమ మన్నపుడు నుక్కులో కకారము ఇత్తు, నువర్ణమునందు ఉకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున కి త్తయిన నకారపుపొల్లు విశేషణములకు చివర చేరును.

అచ్చు పరముగా ఉన్నపుడు, ఉదంతము లయినతద్ధర్మార్థకము లగుధాతుజ

విశేషణములకు చివర నకారపుపొల్లు ఆగమముగా వచ్చును.

చేయు+ఆతఁడు అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి రావలసియుండగా దానిని బాధించి, ఈసూత్రముచే నకారము వచ్చి, చేయున్ + అతడు = చేయునతఁడు అని అగును.

'ఉదంతము' అనుటచే ఇదంత మైనతద్ధర్మార్థవిశేషణమునకు నుగాగమము లేదు. చేసెడియతడు. ధాతుజవిశేషణములు ఏడింటిలోను ఉదంతములు రెండె. అవి తద్ధర్మార్థకములె, కావున ఉదంతధాతుజవిశేషణముల కన్నను ఇబ్బంది లేదు. అయ్యును స్పష్టముగా తద్ధర్మార్థకవిశేషణము లని చెప్పబడినది.

'అచ్చు పరం బగునపుడు' అనుటచే హల్లు పర మగునపుడు నుగాగమము లేదు. ముద్దు సేయుకొడుకు.

'అగు' అనుటచే నుగాగమము నిత్యము. కావున 'చేయు+అతడు–చేయతడు అనురీతిగా ఉత్వసంధి అయినరూపములు సాధువులు కావు.

**34. షష్ఠీసమాసమునం దుకారఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు.**

**రాజుయొక్క + ఆజ్ఞ = రాజునాజ్ఞ,**

**విధాతృయొక్క + ఆనతి = విధాతృనానతి.**

షష్ఠీ విభక్తి చివర గలిగిన శబ్దమునకు మీదిశబ్దముతో చేయబడినసమాసము షష్ఠీసమాసము. నుగాగమము అనుచోట నుక్కులో కకారము ఇత్తు. నువర్ణము నందలిఉకార ముచ్చారణార్థము. కావునకి త్తయిన ననకారపుపొల్లు ఉకార ఋకారములకు చివర ఆగమముగా వచ్చును. అచ్చు పరముగా నున్నపుడు షష్ఠీ తత్పురుషసమాసమున పూర్వపదము చివర ఉన్నఉకారమునకును ఋకారము నకును పైని నకారపుపొల్లు ఆగమముగా వచ్చును.

రాజుయొక్క+ఆజ్ఞ అనువిగ్రహము చొప్పున షష్ఠీతత్పురుషసమాసములో రాజు+ఆజ్ఞ అని యుండగా, 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే రావలసినసంధిని బాధించి ప్రస్తుతసూత్రముచే నకారము చేరగా రాజున్+ఆజ్ఞ రాజు నాజ్ఞ అని అగును.

తెలుగున ఋకారాంతములుగా నిలుచు శబ్దములు, సవితృ విధాతృ మాంధాతృ అనునవి మూడె. వీనికె ఇచట నుగాగమము విధాతృనానతి.

'షష్ఠీసమాసంబు' అనుటచేత మూడగ్నులు మొదలగు షష్ఠీతరతత్పురుష సమాసములలో నుగాగమములేదు. 'ఉకార ఋకారంబులకు' అనుటచేత

ఇతరములైన అచ్చులకు నుగాగమము లేదు. రాములయాజ్ఞ, విధాతృ నియానతి. 'అచ్చు పరంబగునపుడు' అనుటచేత హల్లు పరమయినపుడు ఈ నుగాగమము లేదు. రాముతమ్ముడు. 'ఆగు' అనుటచేత ఈఆగమము నిత్యము. కావున విధాతృ ఆనతి అనువిధమైన రూపములుండవు.

'ఆగమ శాస్త్ర మనిత్యమ్' అను పరిభాషను అనుసరించి శిరసుయొక్క అందము శిరసందము మొ॥ చోట్ల అరుదుగా నుగాగమము లేకపోవుట సమర్థింపబడు.

**35. ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకుఁ దనంబు పరం బగునపుడు నుగాగమం బగు.**

**సొగసు + తనము = సొగసుందనము, సొగసుఁదనము, సొగసున్దనము**

**సరసపు +తనము = సరసపుందనము, సరసపుఁదనము, సరసపున్దనము**

**తెల్ల +తనము = తెల్లందనము, తెల్లఁదనము, తెల్లన్దనము**

ఉదంతములు అనగా హ్రస్వ మైనఉకారము చివర గలవి. ప్రథమైకవచనము లోపించునట్టిఆచ్ఛికశబ్దములు స్త్రీసమములు. గుణమును దెల్పునవి గుణ వాచకములు. హ్రస్వ మగుఅకారము చివర గలవి అదంతములు. త్వార్థమునందు వచ్చుతద్ధితప్రత్యయము తన. నుగాగమము అనుచోట కకారము ఇత్తు. కి త్తయిన నువర్ణము చివర వచ్చి చేరును.

1. 'తన' అనుతద్ధితప్రత్యయము పరముగా నున్నపుడు దానికి పూర్వమునం దున్నహ్రస్వ మగుఉకారము అంతమందు గలిగినస్త్రీసమములకు చివర నువర్ణము ఆగమముగా వచ్చును.

సొగసు+తనము అని ఉండగా ఈసూత్రముచే నుగాగమము వచ్చి సొగసును+ తనము అని కాగా, ద్రుతకార్యములు జరిగి, సొగసుందనము, సొగసుఁదనము సొగసున్దనము అనుమూడురూపములు ఏర్పడును.

2. 'తన' అనుతద్ధితప్రత్యయము పరముగా నున్నపుడు దానికి పూర్వమునం దున్న పు ంపులకు చివర నువర్ణము ఆగమముగా వచ్చును.

సరసపు+తనము అని ఉండగా ఈసూత్రముచే నుగాగమము వచ్చి, సరసపును+ తనము అని కాగా, ద్రుతకార్యములు జరిగి, సరసపుందనము, సరసపుఁదనము సరసపున్దనము అనుమూడురూపములు ఏర్పడును.

3. 'తన' అనుతద్ధితప్రత్యయము పరముగా నున్నపుడు దానికి పూర్వమునం

దున్న హ్రస్వ మగు అకారము చివర గలిగినగుణవాచకములకు చివర నుగాగమము వచ్చును.

తెల్ల+తనము అని ఉండగా ఈసూత్రముచే నుగాగమము వచ్చి, తెల్లను+ తనము అని కాగా, ద్రుతకార్యములు జరిగి, తెల్లందనము, తెల్లఁదనము తెల్లన్దనము అనుమూడురూపములు ఏర్పడును.

'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు' అనుసూత్రముచేత తద్ధితవృత్తియందు ద్రుతమునకు స్వత్వము లేదు. కావున సొగసునుదనము, సరసపునుదనము, తెల్లనుదనము అనువిధ మైనరూపము లుండవు.

'ఉదంత' అనుటచే ఉదంతములు కానివానికి నుగాగమము లేదు. దొంగతనము, లంజెతనము మొ.

'స్త్రీసమంబులకు' అనుటచే స్త్రీసమములు కానివానికి నుగామము లేదు. రాముతనము, వధువుతనము మొ.

'గుణవాచకంబులకు' అనుటచే గుణవాచకములు కానిశబ్దములకు నుగాగమము లేదు. చిన్నతనము, గొప్పతనము మొ.

'తనంబు పరం బగునపుడు' అనుటచేత తనముకంటె ఇతర మైనతద్ధిత ప్రత్యయాదులు పర మైనపుడు నుగాగమము లేదు. సొగసుకాఁడు సొగసుకత్తియ.

'అగు' అనుటచే నుగాగమము నిత్యము. కావున 'సొగసుతనము' అనుతీరుగా నుగాగమము రానిరూపములు ఉండవు.

**36. సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.**

**ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు**

**లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ**

**పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ**

ప్రాత మొద లగునవి ప్రాతాదులు. సమాసమునందు ప్రాత మొద లగు శబ్దములందలిఅచ్చులలో మొదటి దగుఅచ్చునకు పైనున్నవర్ణములు అన్నియును బహుళముగా లోపించును. బహుళము అనుటచే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష అన్యకార్యము అనునాలుగుఅవస్థలకు అవకాశము గలదు.

**ప్రవృత్తి :** ప్రాతాదులలోని వగు మీదు మొద లగుశబ్దములలో తొలియచ్చు మీదివర్ణములకు లోపము నిత్యముగా వచ్చును. మీఁదు+కడ=మీఁగడ. మీఁదుఁగడ అనువిధ మైనలోపము రానిరూపము లుండవు.

**అప్రవృత్తి :** కొన్నిచోట్ల తొలిఅచ్చుమీదివర్ణములకు లోపము లేనేలేదు. క్రొత్త+కుండలు=క్రొత్తకుండలు. ఇచట క్రొంగుండలు లేదా క్రొక్కుండలు అనురీతిరూపములు లేవు.

**విభాష :** కొన్నియెడల లోపము వచ్చుటయు రాకుండుటయు కలదు. ప్రాంత+ఇల్లు అని యుండగా అత్వసంధిని బాధించి ఈసూత్రముచే తొలియచ్చు మీదివర్ణములకు లోపము రాగా, ప్రా+ఇల్లు అని యగును. సంధి లేదు. కావున యడాగమము వచ్చి, 'ప్రాయిల్లు' అని అగును. లోపము రానిపక్షమున 'ప్రాంతయిల్లు' అగును.

**అన్యకార్యము :** క్రింద+కాలు అనుచోట తొలియచ్చు మీదివర్ణములు లోపించి క్రి+కాలు అని కాగా, అన్యకార్యముగా లుప్తశేషమునకు దీర్ఘము వచ్చి, క్రీ+కాలు= క్రీఁగాలు అని అగును.

'సమాసంబున' అనుటచే సమాసము కానపుడు లోపము లేదు. పూవు చూచెను.

'ప్రాంతాదుల' అనుటచే ప్రాంత మొద లగువానిలో చేరనిశబ్దమునందు లోపము లేదు. ఎల్లకలుషములు.

'తొలియచ్చుమీదివర్ణంబులకు' అనుటచేత తొలిఅచ్చువరకు ఉన్నభాగము లోపింపక మిగిలియుండును. ప్రాత, ప్రా (ఇల్లు) 'ఎల్లన్' అనుట తొలిఅచ్చునకు పైనున్న వర్ణములు ఎన్ని ఉన్నను అన్నియు లోపించు నని స్పష్టము చేయుటకె.

**37. లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు.**

**ప్రాంత + కెంపు = ప్రాఁగెంపు.**

**మీఁదు + కడ = మీఁగడ.**

**లేఁత + కొమ్మ = లేఁగొమ్మ.**

**కెంపు + తామర = కెందామర**

**చెన్ను + తొవ = చెందొవ.**

**చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు. బహుళగ్రహణంబుచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు. వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.**

లోపింపగా మిగిలియున్నది లుప్తశేషము. కచటతపలు పరుషములు. నుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు, కిత్తు అయిననువర్ణము లుప్తశేషమునకు చివర వచ్చిచేరును.

ప్రాత మొద లగుశబ్దములలో మొదటిఅచ్చునకు పైనున్న వర్ణములు అన్నియు లోపింపగా మిగిలి ఉన్న మొదటిఅక్షరమునకు కచటతపలు పర మయినపుడు నువర్ణము చివరగా ఆగమముగా వచ్చును.

ప్రాఁత+కెంపు అని యుండగా 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చు మీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ప్రా+కెంపు అని కాగా, ప్రస్తుతసూత్రముచే నుగాగమము వచ్చి, ప్రాను+కెంపు అని కాగా ద్రుతకార్యములు జరిగి 'ప్రాఁగెంపు' అని అగును.

'లుప్తశేషంబునకు' అనుటచే తొలియచ్చుమీదివర్ణములు లోపింపనపుడు నుగాగమము రాదు. ప్రాఁతకెంపు. లేఁతకొమ్మ. మొ.

'పరుషములు పరము లగునపుడు' అనుటచే పరుషము కానివర్ణము పర మయినపుడు నుగాగమము లేదు. ప్రాయిల్లు, పూరెమ్మ మొ.

'అగు' అనుటచే నుగాగమము నిత్యము కావున నుగాగమము రాని, ప్రాకెంపు, లేకొమ్మ అనురీతిరూపములు ఉండవు.

**38. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.**

క్రొత్త + చాయ = క్రొంజాయ,

క్రొత్త + చెమట = క్రొంజెమట

క్రొత్త + పసిఁడి = క్రొంబసిఁడి.

క్రొత్త + కారు = క్రొక్కారు

క్రొత్త + తావి = క్రొత్తావి.

**పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వం బగు.**

క్రొత్త + గండి = క్రొగ్గండి

క్రొత + నన = క్రొన్నన

క్రొత్త + మావి = క్రొమ్మావి.

**కెంధూళి, కెంజడ లని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళ గ్రహణముచేత క్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు. క్రీఁగడుపు, క్రీఁ గాలు, క్రీఁదొడ ఇత్యాదులఁ గ్రిందుశబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేత నని యెఱుంగునది.**

ఆది అక్షరశేషము అనగా మొదటిఅక్షరము మిగిలినది. క్రొత్త శబ్దము ప్రాఁతాదులలోనిది. సమాసమున తొలిఅచ్చుమీదివర్ణములు లోపింపగా మిగిలిన దానికి 'లుప్తశేషంబునకు పరుషములు పరంబు లగునపుడు' అనుసూత్రముచే నుగాగమమె రావలయును. దానిని ఈసూత్రము బాధించును.

క్రొత్త శబ్దమున తొలిఅచ్చుమీదివర్ణములు లోపింపగా మిగిలిన 'క్రొ' అనుదానికి పరుషములు పర మైనపుడు కొన్నియెడల నుగామమును, మరి కొన్నియెడల మీదిహల్లునకు ద్విత్వమును వచ్చును.

క్రొత్త+చాయ అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదుల' అనుసూత్రముచే తొలిఅచ్చుమీదివర్ణములు లోపించి, క్రొ+చాయ అని కాగా, 'లుప్తశేషంబునకుం బరుషంబులు పరంబు లగునపుడు' అనుసూత్రమును బాధించి, ప్రస్తుతసూత్రముచే నుగాగమము వచ్చి, క్రొను+చాయ అని కాగా, ద్రుతకార్యములు జరిగి 'క్రొంజాయ' అని అగును.

క్రొత్త+కారు అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదుల' అనుసూత్రముచే తొలిఅచ్చుమీదివర్ణములు లోపించి, క్రొ+కారు అని కాగా, 'లుప్తశేషంబునకుం బరుషంబులు పరంబు లగునపుడు' అనుసూత్రముచే రావలసిన నుగాగమమును బాధించి, ప్రస్తుతసూత్రముచే మీదిహల్లునకు ద్విత్వము వచ్చి 'క్రొక్కారు' అని అగును.

స్థిరములు పర మైనపుడు మాత్రము 'లుప్తశేషంబులకు' అనుసూత్రముచే నుగాగమమునకు ప్రాప్తి లేదు కావున ద్విత్వము మాత్రమే వచ్చును. క్రొ(త్త)+గండి అనుచో మీదిహల్లునకు ద్విత్వము వచ్చి, క్రొగ్గండి, ఇట్లే క్రొ(త్త)+నన –క్రొన్నన, క్రొ(త్త)+మావి– క్రొమ్మావి, మొ.

'క్రొత్త శబ్దమునకు' అనుటచే ప్రాతాదులలోనిఇతరశబ్దములకు మీదిహల్లునకు ద్విత్వము రాదు. 'లుప్తశేషంబులకు' అనుసూత్రముచే పరుషములు పర మైనపుడు నుగాగమము మాత్రమే వచ్చును. ప్రాఁగెంపు, లేఁగొమ్మ మొ. స్థిరము పర మైనపుడు అది అట్లే ఉండును. లేదూడ, పూరెమ్మ మొ..

'ఆద్యక్షరశేషమునకు' అనుటచే తొలియచ్చుమీదివర్ణములు లోపింపనిచో ఈకార్యము లేదు. క్రొత్తచాయ, క్రొత్తతావి మొ.

'కొన్నియెడల' అనుటచే (పరుషములు పర మైనపుడు) ఎచట నుగాగమము వచ్చునో, ఎచట మీదిహల్లునకు ద్విత్వము వచ్చునో ప్రయోగములనుబట్టి గుర్తింపవలెను. 'క్రొ' శబ్దమునకు మీదిస్థిరమునకు ద్విత్వము వచ్చును.

**39. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.**

**ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరం బగునపుడు తొంటియట్లు లోపనుగాగమంబులును, గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరం బగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబులయందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.**

| | | | | |
|---|---|---|---|---|
| **పది** | **+** | **తొమ్మిది** | **=** | **పందొమ్మిది** |
| **నిండు** | **+** | **వెఱఁగు** | **=** | **నివ్వెఱఁగు** |
| **తొమ్మిది** | **+** | **పది** | **=** | **తొంబది** |
| **నెఱ** | **+** | **తఱి** | **=** | **నెత్తఱి** |
| **వంక** | **+** | **చెఱగు** | **=** | **వంజెఱఁగు** |
| **నెఱ** | **+** | **నడుము** | **=** | **నెన్నడుము** |
| **సగము** | **+** | **కోరు** | **=** | **సంగోరు** |
| **నెఱ** | **+** | **మది** | **=** | **నెమ్మది** |
| **నిండు** | **+** | **వెఱ** | **=** | **నివ్వెఱ,** |
| **నెఱ** | **+** | **వడి** | **=** | **నెవ్వడి** |

**ఇత్యాదులు ప్రయోగంబునం దెలియునది.**

అన్యములు అనగా ప్రాఁత మొద లగువానిలో చేరని వే రైనశబ్దములు. 'ఇక్కార్యంబులు' అనగా ప్రాతాదులకు చెప్పబడినకార్యములు. అనగా 1. తొలి యచ్చుమీదివర్ణములు లోపించుట. 2. పరుషములు పర మైనపుడు లుప్త శేషమునకు నుగాగమము వచ్చుట. 3. లుప్తశేషము మీదిహల్లునకు ద్విత్వము వచ్చుట అనునవి.

ప్రాఁత మొద లగువానిలో లేనిఆయాశబ్దములకు పరుషము మొదట గల ఆయాశబ్దములు పర మైనపుడు, తొలియచ్చుమీదివర్ణములు లోపించి, నుగాగమము వచ్చును.

పది+తొమ్మిది అని ఉండగా ప్రస్తుతసూత్రముచే పది శబ్దమునందు తొలిఅచ్చు మీదివర్ణములకు లోపము వచ్చి, (ప+తొమ్మిది) దానికి చివర నుగాగమము రాగా, పను+తొమ్మిది. ద్రుతకార్యములు జరిగి 'పందొమ్మిది' అని అగును.

2. ప్రాఁత మొద లగువానిలో చేరనిఆయాశబ్దములకు పరుషములు లేదా స్థిరములు మొదట గలిగిన ఆయాశబ్దములు పర మైనపుడు తొలియచ్చుమీది

వర్ణములు లోపించి, మీదిహల్లునకు ద్విత్వము వచ్చును.

నెఱ+నడుము అని ఉండగా ప్రస్తుతసూత్రముచే తొలిఅచ్చుమీదివర్ణములకు లోపము వచ్చి, (నె+నడుము) దాని మీదిహల్లునకు ద్విత్వము వచ్చి, నెన్నడుము అని అగును. ఇట్లే నెఱ+తఱి, నెత్తఱి మొ.

'అన్యంబులకు సహితము' అనుటచే ప్రాతాదిశబ్దములకు ఈసూత్రముచే ఆయాకార్యములు రావు. ఇంక ప్రాతాదిసూత్రములచే అగును.

'ఇక్కార్యంబులు' అనుటచే ప్రాతాదులకు చెప్పబడినకార్యములే కాని ఇతర మైనకార్యములు ఈసూత్రముచే సిద్ధింపవు.

'కొండొకచో' అనుటచే ప్రాఁతాదులలో చేరనిశబ్దములకు అన్నింటికి ఈకార్యములు రావు. నల్లనిఆవు, అన్నదమ్ములు మొ.

అట్లే తొలియచ్చుమీదివర్ణములకు లోపము మొద లగుఈకార్యములు వచ్చుశబ్దములకు కూడ అన్నిచోట్ల రావు. పది+తొమ్మిది - పందొమ్మిది అగును. పది+నాలుగు - పన్నాలుగు ఇత్యాదిగా కాదు.

'కానంబడియెడి' అనుటచే ప్రాతాదులలో చేరనిశబ్దములకు కొన్నింటికి మాత్రమే వచ్చుట, వానికిని ఆయాశబ్దములు పరమగునపుడు మాత్రమే వచ్చుట, అపుడు గూడ ఆయాకార్యములు మాత్రమే వచ్చుటను కవిప్రయోగములను అనుసరించి గ్రహింపవలయును.

**40. ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలియచ్చు మీఁదివర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్త టకారం బగు.**

**ఈసూత్రమునకు భృశార్థంబుందు ద్విరుక్తి విషయం బని యెఱుంగునది.**

**కడ + కడ = కట్టకడ**

**ఎదురు + ఎదురు = ఎట్టయెదురు**

**కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము- పగలు - పిడుగు - బయలు - మొదలు ఇత్యాదులు కడాదులు.**

ఒకే శబ్దము రెండుసార్లు ఉచ్చరింపబడినపుడు అందలిరెండవశబ్దమునకు ఆమ్రేడిత మని పేరు. కడ మొద లగునవి కడాదులు. ద్విరుక్తటకారము అనగా రెండుసార్లు ఉచ్చరించిన టకారము, ట్ట్ అనునది. అదంతము అనగా హ్రస్వ మగుఅకారము చివర గలిగినది. అదంతం బగుద్విరుక్తటకార మనగా 'ట్ట'.

ఆమ్రేడితము పరముగా నున్నపుడు దానికి పూర్వమునం దున్న కడ మొద లగుశబ్దములలో మొదటిఅచ్చునకు పై నున్నవర్ణములు అన్నింటిస్థానమునను

'ట్ట' అనువర్ణము ఆదేశముగా వచ్చును.

కడ+కడ అని ఉండగా ఈసూత్రముచే ద్విరుక్తటకారము వచ్చి, కట్టకడ.

'ఆమ్రేడితంబు (పరం బగునపుడు)' అనుటచే ఆమ్రేడితము పరముగా లేనిచో ట్ట వర్ణము రాదు. ఎదురు నిలిచెను.

'పరం బగునపుడు' అనుటచే ఆమ్రేడితమునకు పూర్వమునందు ఉన్నశబ్దముననే ఈకార్యము వచ్చును కాని ఆమ్రేడితమునందు రాదు. కడకట్ట అని కాదు.

'తొలియచ్చుమీఁదివర్ణంబులకు' అనుటచే కడాదులలో మొదటిఅక్షరము మాత్రము నిలిచియుండును. 'క'ట్టకడ.

'ఎల్లన్' అనుట తొలియచ్చుమీద ఎన్నివర్ణము లున్నను అన్నింటిస్థానమునను ఆదేశము వచ్చు నని స్పష్టము చేయుటకె.

'అగు' అనుటచే 'ట' వర్ణము ఆదేశ మగుట నిత్యము. 'కడకడ' అనురీతిగా ట్ట ఆదేశము రానిరూపములు ఉండవు.

**41. ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.**

**అప్పటికిన్ + అప్పటికిన్ = అప్ప టప్పటికిన్, అప్పటి కప్పటికిన్**

**అక్కడన్ + అక్కడన్ = అక్క డక్కడన్, అక్కడ నక్కడన్**

**ఇంటన్ + ఇంటన్ = ఇం టింటన్, ఇంట నింటన్**

**ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్,**

**ఇంచుక నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షర లోపంబు నగు.**

**ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచు కించుక**

**నాఁడు + వాఁడు = నానాఁడు, నాఁడు నాఁడు.**

రెండుసార్లు ఉచ్చరించిన వానిలో రెండవరూపము ఆమ్రేడితము. ఆమ్రేడితము పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునం దున్నపదముయొక్క విభక్తికి బహుళముగా లోపము వచ్చును. బహుళ మనుటచే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యము అనుతీరుగా నాలుగువిధములుగా ఈలక్షణము ప్రవర్తించుటకు అవకాశము గలదు.

**అప్రవృత్తి :** ఆమ్రేడితము పర మైనను పెక్కుచోట్ల విభక్తిలోపము లేదు. సున్నము+సున్నము = సున్నము సున్నము. అనియు సున్నసున్నము అని కాదు.

**విభాష :** అప్పటికిన్+అప్పటికిన్ అని ఉండగా 'ఏమ్యాదులయిత్తునకు' అను సూత్రముచే రావలసినసంధిని బాధించి, ప్రస్తుతసూత్రముచే 'కిన్' అనువిభక్తి లోపింపగా, అప్పటి+అప్పటికిన్ అని అగును. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనుసూత్రముచే సంధి నిత్యముగా జరిగి, 'అప్పటప్పటికిన్' అని అగును. విభక్తి లోపింపనిపక్షమున అప్పటికిన్+అప్పటికిన్ అని ఉండగా 'ఏమ్యాదులయిత్తునకు' అనుసూత్రముచే సంధి జరిగి, 'అప్పటి కప్పటికిన్' అని అగును. ఆసంధి వికల్పము కావున రానిపక్షమునందు 'అప్పటికి నప్పటికిన్' అని అగును.

**అన్యకార్యము :** ఇంచుక+ఇంచుక అనుచోట విభక్తి కాకున్నను 'క' వర్ణము లోపించి, ఇంచు+ఇంచుక. 'అచ్చున కామ్రేడితంబు' అనుసూత్రముచే సంధి జరిగి, ఇంచించుక అని యగును.

విభక్తి అనుసామాన్యనిర్దేశముచే ఈసూత్రముచే క్రియావిభక్తులకు కూడ లోపము ప్రాప్తించుచున్నది. కాని 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమ ముడుజులకు లోపంబు విభాష నగు' అనుసూత్రనియమము ననుసరించి ఇచట క్రియావిభక్తులకు లోపము గలుగదు. అందురు+అందురు అందు రందురు.

'ఆమ్రేడితంబు పరం బగునపుడు' అనుటచే ఇతరస్థలములందు ఈకార్యము లేదు. అప్పటికిన్ అప్పుడు – అప్పటికప్పుడు.

'విభక్తిలోపంబు' అనుటచే విభక్తి కానిదానికి ఈసూత్రముచే లోపము రాదు. అనగ ననగ, తినగ తినగ మొ.

## 42. అందదుకుప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

**అందదుకు – ఇట్టింకులు – ఇల్లిగ్గులు – చెల్లచెదురు – చెల్లాచెదురు. తుత్తుమురు – తుత్తునియలు – మిఱుమిట్లు ఇత్యాదు లెఱుంగునది.**

అందదుకు మొద లగునవి కవిప్రయోగములందు ఏవిధముగా ఉన్నవో అవిధముగనే గ్రహింపదగును.

ఇవి అన్నియు ఆమ్రేడితము పర మైనపుడు జరుగుసంధికార్యములే. అనగా ఈసూత్రమునకు లక్ష్యములు అన్నియును ఆమ్రేడితస్థలములే అని ప్రకరణ, ఉదాహరణములనుబట్టి గ్రహింపవలెను.

అదుకు+అదుకు అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని ప్రాప్తించుచున్నసంధిని బాధించి, 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అనుసూత్రముచే ప్రాయికసంధి (వచ్చి, అదుకదుకు అని) కావలసిఉండగా, దానిని బాధించి ప్రస్తుతసూత్రముచే అందదుకు అని అగును.

ఇది అందదుకు అనువిధముగా ఎఱ్ఱనచే ప్రయోగింపబడినది. కావున అది అట్లే గ్రహింప వలయును అని ఈసూత్రము చెప్పుచున్నది.

ఇట్లె ఇంకులు+ఇంకులు=ఇట్టింకులు మొద లగువిధముగా శ్రీనాథుడు మొద లగుకవుల ప్రయోగములం దున్నవి. అవి ఎల్ల అట్లే గ్రహింపవలెను.

ఆమ్రేడితము పర మయినపుడు ఒక్కొక్కస్థలమున ఒక్కొక్క విధముగా వర్ణ వికారములు అనేకము లయి కవిప్రయోగములందు కనబడుచున్నవి. వానికి లక్షణము చేయుట లక్షణగౌరవమువలన ప్రయోజనము ఉండదు. కావున అట్టివానిని ప్రయోగములను అనుసరించియే ఆయావిధములుగా గ్రహింపవలయు నని చెప్పబడినది.

'అందదుకు ప్రభృతులు'అనుటచే వీనిలో చేరనివి యథాలక్షణముగా అగును. ఔ రౌర, అప్ప టప్పటికిన్ మొ.

'యథాప్రయోగంబుగ' అనుటచే ప్రయోగప్రమాణము లేకుండ యథేచ్ఛగా గ్రహింపరాదు.

**43. చేతతోడవలనల కిత్వంబు సమాసంబులం దగు.**

**నీచేతన్ + ప్రోవు = నీచేతిప్రోవు,**

**నాతోడన్ + చెలిమి = నాతోడిచెలిమి**

**నీవలనన్ + భయము = నీవలనిభయము.**

సమాసములలో, చేత, తోడ, వలన, అనువిభక్తులకు హ్రస్వ మగుఇకారము ఆదేశముగా వచ్చును. ఇత్వము ఏకాల్లు (ఒక్క వర్ణము) కావున విధించినదానిలో చివరివర్ణముస్థానమున వచ్చును. అనగా చేత, తోడ, వలన అనుప్రత్యయములందు చివర నున్నఅకారముస్థానమున ఇత్వము ఆదేశముగా వచ్చును. ఇత్వము విధించిన సామర్థ్యముచే ఈసమాసములలో చేత, తోడ, వలన విభక్తులు లోపింప వని గుర్తింపవలెను. ఇట్లు విభక్తులు లోపింపనిసమాసములను అలుక్సమాసములు అందురు.

నీచేతన్ + ప్రోపు అని ఉండగా, 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనుసూత్రముచే ద్రుతము లోపించి, నీచేత+ప్రోపు అని కాగా, ఈసూత్రముచే చేతకు ఇత్వము వచ్చి, 'నీచేతిప్రోపు' అని అగును.

'చేతతోడవలనలకు' అనునిర్దేశముచేత ఈఇత్వము ఇతరవిభక్తులకు రాదు. కువలయంబునవారు మొ.

'సమాసంబులందు' అనుటచేత వ్యస్తతలో ఇత్వము రాదు. నీతోడఁ జెలిమి

చేయుదును మొ.

'అగు' అనుటచే ఇత్వము నిత్యము. కావున సమాసములందు 'నీచేతప్రోపు' అనుతీరుగా ఉండదు.

**44. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.**

| | | | | |
|---|---|---|---|---|
| **నాయందున్** | + | **కరుణ** | = | **నాయందలికరుణ** |
| **ఇందున్** | + | **జనులు** | = | **ఇందలిజనులు** |
| **ఎందున్** | + | **వారు** | = | **ఎందలివారు** |

**ఎందు శబ్దమున కలిగాగమంబు కొందఱు లే దండ్రు.**

అందు మొద లగునవి అంద్వాదులు. సప్తమీవిభక్తి యగు 'అందు' అనునదియు, అవ్యయపదము లైన అందు, ఇందు, ఎందు అనునవియును అంద్వాదులు. 'అలిక్' అనుఆగమములో కకారము ఇత్తు. కావున అలి అనునది అంద్వాదులకు చివర చేరును. సమాసమునందు అందు మొద లగువానికి చివర అలి అనునది ఆగమముగా వచ్చిచేరును.

నాయందున్+కరుణ అని యుండగా 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అనుసూత్రముచే ద్రుతము లోపించి, నాయందు+కరుణ అని యుండగా ఈసూత్రముచే 'అలి' ఆగమముగా వచ్చి, నాయందు+అలి+కరుణ అని కాగా, 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, నాయందలికరుణ అని అగును.

'అంద్వాదులకు' అనుటచే అందు మొద లగువానిలో చేరనిదానికి అలి గాగమము లేదు. కువలయంబునవారు.

'సమాసంబునందు' అనుటచే సమాసము కానపుడు అలిగాగమము రాదు. నాయందుఁ గరుణ కలుగుము మొ.

'అగు' అనుటచే నిత్యము. కావున సమాసమున 'నాయందు కరుణ' అని ఉండదు.

అహోబలుడు మొద లగువారు ఎందుశబ్దమునకు అలిగాగమము రా దనిరి. కాని చిన్నయసూరి ఎందునకు కూడ అలిగాగమము వచ్చు నని 'ఎందలివారు' అనుఉదాహరణముతో స్పష్టము చేసెను.

**45. అదియవిశబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు.**

**నా + అది = నాది, నాయది**

**నా + అవి = నాది, నాయవి.**

**ఉదంతము లగుతద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లే దనియు నిదంతంబు లగుతద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యం బనియు బహుళ గ్రహణముచే నెఱుంగునది. వచ్చునది, వచ్చునవి. వచ్చెడిది, వచ్చెడివి.**

వృత్తి అనగా ఇచట సమాసము. సమాసమునందు అది అవి అనుశబ్దముల లోనిహ్రస్వ మైనఅకారమునకు బహుళముగా లోపము వచ్చును. బహుళము అనుటవలన, ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యములకు అవకాశము గలదు.

**ప్రవృత్తి :** ఇకారము చివర గలిగిన (ఎడి ప్రత్యయము చివర గల్గిన) తద్ధర్మార్థక విశేషణములకు పై నున్న అది, అవి శబ్దములలోని'అ'కారమునకు లోపము నిత్యముగా వచ్చును. వచ్చెడి+అది=వచ్చెడిది. వచ్చెడి+అవి=వచ్చెడివి. ఇచట వచ్చెడియది, వచ్చెడియవి అనువిధముగా అత్తునకు లోపము రానిరూపము లుండవు.

**అప్రవృత్తి :** ఉకారము చివర గలిగినతద్ధర్మార్థకధాతుజవిశేషణములకు పరముగా ఉన్న 'అది అవి' అనుశబ్దములలోని అకారమునకు లోపము రాదు. వచ్చు+అది, వచ్చెడు+అవి అనుచోట్ల ప్రస్తుతసూత్రమందలిబహుళశబ్దముచే అకారము లోపింపకుండగా 'ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనుసూత్రముచే నుగాగమము వచ్చి, 'వచ్చునది, వచ్చెడునవి' అని అగును. వచ్చుది, వచ్చెడుది అనువిధముగా ఇచట అత్తునకు లోప మైనరూపము లుండవు.

**విభాష :** కొన్నియెడల అది అవి అనువానిలోనిఅకారము వికల్పముగా లోపించును. నా+అది అని యుండగా ఈసూత్రముచే అకారము లోపించిన 'నాది' అని అగును. లోపము రానిపక్షమున సంధి లేదు గావున 'సంధి లేనిచోట' అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'నాయది' అని అగును. ఇట్లే నా+అవి=నావి, నాయవి.

'అదియవిశబ్దంబుల' అనుటచేత ఇతరశబ్దములందు అకారమునకు లోపము లేదు. వచ్చెడి+అతఁడు – వచ్చెడియతఁడు.

'అత్తునకు' అనుటచే అదియవులలోని దివివర్ణములకు లోపము లేదు. కావున నాది, నావి అనుచోట్ల 'నాయ' అనురీతిగా ది,వి, లోపించినరూపములు ఉండవు.

'వృత్తిని' అనుటచేత సమాసము కానపుడు లోపము రాదు. వానిని చూచి యది నవ్వెను.

**46. పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాష నగు.**

**భయము + పడె = భయపడె, భయంపడె, భయముపడె.**

**సూత్రము + పట్టె = సూత్రపట్టె సూత్రంపట్టె, సూత్రముపట్టె**

**ఈకార్యము కర్తృవాచిమువర్ణమునకుఁ గలుగదు.**

**గజము పడియె,అశ్వము పడియె.**

పడు మొద లగునవి షడ్వాదులు, పడు, పాటు, పట్టు, పెట్టు మొద లగునవి. మువర్ణకము అనగా 'ము' అనుప్రథమావిభక్తి ప్రత్యయము.

పడు మొద లగునవి పరముగా ఉన్నపుడు వానికి ముం దున్న 'ము' ప్రత్యయమునకు లోపమును, నిండుసున్నయును విభాషగా వచ్చును. విభాష అనుటవలన లోపపూర్ణబిందువులు రాక మువర్ణకము అట్లే ఉండుటయు కలదు.

భయము+పడె అని ఉండగా ఈసూత్రముచే మువర్ణకమునకు లోపము వచ్చిన 'భయపడె' అని అగును. విభాష గావున లోపము రానిచో భయము+పడె అని ఉండగా, మువర్ణకముస్థానమున నిండుసున్న వచ్చి 'భయంపడె' అని అగును. ఇదియు విభాషయె కావున నిండుసున్నయును రానిపక్షమునందు 'భయము పడె' అని మువర్ణకము అట్లె ఉండును.

'పడ్వాదులు' అనుటచే పడు మొద లగువానిలో చేరనిశబ్దము పర మైనపుడు ఈకార్యము లేదు. భయము పొందెను.

'మువర్ణకంబునకు' అనుటచే ప్రత్యయము కానిమువర్ణమునకు ఈకార్యము రాదు. పాము పట్టెను.

'పూర్ణ'బిందు వనుటచే ఖండబిందువు రాదు. భయఁపడె అని ఉండదు.

'విభాష' అనుదానిచే కర్తను తెలుపుమువర్ణకమునకు ఈకార్యము లే దని గ్రహింపవలెను. గజముపడియె. పడ్వాదులలోని దగు పడియె అనునది పర మైనది. దానికి పూర్వమునందు గజము అనుచో మువర్ణకము గలదు. ఐనను ఆ'ము'వర్ణకము కర్తను తెలుపునది అగుటచే లోపము రాక, గజముపడియె అనియే ఉండును.

**47. మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు.**

**చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుము నన్ను.**

**ఇటు చూడుము = ఇటు చూడు, ఇటు చూడుము.**

**చూడు మనియె, విను మనియె. ఇచ్చట నచ్చు పరం బయినది కాఁబట్టి లోపము లేదు.**

నీవు, మీరు అనునవి కర్తలుగా గలిగినక్రియ మధ్యమపురుషక్రియ. కకారాదులు హల్లులు. అవసానము అనగా పిదప వర్ణము లేవియు లేకుండుట.

హల్లు గాని అవసానము గాని పరముగా ఉన్నపుడు మధ్యమపురుషక్రియా పదమునందలిముప్రత్యయమునకు వికల్పముగా లోపము వచ్చును.

చూడుము + నన్ను అని ఉండగా, ఈసూత్రముచే ముపర్ణము లోపించిన 'చూడు నన్ను' అని అగును. 'విభాష' అనుటచే లోపము రానిపక్షమున 'చూడుము నన్ను' అని ముపర్ణకము అట్లే ఉండును.

'మధ్యమపురుష' అనుటచే ఇతర(ఉత్తమ)పురుషయందలిముపర్ణకమునకు ఈకార్యము లేదు. చదువుదుము+నిరంతరము=చదువుదుము నిరంతరము అని ముపర్ణకము అట్లే ఉండును.

'ముపర్ణకంబునకు' అనుటచే మధ్యమపురుషయే అయినను ఇతర (మధ్యమపురుష ఏకవచన మగు వు, బహువచన మగు డుజ్) వర్ణకములకు లోపము రాదు. చదువుదువు(+)గ్రంథములను, చదువుఁడు(+)గ్రంథములను.

**48. వ్యతిరేకమధ్యమముపర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.**

**నమ్మకుము + ఇట = నమ్మ కిట, నమ్మకు మిట.**

యుష్మదర్థము (నీవు, మీరు) కర్తగా గలిగినక్రియ మధ్యమపురుషక్రియ. వ్యతిరేకార్థమును తెలుపుమధ్యమపురుషక్రియయందలి'ము'ప్రత్యయమునకు అన్ని చోటులందును విభాషగా లోపము వచ్చును. 'మధ్యపురుషముపర్ణకంబునకు హలవసానంబులు పరము లగునపుడు లోపము విభాష నగు' అనుసూత్రముచే 'మధ్యమపురుషముపర్ణకమునకు హలవసానములు పర మగుచో విభాషగా లోపము సిద్ధించును. ఇచట 'ఎల్లయెడల' అనుటచేత హలవసానములే కాక అచ్చు పర మైనపుడు సైతము వ్యతిరేకమధ్యమముపర్ణము లోపించును.

నమ్ముకుము+ఇట అని ఉండగా, 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని ప్రాప్తించుచున్నఉత్త్వసంధిని బాధించి, ఈసూత్రముచే ముపర్ణకము లోపించి, నమ్మకు+ఇట అని కాగా, (కువర్ణమునందు) ఉత్త్వసంధి జరిగి, 'నమ్మ కిట' అని అగును. 'విభాష' అనుటచే ముపర్ణకము లోపింపనిపక్షమునందు నమ్మకుము+ ఇట అని ఉండగా (ముపర్ణకమునందు) ఉత్వసంధి జరిగి, 'నమ్మకు

మిట' అని అగును.

ఈవిశేషవిధానముచేత వ్యతిరేకమధ్యమమువర్ణకమునకు హలవసానములు పర మైనపుడు కూడ, 'హలవసానంబులు పరంబు లగునపుడు' అనుసూత్రమును బాధించి ప్రస్తుతసూత్రముచేతనే లోపము విభాషగా వచ్చును. నమ్మకు వానిని, నమ్మకు మొ.

'వ్యతిరేక' అనుటవలన స్వార్థమునం దున్న మధ్యమమువర్ణకమునకు ఇచట లోపము రాదు. వినుము + అనియె= విను మనియె. (హలవసానములు పర మగునపుడు మాత్రము 'హలవసానంబులు పరంబు లగునపుడు' అనుసూత్రముచే లోపము వచ్చును. చూడు నన్ను, ఇటు చూడు. మొ.)

'మధ్యమ' అనుటచే మధ్యమపురుష కాని (ఉత్తమపురుష)మువర్ణమునకు లోపము రాదు. నమ్మము+అనిరి=నమ్మ మనిరి.

'మువర్ణకంబునకు' అనుటచేత ఇతరమధ్యమపురుషప్రత్యయములకు ఈకార్యము లేదు. వినవు+అనెను, చూడవు+నన్ను, నమ్మకుఁడు+అని అనుచో మధ్యమ వు, డుజ్వర్ణములకు లోపము లేదు. విన వనెను, చూడవు నన్ను, నమ్మకుఁ డని. మొ.

'ఎల్లయెడల' అనుటచే అచ్చు, హల్లు, అవసానము ఏది పర మైనను ఈ మువర్ణకము విభాషగా లోపించును. నమ్మ కిట, నమ్మకు వానిని, నమ్మకు మొ.

## 49. ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు.

**ఉండుము + ఉండుము = ఉం దుండుము, ఉండు ముండుము**

**కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టు కొట్టుఁడు, కొట్టుఁడు కొట్టుఁడు.**

ద్విరుక్తముయొక్క పరరూపము ఆమ్రేడితము. యుష్మదర్థము (నీవు, మీరు) కర్తగా కలిగినక్రియ మధ్యమక్రియ.

ఆమ్రేడితము పరముగా ఉన్నపుడు మధ్యమపురుషయందు ఏకవచన మగు మువర్ణకమునకును, బహువచన మగు డుజ్వర్ణకమునకును, విభాషగా లోపము వచ్చును. ఇచట ఆమ్రేడితము అని సామాన్యముగా చెప్పుటచే మొదట అ చ్చున్నను హ ల్లున్నను ఆమ్రేడితము పర మైనచో లోపము వచ్చును.

ముడుజులు (క్రియా)విభక్తులు గావున (ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' (సంధి. 41సూ.) అనుసూత్రముచే లోపము

సిద్ధించుచున్నది. అయినను మరల ఆరంభించిన ఈవిధానము 'సిద్ధే స త్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి' అను ఆద్యపరిభాషచే క్రియావిభక్తులలో ము డుజులకు తప్ప ఇతరమునకు (సంధి. 41. సూత్రముచే) లోపము రా దని నియమించుచున్నది.

ఉండుము + ఉండుము అని యుండగా ఉత్త్వసంధిని బాధించి ప్రస్తుత సూత్రముచే మువర్ణము లోపింపగా, ఉండు+ఉండుము అని అగును. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అనుసూత్రముచే సంధి జరిగి, 'ఉండుండుము' అని యేర్పడును. 'విభాష' అనుటచే మువర్ణకము లోపింపనిపక్షమునందు ఉండుము+ ఉండుము అని ఉండగా, 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అనుసూత్రముచే సంధి జరిగి, 'ఉండు ముండుము' అని అగును.

'ఆమ్రేడితంబు' అనుటచే ఉండుము+అనెను మొద లగుచోట్ల 'ము'లోపము లేదు. ఉండు మనెను.

'ఆమ్రేడితంబు పరం బగునపుడు' అనుటచే ఆమ్రేడితమునకు పూర్వమునందలి శబ్దముననే ముడుజ్లోపము వచ్చును. కాని ఆమ్రేడితమున జరుగదు. 'కొట్టుఁడు కొట్టు' అని కాదు.

'మధ్యమ' అనుటచే మధ్యమము కాని ముడుజులకు లోపము రాదు. 'చదువుదుము చదువుదుము' 'చదువఁగలఁడు చదువఁగలడు' మొ.

'ముడుజులకు' అనుటచే ముడుజులకంటె వే రయినమధ్యమపురుష ప్రత్యయములకు లోపము రాదు. 'ఉందువు ఉందువు', 'ఉందురు ఉందురు. మొ.

'డుజు' అనుచో జకారముతో కూర్చి చెప్పుటచే 'జిత్తు బిందుపూర్వం బగు' అనులక్షణము ననుసరించి డువర్ణము బిందువుతో గూడ లోపించును. కొట్టుఁ డు + కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు.

**50. విసర్గంబున కనుకరణంబున లోపం బగు.**

**వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె**

అనుసరించి యథాతథముగా గ్రహించుట అనుకరణము. సంస్కృత వాక్యమును తెలుగులోనికి అనుకరించునపుడు ఆసంస్కృతవాక్యము చివర నున్న విసర్గకు లోపము వచ్చును.

వర్ధతాం శ్రీః + అనియె. అనుచో ఈసూత్రముచే సంస్కృతవాక్యము చివరివిసర్గ లోపింపగా 'వర్ధతాం శ్రీ + అనియె'. ఇచట సంధి లేదు. కావున 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు'

అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'వర్ధతాం శ్రీ యనియె' అని అగును.

'విసర్గంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు లోపము రాదు. 'దాసో ऽహ మనె'.

'అనుకరణంబున' అనగా అనుకరణము పరముగా ఉన్నపుడు అని అర్థము. కావున అనుకరణము పరముగా లేనిచో విసర్గ లోపింపదు. 'శ్రీః వర్ధతామ్ + అనె' అనుచో విసర్గమునకు అనుకరణము పరముగా లేదు కావున లోపింపదు. అనగా సంస్కృతవాక్యమధ్యమునం దున్న విసర్గకు లోపము లే దని తాత్పర్యము.

'అగు' అనుటచే లోపము నిత్యము. కావున 'వర్ధతాం శ్రీః యనియె' అనువిధముగా విసర్గ లోపింపకుండుటకు వీలు లేదు.

**51. అనుకృతిని నమశ్శబ్దముతుదియత్తున కోత్వము విభాష నగు.**

**తుభ్యం నమః + అనె = తుభ్యం నమ యనె.**

**ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి.**

**గతానుగతికో లోకో యటంచున్.**

అనుకృతి అనగా అనుకరణము. 'అత్తునకు' అనుచోటిషష్ఠీవిభక్తిచే హ్రస్వ మగుఅకారముయొక్క స్థానమున అని అర్థ మగును. అనుకరణమునందు నమః అనుశబ్దమునందలి చివరిఅకారముస్థానమున ఓకారము విభాషగా ఆదేశముగా వచ్చును.

తుభ్యం నమః+అనె అని ఉండగా 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' అనుసూత్రముచే విసర్గ లోపించి, 'తుభ్యం నమ+అనె' అని కాగా, ప్రస్తుతసూత్రముచే తుదిఅత్వమునకు ఓత్వము వచ్చి, 'నమో + అనె' అని అగును. ఇచట సంధి లేదు కావున 'సంధి లేనిచోట' అనుసూత్రముచే యడాగమము వచ్చి, 'నమో యనె' అని అగును. 'విభాష' అనుటచే ఓత్వము రానిపక్షమున 'నమ+అనె' అని యుండగా యడాగమము వచ్చి, 'నమ యనె' అని అగును.

'అనుకృతిని' అనుటచే అనుకరణము పరము గానిచో ఈకార్యము లేదు. 'నమ ఆదిత్యాయ యనె'.

'నమశ్శబ్దము' అనుటచే ఇతరశబ్దమునందు ఈకార్యము లేదు. 'ధర్మ స్సహాయ యని' మొ. కాని ఒకచో నమః అనుదానికంటె ఇతరశబ్దమునందును ఓత్వము కనిపించుచున్న దని సూరి వివరించెను. 'గతానుగతికో లోకో యటం చుండుటల్' ఇచట లోకశబ్దమునందు ఓత్వ మయినది.

'తుదియత్తునకు' అనుటచే నమశ్శబ్దమునందలి మొదటిఅత్వమునకు ఓత్వము రాదు. 'తుభ్యం నోమ యనె' అని కాదు.

**52. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.**

**కింతత్ + అనియె = కిం త త్తనియె,**

**క స్త్వమ్ + అనియె = కస్త్వ మ్మనియె.**

ద్విర్వచనము అనగా రెండుసార్లు చెప్పుట. అనగా ద్విత్వము. అనుకరణము పరముగా నున్నపుడు అనుకరింపబడువాక్యముయొక్క చివర నున్నహల్లునకు ద్విత్వము వచ్చును. అనగా మరల అదే హల్లు ఇం కొకటి వచ్చిచేరును.

కిం తత్ + అనియె అని ఉండగా ప్రస్తుతసూత్రముచేత తత్ అనుచోటి చివరిహల్లుతకారమునకు ద్విత్వము వచ్చి, కిం తత్త్ + అనియె, 'కిం త త్తనియె', అని అగును. ఇట్లే క స్త్వమ్ + అనియె = క స్త్వ మ్మనియె. మొ.

'అనుకరణంబున' అనుటచే అనుకరణము పరము గానిచో ఈకార్యము లేదు. 'త్వ మీదృశ యనె'

'తుదిహల్లునకు' అనుటచే చివరిది కానిహల్లునకు ద్విత్వము రాదు. 'కిం త్త తనియె' ఇత్యాదిగా కాదు.

'అగు' అనుటచే ద్విత్వము నిత్యము. కావున 'కిం త తనియె, క స్త్వ మనియె' అనురీతిగా ద్విత్వము రానిరూపము లుండవు.

**53. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.**

**దాసో ఽహమ్ + అనె = దాసో ఽహ మ్మనె, దాసో ఽహ మనె.**

**తత్ కర్తవ్యమ్ + అనె = తత్ కర్తవ్య మ్మనె, తత్ కర్తవ్య మనె.**

అహమ్ మొద లగునవి అహమాదులు. ద్విరుక్తి అనగా రెండుసార్లు చెప్పుట. అనగా ద్విత్వము. 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు' అను సూత్రముచే ద్విత్వము నిత్యముగా రావలసియుండగా ఈసూత్రము వికల్పముగా చెప్పుచున్నది.

అహమ్ మొద లగుశబ్దములమకారమునకు అనుకరణమునందు ద్విత్వము వికల్పముగా వచ్చును.

దాసో ఽహమ్+అనె అని ఉండగా 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు' అనుసూత్రముచే నిత్యముగా ద్విత్వము రావలసియుండగా దానిని బాధించి ప్రస్తుతసూత్రముచే వికల్పముగా వచ్చును. ద్విత్వము వచ్చినచో 'దాసో ఽహ మ్మనె' అని అగును. 'విభాష' అనుటచే ద్విత్వము రానిపక్షమున 'దాసో ఽహ మనె' అని అగును.

'అనుకరణంబునందు' అనుటచే అనుకరణము పరము గానిచో ఈకార్యము లేదు. 'అహ మాగత యనె'.

'అహమాదుల' అనుటచే అహమ్ మొద లగువానిలో చేరనిశబ్దముయొక్క మకారమునకు ద్విత్వము వికల్పము కాదు. పూర్వసూత్రముచే నిత్యమె. క స్త్వమ్+ అనె=క స్త్వ మ్మనె. ఇచట 'క స్త్వ మనె' అని ద్విత్వము రానిరూపము ఉండదు.

'అహమాదుల మకారంబునకు' అనుటచే అహమ్ మొద లగుశబ్దము లన్నియు మకారము చివర గలిగినవే అగుచున్నవి. అందుచే మకారముకంటె వే రైన హల్లునకు పూర్వసూత్రముచే ద్విత్వము నిత్యముగనె అగును. కిం తత్ + అనె= కిం త త్తనె. ఇచట 'కిం త తనె' అనువిధముగా ద్విత్వము లేనిరూపము ఉండదు.

**54. ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు.**

**ఇయం ధేనుః + అనె = ఇయం ధేను వనె.**

**అనుకృతిని నిదుదకుం గుఱుచ యగు నని యొకండు పలికె నది నిరాకరంబు. దుర్బలస్య బలం రాజా యన వినవే.**

హ్రస్వ మగుఉకారము చివర గలిగినది ఉదంతము. ఇచట నామము అనగా క్రియాపదముకంటె వే రైనది. వుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. 'వు' వర్ణమునందు ఉకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున వకారపు పొల్లె ఆగమముగా వచ్చును. ఇది కిత్తు కావున ఉదంతనామమునకు చివరగా వచ్చిచేరును.

అనుకరణమునందు హ్రస్వ మగుఉకారము చివర కలిగినక్రియాపదము కంటె వే రైనశబ్దమునకు చివర వకారపుపొల్లు ఆగమముగా వచ్చును.

ఇయం ధేనుః + అనె అని ఉండగా 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' అనుసూత్రముచేత విసర్గ లోపించి, ఇయం ధేను+అనె అని కాగా, ప్రస్తుత సూత్రముచే వకారము ఆగమముగా వచ్చి, ఇయం ధేనువ్+అనె = 'ఇయం ధేను వనె' అని అగును.

'ఉదంత' అనుటచే ఉదంతములు కాని వానికి వుగాగమము రాదు. 'వర్ధతాం శ్రీ యనె' మొ.

'నామంబునకు' అనుటచేత క్రియాపదములకు వుగాగమము లేదు. ధర్మో జయతు+అనుచు. ఇచట ఉత్వసంధి జరిగి 'ధర్మో జయ తనుచు' అని అగును.

'అగు' అనుటచే వుగాగమము నిత్యము. కావున 'ఇయం ధే ననె' అను విధముగా వుగాగమము రాకుండుటకు వీలు లేదు.

**55. వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గా దని యార్యు లండ్రు. సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడి.**

పిదప వర్ణము లేవియు లేకుండుట అవసానము. అనగా చివర అని అర్థము. వాక్యముయొక్క చివర సంధికార్యములు లేకుండుట తప్పు కాదు అని పెద్దలు చెప్పుదురు. 'న స్యా ద్వాక్యవిరామే తు సంధ్యభావో ऽపి దోషకృత్' అని అధర్వణాచార్యు లనిరి.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో – ఇచట శ్రేయము, అనుచోట ఉకారము వాక్యావసానమునం దున్నది. 'అది' అనుచో తరువాతివాక్యము మొదట అచ్చు కలదు. అయినను 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే రావలసినఉత్వసంధి ఇట రాలేదు. ప్రస్తుతసూత్రము ననుసరించి ఇట్లు వాక్యము చివర సంధి చేయకుండుట దోషము కాదు. కావున ఇది సాధువె.

సూత్రమున 'సంధి' అనుదానికి 'సంధిపరిచ్ఛేదమున చెప్పబడినకార్యము' అని అర్థము. అంతే కాని 'పూర్వసరస్వరంబులకు పరస్వరం బేకాదేశం బగుట' అనునది కాదు. ఆసంధి లేనిచోట రావలసినయడాగమము కూడ ఇట్లు సంధికార్యమె అగుచున్నది. కావున 'శ్రేయము అది లేనిచో' అనుచోట యడాగమము కూడ రాదు. (యడాగమము చేయవలసివచ్చుచో ఉత్వసంధియె యగును.)

ఇట్లు వాక్యావసానమున సంధి లేకపోవుట కావ్యములలో వాక్యాంతము పాదాంతము కూడ అయినపుడే కానవచ్చును.

'వాక్యావసానంబున' అనుటచే వాక్యమధ్యమునందు సంధి లేకపోవుట దోషమె అగును. రాముఁడు ఆంజనేయునికి ప్రసన్నుఁడు అయ్యెను. అని కావ్యములందు ప్రయోగింపరాదు. రాముఁ డాంజనేయునకుఁ బ్రసన్నుఁ డయ్యెను. అనువిధముగా సంధికార్యములు చేయవలెను.

'సంధిలేమి దోషంబు గాదు' అనుటవలన సంధి చేయుట ఇష్టము అనియు ఒకవేళ మానినను తప్పులే దనియు అభిప్రాయము. కావున 'సత్యము సర్వశ్రేయ మది లేనిచో' మొద లగువిధముగా వాక్యావసానమున సంధి యుండుట సాధారణ మని అర్థము.

'అని ఆర్యు లండ్రు' అనుట ఈఅంశమును లక్షణబద్ధము చేసిన అధర్వణాచార్యులవంటి పెద్దలపై గౌరవమును సూచించును.

**ఇది సంధిపరిచ్ఛేదము**

**పరవస్తు చిన్నయసూరి**

# తత్సమపరిచ్ఛేదము

## 1. డుమువులు ప్రథమ.

డు, ము, వు, లు అనునవి నాల్గును ప్రథమావిభక్తులు. నేను, మేము, నీవు, కూఁతురు మొద లగుచోట్ల విశేషముగా అచ్చతెనుగునందు ను, ము, వు, రు మొద లగునవి కొన్ని ప్రథమావిభక్తియందు వచ్చుచున్నవి. తత్సమములందు సామాన్యముగా ప్రథమావిభక్తులు డు,ము,వు,లు అనునవి.

## 2. నువర్ణంబు ద్వితీయ.

'ను' అనునది ద్వితీయావిభక్తి.

## 3. చేత తోడ తృతీయ.

చేత, తోడ, అనునవి రెండును తృతీయావిభక్తులు.

## 4. కొఱకు కయి చతుర్థి.

కొఱకు, కయి అనునవి రెండును చతుర్థీవిభక్తులు. కయి అనుదానిలో అయి అనుదానికి 'ఐ' అనునది ఆదేశముగా రాగా (క్రియా.103) కయి అనుదాని నుండి 'కై' అనురూపము ఏర్పడును. రామునికయి, రామునికై.

## 5. వలన కంటె పట్టి పంచమి.

వలన, కంటె, పట్టి అనునవి మూడును పంచమీవిభక్తులు.

## 6. కు యొక్క లోపల షష్ఠి.

కు, యొక్క, లోపల అనునవి మూడును షష్ఠీవిభక్తులు.

## 7. అందు న సప్తమి.

అందు, న, అనునవి రెండును సప్తమీవిభక్తులు.

## 8. తృతీయాదులకు నుగాగమం బగు.

**రామునిచేతను - రామునితోడను - రామునికొఱకును - రామునివలనను - రామునికంటెను - రామునకును - రామునియందును.**

తృతీయ మొద లగునవి తృతీయాదులు, నుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. కావున కి త్తయిననువర్ణము తృతీయాదులకు (ఆద్యన్తౌ టకితౌ) చివర వచ్చి చేరును. తృతీయ మొదలుకొని సప్తమివర కున్నవిభక్తులకు చివర 'ను' అనువర్ణము ఆగమముగా వచ్చును. ఆగమముగా వచ్చనఈనువర్ణము ద్రుతము.

కావున ఈ విభక్తులు చివర గలిగినశబ్దములు ద్రుతప్రకృతికములు అగును. రామునిచేతను మొ.

'తృతీయాదులకు' అనుటచే ప్రథమాద్వితీయావిభక్తులకు నుగాగమము రాదు. ప్రథమాంతములు కళలు. కావున వీనికి చివర ద్రుతము ఉండదు. ద్వితీయాంతము ద్రుతప్రకృతికము. కావున ద్వితీయయందు విభక్తి యగు'ను'వర్ణమే ద్రుతము. వనమును.

'అగు' అనుటచే నగాగమము నిత్యము. కావున తృతీయాదులు ద్రుత ప్రకృతికములె అగును.

**9. కయి పట్టి యొక్కలకు నుగాగము లేదు.**

**రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.**

కయి అనునది చతుర్థీవిభక్తి. పట్టి అనునది పంచమి. యొక్క అన్నది షష్ఠీ విభక్తి. ఇవి తృతీయ మొద లగువానిలో చేరినవి. కావున 'తృతీయాదులకు నుగాగమం బగు' అనుసూత్రముచేత వీనికి నుగాగమము ప్రాప్తించుచుండగా తృతీయాదులలోని వైన కయి, పట్టి, యొక్క అనుమూడువిభక్తులకు నుగాగమము రా దని ఈసూత్రము నిషేధించుచున్నది. రామునికయి, మొ. నుగాగమము లేకుండుటచే వీనికి చివర ద్రుతము ఉండదు. కావున ఇవి కళ లగును.

'కయిపట్టియొక్కలకు' అనుటచే వీనికి భిన్న మైనతృతీయాదులకు అన్నిటికి పూర్వసూత్రముచే నుగాగమము వచ్చి, అవి ద్రుతప్రకృతికము లగును. 'రాముని కొఱకును, రామునివలనను, రామునకును మొ.

**10. చేతతోడలోపలవర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.**

**రామునిచే - రామునితో - వనములలో.**

ప్రత్యయమునకు తెలుగున వర్ణకము అని విశేష మగుసంజ్ఞ. వర్ణము అనగా అచ్చు లేక హల్లు. అక్షరము అనగా అచ్చు లేదా అచ్చుతో కూడినహల్లు (హల్లులు) అనగా అచ్చు చేరనిహల్లు లెన్ని ఉన్నను దానికి అక్షరముగా పరిగణనము లేదు. చేత తోడ అనుతృతీయా విభక్తులందును, లోపల అనుషష్ఠీ విభక్తియందును మొదటి అక్షరములు వికల్పముగా మిగిలియుండును. అనగా మొదటిఅక్షరము లగు చే, తో, లో, అనువానికి పై నున్నవర్ణము లన్నియు వికల్పముగా లోపించును.

చేత. మొదటి దగు 'చే' అనుఅక్షరమునకు పై నున్న 'త' అనుఅక్షరము లోపించి, మొదటిఅక్షరము మిగులగా, చే. రామునిచే. 'వైకల్పికము' అనుటచే

లోపింపనిపక్షమునందు 'చేత' అని ప్రత్యయ మట్లె ఉండును. రామునిచేత.

ఇట్లే 'తోడ' లో డవర్ణము లోపించి, (రాముని)తో, 'లోపల'లో పైనున్న 'పల' అనురెండక్షరములు లోపింపగా, (వనముల)లో. వైకల్పికము కావున లోపము రానిపక్షమునందు (రాముని)తోడ, (వనముల)లోపల.

చే, తో, లో, అనునవి కూడ తృతీయాదివిభక్తులే అగుటచే 'తృతీయాదులకు నుగాగమం బగు' అనుసూత్రముచే వీనికి నుగాగమము వచ్చును. రామునిచేను, రామునితోను, వనములలోను.

**11. డుమువున లేకవచనంబులు.**

**ఏకత్వసంఖ్యను బోధించుప్రత్యయం బేకవచనంబు.**

**రాముఁడు – సోముఁడు – వనము – ధనము – ధేనువు – భానువు.**

పదార్థము ఒక్కటి అని తెలుపునట్టిప్రత్యయము ఏకవచనము. ప్రథమ మొద లగువిభక్తులలో డు,ము,వు, న అనునవి నాల్గును ఏకవచనములు మాత్రమె అగును. డు,ము,వు అనుప్రథమావిభక్తులును, న అనుసప్తమియును పదార్థ మొక్కటి మాత్రమె అని బోధించును.

రాముఁడు. ఇచట 'డు' అనునది రాముడు ఒక్కడే అగుటను బోధించుచున్నది. ఇట్లే వనము మొ.

'ఏకవచనంబులు' అనుటచే ఇవి బహుత్వమును బోధింపజాలవు. అనేకు లయిన రాములు అనుఅర్థమును 'డు' అనువిభక్తి బోధింపలేదు. రాములు అని లువర్ణము ప్రయోగింపవలెను.

**12. లువర్ణంబు బహువచనంబు.**

**బహుత్వసంఖ్యను బోధించుప్రత్యయంబు బహువచనంబు.**

**రాములు – సోములు – వనములు – ధేనువులు – భానువులు.**

పదార్థము ఒకటికంటె ఎక్కువ సంఖ్యలో ఉండుటను తెలియజేయునది బహువచనము, డుమువులు మొద లగుప్రథమాదివిభక్తులలో 'లు' అనునది బహువచనము.

రాములు. ఒక్కరికంటె ఎక్కువసంఖ్యలోనున్న రాములు అని అర్థము.

'లువర్ణంబు' అనుటచే ప్రథమ మొద లైనవిభక్తులలో లువర్ణముకంటె ఇతర మైనవి కేవలము బహువచనములు కావు. డుమువున అనునవి కేవలము ఏకత్వసంఖ్యను బోధించుచు, ఏకవచనములు మాత్రమే అయిఉండగా, ను, చేత మొద లయినవి బహుత్వముతోపాటు ఏకత్వమును గూడ బోధించుచు

బహువచనములే కాక ఏకవచనములు కూడ అగుచున్నవి. కేవలము బహువచనము మాత్రమే అగునది ప్రథమావిభక్తి అయిన 'లు' వర్ణము ఒక్కటి మాత్రమే.

'బహువచనంబు' అనుటచే లువర్ణము ఏకత్వసంఖ్యను బోధింపజాలదు. 'రాములు' అనుచో లువర్ణము ఒక్కరాముఁడు అనుఅర్థమును బోధింపదు.

పూజ్యత మొద లగుఅర్థవిశేషములందు ఏకత్వముననే బహువచనము విశేషముగా చెప్పబడినది. అట్టివిశేషవిధానస్థలములందు మాత్రము ఏకత్వము నందు చెప్పబడిన దగుటచే బహువచనము ఏకత్వమును బోధించును. 'వీరు ద్రుపదమహారాజులే'. ఇచట 'మహారాజులు' అనుచోటిలువర్ణము 'మహారాజు' అని ఏకత్వసంఖ్యనే బోధించును.

## 13. తక్కినవి యుభయంబులు.

**మిగిలినప్రత్యయము లేకత్వబహుత్వములకు బోధకము లని యర్థము. వనమును, వనములను, వనములచేతను, వనముతోడను, వనములతోడను.**

తక్కినవి అనగా మిగిలినవి. అనగా పూర్వము చెప్పగా మిగిలియున్నవి. 'డుమువున లేకవచనంబులు, లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రములచే అంతకుముందు, డు,ము,వు,న, అనునాల్గును ఏకవచనములుగాను 'లు' అనునది ఒక్కటి బహువచనముగాను చెప్పబడియున్నవి. కావున అవి పోగా మిగిలియున్న ను, చేత, తోడ, మొద లగువిభక్తులు, ఏకవచనములును, బహువచనములును రెండును అగును. అనగా (ద్వితీయా)నువర్ణము మొద లగునవి, ఏకత్వసంఖ్యను బహుత్వసంఖ్యను రెంటిని బోధించుశక్తి కలిగిన వయియుండును.

'వనమును' అనుచోట నువర్ణకము 'వనమును' ఒక్కదానినే బోధించుచు ఏక వచనముగా నున్నది. 'వనములను' అనుచో అదే నువర్ణము 'వనములను' అనేక ములను బోధించుచు బహువచన మైనది. ఇట్లే వనమందు, వనములందు మొ.

## 14. ఓ యామంత్రణంబునం దగు.

**ఓ యనుశబ్దము సంబోధనమునం దగు నని యర్థము. ఇది సంబోధ్య వాచకంబునకు ముందే ప్రయోగింపఁబడును. ఓ శబ్దము తొలఁగియు సంబోధ్యవాచకము ప్రయోగింపవచ్చును. ఓరాముఁడ – ఓరాములార – రాముఁడ – రాములార.**

ఆమంత్రణము అనగా సంబోధనము. అభిముఖముగా చేసికొనుట, పిలుపు అని అర్థము. సంబోధనమునందు 'ఓ' అనుశబ్దము వచ్చును. ఓ రాముఁడ.

'ఆమంత్రణమునందు' అని సామాన్యముగా చెప్పుటచే ఏకత్వమునను, బహుత్వమునను అన్ని అర్థములందును ఓ శబ్దము వచ్చును. ఓ రాములార, ఓ సీత, ఓ వృక్షమ.

దేనిని సంబోధింతుమో అది సంబోధ్యము. దానిని తెలుపుశబ్దము సంబోధ్య వాచకము. ఓ శబ్దము సంబోధింపబడుపదార్థమును తెలుపుశబ్దము (సంబోధ్య వాచకము)నకు పూర్వమునందే ప్రయోగింపబడును. ఓరాముఁడ. సంబోధ్య వాచకమునకు ముందే అనుటవలన 'రాముడ ఓ' అనువిధముగా ఓ శబ్దము సంబోధ్యవాచమునకు పిదప ప్రయోగింపబడదు. 'ఆమంత్రణంబునందు' అని సూత్రమున సామాన్యముగా చెప్పిన ఓశబ్ద మెచ్చట వచ్చునో ఈవివరణము స్పష్టము చేయుచున్నది.

**15. ఓ శబ్దంబునకుం బురుష నీచ స్త్రీ పురుషామంత్రణంబులందు యి సి రి వర్ణంబులు విభాష నంతాగమంబు లగు.**

**ఓయి రాముఁడ – ఓరాముఁడ. ఓసి దుష్టురాల – ఓ దుష్టురాల. ఓయి దుష్టుఁడ – ఓదుష్టుఁడ.**

ఆమంత్రణము అనగా సంబోధనము. పురుషుని సంబోధించునపుడు 'ఓ' అనుశబ్దమునకు చివర 'యి' అనుఅక్షరము వికల్పముగా చేరును.

'ఓ యామంత్రణంబునం దగు' అనుసూత్రముచే ఓ శబ్దము చేరి, ఓ రాముఁ డ అని యుండగా ప్రస్తుతసూత్రముచే 'యి' వర్ణము ఓ శబ్దమునకు పైని చేరి ఓయి రాముడ అని అగును. 'విభాష' అనుటచే యివర్ణము రానిచో – ఓ రాముఁడ.

'పురుషామంత్రణమునందు' అనుటచే స్త్రీతిర్యగ్జడములసంబోధనమున యివర్ణము రాదు. 'ఓయి సీత, ఓయి చిలుక, ఓయి వనమ అని ఉండదు.

2. నీచస్త్రీని సంబోధించునపుడు 'ఓ' అనుశబ్దమునకు చివర 'సి' అను అక్షరము వికల్పముగా ఆగమముగా వచ్చును.

'దుష్టురాల' ఈశబ్దము నీచస్త్రీని తెల్పునది. సంబోధనమున దీనికి ముందు 'ఓ యామంత్రణంబునం దగు' అనుసూత్రముచే ఓ శబ్దము చేరి, ఓ దుష్టురాల అనుచో ఈసూత్రముచే ఓ శబ్దమునకు చివర 'సి' వర్ణము చేరి, 'ఓసి దుష్టురాల' అని అగును. 'విభాష' అనుటచే 'సి'వర్ణము రానిపక్షమునందు 'ఓ దుష్టురాల' అని యుండును.

3. నీచపురుషుని సంబోధించునపుడు 'ఓ' అనుశబ్దమునకు చివర 'రి' అను

వర్ణము వికల్పముగా ఆగమము వచ్చును.

దుష్టుడ అనునది నీచపురుషుని బోధించుచున్నది. సంబోధనమున దీనికి ముందు ఓ శబ్దము చేరి, ఓ దుష్టుడ అని యుండగా ఈసూత్రముచే ఓ శబ్దమునకు పైని 'రి' వర్ణము ఆగమ మయి, 'ఓరి దుష్టుడ' అని అగును. 'విభాష' అనుటచే రివర్ణము రానిపక్షమునందు 'ఓ దుష్టుడ' అని యుండును.

'నీచ స్త్రీ పురుషామంత్రణమునందు' అనుటచేత నీచతార్థము లేనపుడు 'సి,రి' వర్ణములు రావు. ఓరి పూజ్యుడ. ఓసి దేవతా అని యుండవు.

'ఓ శబ్దంబునకు' అనుటవలన సంబోధనమునందు ఓ శబ్దము లేనపుడు 'యిసిరి' వర్ణములకును అవకాశము లేదు. రాముఁడ, దుష్టురాల, దుష్టుడ, మొ. ఇచట 'యి రాముడ, సి దుష్టురాల, రి దుష్టుడ' అనువిధముగా ఉండదు.

'ఆగమములు' కావున ఈఆగమములు రానిపక్షమునను పూర్వము ఉన్న అర్థమునకు భంగము లేదు. ఓరి దుష్టుడ అనగా ఎట్టిఅర్థ మగునో 'ఓ దుష్టుడ' అన్నను అదే అర్థము.

'అంతాగమంబు లగు' అని సామాన్యముగా చెప్పుటచే యిసిరి వర్ణములు ఏకత్వమునను బహుత్వమునకు వచ్చును. బహుత్వమున వచ్చిన ప్రయోగములు అరుదు. ఓయి వెఱ్ఱులార! ఓరీ దుష్టనిశాటులార.

## 16. ఓరి యోసి మైత్రియందుం గలవు.

**ఓరి చిన్నికృష్ణ. ఓసి ముద్దుబాల. ఓయి మొద లయినవానికి స్వతంత్ర ప్రయోగంబుం గలదు. సంగతియ యోయి. ఓసి పోవే. ఓ రోరి యిం కెందుఁ బోవచ్చు. వీనికి దీర్ఘంబుం గలదు. ఓయీ విప్రకులావతంస. ఓరీ దుష్టనిశాటులార. ఓసీ ననుఁ జెనక రాకు.**

'ఓ శబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబులందు 'యిసిరి' వర్ణంబులు విభాష నంతాగమంబు లగు' అనుసూత్రముచే స్త్రీపురుషామంత్రణములందు నీచతయందే సి, రి, అనునవి వచ్చి, ఓసి, ఓరి అనునవి అగును. ఓరి, ఓసి అనునవి నీచతయందే కాక మైత్రియందు కూడ కల వని ఈసూత్రము చెప్పుచున్నది.

అనగా మైత్రియందును పురుషామంత్రణమున ఓ శబ్దమునకు పైని, 'రి' అనునది వికల్పముగా వచ్చును. ఓరి ముద్దుకృష్ణ, ఓ ముద్దుకృష్ణ.

అట్లే మైత్రియందును స్త్రీసంబోధనమునందు ఓశబ్దమునకు చివర 'సి' వర్ణము విభాషగా ఆగమముగా వచ్చును. ఓసి ముద్దుబాల, ఓ ముద్దుబాల.

'మైత్రియందును' అనుచోటి నుశబ్దముచే నీచతార్థమునందు పూర్వసూత్రముచే ఎట్లును వచ్చును. ఓరి దుష్టుడా, ఓసి దుష్టురాల. మైత్రియందు అగుటయే విశేషము.

**17. స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు.**

**తిర్యక్కు లనగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.**

స్త్రీవ్యక్తులను బోధించునవి స్త్రీవాచకములు, సీత, అమ్మ మొ. వీనిని మహతీ వాచకములు అనియు అందురు. తిర్యక్కులు అనగా పశువులు, పక్షులు, కీటకములు మొద లైనవి. ఎద్దు, చిలుక, దోమ మొ. జడములు అనగా చలనము లేనివి. ప్రాణము లేనివానిని (అప్రాణి) బోధించునవి. గోడ మొ. విశేష్యమునందలి విశేషమును తెలుపుశబ్దము విశేషణము.

స్త్రీలు, పశువులు మొద లగువానిని బోధించునవి, ప్రాణము లేనివస్తువులను బోధించునవి, తప్ప మిగిలినశబ్దములకు మహత్తు లని సంజ్ఞ. అట్లు మహత్తు లైనశబ్దములయొక్క విశేషణములును మహత్తులే అగును.

పూజ్యుఁ డగు రాముడు. రామ అనుశబ్దముచే బోధింపబడువస్తువు స్త్రీ తిర్యగ్జడభిన్నము. కావున ఆశబ్దము మహత్తు. దానికి విశేషణ మగుటవలన 'పూజ్య' శబ్దమును మహత్తే అగును. మహత్తే మహద్వాచకము.

'భిన్నంబులు' అనుటచే స్త్రీతిర్యగ్జడములు మహత్తులు కావు. మహత్తులు కానవి అమహత్తులు. కావున స్త్రీ తిర్యగ్ జడములు ఐనవి అమహత్తు లగును. అట్లే స్త్రీతిర్యగ్జడములవిశేషణములును అమహత్తులే. కళత్రము, సింహము, సున్నము మొ. భయంకర మైనసింహము. 'సింహ' అనుఅమహత్తునకు విశేషణము కావున 'భయంకర' శబ్దమును ఇచట అమహత్తు.

**18. క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు.**

**మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు.**

క్లీబములు అనగా నపుంసకలింగములు. 'మిత్ర' మొద లగునవి మిత్రాదులు. మిత్ర, శరణ, ప్రధాన, పాత్ర మొద లగునవి. స్త్రీతిర్యగ్జడభిన్నములును వాని విశేషణములును మహద్వాచకములు. పుంలింగతుల్యములు అనగా పుంలింగముతో సమాన మైనవి.

నపుంసకలింగము లగు 'మిత్ర' మొద లగుశబ్దములు మహత్తు లైనపుడు వికల్పముగా పుంలింగముతో సమానము లగును. వీనికి పుంలింగతుల్యత్వమును

ఆరోపించుటవలన పుంలింగశబ్దము పొందునట్టికార్యములు కల్గును.

స్నేహితుడు అనుఅర్థమున మహద్వాచకమును, నపుంసకలింగమును అయిన మిత్రశబ్దమునకు ప్రస్తుతసూత్రముచే పుంలింగతుల్యత వచ్చును. ఇపుడు దీనికి పుంలింగ మగుమహద్వాచకమునకు వచ్చు ఉత్వము, డుజు మొద లగుకార్యములు కలుగును. మిత్రుఁడు, మిత్రునిన్. మొ.

'విభాష' అనుటచే పుంలింగతుల్యత లేనపుడు మహత్తే అయినను నపుంసక లింగము కావున నపుంసకలింగకార్యము అనగా మువర్ణకము మొద లగునవి వచ్చును. మిత్రము, మిత్రమును మొ.

'క్లీబంబులు' అనుటచే సూర్యుడు అనుఅర్థమునం దున్న 'మిత్ర' అనుపుంలింగ శబ్దమునకు ఇచట ప్రసక్తి లేదు.

'మిత్రాదులు' అనుటచే 'మిత్ర' మొద లగువానిలో చేరనిశబ్దమునకు పుంలింగ తుల్యత లేదు. దైవము.

'మహద్వాచకంబులు' అనుటచే మిత్రాదులు అమహత్తు లైనపక్షమున పుంలింగతుల్యత లేదు. (ఉన్నను అమహత్త్వమువలన డుజాదులు రావు) సింగము మిత్ర మగువృషభము. మొ.

## 19. జిత్తు బిందుపూర్వం బగు.

**జకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధ మయి ప్రయోగించునపుడు మానంబడువర్ణ మిత్తు నాఁబడు. ఉదాహరణము మీఁద స్పష్టం బగు.**

జకారము ఇత్తుగా కలిగినది జిత్తు. జిత్తు అయినవర్ణము పూర్వమునందు బిందువు కలిగినది అగును. అనగా పూర్వమునందు బిందువు వచ్చును. బిందువు అని సామాన్యముగా చెప్పుటచే అరసున్నయు, నిండుసున్నయు అగును. బిందువు వచ్చినపిదప ఇ త్తయిన జకారము లోపించును.

'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనుసూత్రమున 'డుజ్' అను ప్రత్యయము చెప్పబడినది. 'డుజ్'లో జకారము ఇత్తు. జకారము ఇత్తుగా గలది కావున డువర్ణము జిత్తు అయినది. డువర్ణమునకు ముందు 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే బిందువు వచ్చును. నిండుసున్న అయినచో రాముండు. అరసున్న అయినచో రాముఁడు. బిందువు వచ్చిన పిదప జకారము లోపించును. కావున రాముఁడుజ్ అనురీతిగా ఉండదు.

'జిత్తు' అనుటచే జిత్తు కానిదానికి పూర్వమునందు బిందువు రాదు.

'బిందుపూర్వంబు' అనుటచే బిందువు జిత్తునకు పరముగా రాదు. కావున రాముడుం ఇత్యాదిగా ఉండదు.

'అగు' అనుటచే నిత్యము. కావున బిందువు రాముడు అనురీతిగా పూర్వమునందు బిందువు రానిరూప ముండదు.

## 20. డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు స్పష్టము.

వర్ణకము అనగా ప్రత్యయము. ప్రకృతి అనగా ఇచట ప్రాతిపదికము. 'డుఙ్' అనుప్రత్యయమునకు ప్రాతిపదిక అయినశబ్దమునకు డుమంతము అని సంజ్ఞ. 'డు' అను శబ్దముపై మతుప్ ప్రత్యయము చేరి, (డుమత్) తెలుగున 'డుమంతము' అనునది ఏర్పడుచున్నది, రాముఁడు. ఇచట డుజ్వర్ణకమునకు ప్రకృతి అయినది కావున 'రామ' అనుప్రాతిపదికమునకు 'డుమంతము' అని పేరు.

'డుజ్వర్ణకంబునకు' అనుటచే డుజుకంటె వే రైనప్రత్యయములకు ప్రాతిపదిక మైనదానికి ఈసంజ్ఞ ఉండదు. వన, ధేను మొ.

'ప్రకృతి' అనుటచే ప్రాతిపదికమునకే ఈసంజ్ఞ. 'రాముడు' అనువిధ మైన డుజంత మయినపదమునకు డుమంతము అనుసంజ్ఞ లేదు.

పుంలింగము, మహద్వాచకము లయినను డుజు నిలువని 'హరి' మొద లగువానికిని డుమంతము అనుసంజ్ఞ లేదు.

## 21. పుంలింగ బయి మహద్వాచకం బయిననామంబుతుది యత్వంబున కుత్వం బగు.

**నామం బనఁగాఁ బ్రాతిపదికము, డిత్థ, రామ, భార్గవ, రాజపురుష, ఇట్టివి ప్రాతిపదికలు. డిత్థు, రాము, భార్గవు, రాజపురుషు.**

నామము అనగా ప్రాతిపదికము, స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణ ములును మహద్వాచకములు. అత్వమునకు అనుచోటిషష్ఠీవిభక్తిచే హ్రస్వ మగు అకారముస్థానమున అని అర్థ మగును.

పుంలింగమును, మహద్వాచకమును ఐనప్రాతిపదికయొక్క చివర ఉన్న హ్రస్వ మైనఅకారముయొక్క స్థానమునందు హ్రస్వ మైనఉకారము వచ్చును.

'రామ' అనుప్రాతిపదికమునందలి అత్వమునకు ఈసూత్రముచే ఉత్వము వచ్చి 'రాము' అని అగును. ఇట్లే భార్గవ–భార్గవు మొ.

'పుంలింగం బయి' అనుటచే మహ త్తయినను పుంలింగము కానిచో ఉత్వము రాదు. దైవ – ఇది మహద్వాచకమే కాని నపుంసకలింగము. కావున ఉత్వము

రాదు. దైవుఁడు అని కాదు. దైవము అని ముపర్ణకము వచ్చును.

'మహద్వాచకం బయిన' అనుటచే పుంలింగము ఐనను మహత్తు కానిచో ఉత్వము రాదు. వృక్ష. సంస్కృతము ననుసరించి ఈశబ్దము పుంలింగము. కాని ఇది అమహత్తు. కావున ఉత్వము రాదు. వృక్షము. (వృక్షువు అని కాదు.)

'నామంబు' అనుటచే ప్రాతిపదికము కానిశబ్దమునందు ఉత్వము రాదు. రామునియొక్క. ఇది పదము కావున ఉత్వము లేదు.

'తుది' అనుటచే చివరిది కానిఅత్వమునకు ఉత్వము రాదు. హర - హరుఁడు, నల-నలుఁడు మొ. హురఁడు, నులుఁడు ఇత్యాదిగా కాదు.

'అత్వంబునకు' అనుటచే హ్రస్వ మైనఅకారముకంటె వే రైనవర్ణమునకు ఉత్వము రాదు. హరి, విధాతృఁడు మొ.

**22. పుంలింగ మగుమహద్వాచకమునకు డు ఙు.**

**ఇచ్చట డు ఙనుదానియందు ఙకార మిత్తు గావున 'ఙిత్తు బిందుపూర్వం బగు' ననుసూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును బిమ్మట ఙకారము లోపించును. డిత్థుఁడు-డిత్థుండు. రాముఁడు-రాముండు. భార్గవుఁడు - భార్గవుండు.**

'డుమువులు ప్రథమ' అనుసూత్రముచే డువర్ణము ప్రథమమావిభక్తి. 'డుమువున లేకవచనంబులు' అనుసూత్రముచే ఆ 'డు'వర్ణము ఏకవచనము.

పుంలింగమును, మహద్వాచకమును ఐనప్రాతిపదికకు ప్రథమావిభక్తి ఏకవచనమునందు 'డుఙ్' అనుప్రత్యయము వచ్చును.

'రామ' అనునది పుంలింగ మగుమహద్వాచకము. కావున 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబుతుదియత్వంబున కుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, రాము అని కాగా, ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో ప్రస్తుత సూత్రముచే డుఙ్ వచ్చి, రాము+డు(ఙ్) అని యగును. ఇందు 'డు' ఙిత్తు అయినది. కావున 'ఙిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే డువర్ణమునకు ముందు అరసున్న వచ్చిన, రాముఁడు అనియు, నిండుసున్న వచ్చిన, రాముండు అనియు అగును.

'పుంలింగ మగుమహద్వాచకమునకు' అని సామాన్యముగా చెప్పుటచే పుంలింగమును మహద్వాచకమును అయిన ప్రాతిపదికము ఎట్టి దయినను (చివర ఏఅచ్చు ఉన్నను) ఈసూత్రముచే, డుఙు వచ్చును. విశ్వపుఁడు, శంభుఁ డు, విధాతృఁడు.

'పుంలింగ మగు' అనుటచే మహ త్తయినను పుంలింగము కాని ప్రాతిపదికకు' డుజు రాదు. దైవము, మిత్రము. మొ.

'మహద్వాచకంబునకు' అనుటచే పులింగ మయినను, మహత్తు కాని శబ్దమునకు డుజు రాదు. వృక్షము, ఋక్షము. మొ.

**23. డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు.**

**రామునిని – రాముని, రామునిచేతను – రామునిచేతను, రామునికిని– రామునకును, సర్వత్ర యనుట నగాగమబాధనార్థము.**

డుజ్వర్ణకమునకు మూల మైనప్రాతిపదికమునకు 'డుమంతము' అని పేరు. ద్వితీయ మొద లగువిభక్తులయందు ఏకవచనము ద్వితీయాద్యేకవచనము. నిక్+ ఆగమ. అనుచో కకారము ఇత్తు. కావున కిత్తు అయిన నివర్ణము డుమంత మగుప్రాతిపదికకు చివర ఆగమముగా చేరును.

ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనము పరముగా ఉన్నపుడు డుమంత మైనప్రాతిపదికకు చివర 'ని' అనువర్ణము అన్నియెడల వికల్పముగా ఆగమముగా వచ్చును.

రాము+ను అని ఉండగా ఈసూత్రముచే నివర్ణము ఆగమముగా వచ్చి రాముని+ను అని కాగా, 'ఇకారంబుమీఁది' అనుసూత్రముచే నువర్ణకమునకు ఇత్వము వచ్చి, రామునిని అని అగును. 'విభాష' అనుటచే నిగాగమము రానపుడు 'రాము+ను' 'డుమంతంబుమీఁదినువర్ణంబునుత్వంబున కిత్వం బగు' అను (తత్స. 25) సూత్రముచే 'రాముని' అని అగును.

'డుమంతంబునకు' అనుటచేత డుమంతము కాని 'హరి' మొద లగునామము లకు నిగాగమము లేదు. హరి+ను 'ఇకారంబుమీఁది(తత్స. 26)' అనుసూత్రముచే – హరిని.

'ద్వితీయాది' అనుటచే ప్రథమావిభక్తియందు నిగాగమము లేదు. రాముఁడు, (రాములు). ఇంక ద్వితీయ మొదలుకొని సప్తమివరకు అన్నివిభక్తులయందును నిగాగమము వచ్చును. రామునియందును.

'ఏకవచనంబు' అనుటచే బహువచనము పర మయినపుడు నిగాగమము రాదు. రాములను, రాములందు.

'సర్వత్ర' అనుదళము కువర్ణకము పర మైనపుడు చెప్పిననగాగమమును (తత్స. 28), అందు పర మైనపుడు చెప్పిననుగాగమమును (తత్స. 29) బాధించును.

రామునికి, రామునియందు. 'విభాష' గావున నిగాగమము కానపుడు నగాగమ నుగాగమములు వచ్చి, రామునకు, రామునందు అని అగును.

**24. అనుదంత మగుతెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును.**

**మగనిని, మగనిచేతను, మగనికిని, అనుదంతం బనుపర్యుదాసముచేత తమ్మునిని, తమ్ముని, తమ్మునిచేతను, తమ్ముచేతను, అల్లునిని, అల్లుని, అల్లుని చేతను, అల్లుచేతను, బల్లిదునిని, బల్లిదునిచేతను, బల్లిదుచేతను ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికం బని యెఱుంగునది.**

అనుదంతము అనునది పర్యుదాసము. 'పర్యుదాస స్స విజ్ఞేయః య త్రోత్తర పదేన నఞ్'. 'నఞ్'కు మీదిపదముతో చేయబడినసమాసమును పర్యుదాసము అందురు. న+ఉదంత - అనుదంత. ఉదంతము కానిది అనుదంతము. డుజ్వర్ణమునకు మూల మైనఅచ్చతెనుగుప్రాతిపదికకు తెనుగుడుమంతము. 'డుమంతంబునకు' ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు (తత్స. 23) విభాషగా రావలసియున్న'ని'గాగమము ఉదంతములు కాని అచ్చతెనుగుడుమంతములకు నిత్యముగా వచ్చును.

మగ అనుప్రాతిపదికముపై ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షయందు 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే నువర్ణకము వచ్చి, మగ+ను అని యుండగా 'డుమంతంబునకు' (తత్స. 23) అనుసూత్రమును బాధించి ప్రస్తుతసూత్రముచే నిగాగమము నిత్యముగా రాగా, మగని+ను. 'ఇకారంబుమీఁది' అను(తత్స. 26) సూత్రముచే 'మగనిని' అని అగును. ఇట్లే ఔనిచేత మొ.

'అనుదంతంబు' అనుటచేత ఉదంతము లైనతెనుగుడుమంతములకు నిగాగమము నిత్యము గాదు. కావున తత్స. 23 సూత్రముచే విభాషగా వచ్చును. తమ్మునిని, తమ్ముని మొ.

'తెనుఁగుడుమంతమునకు' అనుటచే అనుదంత మైనను సంస్కృత డుమంతమునకు నిగాగమము నిత్యము కాదు. తత్స. 23 సూత్రముచే విభాషయే. విధాతృనియొక్క - విధాతృయొక్క+అనతి - విధాతృనానతి.

'నిత్యముగా నగు' అనుటచే మగని - మగచేత ఇత్యాదిగా నిగాగమము రానిరూపము లుండవు.

**25. డుమంతంబుమీఁదినువర్ణకంబునుత్వంబున కిత్వం బగు.**

**నువర్ణంబు ద్వితీయ యనుసూత్రముచే రాము ను అని ప్రాప్తింపగా**

**నీసూత్రముచేత నువర్ణకోత్వంబున కిత్వంబు సిద్ధించె. రాముని, భార్గవుని.**

డుజ్‌వర్ణము నిలుచుటకు మూల మైనప్రాతిపదికకు డుమంతము అని పేరు. నువర్ణకంబుయొక్క ఉత్వము నువర్ణకంబునుత్వము. 'ఉత్వంబునకు' అనుచోటి షష్ఠీవిభక్తిచే ఉత్వముయొక్క స్థానమున అని అర్థము లభించును.

డుమంతము లగుప్రాతిపదికలకు పై నున్నద్వితీయావిభక్తి యగు నువర్ణము నందలిఉకారముస్థానమున ఇకారము వచ్చును.

రామ అనుప్రాతిపదికకు 'పుంలింగం బయి' అను (తత్స. 23) సూత్రముచే ఉత్వము వచ్చి, రాము అని కాగా, ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే 'ను' అనుప్రత్యయము వచ్చి, రాము+ను అని కాగా (తత్స. 23 సూత్రముచే) నిగాగమము రానిపక్షమునందు ప్రస్తుతసూత్రముచే నువర్ణకమునందలిఉకారమునకు ఇకారము ఆదేశ మయి 'రాముని' అని అగును.

'డుమంతంబు' అనుటచే డుమంతములు కానిశబ్దములపై ఇత్వము రాదు. శంభువును, సీతను. శంభువునిని, సీతనిని మొద లగువిధముగా నిగాగమము ఉండదు.

'మీఁది' అనుటచే డుమంతమునకు వెంటనే పరముగా నున్నపుడె ఇత్వము వచ్చును. రాములను మొద లగుచోట్ల 'ల'వర్ణముతో ఎడము ఉండుటచే నువర్ణమునకు ఇత్వము రాదు.

'నువర్ణకంబు నుత్వంబునకు' అనుటచే ఇతరవిభక్తిప్రత్యయములందలి ఉత్వమునకు ఇత్వము లేదు. రాముఁడు మొ.

**26. ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు.**
**హరిని – హరికిని. శ్రీని – శ్రీకిని. వారిని – వారికిని.**

'లకారంబునకు డుఞువురునుము ఙ్గు' అనుసూత్రముచే చెప్పబడిన డుఙ్, రు, వు, రు, ను, ము అనునవి క్రియావిభక్తులు. ఇకారమునకు మీఁద ఉన్న కు, ను, వు అనువర్ణములందును, క్రియావిభక్తులందును ఉన్న ఉకారమునకు హ్రస్వ మగు ఇకారము వచ్చును.

హరి అనుదానిపై ద్వితీయైకవచనవివక్షయందు 'నువర్ణంబు ద్వితీయ' అను సూత్రముచే నువర్ణము వచ్చి, హరి+ను అని ఉండగా ఈసూత్రముచే నువర్ణము నందలిఉత్వమునకు ఇత్వము వచ్చి, 'హరిని' అని అగును.

'ఇకారంబు' అని తపరకరణము లేకుండ చెప్పుటచే హ్రస్వమే కాక దీర్ఘ మగు ఈకారముపై గూడ ఈకార్యము వచ్చును. శ్రీ+ను = శ్రీని, అట్లె

ఏకవచనమున నైనను, బహువచనమున నైనను ఇత్వము వచ్చును. హరిని, వారిని, ఎవరికి మొ

'ఇకారంబు' అనుటచే ఇతరస్వరములమీద ఉన్నకునువుక్రియావిభక్తులకు ఇత్వము రాదు. సీతకు, శంభువును, వదినెవు మొ.

'మీఁది' అనుటచే ఇకారమునకు అవ్యవహితపరముగా ఉన్నపుడే ఈకార్య మగును. వదినెకు, కన్నియను, మొ.

'కునువుక్రియావిభక్తుల' అనుటచే కునువు మొద లగువానికంటె ఇతరములందు ఈకార్యము గలుగదు. హరికొఱకు, వారియందు మొ.

అట్లే 'కునువుక్రియావిభక్తులు' అనుటచే ఈకార్యము ఏకపదమునందే అని గుర్తింపవలెను. సుకృతి+నుతించెను మొద లగువిధముగా వే ఱొకపదమునకు చెందిన కునువులు పర మైనపుడు వానికి ఇత్వము రాదు.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున ఇత్యము రాని 'హరికు' అనువిధ మైనరూపములు ఏపక్షమునను ఉండవు.

**27. ఈధాతుయుష్మదర్థంబులమీఁదివానియుత్వంబున కిత్వంబు రాదు.**

**ఈరు - ఈవు - ఈను - ఈము - ఈకు- నీకు - మీకు.**

ఈధాతువు అనగా 'ఇచ్చునకు సర్వంబున కీ యగు' అనుసూత్రముచే 'ఇచ్చునకు ఆదేశముగా వచ్చిన 'ఈ' అను(ఇచ్చుధాతు)రూపము. నీ, మీ (ఈ) అనునవి యుష్మదర్థములు నీ, మీ, (ఈ) అనునవి. 'ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' అనుపూర్వసూత్రమును అనుసరించి ఈసూత్రమునందలి 'వాని' అనుదానికి 'కునువుక్రియావిభక్తుల(యొక్క)' అని అర్థము.

ఇచ్చునకు ఆదేశముగా వచ్చిన 'ఈ'ధాతువునకు పైని, నీ, మీ, ఈ అను యుష్మదర్థములకు పైని ఉన్న కు(ను)వు క్రియావిభక్తులయందలిఉత్వమునకు ఇత్వము రాదు.

ఇచ్చు ధాతువునకు వ్యతిరేకార్థమున ప్రథమపురుషబహువచనమున ఈ+రు అని కాగా, 'ఇకారంబుమీది' అను (తత్స. 26) సూత్రముచే రావలసినయిత్వము ప్రస్తుతసూత్రముచే నిషేధింపబడినది. కావున ఇత్వము రాక 'ఈరు' అనియె ఉండును.

'ఈధాతు' అనుటచే 'ఈ' అనుదేశము రానిచో ఇచ్చునకు పైనున్న క్రియా విభక్తులఉత్వముస్థానమున ఇత్వమునకు నిషేధము లేదు. ఇచ్చి+రు=ఇచ్చిరి.

'యుష్మదర్థము' అని సామాన్యముగా చెప్పుటచే ఏకవచనమందును, బహువచనమందును అన్నిచోట్ల నిషేధము వర్తించును. నీకు, మీకు, ఈకు.

'వానియుత్వంబునకు' అనుటచే కునువుక్రియావిభక్తులకంటె ఇతర మైన దానియందు ఈకార్యము లేదు. మీరు, నీకొఱకు మొ.

**28. కువర్ణకంబు పరం బగునపు డుకారఋకారంబులకు నగాగమం బగు.**

**రామునకును - విష్ణునకును - సవితృనకును - విధాతృనకును.**

'కు' అనునది షష్ఠీవిభక్తి. నక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కిత్తు అయిన 'న'వర్ణము ఉకార, ఋకారములకు చివర ఆగమముగా వచ్చును. బహువచనమునందు లడాగమముతో ఎడము ఉండును. కావున షష్ఠీవిభక్తి ఏకవచనమునందు కువర్ణకము పరముగా నుండగా ప్రాతిపదికము చివరి ఉకారమునకును, ఋకారమునకును చివర నవర్ణము ఆగమముగా వచ్చును. ఉకారఋకారంబుల కని సామాన్యముగా చెప్పుటచే ప్రాతిపదికము మహత్తు అయిన, అమహత్తు అయినను నగాగమము వచ్చును.

రామ అనుప్రాతిపదికము షష్ఠీవిభక్తియందు ఏకవచనమునందు 'రాము+కును' అని యుండగా (తత్స. 23 సూ. చే నిగాగమము రానిపక్షమునందు) ప్రస్తుత సూత్రముచే నవర్ణము ఆగమముగా వచ్చి, 'రామునకును' అని అగును.

ఇట్లే వృక్షము+కును=వృక్షమునకును, వధువు+కును=వధువునకును, మొ.

'కువర్ణకంబు' అనుటచే ఇతరప్రత్యయము పర మయినపుడు ఈకార్యము లేదు. శంభువు, విధాతృనిచేత. మొ.

'పరం బగునపుడు' అనుటచే రాములకు అనుతీరుగా లడాగమముతో వ్యవధానమువలన బహుత్వమునందు నగాగమము లేదు.

'ఉకార ఋకారంబులకు' అనుటచే ఇతరము లైనఅచ్చులకు నగాగమము లేదు. సీతకు, వదినెకు, (రాములకు) మొ.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున (మహత్పుంలింగములకు నిగాగమము రానిపక్షమున) నగాగమము రానిరూపము ఉండదు. రాముకు, వధువుకు ఇత్యాదిగా ఉండుట ఈలక్షణమునకు విరుద్ధము.

**29. ఉకారఋకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు.**

**రామునందును - విష్ణువునందును - విధాతృనందును.**

అందు అనునది సప్తమీవిభక్తి. నుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు.

నువర్ణము నందలిఉకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున కి త్తయిన నకారపు పొల్లు ఉకారఋకారములకు చివర వచ్చును. బహుత్వమున లడాగమముతో వ్యవధాన ముండును. కావున ఉకారఋకారంబుల కనుటచే ఈకార్యము సప్తమిలో ఏకవచనమునందే వచ్చును అని గ్రహింపవచ్చును.

(సప్తమీ ఏకవచనమునందు) అందు అనుప్రత్యయము పరముగా నున్నపుడు దానికి పూర్వమునం దున్న ప్రాతిపదిక చివరిఉకారమునకును, ఋకారమునకును చివర నకారపుపొల్లు ఆగమముగా వచ్చును.

రామ అనుప్రాతిపదికము సప్తమీవిభక్తి ఏకవచనమునందు రాము+అందును అని యుండగా (తత్స.23. సూ.చే. నిగాగమము రానిపక్షమునందు) ప్రస్తుత సూత్రముచే ప్రాతిపదికకు చివర నకారపుపొల్లు ఆగమ మయి, రామున్+అందున్= రామునందును అని అగును.

'ఉకారఋకారంబులకు' అని సామాన్యముగా చెప్పుటచే మహత్తు అయినను అమహత్తు అయినను, ఉకారము సహజ మైనను, కృతక మయినను నుగాగమము వచ్చును. శంభునందును, బ్రతుకునందును, రామునందును మొ.

'ఉకారఋకారంబులకు' అనుటచేత ఇతర మయినఅచ్చునకు నుగాగమము లేదు. రాములయందు, సీతయందు మొ.

'అందువర్ణకము' అనుటచే ఇతరవిభక్తి పర మైనపుడు నుగాగమము లేదు. పేరున, గోరున మొ.

'పరం బగునపుడు' అనుటచే రాములయందు అనుతీరుగా లడాగమముతో వ్యవధానమువలన బహుత్వమునందు నుగాగమము రాదు.

'అగు' అనుటచే నుగాగమము నిత్యము. కావున రామందు, విధాతృయందు అనువిధముగా నుగాగమము రానిరూపము లుండవు.

## 30. ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమంబు విభాష నగు.

**వనమునందును - వనమందును - ధేనువునందును - ధేనువందును.**

ఆగమముగా వచ్చిన ము, వు, అనువర్ణములు ఆగమ ము, వు వర్ణములు. నుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. నువర్ణమునందు ఉకారము ఉచ్చారణ సౌకర్యమునకై ఉంచబడినది. కావున నకారపుపొల్లు చివర ఆగమముగా వచ్చును. 'ఉకార ఋకారంబులకు' (తత్స.29) అనుపూర్వసూత్రముచే నిత్యముగా రావలసిన నుగాగమము, 'అందువర్ణకము పర మయినపుడు' ఆగమముగా వచ్చిన

మువర్ణమునకును, వువర్ణమునకును పైని వికల్పముగా వచ్చును.

వన ప్రాతిపదిక. సప్తమీఏకవచనమునందు వనము+అందును అని కాగా, 'ఉకారబుకారంబుల కందువర్ణకము' అను (తత్స. 29) సూత్రముచే నుగాగమము నిత్యముగా రావలసియుండగా, దానిని బాధించి, ప్రస్తుతసూత్రముచే వికల్పముగా వచ్చును. నుగాగమము వచ్చినపక్షమునందు 'వనమున్+అందును - వనము నందును' అని అగును. 'విభాష' అనుటచే నుగాగమము రానపుడు వనము+అందును అనుచోట ('అంద్వవగాగమంబులం దప్ప (సంధి. 11) అనుటచే) ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనుసూత్రముచే సంధి జరిగి, వనమందును అని అగును.

'ఆగమ మువువర్ణంబులకు' అనుటచేత శబ్దమున సహజముగా నున్న 'మువు' వర్ణములకు ఈసూత్రముచే నుగాగమము విభాష కాదు. తత్స. 29 సూ.చే నిత్యముగా వచ్చును. పాము+అందును, పామునందును, ఆవు+అందును ఆవునందును మొ.

'అందువర్ణకము' అనుటచే ఇతరవర్ణకము పర మైనపుడు ఈకార్యము లేదు. వనముచేత, ధేనువుకొఱకు. మొ.

'పరం బగునపుడు' అనుటచేత బహుత్వమునందు లడాగమముతో వ్యవధానమువలన అందు వర్ణకము పరముగా ఉండదు. కావున బహుత్వమునందు ఈకార్యము లేదు. వనములయందు, ధేనువులయందు మొ.

**31. బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు.**

**రాములను - రాములచేతను - విధాతృలను - విధాతృలచేతను.**

బహుత్వము అనగా పదార్థము ఒకటికంటె ఎక్కువ అగుట. ద్వితీయ మొద లగువిభక్తులు ద్వితీయాదివిభక్తులు. అనగా ద్వితీయనుండి సప్తమివరకు గల విభక్తులు. లట్+ఆగమ అనుచో 'ట'కారము ఇత్తు. టకారము ఇత్తుగా కలిగినది కావున 'ల' అనువర్ణము టిత్తు. 'ఆద్యన్తౌ టకితౌ' అనులక్షణము ననుసరించి ఈ లవర్ణము విధింపబడినదానికి అనగా ద్వితీయాదివిభక్తులకు ముందుగా వచ్చి చేరును.

బహుత్వమునం దున్న ద్వితీయ మొద లగువిభక్తులకు పూర్వమునందు లవర్ణము ఆగమముగా వచ్చును. విభక్తికి ఆగమముగా వచ్చినది కావున ఈలకారము విభక్తిలకారము అగును.

రామ అనుప్రాతిపదికపై ద్వితీయావిభక్తి బహువచనవివక్షయందు

అత్వమునకు ఉత్వము వచ్చి, రాము, పైని 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే నువర్ణము వచ్చి, రాము+ను అని కాగా, ఈసూత్రముచే నువర్ణకమునకు ముందు లవర్ణము ఆగమముగా వచ్చి, రాము+లను = రాములను అని అగును.

మహత్తులకు, అమహత్తులకు అనువివక్ష చేయకపోవుటచే ఎల్లశబ్దములకును లడాగమము వచ్చును, రాములను, సీతలను, వనములను మొ.

'బహుత్వంబున' అనుటచేత ఏకవచనమునందు లడాగమము రాదు. రాముని, సీతయందు, గోరున మొ.

'ద్వితీయాదివిభక్తులకు' అనుటచే ప్రథమావిభక్తియందు లడాగమము లేదు. రాములు, సీతలు మొ.

'అగు' అనుటచే నిత్యము. కావున బహుత్వమునందు రాముని, సీతను అనురీతిగా లడాగమము రానిరూపములు ఉండవు.

## 32. సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుదియుకారంబున కకారం బగు.

**ఓ రాముఁడ - ఓ వృక్షమ - ఓ శంభువ - ఓ కొడుక.**

ఏకార్థం బయినపదంబు అనగా ఏకత్వమును బోధించునట్టిపదము. అనగా ప్రథమావిభక్తి ఏకవచనాంతము అయినపదము. 'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనుసూత్రముచే సంబోధనార్థమున ప్రథమావిభక్తి వచ్చును. సంబోధనమునందు మహ త్తయినను, అమహ త్తయినను ప్రథమావిభక్తి ఏకవచనము (డు,ము,వు ప్రథమైకవచనలోపము, మొ.) చివర కలిగినపదము నందు చివర నున్న ఉకారముయొక్క స్థానమున హ్రస్వ మైనఅకారము వచ్చును.

ఓరాముఁడు అనుచోట ఈసూత్రముచే చివరిఉకారముస్థానమున హ్రస్వ మైనఅకారము రాగా 'ఓ రాముఁడ' అని అగును.ఇట్లె ఓ వృక్షమ, ఓ వధువ మొ.

'సంబోధనంబునందు' అనుటచే ప్రాతిపదిక మొద లగుఇతర మైనఅర్థములందు వచ్చిన ప్రథమైకవచనముస్థలమున అత్వము రాదు. రాముఁడు రావణుని సంహరించెను. ఇచట రాముఁడ అని ఉండదు.

'ఏకార్థం బయినపదంబు' అనుటచే బహుత్వార్థమునందు ఉన్నపదమునకు అత్వము కాదు. ఓరాముల, ఓ సీతల అనురీతిగా ఉండదు. విశేషవిధానము ననుసరించి ఆరగాగమము వచ్చి, రాములార ఇత్యాదిగా అగును.

'తుది' అనుటచే ఓరాముఁడ, శంభుఁడ మొద లగుచోట్ల ఇతరస్థలముల

నున్నఉకారమునకు అత్వము రాదు. రాముఁడు శంభుఁడు ఇత్యాదిగా కాదు.

'ఉకారంబునకు' అనుటచే ఉకారముకంటె వే రయినఅచ్చులకు అత్వము రాదు. ఓ హరి, ఓ వదినె మొ. (ఓ హరా) ఓ వదినా అనరాదు.

'అగు' అనుటచే నిత్యము, కావున సంబోధనమునందు 'ఓ రాముఁడు, ఓ కొడుకు' ఇత్యాదిగా అత్వము రానిరూపము లుండవు.

**33. సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు.**

**ఓ రాముఁడా - ఓరాముఁడ. ఓ చెలియా - ఓచెలియ. ఓహరీ - ఓ హరి. ఓ తండ్రీ - ఓ తండ్రి.**

అకారమును ఇకారమును అకారేకారములు. సంబోధనమునందు ప్రథమాంత మైయుండుపదము చివర ఉన్నఅకారమునకును, ఇకారమునకును, వికల్పముగా దీర్ఘము వచ్చును.

రామ శబ్దము సంబోధనమునందు ఓ రాముఁడు అని యుండగా 'సంబోధనంబునం దేకార్థం బయిన' అను (తత్స.32) సూత్రముచే అత్వము వచ్చి ఓ రాముఁడ అని కాగా, చివరి అకారమునకు ప్రస్తుతసూత్రముచే దీర్ఘము వచ్చి, 'ఓ రాముఁడా' అని అగును. 'విభాష' అనుటచే దీర్ఘము రానిపక్షమునందు ఓ రాముఁడ అని యుండును.

'పదంబు' అని సామాన్యముగా చెప్పుటచే ఏకవచనమునను, బహువచనము నను దీర్ఘము వచ్చును. రాముఁడా, రాములారా. అట్లె మహత్తు అయినను అమహత్తు అయినను దీర్ఘము వచ్చును. రాముఁడా, సీతా, గిరీ.

'అకారేకారంబులకు' అని సామాన్యముగా చెప్పుటచే అవి శబ్దమున సహజముగా నున్నను కృతక మైనను దీర్ఘము వచ్చును. చెలియా, రాముఁడా. మొ.

'సంబోధనంబునందు' అనుటచే ప్రాతిపదికాద్యర్థములం దయినప్రథమకు దీర్ఘము రాదు. 'రాముడా రావణుని సంహరించెను.' అని ఉండదు.

'తుది' అనుటచే చివరివి కాని అకారేకారములకు దీర్ఘము రాదు. ఓ హరీ, ఓ చెలియా, అనుచోట్ల ఓ హారి, ఓ చెలీయ అనురీతిరూపము లుండవు.

'అకారేకారంబులకు' అనుటచే ఇతరస్వరములకు దీర్ఘము లేదు. ఓ వదినే, ఓ కన్నే అనువిధముగా దీర్ఘము లుండవు.

**34. కృతోత్కం బగుసంస్కృతనామంబుసంబుద్ధిడుజునకు లోపంబు విభాష నగు.**

**ఓరామ, ఓకృష్ణ, పూర్వసూత్రముచేత దీర్ఘంబు. ఓరామా, ఓకృష్ణ. సంస్కృతనామం బనుటcజేసి ఓ తమ్ముcడ, ఓ బల్లిదుcడ ఇత్యాదులందు లోపంబు లేదు.**

చేయబడిన ఉత్తు కలిగినది కృతోత్కము. సంబుద్ధి అనగా సంబోధనము నందలిప్రథమైకవచనము. అత్వమునకు ఉత్వము వచ్చినట్టి సంస్కృత మైన ప్రాతిపదికకు పరముగా సంబోధనార్థమునం దున్నప్రథమైకవచనము అగు డుజునకు వికల్పముగా లోపము వచ్చును.

ఓ రాము+డుజ్ అనుచో 'రాము' అను కృతోత్కముపై నున్న 'డుజు'నకు ఈ సూత్రముచే లోపము రాగా, 'ఓ రాము' అని అగును. (తత్స. 32. సూత్రముచే) చివరిఉత్వమునకు అత్వము వచ్చి, 'ఓ రామ' అని అగును. 'విభాష' అనుటచేత డుజునకు లోపము రానిపక్షమున ఓ రాముcడు (తత్స. 32.సూత్రముచే) ఓ రాముcడ.

'కృతోత్కంబు' అనుటచేత శంభు మొద లగు సహజ మైన ఉదంతములకు పై నున్న డుజునకు లోపము రాదు. కావున 'ఓ శంభ, ఓ విష్ణ' ఇత్యాదిరూపములు ఉండవు. (ఇట్లే విధాతృ మొ.)

'సంస్కృతనామంబు' అనుటవలన ఆచ్ఛికములును, సంస్కృతతుల్యములును అయినశబ్దముల పైని డుజు లోపింపదు. ఓ తమ్ముcడ, (ఆచ్ఛికము), ఓ బల్లిదుcడ. (సంస్కృతతుల్యము). ఇచట ఓ తమ్మ, ఓ బల్లిద అనువిధ మైనరూపము లుండవు.

'సంబుద్ధి' అనుటచే సంబోధనముకంటె ఇతర మైనఅర్థములందలి డుజు లోపింపదు. కావున రాముcడు మెచ్చెను. మొద లగుచోట్ల 'రామ మెచ్చెను'. అనురీతిగా డుజు లోపించినరూపములు ఉండవు.

'డుజు' అనుటచేత డుజుకంటె ఇతరప్రత్యయములకు ఈకార్యము లేదు. ఓ ధర్మువ, ఓ అర్థువ మొ. బహువచనమున ఈకార్యమునకు ప్రసక్తి లేదు.

**35. ఉదంతసంస్కృతనామంబుమీcదిసంబుద్ధిడుజునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు.**

**ఓ విష్ణూ – ఓ శంభూ. పక్షంబునందు విష్ణుcడ – శంభుcడ. ఇత్యాది.**

సంబుద్ధి అనగా సంబోధనమునందు (ప్రథమ) ఏకవచనము. 'ప్లుతము' అనునది స్వరములలో ఒకభేదము. ఒకమాత్రకాల ముచ్చరింపబడుస్వరము

హ్రస్వము. రెండు మాత్రలకాలము ఉచ్చరింపబడునది దీర్ఘము, మూడుమాత్రల కాలము ఉచ్చరింపబడునది ప్లుతము. మూడు మాత్రలకు గుర్తుగా '3' అంకె ఉంచుదురు.

సహజ మైనహ్రస్వ మగుఉకారము చివర గలిగినసంస్కృతప్రాతిపదికకు పై నున్న సంబోధనప్రథమావిభక్తి ఏకవచనము అగు డుజుయొక్క స్థానమున ప్లుతము అయిన 'ఊ3' కారము వైకల్పికముగా ఆదేశముగా వచ్చును.

సంబోధనమున విష్ణు+డుజ్ అని యుండగా ప్రస్తుతసూత్రముచే డుజుస్థానమున ఊ3 కారము ఆదేశముగా వచ్చి, విష్ణు+ఊ3 అని కాగా, 'అంద్వవగాగమంబులం దప్ప' అను (సంధి. 11) సూత్రముచే సంధి జరిగి, 'విష్ణూ3' అని అగును. 'విభాష' అనుటచే ఊకారము రానిపక్షమున విష్ణుఁడు (తత్స. 32) విష్ణుఁడ మొ.

'ఉదంత' అనుటచే అత్వమునకు ఉత్వము వచ్చుటచే ఉదంతము లైన శబ్దములకు పైని ఈకార్యము లేదు. ఓ రాముఁడ. ఇచట ఓరామూ అని ప్లుతము రాదు.

'సంస్కృతనామంబు' అనుటచే ఆచ్ఛికశబ్దములకు ఈకార్యము లేదు.

'సంబుద్ధి' అనుటచే సంబోధనముకంటె ఇతర మైనఅర్థములం దున్నడుజునకు ఈకార్యము లేదు. విష్ణుఁడు. శంభుఁడు మెచ్చెను. మొ.

'డుజునకు' అనుటచే ఇతర మయినప్రత్యయమునకు ఈకార్యము లేదు. ఓ ధేనువ, ఓ వధువా మొ. ధేనూ, వధూ అనురీతిరూపములు ఉండవు. బహు వచనమున ఈకార్యమునకు ప్రసక్తి లేదు. ఓ శంభులార.

డుజునకు లోపమును ముందరిఉత్వమునకు ప్లుతమును విధించినచో ప్రక్రియలో లాఘవము గలిగెడిది.

తెలుగున వర్ణమాలలో పరిగణింపబడనిఈప్లుతమువిధానము ప్రయోజనము మృగ్యము. దీర్ఘముగా గుర్తింపదగును.

**36. సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు.**

**ఓ రాములార - ఓ కృష్ణులార.**

**దీనికిం బాక్షికంబుగ దీర్ఘం బగు. ఓరాములారా - ఓ కృష్ణులారా.**

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనుసూత్రముచే సంబోధ నార్థమున ప్రథమావిభక్తి వచ్చును. ఆరక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. సంబోధనమునందు ప్రథమావిభక్తిబహువచనమునకు అనగా 'లు' వర్ణమునకు చివర 'ఆర' అనునది ఆగమముగా చేరును.

సంబోధనమునందు ఓ రాములు అని కాగా, లువర్ణకమునకు ఈసూత్రముచే ఆరగాగమము వచ్చి, ఓ రాములు+ఆర అని కాగా, 'అంద్వవగాగమంబులం దప్ప' అను (సంధి.11) సూత్రముచే సంధి జరిగి, 'ఓ రాములార' అని అగును.

బాలురు అనువిధముగా బహువచనలకారమునకు రేఫము వచ్చిన రూపములపై ఆరగాగమము వచ్చిన 'బాలురార' అనురీతిరూపములు గానరావు.

'సంబోధనంబునందు' అనుటచే ఇతరార్థములందు అరగాగమము లేదు. రాములు ముప్వురు మొ.

'బహువచనంబునకు' అనుటచే ఏకవచనమునకు లేదు. ఓ రాముఁడ.

'అగు' అనుటచే అరగాగమము నిత్యము. కావున 'ఓ రాములు' అనురీతిగా ఆరగాగమము లేని రూపము ఉండదు.

**37. మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు.**

**వినుఁడు బాలకులు. వినుఁడు బాలకులార. వచ్చితిరి కాంతలు. వచ్చితిరి కాంతలార. అన్నలార మిమ్ము నడిగెద నొక్కమాట. ఇచ్చట మధ్యమ పురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.**

యుష్మదర్థకము (నీవు, మీరు) కర్తగా కలిగినక్రియ మధ్యమపురుషక్రియ. సంబోధ్యవాచకమునకు మధ్యమపురుషక్రియతో అన్వయ మున్నపుడు 'అర' అను అగమము వికల్పముగా వచ్చును. 'సంబోధనంబునందు' అను(తత్స.36) సూత్రముచే నిత్యముగా రావలసిన ఆరగాగమము మధ్యమపురుషయోగము ఉన్నపుడు వికల్పము.

వినుఁడు బాలకులార! 'బాలకులు' అనుచోట బహువచనమున 'సంబోధనంబు నందు బహువచనంబున కారగాగమం బగు' అనుసూత్రముచే ఆరగాగమము నిత్యముగా రావలసియున్నది. ఇచట బాలకులు అనుసంబోధ్యవాచకము 'వినుఁడు' అను మధ్యమపురుషక్రియతో అన్వయించుచున్నది. కావున ప్రస్తుతసూత్రముచే అరగాగమము విభాష. 'ఆర' వచ్చినచో సంధి జరిగి, బాలకులార అని అగును. విభాష అనుటచే రానిపక్షమునందు 'వినుఁడు బాలకులు' అనియె ఉండును.

'మధ్యమపురుషయోగంబునందు' అనుటచేత సంబోధ్యవాచకమునకు మధ్యమ పురుషక్రియతో యోగము లేనిచో పూర్వసూత్రము ననుసరించి ఆరగాగమము నిత్యమే. అన్నలార! మిమ్ము అడిగెద. ఇచట అన్నలార అనుసంబోధ్యవాచకమునకు మధ్యమపురుషయోగము లేకపోవుటచే ఆరగాగమము నిత్యము. కావున 'అన్నలు అడిగెద' అని ఉండదు.

'ఆరగాగమంబు' బహువచనమునకు వచ్చుఆరగాగమము, మాత్రమే విభాష. కావున ఏకవచనమున ఉత్వమునకు కావలసినఅత్వము నిత్యమె. వినుము బాలకుఁడ. అకారేకారములకు దీర్ఘము పూర్వలక్షణానుగుణముగా వర్తించును. వినుము బాలకుఁడా, బాలకులారా.

**38. అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుమీఁదివిభక్తి లకారంబునకు రేఫం బగు.**

**బాలురు, బాలురను, బాలురచేతను. నృపాలురు, నృపాలురను, నృపాలురచేతను. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. దయాళురు, దయాళురను, దయాళురచేతను.**

హ్రస్వ మగుఅకారము చివర గలది అదంతము. ఉపధ అనగా చివరి నుండి రెండవవర్ణము. దీర్ఘము పూర్వమునందు కలిగినలకారము ఉపధగా కలిగినది దీర్ఘపూర్వలోపధము. విభక్తికి సంబంధించిన అకారము విభక్తిలకారము. 'లువర్ణంబు బహువచనంబు' అని చెప్పబడిన లువర్ణము, బహుత్వమున ద్వితీయ మొద లగు విభక్తులకు వచ్చినది గావున లడాగమ'ల'వర్ణమును ఇట్టివి. దీర్ఘము పూర్వమునందు గలిగినలకారము ఉపధగా ఉండి, హ్రస్వ మగుఅకారము చివర గలిగిన మహద్వాచక మగుప్రాతిపదికమునకు పైనున్న విభక్తు లగు లు, ల అనువర్ణములం దున్నలకారముపొల్లుస్థానమున రేఫము వచ్చును.

బాల అనుప్రాతిపదికకు తత్స.21. సూత్రముచే ఉత్వముతో ప్రథమా బహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, బాలు+లు అని యుండగా ప్రస్తుతసూత్రముచే బహువచనలకారమునకు రేఫము వచ్చి, 'బాలురు' అని అగును.

'అదంతం బయి' అనుటచే అదంతములు కానివానికి పైని ఈ రేఫ రాదు. ధీశాలి+లు ధీశాలులు. ఆకారాంతములు కానరావు. కావున అత్తు అనుచో తపరకరణము స్పష్టతకు అనవచ్చును. అదంతము కాకున్నను దయాళు అను ఉదంతశబ్దముపై మాత్రము రేఫము వచ్చుట కలదు. దయాళురు.

'దీర్ఘపూర్వ' అనుటచే హ్రస్వపూర్వములపైని రేఫము రాదు. నల–నలులు.

'లోపధము' అనుటచే లకారము కాక వేరొక హల్లు ఉపధ అయినపుడు ఈ రేఫము రాదు. రామ – రాములు మొ.

'మహత్తు' అనుటచే అమహత్తుల కీకార్యము లేదు. ఆడుపిల్ల అనుఅర్థమున బాలశబ్దము అమహత్తు. కావున రేఫము రాదు. బాలలు.

'విభక్తిలకారము' అనుటచే విభక్తికి సంబంధింపనిలకారమునకు రేఫము

రాదు. నృపాలులాభము మొ.

'అగు' అనుటచేత రేఫము నిత్యము. కావున బాలులు, నృపాలులు అనువిధముగా రేఫము రాని రూపము లుండవు.

**39. అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు.**

**వృక్షము – ఋక్షము – దైవము – కళత్రము – అపత్యము. క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ. మిత్రుఁడు – మిత్రము. శరణుఁడు – శరణము.**

ఆమహత్తులును నపుంసకములును అమహన్నపుంసకములు. స్త్రీతిర్యగ్ జడములును వానివిశేషణములును అమహత్తులు. సంస్కృతమును అనుసరించి నపుంసకలింగమునం దుండుశబ్దములు నపుంసకములు. అదంతములు అనగా హ్రస్వ మగుఅకారము చివర గలిగినవి. 'డుముడులు ప్రథమ' అనుసూత్రమునుబట్టి 'ము' అనునది ప్రథమావిభక్తి, 'డుమువున లేకవచనంబులు' అనుసూత్రము ననుసరించి ఏకవచనము.

హ్రస్వ మగుఅకారము చివర గల అమహత్తు లైనప్రాతిపదికలకును, హ్రస్వ మగుఅకారము చివర గల నపుంసకలింగములు అయినశబ్దములకును ప్రథమా విభక్తి ఏకవచనమునందు 'ము' అనుప్రత్యయము వచ్చును.

'వృక్ష' అనునది పుంలింగము. అయినను జడవాచక మగుటచే అమహత్తు, కావున అదంత మగుఈఅమహత్తునకు ప్రస్తుతసూత్రముచే ప్రథమైకవచనమున ముపర్ణకము వచ్చి, వృక్షము అని అగును.

'దైవ' అనునది మహద్వాచకము, అయినను సంస్కృతము ననుసరించి నపుంసకలింగము. కావున అదంత మగుఈనపుంసకశబ్దమునకు ప్రథమైకవచనమున ఈసూత్రముచే ముపర్ణకము వచ్చి 'దైవము' అని అగును.

'అమహన్నపుంసకములు' అనుటచే అమహత్తు లైనశబ్దములు నపుంసక లింగములు కాకున్నను ముపర్ణకము వచ్చును. వృక్షము. (ఇది పుంలింగము) నపుంసకలింగము లగుశబ్దములు అమహత్తు లైనను, మహత్తు లైనను ముపర్ణకము వచ్చును. కళత్రము, దైవము మొ. కావున అమహత్తు గాని, నపుంసకలింగము గాని కానిశబ్దమునకు ముపర్ణకము రాదు. రాముఁడు, మగఁడు మొ.

'అదంతములకు' అనుటచే అదంతములు కానిశబ్దములకును ముపర్ణకము రాదు. గిరి, మొ. ఇ ట్లనుటవలన పాము, మినుము ఇత్యాదులలో కనిపించు

ముువర్ణము ప్రథమావిభక్తి కా దనియు అది ప్రాతిపదికలో భాగమె అనియు తెలియవచ్చును.

'అగు' అనుటచే నిత్యము. కావున వృక్ష, కళత్ర అనుతీరుగా ముువర్ణము రానిరూపము ఉండదు.

**40. వానికి ముువర్ణకేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు.**

**వృక్షములు – వృక్షమును. ఋక్షములు – ఋక్షమును.**

'అమహన్నపుంసకముల కదంతములకు ముువర్ణకం బగు' అనుపూర్వసూత్రము ననుసరించి ఇచట 'వానికి' అనగా 'అమహన్నపుంసకముల కదంతములకు' అని అర్థము. 'డమువులు ప్రథమ', 'డుమువున లేకవచనంబులు' అను సూత్రములను అనుసరించి ముువర్ణకము ప్రథమావిభక్తి ఏకవచనము. కావున ముువర్ణకముకంటె ఇతర మైనవిభక్తి అనగా ప్రథమావిభక్తి బహువచనము మొద లగువిభక్తులు. ముక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కావున 'ముువర్ణము' కిత్తు. అందుచే ప్రాతిపదికకు చివర చేరును.

ప్రథమావిభక్తి బహువచనము మొదలుకొని మిగిలినవిభక్తులు పరముగా నున్నపుడు, అదంతము లైనఅమహత్తులకును, అదంతము లైననపుంసక లింగముల కును చివర 'ము' అనువర్ణము ఆగమముగా వచ్చును.

వృక్ష అనునామముపై ప్రథమావిభక్తిబహువచనమునందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, వృక్ష+లు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ప్రాతిపదిక చివర ముువర్ణము చేరి, వృక్షము+లు – వృక్షములు అని అగును. ఇట్లే వృక్షములందు మొ.

'వానికి' అనుటచే అదంతము లగుఅమహన్నపుంసకములకంటె వే రైన శబ్దములకు ముగాగమమును రాదు. గిరుల మొ.

'ముువర్ణకేతరం బయినవిభక్తి' అనుటచే ముువర్ణకము పర మైనపుడు ముగాగమము లేదు. వృక్షము. 'వృక్షముము' అని కాదు.

'అగు' అనుటచే ముగాగమము నిత్యము. కావున 'వృక్షలు' అనువిధముగా ముగాగమము రానిరూపము ఉండదు.

**41. ముువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు.**

**ముువర్ణకంబునకు విధించులోపాదేశాదికార్యములు ముగాగమంబునకు సహితము వచ్చు నని యర్థము.**

ప్రథమైకవచనప్రత్యయ మయినమువర్ణమునకు విధింపబడినలోపము ఆదేశము మొద లగుకార్యములు, ప్రాతిపదికకు ఆగమముగా వచ్చిన మువర్ణ మునకు సైతము వచ్చును.

'చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే మువర్ణమునకు లోపము చెప్పబడినది. చరిత్రములు మొద లగుచోట్ల ముగాగమమునకు గూడ ప్రస్తుతసూత్రము ననుసరించి సిద్ధించును. చరిత్రలు. ఇట్లే చరిత్రను, చరిత్రలందు మొ.

'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' అనుసూత్రము మువర్ణకమునకు పుంపులను ఆదేశముగా విధించినది. ఈసూత్రము ననుసరించి ఆఆదేశము ముగాగమమునకు గూడ వచ్చును. సరసములు+మాటలు= సరసము+మాటలు = సరసపుమాటలు.

'మువర్ణకంబునకు మాముడి యేని' అనుతత్స. 42 సూ.చే. విధింపబడు మాముడి ముగాగమమునకును ఈసూత్రముచే కలుగగా 'వనమ్ములు' అని అగును.

'మువర్ణకంబునకు' అనుటచే ప్రత్యయ మగుమువర్ణమునకు చెప్పినకార్యమె ముగాగమమునకు వచ్చును. ముగాగమమునకు చెప్పినకార్యము మువర్ణకమునకు రాదు. 'లులనలు పరంబు లగునపుడు అను(తత్స.43)సూత్రముచే ముగాగమ మునకు చెప్పినకార్యము మువర్ణకమునకు లేదు. వజ్రా అని కాదు.

'ముగాగమంబునకు' అనుటచే ఆగమము కానిమువర్ణమునకు ఈకార్యము రాదు. పాముయొక్క కాటు-పాముకాటు. పాపుకాటు (పాపకాటు) అని యుండదు.

**42. మువర్ణకంబునకు మాముడి యేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు.**

**వృక్షమ్ము - వృక్షంబు. ఋక్షమ్ము - ఋక్షంబు. పూర్వసూత్రముచేత ముగాగమంబున కీకార్యం బగు. వృక్షమ్ములు - వృక్షంబులు, ఋక్షమ్ములు- ఋక్షంబులు.**

ముడి అనగా ముడి ఆకారములో వ్రాయబడుహల్లు ఒత్తు. మాముడి అనగా మాఒత్తు. నిండుసున్న పూర్వమునందు గల'బు'వర్ణము (ంబు) పూర్ణబిందుపూర్వక బువర్ణము. ఇది అనేకాల్లు (ఒకటికంటె ఎక్కువ వర్ణములు గలది) గావున మువర్ణము మొత్తముస్థానమునందు ఆదేశముగా వచ్చును.

ప్రత్యయము అయినమువర్ణమునకు మాఒత్తు ఆగమముగా కాని, నిండుసున్న ముం దున్నబువర్ణము ఆదేశముగా కాని, వికల్పముగా వచ్చును.

వృక్షము అనుచోటిమువర్ణమునకును ఈసూత్రముచే మాముడి రాగా వృక్షమ్ము అని అగును. విభాష గావున మాముడి రానిచో ఇదే సూత్రముచే 'ము' స్థానమున 'ంబు' ఆదేశ మయి, 'వృక్షంబు' అని అగును. ఇదియు విభాషయే కావున రానిచో 'వృక్షము' అని అట్లే ఉండును.

'మువర్ణకంబునకు' అనుటచే, ప్రత్యయము కానిమువర్ణమునకు ఈకార్యము లేదు. పాము, ఇనుము మొ. ఇచట 'పమ్ము, ఇనుంబు' అనురీతిరూపము లుండవు.

'పూర్ణబిందు' అనుటచే బువర్ణమునకు పూర్వమునందు ఖండబిందువు ఉండదు. కావున 'వృక్షఁబు' అనువిధ మైనరూపములు ఉండవు.

'(పూర్ణబిందు)పూర్వక' అనుటచే పూర్ణబిందువు బువర్ణమునకు ఇతరస్థలములలో ఉండదు. వనబుం ఇత్యాదిగా ఉండదు.

'ఏని' శబ్దముల ననుసరించి, మాముడికార్యము రానపుడు, 'ంబు' ఆదేశకార్యము వచ్చును. రెండును ఒకేసారి రావు.

**43. లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు.**

**వజ్రాలు-వజ్రాలను-వజ్రాన. పగడాలు-పగడాలను-పగడాన. ఒకానొకచో ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపఁబడియె.**

'లు' అనునది ప్రథమావిభక్తిబహువచనము. 'ల' అనునది బహుత్వమున ద్వితీయ మొద లగువిభక్తులకు వచ్చినఆగమము. 'న' అనునది సప్తమీవిభక్తి ఏక వచనము. 'న' కువిభక్తి పరముగా ఉండగా వచ్చినఆగమము గూడ గలదు.

ఇట్టి 'లులన' అనునవి పరముగా ఉన్నపుడు కొన్నియెడల ఆగమముగా వచ్చినమువర్ణమునకు లోపమును, అమువర్ణమునకు పూర్వమునం దున్నఅచ్చునకు దీర్ఘమును వికల్పముగా వచ్చును.

'వజ్రములు' అని ఉండగా ప్రస్తుతసూత్రముచే మువర్ణము లోపించి (వజ్ర+లు) దానికి పూర్వమునం దున్నహ్రస్వ మైనఅకారమునకు దీర్ఘము (ఆ) రాగా, వజ్రాలు అని అగును. 'విభాష' అనుటచే ఈకార్యము జరుగనిపక్షమునందు 'వజ్రములు' అని యుండును.

'లులనలు పరం బగునపుడు' అనుటచే ఇతరవర్ణములు పర మయినపుడు ఈకార్యము జరుగదు. వజ్రమును, పగడమునందు మొ. ఇచట వజ్రాను, పగడానందు ఇత్యాది రూపములు ఉండవు.

'ఒకానొకచో' అనుటచే ఈకార్యము అరుదుగా జరుగును. 'వజ్రాలు' అను

విధ మైనప్రయోగములు కావ్యములందు తఱుచుగా ఉండవు.

'ముగాగమంబునకు' అనుటచే ఆగమము కానిమువర్ణమునకు ఈకార్యము (లోపమును ముందరిఅచ్చునకు దీర్ఘమును) లేదు. పాములు, మినుములు మొ.

'తత్పూర్వ (స్వరంబునకు)' అనుటచే ముగాగమమునకు పూర్వమునం దున్న అచ్చునకె దీర్ఘ మగును. వనములు. వనాలు. వవర్ణమునందలిఅత్తునకు దీర్ఘము రాదు. 'వానలు' (వనములు) అనురీతిగా కాదు.

'స్వరంబునకు' అనుటచే ముగాగమమునకు పూర్వమునం దున్న ఏఅచ్చున కైనను దీర్ఘము రావచ్చును. ముత్తియములు - ముత్తెములు అని కాగా ఈలక్షణముచే ముత్తేలు అని కావచ్చును. కాని ఇట్టివి మిక్కిలి అరుదు. కళ్లేలు.మొ.

'లోపంబును, దీర్ఘంబును' అనుచోటులందలి సముచ్చయార్థక మైన'ను'శబ్దముచే లోపము దీర్ఘమును రెండును కలిసియె వచ్చును. విభాష కావున లేనిపక్షమున రెండును రావు. అనగా దీర్ఘము లేకుండ లోపముతో ఒకరూపము (వజ్రలు), లోపము లేకుండ దీర్ఘముతో ఇంకొకరూపమును (వజ్రాములు) ఏర్పడవు.

## 44. ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు.

**ఇకారాంతములకు గ్లౌరైశబ్దములకు మఱి యుగాగమాంతంబులకుఁ బ్రథమైకవచనలోపం బగు. హరి - గిరి - శ్రీ - ధీ.**

'ఇ' అనగా ఇకారాంతములు, (రై+ఉగంత = రాయుగంత) 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే వచ్చిన ఉగాగమము చివర గలిగినశబ్దములు ఉగంతములు.

ఇకారాంతములకును, గ్లౌశబ్దమునకును, రైశబ్దమునకును, ఉగాగమము అంతమందు కలిగినశబ్దములకును పర మైయున్న ప్రథమావిభక్తి ఏకవచనమునకు లోపము వచ్చును. సంస్కృతము ననుసరించి 'సు' అనుప్రథమైకవచనమును చేసి దానికి లోపము చేయదగును. సామాన్యముగా చెప్పుటవలన మహ త్తయినను, అమహ త్తయినను, ఏలింగమం దున్నను ఈకార్యము కలుగును.

హరి అనునది ఇకారాంత మగుప్రాతిపదికము(పుంలింగమును, మహద్వాచకమును). దానిపై ప్రథమావిభక్తి ఏకవచనమును వివక్షింపగా 'సు' ప్రత్యయము చేయగా, అది ఈసూత్రముచే లోపించును. 'హరి' అనుప్రథమైక వచనాంత మగుపదము ఏర్పడును. ఇట్లే గిరి, మతి, కరి మొ.

'ఇ' అని తపరకరణము లేకుండ నిర్దేశించుటవలన ఈకారాంతములపై

గూడ ప్రథమైకవచనము లోపించును. శ్రీ. ధీ. (ఇకారాంతము లయిన ఆచ్ఛికశబ్దములు స్త్రీసమములు అగుటచే వానికి 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించును. కావున ఈసూత్రమునకు అచ్చతెనుగుశబ్దములు ఉదాహరణములు కావు.)

'గ్లౌ, రై' అనునిర్దేశముచే ఈశబ్దములకే ఓత్వము వచ్చుటచే ఏర్పడిన గ్లో, రో, (గ్లౌ, రై) శబ్దములకును ఈసూత్రముచే ప్రథమైకవచనము లోపించును. గ్లో, గ్లౌ, రో, రై.

మరుత్తు, వాకు మొ. ఉగాగమాంతముపై ప్రథమైకవచనము లోపించినవి.

'ఇగ్లౌరాయుగంతంబుల' అనుటచే ఇతరశబ్దములకు ఈవిధి వర్తింపదు. రాముఁడు, శంభువు మొ.

'ప్రథమైకవచనంబునకు' అనుటచే ఇతరవిభక్తివచనములకు లోపము లేదు. హరిని, వాక్కునందు మొ.

**45. ఇత్తునకు బహువచనంబు పరం బగునపుడు దుత్వం బగు.**

**హరులు – గిరులు. కవులు – రవులు. యామినులు – భామినులు. తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు, స్త్రీలు, లకోరీలు.**

'ఇత్' అనుచోటితపరకరణముచే ఇత్తు అనగా హ్రస్వ మగుఇకారము. ఇత్తునకు అనుచోటిషష్ఠివలన హ్రస్వ మగుఇకారముస్థానమున అని అర్థ మగును. బహువచనము అనుసామాన్యనిర్దేశముచేత అన్నివిభక్తులయందును అనగా ప్రథమ మొదలుకొని సప్తమివరకును బహువచనమున ఉత్వము వచ్చును. సామాన్య విధానము ననుసరించి సంస్కృత, ఆచ్ఛికప్రాతిపదికలు అన్నింటియందును ఈకార్యము గలుగును.

బహువచనము (లు, ల) పరముగా నున్నపుడు ప్రాతిపదికమునకు చివర ఉన్న హ్రస్వ మైనఇకారముస్థానమున హ్రస్వ మగుఉకారము ఆదేశముగా వచ్చును.

హరి అనుప్రాతిపదికముపై ప్రథమాబహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణము వచ్చి, హరి+లు అని ఉండగా ఈసూత్రముచేత ఇత్వమునకు ఉత్వము వచ్చి, హరులు అని అగును. ఇట్లే తండ్రులు మొ.

'ఇత్తునకు' అనుచోటితపరకరణమువలన దీర్ఘ మగు'ఈ'కారమునకు ఈకార్యము రాదు. శ్రీలు, ధీలు, లకోరీలు మొ.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు ఉత్వము రాదు. హరి, హరిని మొ.

'అగు' అనుటచే ఉత్వము నిత్యము. 'హరిలు' అనువిధముగా ఉత్వము రాని రూపము లుండవు.

**46. వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు బహు వచనము పరం బగునపు దుత్వం బగు.**

**ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు.**

**కలికి – కలుకులు. ములికి – ములుకులు. చెలిమి – చెలుములు. బలిమి – బలుములు. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి నిసి ఇత్యాదులం దుత్వంబు లేదు. జిగులు – నిసులు.**

వికృతి అనగా ఇచ్చట ఆచ్ఛికము. మూడు గాని అంతకంటె ఎక్కువ గాని అక్షరములు ఉన్నశబ్దములో చివరిఅక్షరమునకు ఉత్తమము అని పేరు. దానికి సమీపమునందలిది, అనగా చివరినుండి రెండవది అయినఅక్షరమునకు ఉపోత్తమము అని పేరు. ఉపోత్తమమునందలిఇత్వము ఉపోత్తమేత్వము. బహు వచన మని సామాన్యముగా చెప్పుటచే ప్రథమ మొద లగువిభక్తు లన్నిటియందును వచ్చును.

అన్నివిభక్తులయందును బహువచనము (లు,ల) పరముగా ఉన్నపుడు ఇకారము చివర గలిగినఅచ్చతెనుగుశబ్దమునందు ఉపోత్తమ మగుఅక్షరమునందలి హ్రస్వ మైనఇకారముస్థానమున హ్రస్వ మగుఉకారము ఆదేశముగా వచ్చును.

కలికి+లు అని ఉండగా, ఉపోత్తమ మగు 'లి' వర్ణమునందలి ఇకారమునకు ఈసూత్రముచే ఉత్వము వచ్చి, కలుకి అని కాగా, 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అను సూత్రముచేత చివరిఇత్వమునకు ఉత్వము వచ్చి 'కలుకులు' అని అగును. ఇట్లే బలుములను, చెలుములందు, మొ.

'వికృతియందు' అనుటచే ఈకార్యము, సంస్కృతసమములందు లేదు. భామిని+లు – భామినులు. భామునులు అని కాదు.

'ఇకారాంతముల' అనుటచే ఇకారాంతములు కానిశబ్దములందు ఉపోత్తమేత్వమునకు ఉత్వము లేదు. గొఱియలు, వన్నియలు మొ.

'ఉపోత్తమ' అనుటచే ఉపోత్తమము కానిచోట అనగా, మూడక్షరములు లేని శబ్దమునందు ఈకార్యము లేదు. 'జిగి+లు, నిసి+లు' మొద లగువానిలో ఈకార్యము లేదు. జిగులు, నిసులు. ఇచట జుగులు, నుసులు అని కాదు.

'(ఉపోత్తమ) ఇత్వంబునకు' అనుటచే ఇతరస్వరమునకు ఉత్వము రాదు. పల్లకి+లు–పల్లకులు. ఇచట పల్లుకులు అని కాదు.

'బహువచనము పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు ఉత్వము రాదు. కలికిని, కలికియందు మొ.

'అగు' అనుటచే ఉత్వము నిత్యము. కావున కలికులు అనురీతిగా ఉత్వము రానిరూపములు ఉండవు.

**47. రలడోపధనవార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు.**

**పందిరి – పందిరులు. పిడికిలి – పిడికిళులు. రాపిడి – రాపిడులు. తొమ్మిది – తొమ్మిదులు.**

ఉపధ అనగా చివరినుండి రెండవవర్ణము. నవ అర్థ – తొమ్మిది, మొద లగునవి నవార్థాదులు. మూడు గాని అంతకంటె ఎక్కువ గాని అక్షరము లున్నశబ్దములో చివరినుండి రెండవఅక్షరము ఉపోత్తమము. అందలిహ్రస్వ మగుఇకారము ఉపోత్తమేత్వము.

రేఫము గాని, లకారము గాని, డకారము గాని ఉపధగా గలిగినశబ్దము లందును, తొమ్మిది మొద లగుశబ్దములయందును ఉపోత్తమమునందలిఇత్వము నకు (బహువచనము పర మగునపుడు) ఉత్వము గాదు. 'వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు బహువచనము పరం బగునపుడు దుత్వం బగు' అనుసూత్రముచే ప్రాప్తించునట్టి ఉత్వమును ఈసూత్రము నిషేధించుచున్నది.

పందిరి+లు అని ఉండగా 'వికృతియం దికారాంతముల' అను (తత్స. 46) సూత్రముచే ఉపోత్తమేత్వమునకు ఉత్వము రావలసియుండగా ఈశబ్దమునందు ఉపధ రేఫ అయినది (పందిర్+ఇ) కావున ఈసూత్రముచే ఉత్వము రాదు. చివరిఇకారమునకు 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, పందిరులు అని అగును.

'రలడోపధ, నవార్థాదుల' అనుటచే రేఫ, లకార, డకారములకంటె వే రైనవర్ణము ఉపధగా గలిగి, తొమ్మిది మొద లగువానిలో చేరనిశబ్దమునందు ఈనిషేధము లేదు. కావున ఉత్వము వచ్చును. కలుకులు మొ.

'ఉపోత్తమేత్వంబునకు' అనుటచే చివరి(ఉత్తమమునందలి)ఇత్వమునకు ఉత్వము వచ్చుటలో నిషేధము లేదు. పందిరులు మొ.

**48. ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు.**

**తరువు – ధేనువు – మధువు – గోవు.**

**అంతట ననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము.**

ఉకారము చివర గలిగినశబ్దము ఉకారాంతము. ఓకారము అంతమునందు

గలిగినసంస్కృతశబ్దములో 'గో' అనునది ఒకటె తెలుగున ప్రయోగింప బడుచున్నది. 'డుమువులు ప్రథమ' అనుసూత్రముచే వువర్ణకము ప్రథమావిభక్తి. 'డుమువున లేకవచనంబులు' అనుసూత్రమును అనుసరించి అది ఏకవచనము.

ఉకారము అంతమునందు గలశబ్దములకును, గో అనుశబ్దమునకును ప్రథమా విభక్తి యేకవచనమునందు 'వు' అనుప్రత్యయము వచ్చును. ఉకారాంతము అని సామాన్యముగా చెప్పుటచే మహ త్తయినను, అమహ త్తయినను, ఏలింగ మైనను వువర్ణకము వచ్చును.

'తరు' అనుప్రాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనవివక్షయందు ప్రస్తుత సూత్రముచే వువర్ణకము వచ్చి, తరువు అని అగును. ఇట్లే ధేనువు, మధువు. మొ.

'ఉకారాంత' అని తపరకరణము లేకుండ నిర్దేశించుటచేత దీర్ఘ మగు ఊకారము పైని గూడ వువర్ణకము వచ్చును. భ్రూ - భ్రూవు.

'ఉకారాంతగోశబ్దములకు' అనుటచే ఇతరశబ్దములకు ఈకార్యము లేదు. రాముఁడు.

'అంతట' అనుటచే 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే రావలసిన ప్రథమైకవచనలోపమును బాధించి ఈసూత్రముచే ఉకారాంతము లగుస్త్రీలింగశబ్దములకును వువర్ణకము వచ్చును. ధేనువు, వధువు.మొ.

'అగు' అనుటచే వువర్ణకము నిత్యము. కావున తరు, ధేను ఇత్యాదిగా వువర్ణకము రానిరూపములు ఉండవు.

**49. వువర్ణకేతరవిభక్తి పర మగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు.**

**తరువులు - తరులు. ధేనువులు - ధేనులు. గోవులు.**

వుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. వువర్ణకముకంటె ఇతర మైనవిభక్తి వువర్ణకేతరవిభక్తి. వువర్ణకము ప్రథమావిభక్తి ఏకవచనము. ప్రథమాబహువచనము మొద లగువిభక్తులు పరముగా నున్నపుడు ఉకారము చివర గలిగినప్రాతిపదికలకు చివర 'వు' అనువర్ణము బహుళముగా వచ్చి చేరును. గో అనుశబ్దమునకు మాత్రము ఇచట వువర్ణము నిత్యముగా చేరును.

తరుశబ్దముపై ప్రథమాబహువచనమునందు 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకము వచ్చి, తరు+లు అని ఉండగా ఈసూత్రముచే వుగాగమము వచ్చినపక్షమునందు 'తరువులు' అని అగును. 'బహుళము' అనుటచే రానిపక్షమున

'తరులు' అని అగును. ఇట్లే శంభువులు, శంభులు. బహుళశబ్దముచే ఇట్టిచోట్ల విభాష.

'బహుళము' అనుటచేత ఉకారాంతము లగుస్త్రీవాచకము లయినస్త్రీలింగ శబ్దములకు వుగాగమము నిత్యము. కావున ప్రవృత్తి. వధువులు. ఇచట వుగాగమము రాని 'వధులు' అనురీతిరూపము లుండవు.

గో శబ్దమునకు నిత్యము, కావున గోవులు. గోలు అని యుండదు.

'వువర్ణకేతరవిభక్తి పర మగునపుడు' అనుటచే వువర్ణకము పర మైనపుడు వుగాగమము లేదు. తరువు.

'ఉకారాంతంబులకు' అనుటచే ఇతరములకు వుగాగమము లేదు. రమలు, హరులు, మొ.

**50. ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకము బహుళముగా నగు.**

**విష్ణువు – విష్ణుఁడు. శంభువు – శంభుఁడు. వసువు – వసుఁడు.**

ఉకారము చివర గలిగినది ఉకారాంతము. స్త్రీతిర్యగ్జడభిన్నములును వాని విశేషణములును మహత్తులు. మహత్తు లైనశబ్దములు పుంలింగములు గూడ అగుటచే 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు ఙగు' అనుసూత్రముచేత డుఙు రావలసియున్నది. కాని ఉకారాంతము లగుటనుబట్టి డుఙును బాధించి 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనుసూత్రముచే వీనికి వువర్ణకము నిత్యముగా రావలసియున్నది. ప్రస్తుతసూత్రము ఆనిత్యవువర్ణకమును బాధించి ఉకారాంతము లైనమహద్వాచకములకు ప్రథమైకవచనమున వువర్ణకము బహుళముగా వచ్చు నని చెప్పుచున్నది. బహుళము అనుటచే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష అన్యకార్యములకు అవకాశము గలదు.

1. ప్రవృత్తి : 'మను' మొద లగు కొన్నిశబ్దములకు వువర్ణకము నిత్యముగా వచ్చును, మనువు, ఆతఁడు పటువు మొ.

2. అప్రవృత్తి : 'అభిమన్యు' మొద లగుశబ్దములకు వువర్ణకము అసలు రాదు. 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు ఙగు' అనుసూత్రముచే డుఙు మాత్రమె వచ్చును. అభిమన్యుఁడు, కంతుఁడు మొ.

3. విభాష : కొన్నిశబ్దములకు వువర్ణకము వికల్పముగా వచ్చును. శంభు అనుదానిపై వువర్ణకము వచ్చినచో శంభువు అని యగును. వువర్ణకము రాని పక్షమున 'పుంలింగ మగు' అను (తత్స. 22) సూత్రముచే డుఙు వచ్చి, శంభుఁడు అని అగును.

4. అన్యకార్యము : రాహుశబ్దమునకు వువర్ణకమును, అది రానిపక్షమున డుఙ్‌వర్ణకమును వచ్చి రాహువు, రాహుఁడు అని అగుటతోపాటు అన్యకార్యముగా ప్రథమైకవచనలోపము వచ్చును. రాహు.

'ఉకారాంతంబు లగు' అనుటచే ఉకారాంతములు కానివానికి వువర్ణకము రాదు. రాముఁడు, హరి మొ.

'మహత్తులకు' అనుటచే అమహత్తులకు 'ఉకారాంతగోశబ్దంబులకు అనుసూత్రముచే వువర్ణకము నిత్యమె. తరువు ధేనువు మొ.

## 51. కద్రువ నాగమాత.

**కద్రువ – కద్రువలు – కద్రువలను.**

'కద్రూ' అనుశబ్దము 'నాగమాత' అనుఅర్థమునందు కద్రువ అని అగును.

'కద్రూ' ప్రాతిపదికము. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' (తత్స. 54) అని తుదిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి, కద్రు అని కాగా స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని రావలసినప్రథమైకవచన లోపమును బాధించి, 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అను సూత్రముచే వు వర్ణకము వచ్చి, 'కద్రువు' అని కావలెను. ఇట్లే ఇతరవిభక్తులందు వుగాగమముతో కద్రువులు, కద్రువులను మొ. అట్టియెడల 'కద్రూశబ్దమునకు దీర్ఘమునకు హ్రస్వమును, 'వ'వర్ణము ఆగమ మగుటను ఈసూత్రము నిపతించుచున్నది. శాస్త్రముచే ఒకవిధముగా (కద్రువు) ఏర్పడురూపమును (ప్రయోగానుసారముగా') ఇం కొకవిధముగా (కద్రువ) ఉండునట్లు నియమించుటను నిపతించుట (నిపాతము) అందురు.

'కద్రూ' అనుప్రాతిపదికకు నాగమాత అనుఅర్థమున ఈసూత్రముచే హ్రస్వమును (కద్రు) వవర్ణాగమమును వచ్చి, కద్రువ అను ప్రాతిపదికరూప మేర్పడును. దీనిపై 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే సు ప్రత్యయము లోపించి 'కద్రువ' అని అగును.

ఇట్లే ఇతరవిభక్తులలో గూడ ప్రస్తుతసూత్రముచే దీర్ఘమునకు హ్రస్వము వచ్చి (కద్రు), ప్రథమైకవచనేతరవిభక్తిపరకతలో 'వ'వర్ణము ఆగమముగా వచ్చి, కద్రువలు, కద్రువలందు ఇత్యాదిగా రూపము లగును.

'నాగమాత' అనుటచే నాగులతల్లి అనుదానికంటె వే రైన అర్థమునందు 'కద్రువ' అనురూప ముండదు. కావున దీర్ఘమునకు హ్రస్వ మై, వువర్ణకము రాగా, కద్రువు అని అగును. ఇట్లే ఇతరస్థలములలో కద్రువులు, కద్రువును మొ. దీనికి గోరోజనవర్ణము అని అర్థము.

**52. ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు.**

**భ్రాత - జామాత. కర్త - భర్త. గంత - హంత.**

ఋకారము చివర గలిగినశబ్దము ఋకారాంతము. 'అత్వము' అనగా హ్రస్వ మగుఅకారము. ఇది ఏకాల్లు (ఒకేవర్ణము) కావున విధించినదానిలో చివరి వర్ణముస్థానమున ఆదేశముగ వచ్చును. స్త్రీలింగముతో సమాన మగుట స్త్రీవద్భావము.

ఋకారము చివర గలిగినసంస్కృతప్రాతిపదికలయందు చివరి దగు ఋకారముయొక్క స్థానమున హ్రస్వ మగుఅకారము ఆదేశముగా వచ్చును. ఆప్రాతిపదికము స్త్రీలింగమువంటిది అగును.

భ్రాతృ అనుప్రాతిపదికమునకు ఈసూత్రముచే ఋకారముస్థానమున అత్వము రాగా, భ్రాత, అని అగును. ఇది సహజముగా పుంలింగ మైనను ప్రస్తుతసూత్రముచే స్త్రీలింగమువంటిది అగుటవలన డుఌ రాకుండ 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే సు ప్రత్యయము లోపించి, భ్రాత అనుప్రథమైకవచనాంత మగుపదము ఏర్పడును.

ఇట్లే ఇతరవిభక్తులలో భ్రాతను, జామాతచేత మొ.

'ఋకారాంతంబులకు' అనుటచే ఇతరములకు అత్వము రాదు. రాముఁడు హరి, శంభువు మొ.

'అత్వంబును, స్త్రీవద్భావంబును' అనుచోటిసముచ్చయార్థకము లగు శబ్దములచే రెండుకార్యములను కలిసియె ప్రవర్తించును. కావున అత్వము మాత్రమే వచ్చి, భ్రాతఁడు అనువిధముగా కాని, లేదా స్త్రీవద్భావము మాత్రమే వచ్చి, భ్రాతృ అని కాని కావు.

'అగు' అనుటచే అత్వస్త్రీవద్భావములు నిత్యము. కావున భ్రాతృఁడు, భ్రాతృని జామాతృనిచేత అనువిధముగా డుఌ మొద లగునవివచ్చినరూపములు ఉండవు.

**53. విధాతృధాతృదాతృసవితృనేతృశబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాష నగు.**

**విధాత - విధాతృఁడు. ధాత - ధాతృఁడు. దాత - దాతృఁడు. సవిత- సవితృఁడు. నేత - నేతృఁడు.**

అత్వము ఏకాల్లు కావున విధించినదానిలో (విధాతృ మొద లగుశబ్దములలో) చివరివర్ణము(ఋకారము)యొక్క స్థానమున వచ్చును. స్త్రీలింగమువంటి దగుట స్త్రీవద్భావము. విధాతృ మొద లగుఈశబ్దములు ఋకారాంతములు. కావున

'ఋకారాంతంబున కత్వంబున స్త్రీవద్భావంబు నగు' అనుసూత్రముచే అత్వ స్త్రీ వద్భావములు నిత్యముగా రావలసియుండగా దానిని బాధించి, ఈలక్షణము వికల్పము చేయుచున్నది.

విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ అనుశబ్దములం దున్నచివరి ఋకారము స్థానమున అత్వమును, ఆశబ్దమునకు స్త్రీవద్భావమును విభాషగా వచ్చును.

విధాతృ అనుప్రాతిపదికమునకు ఈసూత్రముచే ఋకారముస్థానమునందు అత్వము రాగా (విధాత), స్త్రీవద్భావము కలిగి, 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబు నకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము (సు) లోపింపగా, విధాత అనుపద మేర్పడును. 'విభాష' అనుటచే అత్వ స్త్రీవద్భావములు లేనపుడు విధాతృ అని యుండగా ప్రథమైకవచనమునందు 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనుసూత్రముచేత డుజు వచ్చి, విధాతృఁడు అని అగును.

'మహత్తులకు' అనుటచే ఈశబ్దములు అమహత్తు లయినపుడు పూర్వ సూత్రముచే అత్వస్త్రీసద్భావములు నిత్యముగా అగును. వనమునకు నేత యగు సింగము.

'విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృశబ్దంబులకు' అనుటచే మిగిలిన ఋకారాంతములకు పూర్వసూత్రముచే అత్వస్త్రీసద్భావములు నిత్యము. భ్రాత జామాత. మాంధాతృశబ్ద మొక్కదానికి డుజుతో రూప మున్నది. పైని పేర్కొన్న విధాతృ మొద లగువానిలో ధాతృ, దాతృ, నేతృ శబ్దములకు డుజుతో ప్రయోగము కానరాదు. సూరి ఇతరస్థలములలో వీనిని డుజుతో చూపలేదు. సవితృ విధాతృ మాంధాతృ శబ్దములు మూడింటికి మాత్రమె అత్వ స్త్రీవద్భావములు వికల్పము. కావున మిగిలినఋకారాంతసంస్కృతశబ్దములు అన్నియును తెలుగున అదంతములుగానే నిలుచును.

### 54. నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు.

**రమా-రమ. వనితా-వనిత. విద్యా-విద్య. లక్ష్మీ-లక్ష్మి. సేనానీ-సేనాని. ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుం బోలెఁ గార్యం బగు. లక్ష్ములు- సేనానులు - సిరులు.**

నామము అనగా ప్రాతిపదికము. దీర్ఘమునకు అనుచోటిషష్ఠిచే దీర్ఘము స్థానమున అని అర్థము. 'దీర్ఘంబునకు' అనుసామాన్యనిర్దేశముచే దీర్ఘము లగుఅన్ని అచ్చులకును హ్రస్వము వచ్చును.

సంస్కృతమును ప్రాకృతమును అయినప్రాతిపదికలకు చివర ఉన్నదీర్ఘ మయిన అచ్చుస్థానమున హ్రస్వ మయిన అదే అచ్చు ఆదేశముగా వచ్చును.

'రమా' అనునది ప్రాతిపదిక. ఈసూత్రముచే తుదిదీర్ఘమునకు హ్రస్వము రాగా 'రమ' అని అగును. ఇట్లే సిరీ – సిరి, వధూ – వధువు మొ. ఇతరవిభక్తులలో రమను, సిరిని, వధువును మొ.

'నామంబుల' అనుటచే ప్రాతిపదికముకంటె ఇతర మైనశబ్దమునందు హ్రస్వము రాదు. రామునిచే, వనములలో. మొ.

'తుది' అనుటచే చివరిది కానిదీర్ఘమునకు హ్రస్వము రాదు. రామ–రమ రమేశ–రమెశ అనురీతిగా కావు.

'దీర్ఘంబునకు' అనుటచే దీర్ఘము కానిదానికి అనగా హ్రస్వమునకు హ్రస్వము రాదు. రామ–రాముఁడు, మతి, ధేను–ధేనువు మొ.

'అగు' అనుటచే హ్రస్వము నిత్యము. తెలుగున రమా, లక్ష్మీ అనువిధముగా హ్రస్వము రానిరూపము లుండవు.

ఈకార్యము సంస్కృతప్రాకృతప్రాతిపదికలకే కావున తద్భవదేశ్యశబ్దములందు ఈసూత్రముచే హ్రస్వము రాదు. నవలాలు, పల్లకీలు, మొ.

**55. ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు.**

**క్ష్మా – మా – భా. శ్రీ – స్త్రీ – ధీ – భీ. భ్రూవు.**

అచ్చు లేదా చివర అచ్చు గలిగినహల్లు (హల్లులు) అక్షరము. అనగా కేవలము పొల్లుహల్లు(లు) అక్షరము కాదు. ఒకే అక్షరము ఐనశబ్దము ఏకాక్షరము. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచేత రావలసిన హ్రస్వము, ఒకే అక్షర మైనసంస్కృత(ప్రాకృత)ప్రాతిపదికలతుదిదీర్ఘమునకు మాత్రము రాదు. ప్రాకృతశబ్దము లిట్టివి గానరావు.

క్ష్మా– ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు' అనుసూత్రముచేత రావలసిన హ్రస్వము ప్రస్తుతసూత్రముచేత రాదు. కావున 'క్ష్మా' అని అట్లే యుండును.

'ఏకాక్షరంబులకు' అనుటచే ఒకటికంటె ఎక్కువ అక్షరములు గలిగిన శబ్దములలో మాత్రము తుదిదీర్ఘమునకు 'నామంబులతుదిదీర్ఘంబునకు' అను సూత్రముచే హ్రస్వము వచ్చును. రమ, వనిత మొ.

'లేదు' అనుటచే హ్రస్వాభావము నిత్యము. కావున క్ష్మ ఇత్యాదిగా హ్రస్వము వచ్చినరూపములు ఎప్పుడును ఉండవు.

**56. వృద్ధాదులడుఁబునకు లోపము విభాష నగు.**

**వృద్ధ – వృద్ధుఁడు. మూర్ఖ – మూర్ఖుఁడు. నీచ – నీచుఁడు. గృహస్థ–**

**గృహస్థుఁడు. చార్వాకు - చార్వాకుఁడు.**

వృద్ధ మొద లగునవి వృద్ధాదులు, వృద్ధ మొద లగుశబ్దములకు పై నున్న ప్రథమావిభక్తి ఏకవచనము అగు 'డుజ్' ప్రత్యయమునకు వికల్పముగా లోపము వచ్చును.

వృద్ధ అనుప్రాతిపదికకు 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనుసూత్రముచేత ఉత్వము వచ్చి, 'వద్ధు' అని కాగా, 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనుసూత్రముచేత డుజు వచ్చి, వృద్ధు+డుజ్ అని కాగా ప్రస్తుతసూత్రముచే డుజు లోపించి, 'వృద్ధు' అని అగును. 'విభాష' కావున డుజునకు లోపము రానిపక్షమునందు 'వృద్ధుఁడు'.

'వృద్ధాదుల' అనుటచే వృద్ధ మొద లగువానిలో చేరనిశబ్దములలో డుజునకు లోపము లేదు. రాముఁడు, విష్ణుఁడు మొ.

'డుజునకు' అనుటచే ఇతరవిభక్తులకు లోపము లేదు. వృద్ధుని, వృద్ధునిచేత మొ. ప్రథమైకవచనమునందును అత్వమునకు వచ్చినఉత్వమునకు లోపము లేదు. వృద్ధు. మొ.

**57. స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు.**

**రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీననేత్ర.**

స్త్రీలింగము లయినశబ్దములకు పై నున్న ప్రథమావిభక్తి ఏకవచనమునకు లోపము వచ్చును. ప్రథమావిభక్తి యేకవచనమునందు సంస్కృతము ననుసరించి 'సు' ప్రత్యయమును చేసికొని దానికి లోపము చేయవలెను. స్త్రీలింగంబు లనుసామాన్యనిర్దేశముచేత స్త్రీలింగము లయినశబ్దములు మహత్తు లయినను, అమహత్తు లయినను ఈకార్యము గలుగును.

రమా అనునది ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచేత హ్రస్వము వచ్చి, 'రమ' అని కాగా ప్రథమావిభక్తి ఏకవచన వివక్షలో సు ప్రత్యయము రాగా, ప్రస్తుతసూత్రముచేత దానికి లోపము వచ్చి, రమ అనుప్రథమైకవచనాంతపదము ఏర్పడును.

'స్త్రీలింగంబుల' అనుటచే ఇతరలింగమునకు ఈసూత్రముచే ప్రథమైకవచన లోపము రాదు. రాముఁడు, వనము మొ.

'ప్రథమైకవచనంబునకు' అనుటచే ఇతరవిభక్తివచనములకు లోపము రాదు. రమను, రమలు మొ.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున ప్రథమైకవచనము లోపింపని రూపములు ఉండవు.

**58. చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.**

**చరిత్ర - చరిత్రము. చరిత - చరితము.**

**అలక-అభిలాష-అక్షత-ఘోష-తరంగ-భ్రమ-విజృంభణ-వధ-వేగ-స్ఫురణ-హంస-ఇత్యాదులు చరిత్రాదులు. బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు. దర్భ - పనస ఇత్యాదులు.**

చరిత్ర మొద లగునవి చరిత్రాదులు. చరిత, అలక, మొద లగునవి. చరిత్ర మొద లగుశబ్దములయొక్క ప్రథమైకవచన మగు 'ము'ప్రత్యయమునకు బహుళముగా లోపము వచ్చును.

చరిత్రశబ్దముపై ప్రథమైకవచనమున 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనుసూత్రముచే మువర్ణకము రాగా, చరిత్రము అని కాగా ప్రస్తుతసూత్రముచేత మువర్ణకము లోపించి, చరిత్ర అని అగును. బహుళము అనుటచేత మువర్ణకము లోపింపనిచో 'చరిత్రము' అని యుండును. ఇట్టిచోట్ల ఈకార్యము విభాష.

దర్భ మొద లగుశబ్దములలో మువర్ణకము నిత్యముగా లోపించును. కావున ఇచట ప్రవృత్తి. దర్భ, పనస. ఇచట మువర్ణములోపింపక దర్భము, పనసము అని ఉండదు.

'చరిత్రాదులు' అనుటచేత చరిత్ర మొద లగువానిలో చేరనిశబ్దమునందు మువర్ణకమునకు లోపము రాదు. వనము, ధనము మొ. కావున ఇట్లు గణశబ్దములకు విధింపబడినచోట బహుళ మైనను అప్రవృత్తి ఉండదు.

'మువర్ణకంబునకు' అనుటచేత 'మువర్ణకంబునకు విధించుకార్య ముగాగమంబునకు నగు' అనుసూత్రముచే ఇతరవిభక్తివచనములలో వచ్చిన ముగాగమమునకును ప్రస్తుతసూత్రముచే లోపము వచ్చును. చరిత్రములు - చరిత్రలు, చరిత్రమునందు - చరిత్రయందు మొ.

**59. స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁబడు.**

**దేవుఁడు. సకలసురులు, స్వర్గివాచి యనుటచే భూదేవులు, భూసురుఁ డనుప్రయోగంబు లబాధితంబు లయ్యె.**

స్వర్గివాచి అనగా స్వర్గమునం దున్నవానిని తెలుపునది.

స్వర్గమునం దున్న వారిని బోధించునపుడు దేవ అనుశబ్దము ఏకత్వముననె అనగా ఏకవచనముతోనె తెలుగున ప్రయోగింపబడును. అనగా ప్రథమ మొద లగుఅన్నివిభక్తులయందును ఏకవచనరూపములు మాత్రమే ఉండును.

దేవశబ్దము సంస్కృతము ననుసరించి పుంలింగము. తెలుగులక్షణము ననుసరించి మహద్వాచకము. దీనిపై ప్రథమావిభక్తిని వివక్షింపగా ప్రస్తుత సూత్రము ననుసరించి ఏకవచనమే కలుగును. ప్రథమైకవచనమునందు (తత్స 22, 23) ఉత్వడుజులు వచ్చి. దేవుఁడు. ఇట్లే ఇతరవిభక్తులలో దేవుని, దేవునియందు. మొ.

'ఏకత్వ' అనుటచే దీనికి బహువచనముతో ప్రయోగ ముండదు. దేవులు, దేవులను ఇత్యాదిగా ఉండదు. కావున బహుత్వార్థమును తెలుపవలసినపుడు దేవశబ్దమును గ్రహించుటకు వీలు లేదు.

స్వర్గమునం దున్నవారిని బోధించునపుడు 'సుర' అనుశబ్దము బహుత్వముననె అనగా బహువచనముతోనె తెలుగున ప్రయోగింపబడును. అనగా అన్నివిభక్తుల యందును బహువచనాంతరూపములు మాత్రమే ఉండును.

(నిఖిల)సురశబ్దము సంస్కృతము ననుసరించి పుంలింగము. తెలుగులక్షణము ననుసరించి మహద్వాచకము. దీనిపై ప్రథమావిభక్తిని వివక్షింపగా ప్రస్తుత సూత్రము ననుసరించి బహుత్వముననే ప్రయోగింపవలెను కావున బహువచనమే కలుగును. ప్రథమాబహువచనమందు(తత్స 22,11) ఉత్వమును లువర్ణకమును వచ్చి. నిఖిలసురులు. ఇతరవిభక్తులలో నిఖిలసురులను, నిఖిలసురులయందు.మొ.

'బహుత్వంబుల' అనుటచేత సురశబ్దము ఏకవచనమున ప్రయోగింపబడదు. సుర, సురను ఇత్యాదిరూపములు ఉండవు. కావున ఏకత్వార్థమును తెలుపవలసినపుడు సురశబ్దమును గ్రహించుటకు అవకాశము లేదు.

'స్వర్గివాచి' అనుటచేత స్వర్గమునం దున్నవారిని కాక ఇతరులను బోధించునపుడు ఈనియమము లేదు. భూలోకమునం దున్నవారిని తెలియజేయునపుడు దేవశబ్దము ఏకత్వముననే (భూదేవుఁడు) కాక, బహుత్వమున గూడ ప్రయోగింపవచ్చును. భూదేవులు. భూదేవుని, భూదేవులందు మొ. అట్లే సుర శబ్దము భూమిపై నున్నవారిని బోధించునపుడు బహుత్వముననే (భూసురులు) కాక, ఏకత్వమున గూడ ప్రయోగింపవచ్చును. భూసురుఁడు. ఇట్లే భూసురులను, భూసురునందు మొ.

'దేవసురశబ్దంబులు' అనుటచేత ఇతరశబ్దములకు ఈనియమము లేదు.

దేవత, దేవతలు. మొ.

**60. సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు. సంస్కృతసమాసంబునఁ గావు.**

**సురలు. అసుర – అసురుఁడు. నిఖిలసురులు. రావణాసురుఁడు. ఎల్లసురలు. ఎల్లయసురలు – ఎల్లయసురులు.**

స్త్రీతుల్యము అనగా స్త్రీలింగముతో సమానము.

సుర అనుశబ్దము నిత్యముగా స్త్రీలింగముతో సమాన మైయుండును. అసుర అనుశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యము. సంస్కృతసమాసములలో మాత్రము స్త్రీతుల్యత లేదు. స్త్రీతుల్యతవలన మహత్పుంలింగకార్యములు వారింపబడి, ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగకార్యములు గల్గును.

'సుర' అనుశబ్దము 'స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁబడు' అనుసూత్రముచే బహువచనముననే ఉండును. కావున ప్రథమా విభక్తిని వివక్షింపగా 'లువర్ణంబులు బహువచనంబు' అని లువర్ణము వచ్చి, సుర+లు అని అగును. ఇది పుంలింగమును, మహద్వాచకమును అగుటచే 'పుంలింగ బయి మహద్వాచకం బయిన' అనుసూత్రముచే ఉత్వము రావలసి యుండగా, ప్రస్తుతసూత్రముచే స్త్రీసమత్వము గలిగి ఉత్వము రాదు. కావున 'సురలు' అనియే యుండును.

సురశబ్దమునకు స్త్రీతుల్యత్వము నిత్య మనుటచేత సురులు అనువిధముగా పుంలింగకార్యము(అత్వమునకు ఉత్వము)తో రూపము ఉండదు.

'సంస్కృతసమాసంబునఁ గావు' అనుటవలన సంస్కృతమున చేసిన సమాసములలో చివర ఉన్నసురశబ్దమునకు స్త్రీతుల్యత కలుగదు. కావున అపుడు పుంలింగ (మహత్) కార్యము లయిన ఉత్వము, డుజు మొద లగునవి వచ్చును. భూసురుఁడు, నిఖిలసురులు మొ. ఇచట భూసురలు, భూసురలను అనురీతిగా స్త్రీలింగ (తుల్య)కార్యముతో రూపములు ఉండవు.

'సంస్కృతసమాసంబున' అనుటచేత తెలుగున చేసినమిశ్రసమాసమునందు స్త్రీతుల్యమె అగును. ఎల్లసురలు, ఎల్లసురలను మొ. మిశ్రసమాసములలో పుంలింగకార్యముతో 'ఎల్లసురులు' అని కాదు.

'అసుర' అనుశబ్దము ప్రస్తుతసూత్రముచే ఇది వికల్పముగా స్త్రీతుల్య మగును. స్త్రీతుల్య మయినపక్షమున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే 'సు' ప్రత్యయము లోపించి, 'అసుర' అనుపద మేర్పడును. ఇట్లే ఇతరవిభక్తులలో అసురను, అసురచేత మొ. వికల్ప మనుటచే స్త్రీతుల్యత

లేనపుడు ఈశబ్దము సహజముగా పుంలింగము (మహత్తును) కావున ఉత్వము, డుఙు మొద లగు (మహత్) పుంలింగకార్యములు కలుగును. అసురుఁడు. ఇట్లే అసురుని, అసురునిచేత మొ.

'సంస్కృతసమాసంబునఁ గావు' అనుటవలన సంస్కృతమున చేసిన సమాసములో అసురశబ్ద మెపుడును స్త్రీతుల్యము కాదు. (మహత్)పుంలింగము కావున (మహత్) పుంలింగకార్యము లగు ఉత్వడుఙులు మొద లగునవి మాత్రమే కలుగును. రావణాసురుఁడు. ఇచట స్త్రీతుల్యత గలిగిన 'రావణాసుర' అనురూప ముండదు.

'సంస్కృతసమాసంబున' అనుటచేత తెలుగున చేసినమిశ్రసమాసమునందు అసురశబ్దము వైకల్పికముగ స్త్రీతుల్యమె అగును. ఎల్లయసురలు. స్త్రీతుల్యత లేనిపక్షమున ఎల్లయసురులు.

**61. దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు.**

**దూత - దూతుఁడు. యోధ - యోధుడు, శుంఠ - శుంఠుఁడు.**

**బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు.**

**సింగంబుదూత యగుజంబుకంబు.**

దూత మొద లగునవి దూతాదులు. యోధ, శుంఠ మొద లగునవి. దూత మొద లగుశబ్దములకు బహుళముగా స్త్రీత్వము కలుగును. దూతాదులు సహజముగా (మహత్) పుంలింగము లయినను, పుంలింగకార్యములు కలుగక స్త్రీత్వముచేత ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగకార్యములు కలుగును.

దూత. ఇది పుంలింగము (మహద్వాచకము) కావున ప్రథమైకవచనమునందు ఉత్వడుఙులు రావలసిఉండగా, ప్రస్తుతసూత్రముచే దూత శబ్దమునకు స్త్రీత్వము కలుగును. కావున ఉత్వడుఙులు రాక, 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే సు ప్రత్యయము లోపించి, 'దూత' అనుపదము ఏర్పడును. బహుళము అనుటచేత స్త్రీత్వము లేనపుడు సహజముగా పుంలింగము (మహత్తును) కావున ఉత్వము (తత్స. 21) డుఙు(తత్స. 22) వచ్చి, దూతుఁడు అని అగును. బహుళపదముచే ఇట్టిచోట్ల విభాష.

దూత మొద లగునవి అమహద్వాచకము లైనపుడు స్త్రీత్వము నిత్యముగా వచ్చును. 'సింగంబు దూత యగుజంబుకంబు'. ఇచట జంబుకంబు అను అమహత్తునకు విశేషణ మగుటచే దూత అమహత్తు అయినది. కావున దీనికి స్త్రీత్వము నిత్యముగా కలిగి, ప్రథమైకవచనలోపముతో 'దూత' అని మాత్రమే

ఉండును. కాని 'దూతము అదుజంబుకంబు' అనురీతిగా అమహత్కార్యము (మువర్ణకము)తోడిరూపము ఉండదు. బహుళశబ్దముచే ఇట్టిచోట్ల ప్రవృత్తి.

'దూతాదులకు' అనుటచేత దూత మొద లగువానిలో చేరనిశబ్దమునకు స్త్రీత్వము లేదు. రాముఁడు మొ. ఇట్టిగణవిధానములందు ఈకార్యము లేనిశబ్దములు ఆగణమునందు చేరవు. కావున బహుళకార్యములలో 'అప్రవృత్తి' ఉండదు.

## 62. పృధ్వీవాచిభూశబ్దంబునకు భువి యగు.

**భువి – భువులు. భువిని – భువులను.**

పృధ్వి అనగా భూమి. భూమి అనుఅర్థమును తెలుపునట్టి 'భూ' అను శబ్దమునకు 'భువి' అనురూపము కలుగును.

'భూ' అనుప్రాతిపదికకు 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అను సూత్రముచే హ్రస్వము రావలసియుండగా 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' అనుసూత్రముచే హ్రస్వము రాదు. 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనుసూత్రముచే వువర్ణకము వచ్చి, 'భూవు' అని కావలసియున్నది. భూశబ్దము ఇట్లు 'భూవు' అని కావలసియుండగా 'భువి' అని అగు నని ఈ సూత్రము నియమించుచున్నది. అనగా, భూశబ్దమునకు హ్రస్వమును, (భు) మీద 'వి'వర్ణము ఆగమ మగుటయు ఈసూత్రముచే నిపతింపబడినవి.

భూ అనుప్రాతిపదికమునకు ప్రస్తుతసూత్రముచే భువి అనురూపము కలుగగా ఇకారాంత మగుఈప్రాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనము(సు)నకు 'ఇగ్లొరా యుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చి, భువి అనుపద మేర్పడును. ఇతరవిభక్తులలో భువులు, భువిని. మొ.

'పృధ్వీవాచి' అనుటచే పుట్టుక మొద లగుఇతరార్థములం దున్న భూశబ్దమునకు 'భువి' అనురూపము గలుగదు. వ్యస్తముగా ఆ'భూ'శబ్దము తెలుగున ప్రయోగింపబడదు. సమాసమునం దున్నపుడు స్వయంభూ – స్వయంభువు అనువిధముగా సామాన్యశాస్త్రమునకు అనుగుణముగా ఏర్పడును.

'భూశబ్దంబునకు' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు. ధరణి మొ.

## 63. నౌశబ్దంబునకు నావ యగు.

**నావ–నావలు. మహానావ. కొందఱు నావి అనియు నాదేశం బగు నంద్రు.**

'నౌ' అనుప్రాతిపదికమునకు 'నావ' అనునది ఆదేశముగా వచ్చి, 'నావ'

అనురూపము గలుగును.

'నౌ' అనుదానికి ప్రస్తుతసూత్రముచే 'నావ' అనురూపము ఏర్పడును. ఈశబ్దము స్త్రీలింగము. కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే 'సు' విభక్తి లోపించి, 'నావ' అనుపదము ఏర్పడును. ఇట్లే నావలు. మహానావ అనుచోట సమాము చివర నున్నను 'నౌ' శబ్దమునకు 'నావ' అనురూపము కలిగినది.

'నౌ' అనుశబ్దమునకు 'నావి' అని కూడ ఆదేశముగా వచ్చు నని కొందఱు లాక్షణికులు చెప్పిరి. (నావి ఆదేశము అనుటవలన సూరిసూత్రములో 'నౌ' అనుశబ్దమునకు 'నావ' అనునది ఆదేశము అని తెలియవచ్చును.) అధర్వణుని త్రిలింగశబ్దానుశాసనములోను, (జీవ న్నావః పుష్పదన్తస్య) రావిపాటి గురుమూర్తి శాస్త్రి తెలుగువ్యాకరణములోను ఇట్లు 'నావి' అనురూపము ప్రస్తావింపబడినది. సూరి దీనిని అంగీకరింపలేదు. తిరస్కరింపలేదు.

'నౌశబ్దంబునకు' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు. సంస్కృత మందలిఔకారాంతములలో గ్లౌ, నౌ అనురెండుశబ్దములు తెలుగులోనికి వచ్చుట చెప్పబడినది.

'నావ యగు' అనుటచే నావ అను ఆదేశము నిత్యముగా వచ్చు నని అర్థ మగుచున్నది. దీనినిబట్టి నావి అనుఆదేశమునకు ప్రయోగప్రమాణము లభింపక, సూరి ఉపేక్షించినట్లు చెప్పవచ్చును.

## 64. రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు.

**ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు. రో-రై, గ్లో-గ్లౌ.**

ఓత్వము అనగా ఓకారము. ఇది ఏకాల్లు (ఒకేవర్ణము) 'అలో ऽన్త్యస్య' అని చివరివర్ణముయొక్క స్థానమున వచ్చును. రై అను ప్రాతిపదికమునందలి ఐకారము స్థానమునను, గ్లౌ అనుశబ్దమునందలి ఔకారముయొక్క స్థానమునను వికల్పముగా ఓకారము ఆదేశముగా వచ్చును.

'రై' శబ్దమునందలి ఐకారమునకు ఈసూత్రముచే ఓత్వము రాగా 'రో' అని అగును. 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే దీనిపై ప్రథమైకవచనము 'సు' విభక్తి లోపించి, రో అని అగును. 'విభాష' అనుటచేత ఓత్వము రానిపక్షమునందు 'రై' అని యుండగా 'ఇ గ్లౌ రై' అనుసూత్రముచే 'సు' విభక్తి లోపించి, 'రై' అని అగును.

ఇట్లే గ్లౌ శబ్దమునకు ఓత్వము వచ్చినచో గ్లో అనియు ఓత్వము రానిపక్షమున గ్లౌ అనియు అగును. వీనిపైని ప్రథమైకవచనము 'ఇగ్లౌ' సూత్రముచేత లోపించును.

'రైగ్లౌశబ్దంబులకు' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు.

**65. ఐకారం బీతుల్యంబు.**

**రైని - రైకి. కైని - కైకి. పైని - పైకి.**

ఐకారము ఈకారముతో సమానము. ఐకారాంతము లయినశబ్దములకు ఈకారాంతశబ్దములకువలె ఆయాకార్యము లగు నని తాత్పర్యము.

రైశబ్దముపై ద్వితీయైకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే నువర్ణము కాగా, రై+ను అని అగును. ప్రస్తుతసూత్రముచే ఐకారము ఈ కారమువంటిది. కావున 'ఇకారంబు మీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనుసూత్రమును అనుసరించి నువర్ణమునకు ఇత్వము వచ్చి, రైని అని అగును. ఇట్లె - రైకి మొ.

'ఐకారంబు' అనుటచే ఇతరమునకు ఈకార్యము లేదు.

'ఈతుల్యంబు' అని దీర్ఘముగా నిర్దేశించుటవలన రై+లు, కై+లను మొద లగువిధముగా బహువచనము పర మైనపుడు ఐకారమునకు ఉత్వము రాకుండుట ప్రయోజనము అని చెప్పుదురు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అనుసూత్రము హ్రస్వ మైనఇకారముకె ఉత్వము చెప్పినది కావునను, ఐకారము దీర్ఘ మగుఈకారముతో తుల్య మనుటవలన ఉత్వము రా దనియు అభిప్రాయము.

(ఇ) వర్ణనిర్దేశమున దీర్ఘము(ఈ)గా గ్రహింపవచ్చును. 'అడంగ్వాదుల డాకు' 'జూదాదూల జాకు' మొ.

**66. కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు.**

**కంధరము - కంధర.**

**విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు. విధము.**

**కంధరా, నాసికా, దంష్ట్రా, గ్రీవా, పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.**

కంధరా మొద లగునవి కంధరాదులు. క్లీబము అనగా నపుంసకలింగము. కంధర మొద లగుశబ్దములు సంస్కృతము ననుసరించి స్త్రీలింగములు. ఇవి బహుళముగా నపుంసకలింగముతో తుల్య మైనవి అగును. క్లీబతుల్యత్వమువలన నపుంసకలింగకార్యములు వచ్చును.

'కంధరా' అనునది ప్రాతిపదికము. 'నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే హ్రస్వము రాగా, కంధర అని అగును. ప్రస్తుతసూత్రముచే ఈశబ్దము క్లీబతుల్య మైనది. కావున 'అమహన్నపుంసకముల కదంతములకు

మువర్ణకం బగు’ అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, కంధరము అని అగును.

బహుళ మనుటచేత క్లీబతుల్యత్వము కలుగనిపక్షమునందు సహజ మైన స్త్రీలింగతను అనుసరించి ‘స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు’ అనుసూత్రముచే సువిభక్తి లోపించి ‘కంధర’ అనురెండవరూప మేర్పడును. ఇట్లే నాసికము నాసిక మొ. బహుళ మనుటచే ఇట్టిచోట్ల విభాష.

బహుళ మనుటచే విధాశబ్దమునకు ఈకార్యము నిత్యము. ప్రవృత్తి. విధము. విధ విధలు అని స్త్రీలింగరూపము ఉండదు.

‘కంధరాదులు’ అనుటచేత కంధరా మొద లగువానిలో చేరనిశబ్దమునకు ‘క్లీబతుల్యత లేదు. రమ, వనిత మొ. కావున ఇట అప్రవృత్తి ఉండదు.

‘క్లీబతుల్యము’ అనుటవలన సహజముగా స్త్రీలింగము లయిన కంధరాదులకు క్లీబతుల్యత్వపక్షమున స్త్రీలింగకార్యము (ప్రథమైకవచనలోపము మొ.) జరుగక నపుంసకలింగకార్యము (మువర్ణకము మొ.) వచ్చును.

## ఇంక హలంతప్రకరణము

**67. హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు.**

**రుక్, రాట్, మరుత్, వీరుత్, కర్మ, వర్మ. శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచనతుల్యంబులే యగు నని యెఱుంగునది.**

హల్లు చివర గలిగినది హలంతము. ప్రథమావిభక్తి ఏకవచనము చివర గలిగినశబ్దముతో సమాన మైనది ప్రథమైకవచనాంతతుల్యము. నామము అనగా ప్రాతిపదికము. సంస్కృతమునందలిహలంతము లగుశబ్దములు, ఆశబ్దములకు ప్రథమావిభక్తి ఏకవచనమున సంస్కృతములో ఎట్టిరూపము ఉండునో దానితో సమాన మైనఆకారము గలిగిన వై తెలుగున ప్రాతిపదికగా నిలుచును.

‘రుచ్’ అనునది చకారాంత మగుశబ్దము. దీనికి ప్రథమావిభక్తి ఏకవచనములో సంస్కృతమున ‘రుక్, రుగ్’ అనురూపము లుండును. రుచ్ అనుహలంతసంస్కృత శబ్దము దానిప్రథమైకవచనాంత మగు ‘రుక్’ అనురూపముతో సమాన మైన ‘రుక్’ అను రూపమును పొంది తెలుగున ప్రాతిపదికగా నిల్చును. ఇట్లు రుచ్ అనుశబ్దము రుక్ అనురూపముతో తెలుగున ప్రాతిపదికగా కాగా రుక్కు అని ప్రథమైకవచనమునం దగును. ఇట్లే రాజ్ అనుజకారాంతశబ్దము ప్రస్తుత సూత్రముచే ‘రాట్’ అనురూపముతో తెలుగున ప్రాతిపదికగా నిల్చును. రాట్టు.

'హలంతంబు' అనుటచే అజంతము లగుసంస్కృతశబ్దములకు ఈకార్యము లేదు. అవి సంస్కృతమునందలిప్రాతిపదికయే తెలుగునను ప్రాతిపదికగా నిల్చును. రామ, హరి, శంభు మొ.

'ప్రథమైకవచనాంత' అనుటచే రుచః, రుచమ్, మొద లగుఇతరవిభక్తివచన రూపములు ఇట ప్రసక్తములు కావు.

'తుల్య' అనుటచే తెలుగున ప్రాతిపదికగా నిలుచుశబ్దము ప్రథమైకవచ నాంతము కాదు. ప్రథమైకవచనాంతము సంస్కృతమునందు పదము. అది తెలుగున ప్రాతిపదిక మగుట సరి కాదు. కావున ప్రథమైకవచనాంతముతో సమాన మైనరూపము నిల్చు నని 'తుల్య' శబ్దము ప్రయోగింపబడినది. రుక్, రుగ్, రాట్, రాడ్ అనువిధముగా సంస్కృతమున సరళము తుదిని గలరూపము లున్నను పరుషాంతము లగునట్టి రూపములు మాత్రమె నామము లగుటను గూడ తుల్యశబ్దముచే గుర్తింపదగును.

**68. ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు.**

**ఉగాగమాంతంబుల కిగ్లౌసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు. రుక్కు - రాట్టు - మరుత్తు - వీరుత్తు. ఉగాగమంబు లేమింజేసి యిట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు. కర్మము- వర్మము - చర్మము - సుధన్వుఁడు - సుత్రాముఁడు.**

ఉక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. కావున కి త్తయిన'ఉ'కారము తుది హల్లునకు చివర వచ్చిచేరును. హలంతప్రాతిపదికము చివర ఉన్నహల్లునకు ద్విత్వమును, దానిపైని ఉకారమును వచ్చును.

'రుచ్' అనుశబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచే రుక్ అనునది ప్రాతిపదిక కాగా, ప్రస్తుతసూత్రముచే ఉగాగమద్విత్వములు వచ్చి, రుక్కు అని అగును. 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే 'సు' విభక్తి లోపించి, రుక్కు అనుపద మేర్పడును.

'ఉగాగమమునకు, ద్విత్వంబును' అనుచోట్ల నున్నసముచ్చయార్థక మగు 'ను' శబ్దములచే ఉగాగమద్విత్వములు రెండును కలిసియె వచ్చును. కేవలము ఉగాగమము మాత్రము వచ్చి, 'రుకు' అని కాని, కేవలము ద్విత్వము మాత్రము వచ్చి 'రుక్క్' అని కాని రూపములు ఏర్పడవు.

'తుది' అనుటచే చివరిది కానిహల్లునకు ద్విత్వము రాదు. మరుత్తు. మర్రుత్ ఇత్యాదిగా కాదు.

'హల్లునకు' అనుటచే చివర హల్లు లేనిచో ఈకార్యము రాదు. కర్మము, సుధన్వుఁడు మొ.

'అగు' అనుటచే ఉగాగమద్విత్వములు నిత్యము. కావున రుక్, రాట్ అని ఉండవు.

**69. దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.**

**వాక్కు - వాకు. స్వరాట్టు - స్వరాటు.**

దీర్ఘమునకు పై నున్నహల్లునకు ద్విత్వము బహుళముగా వచ్చును. 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచేత చివరి హల్లునకు ఉగాగమద్విత్వములు రెండును నిత్యముగా ప్రాప్తించుచుండగా, వానిలో ద్విత్వము మాత్రము దీర్ఘముమీద బహుళ మని చెప్పబడినది. ద్విత్వము వచ్చినను రాకున్నను ఉగాగమము మాత్ర మాసూత్రముచే నిత్యముగా వచ్చును.

'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచే వాచ్ శబ్దమునకు వాక్ అనునది తెల్గున ప్రాతిపదికము. 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే ఉగాగమముతోపాటు ద్విత్వమును నిత్యముగా రావలసియుండగా ఈసూత్రమును అనుసరించి ద్విత్వము మాత్రము బహుళము. కావున ఉగాగమముతో ద్విత్వము వచ్చిన, వాక్కు అని అగును. బహుళము గావున ద్విత్వము రానిచో నిత్య మగుఉగాగము మాత్రము వచ్చి, 'వాకు' అని అగును. వాక్కు, వాకు అన్నవి రెండును ఉగాగమాంతములె. కావున 'ఇగ్లొ' సూత్రముచే వీనిపైని ప్రథమైకవచనము (సు) లోపించును. వాక్కు, వాకు. బహుళ మనుటచే ఇచట ద్విత్వము విభాషగా వచ్చును.

'రాట్' మొద లగుశబ్దములలో ద్విత్వము నిత్యముగనె వచ్చును. రాట్టు. మొ. ఇచట ప్రవృత్తి. కావున ద్విత్వము రాని 'రాటు' అనురీతిరూపములు ఉండవు.

'దీర్ఘంబుమీఁది' అనుటచే హ్రస్వముమీదిహల్లునకు ద్విత్వము పూర్వసూత్రముచే నిత్యము. రుక్–రుక్కు. ఇచట 'రుకు' అనువిధముగా ద్విత్వము లేనిరూప ముండదు.

'హల్లునకు' అనుటచే దీర్ఘముమీద హల్లు లేనియెడల ఈకార్యమునకు ప్రసక్తి లేదు. సుధన్వా– సుధన్వుఁడు. మొ.

'ద్విత్వంబు' అనుటచే ద్విత్వము మాత్రమె బహుళము. కావున ఉగాగమము నిత్యమె. అందుచేత ద్విత్వము రానిపక్షమునను ఉగాగమము వచ్చును. వాక్కు.

**70. మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు.**

**శ్రీమంతమ్ - గుణవంతమ్ - విద్వాంసమ్ - అనడ్వాహమ్ - శ్వానమ్- ఉపానహమ్ - అప్సరసమ్ ఇత్యాదులు.**

'మతుప్' అనుప్రత్యయము చివర గలవి, మొద లగునవి మతుబాదికము. మతుప్ ప్రత్యయాంతములు మొద లగుసంస్కృతశబ్దములు, సంస్కృతమునందు వానికి ద్వితీయావిభక్తి ఏకవచనమునందు ఎట్టిరూపము కలుగునో దానితో సమాన మైనఆకారముతో తెలుగున ప్రాతిపదికగా నిల్చును. 'హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందు నామం బగు' అనులక్షణమును ఈవిధి బాధించును.

'శ్రీమత్' అనునది మతుబంత మగుశబ్దము. 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యంబు' అనుసూత్రమును బాధించి, ప్రస్తుతసూత్రముచే సంస్కృతమున ద్వితీయావిభక్తిలో ఏకవచనమునందలి 'శ్రీమన్తమ్' అనుదానితో సమాన మైన 'శ్రీమంతమ్' అనురూపముతో తెలుగున ప్రాతిపదికగా నిలుచును. ఇట్లె విద్వత్ – విద్వాంసమ్ మొ.

'మతుబాదికంబు' అనుచోటిఆదిశబ్దముచే ఇందలిశబ్దములు మతుప్ ప్రత్యయాంతములే కావలసిననియమము లేదు. అనడుహ్, శ్వన్ మొ.

'మతుబాదికంబు' అనుటచే మతుబాదులలో చేరనిసంస్కృతహలంతశబ్దము 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికగా నిలుచును.

'ద్వితీయైకవచనాంత' అనుటచే శ్రీమత్, శ్రీమాన్, శ్రీమతీ మొద లగుఇతర రూపములప్రసక్తి లేదు.

'తుల్యంబు' అనుటచే తెలుగున ప్రాతిపదిక మగునది సంస్కృతద్వితీయైక వచనాంతము కాదు. ద్వితీయైకవచనాంతము పదము. ద్వితీయైకవచనాంతమే అనగా పదమే తెలుగున ప్రాతిపదికము అగుట ఉచితము కాదు. కావున ద్వితీయైకవచనాంత 'తుల్యంబు' అని తుల్యశబ్దము ప్రయోగింపబడినది. (శ్రీమన్తమ్ అనురీతిగా పరసవర్ణము ఉన్నచోట తెలుగున అనుస్వారము ఉండుట తుల్యశబ్దముచే సమర్థించుకొనవచ్చు.)

**71. దానియంతిమమకారంబునకు లోపం బగు.**

**శ్రీమంత - గుణశంత - విద్వాంస - అనడ్వాహ ఇత్యాది. వీని కజంతములకుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు. అతఁడు శ్రీమంతుఁడు. ఇతఁడు గుణవంతుఁడు, వానివంశము శ్రీమంతము.**

**వీనివంశము గుణవంతము. విద్వాంసుఁడు, విద్వాంసము. అనడ్వాహము. శ్వానము. అప్సరస. వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతములె యిందు గ్రహింపఁబడు. శ్రీమతి, గుణవతి, విదుషి, శుని. మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు. ప్రాతిపదికగా నిలిచినమతుబాదులయొక్క ద్వితీయైకవచనాంతతుల్యరూపములందు చివర ఉన్నమకారమునకు లోపము వచ్చును. పిదప వీనికి అజంతములకువలె ఆయాకార్యము లగును.**

శ్రీమత్ అనుశబ్దమునకు 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనుసూత్రముచే శ్రీమంతమ్ అనునది ప్రాతిపదిక కాగా, అందలి చివరిమకారమునకు ప్రస్తుతసూత్రముచే లోపము వచ్చి, 'శ్రీమంత' అని అగును. మహ త్తయినపుడు ఉత్వడుజులు వచ్చి, శ్రీమంతుఁడు అని అగును. అమహత్తు అయినచో (తత్స. 39) ముపర్ణకము వచ్చి, శ్రీమంతము అని అగును.

'దాని' అనుటచే మతుబాదికముయొక్క ద్వితీయైకవచనాంతతుల్యరూప ప్రాతిపదికమునకు సంబంధించినది కానిచోట మకారమునకు లోపము రాదు.

'అంతిమమకారంబునకు' అనుటచే ఇతరస్థలములం దున్నమకారమునకు లోపము లేదు. శ్రీమంత. మతిమంత మొ.

'అగు' అనుటచే లోపము నిత్యము. కావున శ్రీమంతమ్ము అనుతీరుగా మకారము లోపింపని (ఉగాగమద్విత్వములు వచ్చిన) రూపములు ఉండవు.

### 72. ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు.

**ముదము – ఉపానహము – స్రజము.**

'ముత్' మొద లగునవి ముదాదులు. మతుబాదికములోని ఈశబ్దములు స్త్రీలింగములు. స్త్రీలింగములప్రథమైకవచనమునకు రావలసినలోపము ముత్ మొద లగు(స్త్రీలింగ)శబ్దములకు మాత్రము రాదు.

ముత్ అనుశబ్దమునకు 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనుసూత్రముచే 'ముదమ్' అనునది ప్రాతిపదిక. 'దానియంతిమ మకారంబునకు లోపం బగు' అనుసూత్రముచే మకారము లోపించి, 'ముద' అని అగును. ఇది స్త్రీలింగము కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనమునకు లోపము రావలసియుండగా, ప్రస్తుతసూత్రముచే ఆలోపము రాదు. కావున 'అమహన్నపుంసకముల కదంత ములకు ముపర్ణకం బగు' అనుసూత్రముచే ముపర్ణకము వచ్చి, 'ముదము' అని అగును. ఇట్లే ముదములు మొ.

'ముదాదులకు' అనుటచేత ముదాదులలో లేనిశబ్దమునకు ఈనిషేధము లేదు. అప్సరసమ్ – అప్సరస.

హలంతము లయినముదాదులను అజంతము లగుకంధరాదులలో చేర్చుట కంటె వేరుగా చెప్పదగు నని సూరి వేరుగా ఇట్లు సూత్రించియుండవచ్చును.

**73. ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు.**

**ఋత్విజుఁడు – ఋత్విక్కు. నీవృతము – నీవృత్తు.**

**ఋత్విగాదికం బాకృతిగణంబు.**

ఋత్విక్ మొద లగునవి ఋత్విగాదులు. ద్వితీయైకవచనముతో సమాన మైనరూపము ద్వితీయైకవచనాంతతుల్యము. ఋత్విక్ మొద లగుహలంత శబ్దములకు, సంస్కృతమున వానికి ద్వితీయైకవచనమునందలిరూపముతో సమాన మైనరూపము తెలుగున వికల్పముగా ప్రాతిపదికగా నిల్చును. జకారాంత మగు ఋత్విజ్ మొద లగుశబ్దములు మతుబాదులలో చేరినవి కావు. కావున 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికగా నిత్యముగా ఏర్పడుచున్నది. దానిని బాధించి ప్రస్తుతసూత్రముచే ద్వితీయైకవచనాంతతుల్యరూపము కలుగును. విభాష అనుటచే ద్వితీయైకవచనాంతతుల్యరూపము కలుగనపుడు 'హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యంబు' మున్నగుసూత్రము ననుసరించి ప్రథమైకవచనాంతతుల్య రూపమె ప్రాతిపదిక మగును.

ఋత్విజ్ అనుశబ్దమునకు (తత్స. 67. సూత్రమును బాధించి) ఈసూత్రముచే ద్వితీయైకవచనాంతతుల్యరూప మగు ఋత్విజమ్ అనునది ప్రాతిపదిక కాగా (తత్స. 71) మకారము లోపించి, ఋత్విజ అని కాగా, (తత్స. 21.సూత్రముచే) ఉత్వమును (తత్స. 22 సూత్రముచే) డుజును వచ్చి, ఋత్విజుఁడు అని అగును. 'విభాష' అనుటచే ద్వితీయైకవచనాంతతుల్యము కానిపక్షమునందు (తత్స. 67 సూత్రముచే) ప్రథమైకవచనాంతతుల్య మగు 'ఋత్విక్' అనునది ప్రాతిపదిక మై (తత్స. 66చే) ఉగాగమద్విత్వములును (తత్స. 44సూ.చే) ప్రథమైకవచనలోపమును కలిగి, ఋత్విక్కు అని అగును.

'ఋత్విగాదులు' అనుటచే ఋత్విక్ మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈ కార్యము లేదు. రుక్కు.

**74. ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాష నగు.**

**హనుమానుఁడు–హనుమంతుఁడు. భగవానుడు–భగవంతుఁడు ఇత్యాది.**

మహద్వాచక మయినపుడు కొన్నిస్థలములందు మతుప్ ప్రత్యయములోని తకారమునకు వికల్పముగా 'ఆన' అనునది ఆదేశముగా వచ్చును. ఇవి మతుబంతములు కావున 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనుసూత్రముచే ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక కావలసి యుండగా, దానిని బాధించి ఈలక్షణము ప్రవర్తించును.

హనుమత్. ఈశబ్దము 'మతుబాదికంబు' అనుసూత్రముచే హనుమంతమ్ అనునది ప్రాతిపదిక కావలసియుండగా, ఆసూత్రమును బాధించి, ప్రస్తుత సూత్రముచే సంస్కృతమున ప్రాతిపదిక మగు 'హనుమత్' అనునదే తెలుగునను ప్రాతిపదికగా నిలిచి, అందలిచివరితకారముపొల్లుస్థానమున 'ఆన' అనునది ఆదేశ మయి, హనుమ+ఆన కాగా, 'అంద్వవగాగమంబులం దప్ప' అను (సంధి. 11) సూత్రముచే సంధి జరిగి, హనుమాన అని అగును. ఇది పుంలింగ మగు మహద్వాచకము. కావున ఉత్వమును (తత్స. 21) డుజును (తత్స. 22) వచ్చి, 'హనుమానుఁడు' అని అగును.

'విభాష' అనుటచే 'ఆన' అనుఆదేశము రానిపక్షమునందు 'మతుబాదికంబు' అనుసూత్రముచే బాధ లేదు. కావున ద్వితీయైకవచనాంతతుల్యరూపము 'హనుమంతమ్' అనునది ప్రాతిపదిక మై, ప్రథమైకవచనమునందు 'హనుమంతుఁ డు' అని అగును.

'ఒకానొకచో' అనుటచే ఆనాదేశము వచ్చిన హనుమానుఁడు అనువిధ మైన రూపములు విరళములుగా నుండును. అంతే కాక మతుప్ ప్రత్యయాంతములకు కొన్నింటికి మాత్రమే ఈకార్య మగును. కావున శ్రీమానుఁడు, బుద్ధిమానుఁడు ఇత్యాదిగా రూపములు ఉండవు. ప్రయోగానుసారముగా గ్రహింపదగును. హనుమానుఁడు, అనురీతిరూపములు లోకవ్యవహారమునందు వినిపించుచున్నను ప్రామాణికకవిప్రయోగములందు కనిపించుట లే దందురు.

'మహత్త్వంబున' అనుటచే అమహత్త్వములో ఈకార్యము లేదు. కావున హనుమానము, గుణవానము అనురీతిగా మువర్ణకాంతరూపములు ఉండవు. వానరము హనుమంతము అనురీతిగా ఉండవచ్చును. ఇట్లే స్త్రీత్వమున భగవతి గుణవతి మొ.

**75. విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు.**

**స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వడుజులు లే వని యెఱుంగునది. విశ్వకర్మ కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వ ఇత్యాదులు.**

విశ్వకర్మ మొద లగునవి విశ్వకర్మాదులు, స్త్రీత్వము అనగా స్త్రీలింగధర్మము.

విశ్వకర్మ మొద లగుశబ్దములకు స్త్రీలింగత్వము వచ్చును. ఇవి సహజముగా పుంలింగములు. మహద్వాచకములు. కావున ఉత్వము, డుజ్ మొద లగుపుంలింగకార్యములు రావలయును. కాని స్త్రీలింగత్వమును ఆరోపించుటచేత పుంలింకార్యములు రాకుండ, ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగకార్యములు కలుగును.

విశ్వకర్మన్ శబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచేత 'విశ్వకర్మా' అనునది ప్రాతిపదిక కాగా, 'నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే హ్రస్వము వచ్చి, విశ్వకర్మ అని కాగా, ఉత్వడుజులు రావలసియుండగా, ప్రస్తుతసూత్రముచే స్త్రీత్వము కలిగి (ఉత్వము, డుజు రాక) 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించి, విశ్వకర్మ అని అగును. ఇట్లే ఇతరవిభక్తివచనములలో విశ్వకర్మలు, విశ్వకర్మను, మొ.

'విశ్వకర్మాదులకు' అనుటచేత విశ్వకర్మ మొద లగువానిలో చేరనిశబ్దములకు స్త్రీత్వము లేదు. సుత్రాముఁడు, సుధన్వుఁడు మొ.

'అగు' అనుటచే స్త్రీత్వము నిత్యము. కావున విశ్వకర్ముఁడు, విశ్వకర్ముని మొద లగు పుంలింగరూపములు ఉండవు. విశ్వకర్మునికూఁతు అనుఒక ప్రయోగమును ప్రౌఢవ్యాకర్త చూపెను.

**76. మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు.**

**బ్రహ్మ. ఈశబ్దము చతుర్ముఖఋత్విగ్విప్రులకు వాచకంబు.**

**తత్త్వతపోవేదయోగవాచకం బగు నేని బ్రహ్మము నాఁబడు.**

స్త్రీతిర్యగ్జడభిన్నమును దెలుపునది మహత్తు. మహద్వాచకమును, పుంలింగమును అయినబ్రహ్మశబ్దమునకు స్త్రీలింగత్వము కలుగును. దీనివలన (మహత్తును) పుంలింగము అయినఈశబ్దమునకు ఉత్వడుజాదికార్యములు వారింపబడి ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగకార్యములు వచ్చును.

పుంలింగ మగు బ్రహ్మన్ శబ్దమునకు, 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచేత 'బ్రహ్మా' అనునది ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే హ్రస్వము రాగా, మహద్వాచకమును పుంలింగమును అయినఈశబ్దమునకు ఉత్వము, డుజు రావలసియుండగా, ప్రస్తుతసూత్రముచేత స్త్రీత్వము కలుగును. స్త్రీలింగత్వము వలన ఉత్వడుజులు రాక, 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు'

అను సూత్రముచే ప్రథమైకవచనము లోపించి, బ్రహ్మా అని అగును. ఇతరవిభక్తివచనము లలో బ్రహ్మను, బ్రహ్మలు మొ. మహత్తును పుంలింగమును అయినఈబ్రహ్మ శబ్దమునకు బ్రహ్మ, యజ్ఞము చేయించువాడు, బ్రాహ్మణుఁడు అని అర్థములు.

'మహద్వాచక మయి' అనుటచే మహద్వాచకము కాని బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వము లేదు. యోగము అనుఅర్థములో పుంలింగ మైనను బ్రహ్మశబ్దము అమహత్తు. కావున స్త్రీత్వము గలుగదు. తపస్సు, వేదము అనుఅర్థములలో అమహత్తు, నపుంసకము. కావున స్త్రీత్వము గలుగదు. నపుంసకలింగకార్యము అనగా ఇచట మువర్ణకముతో, బ్రహ్మము అని అగును.

'పుంలింగంబు' అనుటచే పుంలింగము కానిచో స్త్రీత్వము గలుగదు. తత్త్వము, పరమాత్మ, అనుఅర్థమున మహ త్తయినను బ్రహ్మశబ్దము నపుంసకలింగ మైనది. కావున అపుడు స్త్రీత్వము గలుగదు. నపుంసకలింగకార్యము అనగా ఇచట మువర్ణకముతో, బ్రహ్మము అని అగును.

'బ్రహ్మశబ్దమునకు' అనుటచే ఇతరశబ్దమునకు ఈసూత్రముచే స్త్రీత్వము గలుగదు.

**77. ఆత్మేమనిజంతంబులకు నాంతము లగుమనుజసంజ్ఞలకును స్త్రీత్వంబు బహుళంబుగా నగు.**

**ఆత్మ–ఆత్మము–ఆత్ముఁడు. మహిమ–మహిమము. అణిమ–అణిమము. గరిమ–గరిమము. లఘిమ–లఘిమము. దేవశర్మ–దేవశర్ముఁడు.**

'ఇమనిచ్' అనుప్రత్యయము చివర గలవి ఇమనిజంతములు. మహిమన్ గరిమన్ మొద లగునవి. నకారము చివర కలిగి, మనుజులకు పేర్లు అయిన శబ్దములు నాంతము లగుమనుసంజ్ఞలు.

ఆత్మన్ శబ్దమునకును, 'ఇమన్' ప్రత్యయము చివర గలవానికిని, మనుజులకు పేరు లైన నకారాంతము లగుశబ్దములకును బహుళముగా స్త్రీత్వము కలుగును. శబ్దము సహజముగా పుంలింగవెూ నపుంసకలింగవెూ అయినను అతిదేశింపబడిన స్త్రీత్వముచేత ఆయాకార్యములు రాక, ప్రథమైకవచనలోపము మొద లగుస్త్రీలింగ కార్యములు వచ్చును.

ఆత్మన్ శబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు(తత్స. 67)' అనుసూత్రముచే 'ఆత్మా' ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు(తత్స. 54) సూత్రముచే హ్రస్వము. ఆత్మ. పరమాత్మ మొద లగుఅర్థములో పుంలింగమును మహద్వాచకమును ఐనదీనికి ప్రథమైకవచనమున ఉత్వడుజులు ప్రాప్తించు

చుండగా ప్రస్తుతసూత్రముచే స్త్రీత్వము కలిగి, (ఉత్వదుజులు రాక), 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనము లోపించి, 'ఆత్మ' అని అగును. బహుళము గావున స్త్రీత్వము రానపుడు మహత్పుంలింగము కావున ఉత్వదుజులు వచ్చి, ఆత్ముఁడు అని అగును.

మనస్సు మొద లగుఅర్థములలో నపుంసకలింగ మయిన 'ఆత్మన్' శబ్దమునకు (తత్స. 67.చే) ఆత్మ అన్నది ప్రాతిపదిక కాగా, ప్రస్తుతసూత్రముచే స్త్రీత్వము వచ్చి ప్రథమైకవచనము లోపింపగా, 'ఆత్మ' అని అగును. బహుళము కావున స్త్రీత్వము రానిపక్షమున నపుంసకలింగ మగుటచే 'అమహన్నపుంసకములకు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, ఆత్మము అని అగును.

ఇట్లే మహిమ-మహిమము, సుశర్మ-సుశర్ముఁడు మొ. బహుళ మనుటచే ఇచట విభాష.

సుధన్వన్, శతధన్వన్ మొద లగుశబ్దములందు స్త్రీత్వము అసలు లేదు. సుధన్వుఁడు, శతధన్వుఁడు మొ. ఇచట సుధన్వ అనువిధముగా స్త్రీలింగకార్యముతో రూప ముండదు. కావున బహుళశబ్దముచే ఇట్టిచోట్ల అప్రవృత్తి.

'నాంతంబు లగు' అనుటచే నాంతములు కానిమనుజసంజ్ఞలకు స్త్రీత్వము లేదు. అంగిరసుఁడు మొ.

'మనుజ' అనుటచే మనుజసంజ్ఞలు కానివానికి స్త్రీత్వము లేదు. సుత్రామన్ ఇది దేవసంజ్ఞ. కావున స్త్రీత్వము కలుగక పుంలింగకార్యముతో సుత్రాముఁడు.

'సంజ్ఞలకు' అనుటచే సంజ్ఞలు గానిశబ్దములకు స్త్రీత్వము రాదు. మహాత్మన్-మహాత్ముఁడు.

**78. మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు. రాజు - ఖగరాజు. అమహత్త్వంబునందు - రాజము. వృక్షరాజము. ఉపసర్జనత్వంబునందు - హతరాజుఁడు పరశురాముఁడు.**

స్వార్థపరము అనగా తనయొక్క అర్థమునందు ప్రాధాన్యము కలిగినది. మహద్వాచక మయి, తనయర్థమునే ప్రధానముగా తెలుపునపుడు రాజశబ్దము 'రాజు' అనురూపమును పొందును.

రాజన్ శబ్దము నకారాంతము. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు' అనుసూత్రముచే ప్రథమైకవచనాంతతుల్య మగు 'రాజా' అన్నది ప్రాతిపదిక మై, 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని చివరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి, రాజ. ఇది పుంలింగము, మహద్వాచకము కావున ప్రథమైకవచనమునందు

ఉత్వడుఙులు వచ్చి 'రాజుఁడు' అని మహత్త్వమునందు కావలసియున్నది. 'రాజు' అని అగు నని ఈసూత్రము నియమించుచున్నది. అనగా రాజన్‌శబ్దములో నకారమునకు లోపమును, 'రాజ' అనుశబ్దమున తుదిఅత్వమునకు ఉత్వమును, స్త్రీవద్భావమును దీనిచే నిపతింపబడినవి. రాజులో జకారమునకు దంత్యత గూడ సూత్రముచే నిపతింపబడినట్లు గ్రహింపవచ్చును.

రాజన్‌శబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు' అను సూత్రమును బాధించి, ప్రస్తుతసూత్రముచే నకారలోపము, (రాజ) అత్వమునకు ఉత్వమును రాగా, రాజు, అని అగును. ఈసూత్రముచేతనే స్త్రీవద్భావము కలుగును. దానివలన 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించి 'రాజు' అని అగును. సూత్రమున ప్రథమైకవచన లోపముతోనె నిర్దేశింపబడినది కావున స్త్రీవద్భావముచేత 'రాజు' ఉకారాంత మైనను, వువర్ణకము రాకుండ ప్రథమైకవచనలోపమే అగును. ఇతరవిభక్తివచనము లలో – రాజును, రాజులు మొ.

'రాజశబ్దము' అనునిర్దేశముచే ఇది రాజన్ అని నకారాంత మైయున్నను, లేదా సమాసమునందు చివర (టచ్‌ప్రత్యయముచే) ఖగరాజ అనువిధముగా అకారాంత మైయున్నను 'రాజు' అనురూపము నందును. ఖగరాజు.

'మహత్త్వంబున' అనుటచే అమహత్తు అయినపుడు రాజు అని యుండదు. మువర్ణకము వచ్చి – వృక్షరాజము.

'స్వార్థపరంబు' అనుటచే రాజశబ్దము అర్థము అప్రధాన మైనపుడు రాజు అని ఉండదు. హతరాజుఁడు (పరశురాముఁడు).

'రాజశబ్దము' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు.

**79. జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు.**

**జగము – జగత్తు. ఇంద్రజి – ఇంద్రజిత్తు.**

**ఋత్విగాది యగుటంజేసి యింద్రజితుం డనియు వాడంబడు.**

జగత్, ఇంద్రజిత్ అనుశబ్దములం దున్నతకారమునకు వికల్పముగా లోపము వచ్చును.

జగత్ అనుశబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనుసూత్రముచే 'జగత్' అనునది ప్రాతిపదిక. 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రమును బాధించి, ఈసూత్రముచే తకారము లోపించి 'జగ' అని కాగా, ప్రథమైకవచనమునందు 'అమహ

న్నపుంసకముల కదంతములకు ముువర్ణకం బగు’ అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, ‘జగము’ అని అగును. ‘విభాష’ గావున తకారము లోపింపనిచో ‘జగత్’ అని ఉండగా ‘ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు’ అనుసూత్రముచే జగత్తు అని కాగా, దీనిపై ప్రథమైకవచనమునకు ‘ఇగ్లౌ’ సూత్రముచే లోపము వచ్చి, ‘జగత్తు’ అనుపదము ఏర్పడును.

ఇంద్రజిత్ శబ్దము. ‘హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు’ అనుసూత్రమును బాధించి, ‘ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు’ అనుసూత్రముచే ఇంద్రజితమ్ అనునది ప్రాతిపదిక కాగా, దాని అంతిమమకారము (తత్స,71) లోపించి, ప్రథమైకవచనమున ఉత్వ(తత్స. 21) డుఙు(తత్స. 22)లు రాగా, ఇంద్రజితుఁడు అని అగును.

విభాష అనుటచే ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక కానిస్థితిలో ‘హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు’ అనుసూత్రముచే ఇంద్రజిత్ అనునది ప్రాతిపదిక కాగా, ఉగాగమంబును ద్విత్వంబును అనుసూత్రమును బాధించి, ప్రస్తుతసూత్రముచే తకారము లోపింపగా, ‘ఇంద్రజి’. ఇది ఇకారాంత మయినది కావున ‘ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు’ అను సూత్రముచే ‘సు’ విభక్తి లోపించి, ‘ఇంద్రజి’ అని అగును. ‘విభాష’ అనుటచే తకారము లోపింపనిపక్షమున ఉగాగమద్విత్వములు వచ్చి. ఇంద్రజిత్తు అని అగును.

## 80. సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు.

**ఉరము – ఉరస్సు. వృక్షము – వక్షస్సు. అర్చి – అర్చిస్సు. ధనువు – ధనుస్సు. ఆయువు – ఆయుస్సు. బహుళగ్రహణంబునంజేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబు లేదు. పయస్సు – వయస్సు – సరస్సు.**

సకారము చివర గలిగినశబ్దముల చివరిసకారమునకు బహుళముగా లోపము వచ్చును. ‘హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు’ అనుసూత్రముచే సాంతము లగుఈశబ్దములకు ప్రథమైకవచనాంతతుల్యము లగు రూపములు (ఉరః, వక్షః మొ.) ప్రాతిపదికలు కావలయును. ఆపక్షమున ఆశబ్దములకు చివర విసర్గము ఉండునే కాని సకారము ఉండదు. అయినను ఈ సూత్రమున ‘సాంతంబులతుదిసకారంబునకు’ అనుటచేత సకారాంతములు మాత్రము ప్రథమైకవచనతుల్యములు గాక సంస్కృతమున ఏవి ప్రాతిపదికలో తెలుగున కూడ అవే ప్రాతిపదికలు అగు నని గుర్తింపవలయును.

ఉరస్ అనునది ప్రాతిపదికము. ప్రస్తుతసూత్రముచే సకారము లోపింపగా ‘ఉర’ అని అగును. నపుంసకలింగ మగుఈశబ్దము సకారలోపానంతరము

అదంతము అయినది కావున ప్రథమైకవచనమునందు 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనుసూత్రముచే ముపర్ణకము వచ్చి, 'ఉరము' అని అగును. బహుళము అనుటచేత సకారము లోపింపనిపక్షమునందు ఉరస్ అని యుండగా 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే ఉగాగమద్విత్వములు వచ్చి, 'ఇగ్లౌ' సూత్రముచే ప్రథమైకవచనము లోపించి, 'ఉరస్సు' అని అగును. ఇట విభాష.

పయస్ మొద లగుశబ్దములలో సకారమునకు లోపము లేదు. పయస్సు. వయస్సు. మొ. ఇ ట్లనుటచే పయము, వయము అనుతీరుగా సకారము లోపించిన రూపములు ఉండవు. కాగా ఇచట అప్రవృత్తి.

'సాంతంబులతుదిసకారంబునకు' అనుటచే ఇతరస్థలముల హల్లులు లోపింపవు. రుక్కు, మరుత్తు.

'తుది' (సకారంబునకు) అనుటచే చివరిది కానిసకారమునకు లోపము లేదు. సదము, సరస్సు. మొ.

## 81. మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీయైక వచనాంతతుల్యత్వం బే నగు.

**అంగిరుఁడు – అంగిరసుఁడు. ఉగ్రశ్రవుఁడు – ఉగ్రశవసుఁడు. ప్రచేతుఁడు – ప్రచేతసుఁడు. ఊర్ధ్వరేతుఁడు – ఊర్ధ్వరేతసుఁడు.**

స్త్రీతిర్యగ్జడభిన్నములు మహత్తులు. మహద్వాచకము లయినసకారాంత శబ్దములచివరివర్ణమునకు అనగా సకారమునకు లోపము కల్గును. లేనిపక్షమున ఆప్రాతిపదికము ద్వితీయైకవచనాంతతుల్య మగును. 'సాంతంబులతుదిసకార మునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే బహుళముగా సకార లోపము మాత్రమే ప్రాప్తించి, అంగిరుఁడు, అంగిరస్సు అనువిధముగా కావలసి వచ్చుచుండగా దానిని బాధించి, ఈలక్షణము ప్రవర్తించును.

'అంగిరస్' అనుప్రాతిపదికమునందు ఈసూత్రముచే సకారము లోపింపగా 'అంగిర' అని అగును. ఇది పుంలింగ మగుమహద్వాచకము కావున ఉత్వమును (తత్స. 21) డుజును (తత్స. 22) వచ్చి, అంగిరుఁడు అని అగును. సకారలోపము రానిపక్షమున ఈసూత్రముచేతనే ద్వితీయైకవచనతుల్యరూపము కల్గి, అంగిరస్ అనునది 'అంగిరసమ్' అనురూపముతో ప్రాతిపదికము అగును. 'దానియంతి మమకారము' లోపింపగా 'అంగిరస' అనుశబ్దమునకు ఉత్వమును (తత్స. 21) డుజును (తత్స. 22) వచ్చి, అంగిరసుఁడు అని అగును.

'మహద్వాచకంబులు' అనుటచే అమహత్తు లగుసాంతములకు ఈకార్యము

లేదు. 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే బహుళముగా సకారలోపమె వచ్చును. ఉరము – ఉరస్సు.మొ.

'సాంతంబులకు' అనుటచే ఇతరములకు ఈకార్యము లేదు.

'అంతలోపం బేని, ద్వితీయైకవచనాంత తుల్యత్వం బేని' అనుటచే అంగిరస్సు, అనువిధముగా మహద్వాచకములకు సకారము లోపింపక నిలిచియున్నరూపము లుండవు.

## 82. వేధ పురోధ పురోధసుఁడు.

**వేధశ్శబ్దమునకు నిత్యంబుగా, పురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపఁబడియె.**

వేధస్, అనుశబ్దమునకు 'వేధ' అనియు, పురోధస్, అనుశబ్దమునకు పురోధ, పురోధసుఁడు అనియు రూపములు అగును. వేధస్ – పురోధస్ అనుశబ్దములు సకారాంతములును పుంలింగములును అయినమహద్వాచకములు. కావున 'మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు' అనుసూత్రమును అనుసరించి, సకారము లోపించినచో వేధుఁడు, పురోధుఁడు అనియు, సకారము లోపింపనిపక్షమున ద్వితీయైకవచనాంతతుల్యత్వము కలిగి, వేధసుఁడు. పురోధసుఁడు అనియు కావలసియుండగా –

ప్రస్తుతసూత్రముచే వేధస్ శబ్దమునకు నిత్యముగా సకారలోపమును, స్త్రీవద్భావమును నిపతింపబడినవి.

'వేధస్' అనుప్రాతిపదికమునకు ('సాంతంబులతుదిసకారంబునకు' అను సూత్రమును బాధించి ప్రవర్తింపవలసిన) 'మహద్వాచకంబు లగుసాంతంబులకు' అనుసూత్రమును బాధించి ప్రస్తుతసూత్రముచే సకారలోపము కలిగి, వేధ అని కాగా, ఈసూత్రముచేతనే స్త్రీవద్భావము కలిగి, (ఉత్వడుజులను వారించి) 'స్త్రీ లింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచన లోపము వచ్చి 'వేధ' అనుపదము ఏర్పడును. ఇట్లే వేధలు, వేధను, వేధచేత.మొ.

సలోపము నిత్యము. కావున సలోపము లేని వేధస్సు, లేదా వేధసుఁడు అను రూపము లుండవు. అట్లే స్త్రీవద్భావమును నిత్యము. కావున స్త్రీవద్భావము లేక వేధుఁడు, వేధుని అనురీతిగా పుంలింగకార్యముతో రూపము లుండవు.

'పురోధస్' శబ్దమునకు సకారలోపమును స్త్రీవద్భావమును వికల్పముగా ఈ సూత్రము నియమించుచున్నది.

పురోధస్ అనుప్రాతిపదికలో ('సాంతంబుల', 'మహద్వాచకంబు లగు సాంతంబుల' అనుసూత్రములను బాధించి) ప్రస్తుతసూత్రముచే తుదిసకారము లోపించి, 'పురోధ' అని కాగా, ఈసూత్రముచేతనే స్త్రీవద్భావము కలిగి, ప్రథమైక వచనము లోపించగా, 'పురోధ' అనురూప మేర్పడును. ఇట్లే పురోధలు, పురోధను మొద లగనవి.

వికల్పము గావున సలోపస్త్రీవద్భావములు లేనపుడు 'మహద్వాచకంబు లగు సాంతంబులకు' అనుసూత్రమును అనుసరించి ద్వితీయైకవచనాంతతుల్యత్వము కలిగి పురోధసమ్ అని ఏర్పడినప్రాతిపదికలో అంతిమమకారము లోపించి (తత్స. 71), పురోధస అని కాగా, (పుంలింగ మగుమహత్తు కావున)ఉత్వమును (తత్స. 21), డుజును (తత్స. 22) వచ్చి, పురోధసుఁడు అని అగును.

'పురోధ పురోధసుఁడు' అనునిర్దేశముచే సలోపమును స్త్రీవద్భావమును రెండును కలిసియే వచ్చును. కావున రానపుడు రెండును రావు. అందుచే 'పురోధసమ్' అని ద్వితీయైకవచనాంతతుల్యత్వము కలిగినపుడు (సలోపము లేదు కావున) స్త్రీవద్భావమును ఉండదు. కావున (మహత్) పుంలింగకార్యములతో పురోధసుఁడు, అనియె అగును. కాని 'పురోధస – పురోధసను' ఇత్యాదిగా కాదు.

**83. మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాష నగు.**
**మనసు – మనస్సు. శిరస్సు – శిరస్సు. సదసు – సదస్సు.**
**సలోపం బయ్యె నేని – మనము, శిరము, సదము.**

'మనస్' మొద లగుశబ్దములయందలిసకారమునకు ద్విత్వము వికల్పముగా వచ్చును. 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రమును అనుసరించి ఉగాగమముతోపాటు ద్విత్వము సైతము నిత్యముగా రావలసి యున్నది. ఈసకారము హ్రస్వముమీద ఉన్నది. కావున 'దీర్ఘంబు మీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ద్విత్వము వికల్పముగా వచ్చుటకు అవకాశము లేదు. అందుకయి ఈసూత్రము 'మనస్ మొద లగువానిలో ద్విత్వము వికల్ప మగుటను ప్రత్యేకముగా పేర్కొనుచున్నది. ద్విత్వము మాత్రమె వికల్పము. కావున ఉగాగమము నిత్యమె.

'మనస్' అనుప్రాతిపదికమునందు 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే సకారము లోపింపనిపక్షమునందు 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనుసూత్రముచే ఉగాగమము తోపాటు ద్విత్వము గూడ నిత్యముగా రావలసియుండగా, ఈసూత్రమును

అనుసరించి ద్విత్వము వికల్పము. (ఉగాగమముతో) ద్విత్వము వచ్చినచో 'మనస్సు' అని అగును. 'విభాష' అనుటచే ద్విత్వము రానిచో ఉగాగము మాత్రము కలిగి 'మనసు' అని అగును. ఇవి ఉగాగమాంతములు కావున 'ఇగ్లౌరాయుగంతంబుల' అనుసూత్రముచేత ప్రథమైకవచనము లోపించి 'మనస్సు, మనసు' అని అగును.

'మనః ప్రభృతుల' అనుటచేత 'మనస్' మొద లగువానిలో చేరనిశబ్దమునందు సకారమునకు ద్విత్వము నిత్యము. ఉరస్సు.

'సకారంబునకు' అనుటచే మనఃప్రభృతులలోని ఇతరము లగుహల్లులకు ఈకార్యము లేదు.

'ద్విత్వంబు' అనుటచే ద్విత్వము వచ్చినను, రాకున్నను ఉగాగమము మాత్రము వచ్చును. మనస్సు - మనసు.

**84. ద్యుహచ్ఛబ్దంబులకు దివి హృది యగు.**

**దివి - దివులు. హృది - హృదులు.**

దివ్ అనుశబ్దమునకు దివి అనియును, హృత్ అనుశబ్దమునకు హృది అనియును రూపము లుండును. ఈలక్షణము 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బింది నామం బగు' అనుసూత్రమును బాధించి దివి, హృది అను రూపములను సాధించును.

దివ్ అనుశబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు' అనుసూత్రమును బాధించి, ఈసూత్రముచే 'దివి' అనుఆదేశము కలుగగా, ఇది ఇకారాంతము కావున 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించి, 'దివి' అని అగును, ఇట్లే ఇతరవిభక్తివచనములలో దివిని, దివులు మొ.

అకారాంత నపుంసకలింగ మగు దివ అనుశబ్దమునకు 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అని ముపర్ణము వచ్చి, దివము అని యేర్పడును. దివ్ శబ్దమునే మతుబాదులలో చేర్చి ద్వితీయైకవచనాంతతుల్యరూపము (దివమ్) నుండి 'దివము' ఏర్పడె ననరాదు. దివ్‌శబ్దము మతుబాదికములో లేదు.

'హృద్' అనుశబ్దమునకు 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బింది నామం బగు' అనుసూత్రముచే 'హృత్' అనునది ప్రాతిపదికము కాగా, ఉగాగమ ద్విత్వములు వచ్చి హృత్తు అని కావలసియుండగా దానిని బాధించి, ప్రస్తుతసూత్రము 'హృది' అనురూపమును విధించినది. హృత్ అనుశబ్దమునకు ఈసూత్రముచే హృది అనుఆదేశము కలుగగా, హృది ఇకారాంతము కావున

'ఇగ్లౌ రాయుగంతంబుల' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించి, 'హృది' అను పద మేర్పడును. ఇట్లే ఇతరవిభక్తివచనములలో హృదిని, హృదులు మొ.

**85. స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు.**

| నామము | స్త్రీప్రత్యయాంతము | తత్సమము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి. |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వత్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖీ, | వనజముఖి, |
| | వనజముఖా, | వనజముఖి, |
| మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర |

**అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి ఇత్యాదు లసాధువులు.**

అజంతములును, హలంతములును అయినస్త్రీలింగశబ్దము లన్నియు సంస్కృతమున ఆయాశబ్దములకు జెప్పబడిన ఆయాస్త్రీప్రత్యయములతో కూడియే తెలుగున ప్రాతిపదికలుగా నిలుచును.

కర్తృ అనునది ప్రాతిపదికము. పుంలింగమున 'కర్తృ' అనుసంస్కృత ప్రాతిపదికము అట్లే తెలుగున నిలుచును. ఇది స్త్రీలింగము అయినపుడు దీనికి సంస్కృతమునందు 'ఋన్నేభ్యో జీప్' అనులక్షణముచే జీప్ అనుప్రత్యయము వచ్చి 'కర్త్రీ' అని అగును. తెలుగున స్త్రీలింగమున కర్తృ అనునది కాక స్త్రీ ప్రత్యయము(జీప్)తో కూడిన 'కర్త్రీ' అనునదే ప్రాతిపదికముగా నిలుచును. దీనికి 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే హ్రస్వము కలిగి 'కర్త్రి' అని కాగా, 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబులకు లోపం బగు' అనుసూత్రముచే సు విభక్తి లోపించి 'కర్త్రి' అనుపద మేర్పడును.

'ఎల్ల' అనుటచే అజంతములు, హలంతములు నగుశబ్దము లన్నియు స్త్రీలింగమున స్త్రీప్రత్యయముతో గూడియె వచ్చును. కర్తృ–కర్త్రీ, బుద్ధిశాలిన్–

బుద్ధిశాలినీ మొ.

**86. 'మహతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు.**

**పద్మలత మనోహారి - పద్మలత మనోహారిణి. హృద్య మగువిద్య - హృద్య యగువిద్య. మొదవులలోఁ గపిల వరిష్ఠంబు - కపిల వరిష్ఠ.**

మహతి అనగా స్త్రీవాచకము. స్త్రీవాచకము కానిది మహతీతరము. స్త్రీవాచకము కాని స్త్రీలింగము ఐనశబ్దముయొక్క విశేషణమునకు వికల్పముగా క్లీబత్వము కలుగును. 'విశేష్యంబునకుం బోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' అనుసూత్రము ననుసరించి 'విశేష్యము స్త్రీలింగ మయినపుడు దాని విశేషణమును స్త్రీలింగమునందె ఉండును. కాని స్త్రీలింగ మగువిశేష్యము స్త్రీవాచకము కానపుడు మాత్రము, దానియొక్క విశేషణము నపుంసక లింగములోను, స్త్రీలింగములోను రెండు విధములుగా ఉండును.

హృద్య యగువిద్య. ఇట 'విద్య' స్త్రీలింగము. కాని దీనిచే బోధింపబడునది స్త్రీ కాదు. కావున ఇది మహతీతర మగుస్త్రీలింగము. దీనికి విశేషణము అయిన 'హృద్య' శబ్దమునకు ప్రస్తుతసూత్రముచేత క్లీబత్వము కలుగగా (అదంత మైనది కావున) 'అమహన్నపుంసకముల కదంతములకు ముువర్ణకం బగు' అనుసూత్రముచే ముువర్ణకము వచ్చి 'హృద్యము అగువిద్య' అని అగును. 'విభాష' అనుటచే క్లీబత్వము రానిపక్షమున విశేష్యమును అనుసరించి స్త్రీలింగమునం దుండి 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచేత ప్రథమైకవచనము లోపించి హృద్య అగువిద్య అగును.

'మహతీతరంబు' అనుటచే స్త్రీవాచకము అయినస్త్రీలింగముయొక్క విశేషణమునకు మాత్రము క్లీబత్వము రాదు. హృద్య అగువనిత.

'స్త్రీలింగంబుల' అనుటచే స్త్రీలింగము కానివిశేషణమునకు క్లీబత్వము కలుగదు. మనోహరుఁ డగురాముఁడు.

'విశేషణంబులకు' అనుటచే విశేష్యలింగమునకు మార్పు ఉండదు. హృద్య మగువిద్య. విద్యము అని యుండదు.

**87. భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు.**

**భవదాదు లగుహలంతసర్వనామములకు, శతృరేఫాంతాదులకును, దెనుఁగుభాషయందు వ్యవహారంబు లే దని యర్థము. సమాసంబులం దొలుతం గదిసి యుందుం బ్రయుక్తంబు లగు. భవద్గుణంబులు, త్వదాశ్రయము, మత్పుణ్యము. లసద్రూపము, భవిష్యత్కాలము, ధూర్వహము**

**ఇత్యాదు లెఱుంగునది.**

భవత్+శతృ+అదులు భవచ్ఛత్రాదులు. భవత్, త్వత్ మొద లగుహలంతము లయినసర్వనామశబ్దములును, లసత్ మొద లగుశతృప్రత్యయము చివర గలిగిన శబ్దములును. రేఫము చివర గలిగినవి అగుసంస్కృతశబ్దములు మొద లగుసంస్కృశబ్దములు తెలుగుభాషలో ప్రయోగింపబడవు.

ఈశబ్దములు సంస్కృతసమాసములో చివర కాక, సమాసమునందు ఇతరస్థలములం దుండి తెలుగులో ప్రయోగింపబడవచ్చును. భవత్పుణ్యము. ఇట భవత్పుణ్య అన్నది ప్రాతిపదికము. ముపర్ణకముతో భవత్పుణ్యము అని అయినవి. సమాసమునందు చివర లేకుండుటచే తెలుగువిభక్త్యాదులు భవచ్ఛత్రాదులపై తెలుగువిభక్తులు ఉండవు.

'భవచ్ఛత్రాదులకు' అనుచోట ఆదిశబ్దముచే రేఫము చివర గలిగినశబ్దములు మొద లగునవి కవిప్రయోగానుసారముగా గ్రహింపవలయును. అనగా 'ధూర్' మొద లగురేఫాంతశబ్దములు కూడ తెలుగులో ప్రయోగింపబడవు. సమాసము నందు మొదటను, నడుమ నుండి తెలుగున చేరవచ్చును. ధూర్వహము.

ఈలక్షణమునుబట్టి సంస్కృతమునందలిశబ్దములు అన్నియు తెలుగున తత్సమములుగా చేరవు అని తెలియవచ్చును.

'భవచ్ఛత్రాదులకు' అనుటచే భవచ్ఛత్రాదులలో చేరనిసంస్కృతశబ్దము తత్సమముగా తెలుగున ప్రయోగింపబడును. రాముఁడు, సీత, మొ.

'ఇందు' అనగా తెలుగుభాషలో ప్రయోగింపబడదు. సంస్కృతమున ప్రయోగింపబడుటను ఈలక్షణము సూచించును.

**ఇది తత్సమపరిచ్ఛేదము**

# ఆచ్ఛికపరిచ్ఛేదము

**1. సంస్కృతసమేతరం బయినయీభాష యచ్ఛ యనంబడు.**

**స్పష్టము.**

సంస్కృతముతో తుల్య మైనభాష సంస్కృతసమము. సంస్కృతసమముకంటె వే రైనది సంస్కృతసమేతరము. సంస్కృతసమేతరము ఐనతెలుగుభాషకు అచ్ఛ అని సంజ్ఞ. అచ్ఛయే ఆచ్ఛికము. కావ్యములందు ప్రయోగించుటకు అర్హము అయిన తెలుగుభాష తత్సమము, తద్భవము, దేశ్యము అని మూడు విధములు. ఇందు తత్సమము. 1. సంస్కృతసమము, 2. ప్రాకృతసమము అని రెండు విధములు. అట్లే తద్భవము. 1. సంస్కృతభవము, 2. ప్రాకృతభవము అని రెండు విధములు. దేశ్య మొక్కవిధము. వీనిలో సంస్కృతసమమును విడిచి పుచ్చగా మిగిలిన – 1. ప్రాకృతసమము 2. సంస్కృతభవము, 3. ప్రాకృతభవము, 4. దేశ్యము అను నాలుగువిధము లైన తెలుగుభాషకు ఆచ్ఛికము అని పేరు. ఇట్లు మొత్తము తెలుగు భాష. 1. సంస్కృతసమము, 2. ఆచ్ఛికము అని రెండు విధము లగుచున్నవి. (శ్రీః – సిరీ) సిరి – ప్రాకృతసమము; (ఆకాశః) ఆకసము– సంస్కృతభవము, (అఙ్గారః – ఇంగాలో) ఇంగలము– ప్రాకృతభవము. ఊరు– దేశ్యము.

సంస్కృతసమేతరము అనుటచే రాముఁడు, విద్య మొద లగుసంస్కృత సమములకు ఆచ్ఛికము అనుసంజ్ఞ లేదు.

'ఈభాష' అనుటచే సంస్కృతసమముకంటె ఇతరములే అయినను సంస్కృతము, ప్రాకృతము మొద లగుఇతరభాషలకు ఆచ్ఛికము అనుసంజ్ఞ లేదు.

**2. ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుఁ గ్లీబసమంబులు నయియుండు.**

**స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును గ్లీబసమత్వాతి దేశంబుచే మువర్ణకంబు నగు నని యెఱుంగునది. అన్న – మిన్న, అద్ద – గద్ద, జాణ – గాణ, ఓడ – గోడ ఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము – నెయ్యము, అల్లము – మొల్లము, సున్నము – సన్నము ఇత్యాదులు క్లీబసమంబులు. తఱుచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులు గొండొక కల**

**వని తాత్పర్యము. కొమరుఁడు - చందురుఁడు - జముఁడు - కందుఁడు ఇత్యాదులు.**

సంస్కృతసమములకంటె ఇతరములు అయినశబ్దములు ఆచ్ఛికములు. స్త్రీలింగముతో సమాన మైనవి స్త్రీసమములు. క్లీబసమములు అనగా నపుంసక లింగముతో సమానము అయినవి. సంస్కృతసమములకంటె వే రయినశబ్దములు తఱుచుగా స్త్రీసమములును, క్లీబసమములును అగును.

అన్న - ప్రస్తుతసూత్రముచే ఇది స్త్రీసమము. కావున 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే సు విభక్తి లోపించి, 'అన్న' అనురూప మేర్పడును, ఇట్లె మిన్న, మున్నగునవి.

బియ్య అనునది ప్రస్తుతసూత్రముచే క్లీబసమము. కావున ప్రథమైకవచనము నందు 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనుసూత్రముచే ముపర్ణకము వచ్చి, 'బియ్యము' అని అగును. ఇట్లె నెయ్యము మొద లగునవి.

కొన్ని శబ్దములు స్త్రీసమక్లీబసములు రెండు నగును, ఏవ, ఏవము మొ.

'ఆచ్ఛికశబ్దంబులు' అనుటచే సంస్కృతమములకు స్త్రీసమత్వము గాని క్లీబసమత్వము గాని లేదు.

'ఎల్లన్' అనుటచే ఆచ్ఛికశబ్దము, స్త్రీసమము, క్లీబసమము లేదా పుంలింగ తుల్యము ఏదో ఒకటి అగునే గాని ఏదియును కాక ఉండదు.

'తఱుచుగ' అనుటచే అరుదుగా పుంలింగతుల్యములు గలవు. పుంలింగ తుల్యములు మహద్వాచకములే అగును. కావున పుంలింగసమత్వముచే (ఉత్వము) డుజ్ మొద మహత్పుంలింగకార్యములు అగును. చందుర - చందురుఁడు.

జాణ - జాణఁడు. ముదుక - ముదుకఁడు మొద లగుకొన్నిశబ్దములు స్త్రీసమములు, పుంలింగతుల్యములు రెండు నయియున్నవి.

**3. బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.**

**మహత్త్వంబున వీని కుత్వడుజాదులు, నమహత్త్వంబున ముపర్ణకాదులు, స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబును గలుగు నని యెఱుంగునది. బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు. బల్లిద - అక్కజ - కావల - బెట్టిద - బెడిద - మిసిమింత - మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు.**

బల్లిద మొద లగుఆచ్ఛికశబ్దములు విశేషణములు. బల్లిద మొద లగు శబ్దములు సంస్కృత (విశేషణ) శబ్దములతో సమాన మైనవి. సంస్కృతతుల్యత్వము

వలన –

(పుంలింగ మగు)విశేష్యమును అనుసరించి బల్లిద మొద లగునవి మహద్వాచకము లైనపుడు, పుంలింగతుల్యత గలుగును. పుంలింగతుల్యత్వముచేత ఉత్వము డుజు మొద లగు(మహత్) పుంలింగకార్యములు కలుగును. రాముఁడు 'బల్లిదుఁడు'.

అట్లే విశేష్యమును అనుసరించి బల్లిద మొద లగునవి అమహత్తు లైనపుడు ముపర్ణకము మొద లగునవి కలుగును. వానివంశము 'బల్లిదము'.

విశేష్యమును అనుసరించి స్త్రీవాచకము లైనచో బల్లిద మొద లగునవి ప్రాతిపదిక లయినను వీనికి 'ఆలు' అనుశబ్దముతో సమాసము కలుగును. ఇవి సంస్కృతతుల్యములు గావున బల్లిద+ఆలు అని యుండగా 'కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు' అనుసూత్రముచేత ఉత్వరుగాగమములు వచ్చి, బల్లిదురాలు అని అగును.

'బల్లిదాదులు' అనుటచే బల్లిద మొద లగువానిలో చేరనిశబ్దము మహదర్థము నందును అమహదర్థమునందును ఒకే రూపముతో నుండును. అంద మైన రాముడు. అంద మైన సీత. అంద మైనలేడి. మిన్న అయినరాముడు, మిన్న అయినసీత మిన్న అగులేడి.

**4. మహత్తు లగుమగాదులకుం గయిరాదులకును దు జగు నుత్వంబు గాదు.**

**మగఁడు – మనుమడు. కయిరఁడు – కత్తళఁడు. మగ – మనుమ – రాయ – పాప – వ్రే – తే. ఈ, కా ప్రత్యయాంతంబులు ఇత్యాదులు మగాదులు. కయిర – కత్తళ – జన్న – నీల ఇత్యాదులు కయిరాదులు.**

స్త్రీతిర్యగ్జడభిన్నములును వానివిశేషణములును మహత్తులు, మగ మొద లగునవి మగాదులు, మనమ, పాప మొ. మగాదులు మహత్తులు. కయిర మొద లగునవి కయిరాదులు. ఇవి అమహత్తులు, మహద్వాచకము లయిన మగ మొద లగు వానికిని, అమహత్తులు అయిన కయిర మొద లగువానికిని ప్రథమావిభక్తి ఏకవచనమున డుజు వచ్చును. కాని ఎల్లవిభక్తులయందును అత్వమునకు రావలసిన ఉత్వము మాత్రము రాదు.

'మగ' అనునది మహత్తు, 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ' అనుసూత్రముచే పుంలింగతుల్యము. కావున 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వమును 'పుంలింగ మగు మహద్వాచకమునకు డు జగు' అనుసూత్రముచేత డుజును వచ్చి, మగుఁడు

అని కావలయును. కాని ప్రస్తుతసూత్రముచేత డుజు మాత్రమె వచ్చి, ఉత్వము రాకుండగా మగఁడు అని అగును. ఇతరవిభక్తులలో మగని మొ.

కయిర అనునది అమహత్తు. ('ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ' అనుసూత్రముచే స్త్రీసమమో లేదా క్లీబసమము కావలెను. స్త్రీసమ మైనచో ప్రథమైకవచనలోపముతో కయిర, అనియు, క్లీబసమ మయినచో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, కయిరము ఇత్యాదిగాను కావలసియుండగా,) ప్రస్తుతసూత్రముచే ప్రథమావిభక్తి ఏకవచనమునందు డుజు వచ్చి, ప్రాతిపదికకు ఉత్వము రాకుండ 'కయిరఁడు' అని అగును. కయిరని మొ.

'మహత్తులు' అనువిశేషణముచే మహత్తులు కానిపక్షమునందు డుజు రాదు. మనుమరాలు, పాప. మొ.

'మగాదులకు' అనుటచే మగాదులలో చేరనిశబ్దమునకు ఈకార్యము (ఉత్వనిషేధము) లేదు. కొమరుఁడు, తమ్ముఁడు మొ.

'కయిరాదులకు' అనుటచే కయిరాదులలో చేరనిఅమహత్తునకు డుజు రాదు. గుఱ్ఱము, ఏనుఁగు మొ.

**5. పగతాదుల బహువచనలకారంబునకు రేఫం బగు.**

**పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు - మార్తురు.**

పగత మొద లగునవి పగతాదులు. ఇవి మహత్తులు. ప్రథమావిభక్తి బహువచన మగు 'లు'వర్ణమునందును, 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' అనుసూత్రముచే చెప్పబడిన'ల'వర్ణమునందును గలలకారము బహువచన లకారము. 'లకారంబునకు' అనుచోటిషష్ఠిచే లకారముస్థానమున అని అర్థము.

పగత మొద లగుశబ్దములకు పైనున్న బహువచనము లైన లు,ల, అనువానియందలి లకారము స్థానమున రేఫము వచ్చును.

'పగత' అనునది పుంలింగతుల్య మగు మహత్తు. కావున 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, పగతు అని కాగా, ప్రథమావిభక్తిబహువచనమున 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణకము వచ్చి, పగతు+లు అని కాగా, ప్రస్తుతసూత్రముచే లకారమునకు రేఫము వచ్చి, పగతురు అని అగును. ఇట్లే ద్వితీయాదివిభక్తులలో 'పగతురను' మొ.

'పగతాదులు' అనుటచే పగతాదులలో చేరనిశబ్దముమీద ఈకార్యము లేదు. కొమరులు, అన్నలు మొ.

'బహువచనలకారంబునకు' అనుటచే ఇతర మగులకారమునకు రేఫము లేదు. పగతులాఘవము మొ.

'అగు' అనుటచే రేఫము నిత్యము. కావున పగతులు, అల్లులు అనువిధముగా రేఫము రానిరూపములు ఉండవు.

**6. కొన్ని డుమంతంబులబహువచనలకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారంబు నగు.**

**గండండ్రు - మిండండ్రు ఇత్యాదులు.**

ప్రథమావిభక్తి ఏకవచనమున డుజ్వర్ణకము నిల్చుటకు అర్హ మైన ప్రాతిపదికమునకు డుమంతము అని పేరు. ప్రథమాబహువచన మగులువర్ణము నందును బహుత్వమున ద్వితీయాదివిభక్తులకు వచ్చినలడాగమలవర్ణమునందు ఉన్నలకారము బహువచనలకారము.

డుమంతములు అయిన కొన్ని ఆచ్ఛికప్రాతిపదికలకు పరముగా ఉన్నబహు వచనములు అగు'లుల'వర్ణములందలి లకారముస్థానమున రేఫము వచ్చును. ఆరేఫమునకు పూర్వమునందు నిండుసున్న ముందు కలిగినడకారము (ండ్) వచ్చిచేరును.

'గండ' అనునది పుంలింగతుల్య మగుమహద్వాచకము. 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము రావలసియుండగా, 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు నుత్వంబు గాదు' అనుసూత్రముచే ఉత్వము రాదు. ప్రథమాబహువచనము నందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, గండ+లు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే లకారమునకు రేఫమును (గండ+రు) దానికి ముందు 'ండ్' అనువర్ణమును వచ్చి (గండ+ండ్+రు) 'గండండ్రు' అని అగును.

'కొన్ని' అనుటచే డుమంతములకు అన్నింటికి ఈకార్యము లేదు. మగలు, మనుమలు మొ.

'డుమంతంబుల' అనుటచేత డుమంతములు కానివానికి ఈకార్యము లేదు. అన్నలు, అయ్యలు మొ.

'పూర్ణబిందుపూర్వక' అనుచోట 'పూర్ణ' అనువిశేషణము స్పష్టతకె. దీనికి తరువాతి దగు 'కాప్రత్యయంబుమీది' అనుసూత్రమునందువలె 'బిందుపూర్వక

డకారంబు' అన్నను ఇబ్బంది లేదు.

'అగు' అనుటచే ఈవిధి నిత్యము. కావున గండలు, మిండలు అనురీతి రూపము లుండుటకు అవకాశము లేదు.

**7. కాప్రత్యయము మీఁదిబహువచనలకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకుముందు బిందుపూర్వకడకారంబు నగు.**

**విలుకాండ్రు-విలుకాఱు. వేటకాండ్రు-వేటకాఱు. వేడుకకాండ్రు- వేడుకకాఱు.**

'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థమునం దాటాదుల కగు' మొద లగుసూత్రములచే 'కా' అనునది తద్ధితప్రత్యయముగా చెప్పబడినది. సాధురేఫము (ర) లఘురేఫము. శకటరేఫము (ఱ) అలఘురేఫము. ప్రథమా బహువచన మగులువర్ణమునందును, బహుత్వమునందు ద్వితీయాదివిభక్తులకు ఆగమముగా వచ్చిన లవర్ణమునందును ఉన్నలకారము బహువచనలకారము.

'కా' అనుతద్ధితప్రత్యయమునకు పై నున్నబహువచనము లయిన 'లుల' అనువానియందలిలకారమునకు ఒకపర్యాయము సాధురేఫమును, ఒకపర్యాయము శకటరేఫమును వచ్చును. సాధురేఫము వచ్చినపుడు దానికి పూర్వమునందు నిండుసున్న ముందు కలిగినడకారము (ండ్) చేరును.

'విలుకా' అనుప్రాతిపదికపై ప్రథమాబహువచనమునందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, విలుకా+లు అని యుండగా ఈసూత్రముచే బహువచనలకారమునకు అలఘురేఫము రాగా 'విలుకాఱు' అని అగును. సాధురేఫము వచ్చినచో విలుకా+రు అనుచోట ఈసూత్రముచేతనే రేఫమునకు ముందు 'ండ్' వర్ణము చేరి, 'విలుకాండ్రు' అని అగును.

'కాప్రత్యయము' అని సామాన్యముగా చెప్పుటచే అమహత్తులకు వచ్చిన కాప్రత్యయము మీదను ఈకార్యము కలుగును. కొమ్ముకాఱు, కొమ్ముకాండ్రు.

'కాప్రత్యయముమీఁది' అనుటచే ఇతర మగుప్రత్యయముమీద ఈకార్యము లేదు. మన్నీలు మొ.

'బహువచన'(లకారమునకు) అనుట స్పష్టతకే. బహువచనము కానిలకారము కాప్రత్యయముమీద ఉండదు.

'లఘురేఫంబునకు ముందు' అనుటచే అలఘురేఫము వచ్చినపుడు బిందుపూర్వకడకారము రాదు. కావున విలుకాఱు అనియే ఉండును. (విలుకాండ్ఱు అని ఉండదు.)

లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారము నిత్యము. కావున

బిందుపూర్వకడకారము రాని 'విలుకారు' అనురూపము ఉండదు.

'బిందుపూర్వకడకారము' అనుచో బిందువు అని సామాన్యముగా చెప్పుటచే అరసున్న ముం దున్నడకారమును రావచ్చును. కాని అపుడును 'విలుకాఁడ్రు అని ఉండగా 'సమాసపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండ బిందునకుం బూర్ణం బగు' అనుసూత్రముచేత అరసున్నకు నిండుసున్న వచ్చి 'విలుకాండ్రు' అనియె అగును. కావున విలుకాఁడ్రు అని అరసున్నతోడిరూపము ఉండదు.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున 'విలుకాలు, విలుకాలను' అనురీతిగా బహువచనలకారమునకు రేఫము రానిరూపములు ఉండవు.

**8. తేప్రభృతులబహువచనమునకు ముందు డు జగు.**

**తేఁడులు - తేండ్లు.**

తే మొద లగుశబ్దములకు పరముగా ఉన్న బహువచనప్రత్యయమునకు ముందు 'డుజ్' అనునది వచ్చును. 'డుజ్' అనుచో జకారము ఇత్తు. డువర్ణము జిత్తు. కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే డువర్ణమునకు ముందు సున్న వచ్చును.

'తే' అనుప్రాతిపదికకు ప్రథమాబహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, తే+లు అని ఉండగా ప్రస్తుత సూత్రముచే లువర్ణమునకు ముందు 'డుజ్' వచ్చును. 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే డువర్ణమునకు ముందు అరసున్న రాగా, తేఁడులు అని అగును. బిందువు అనుటచే నిండుసున్నయు రావలసియుండగా 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనుసూత్రముచే రాదు. కావున తేండులు అని కాదు.

'తేప్రభృతుల' అనుటచేత 'తే' మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈ కార్యము లేదు. వ్రేలు - వ్రేఁడులు అని కాదు.

'బహువచనమునకు ముందు' అనుటచేత ఏకవచనమునందు ఈకార్యము లేదు. (తేఁడు) తేనిని, తేనిచేత మొ.

**9. కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణకం బగు.**

**కూఁతురు - కూఁతులు. కూఁతురుల, కూఁతుళ్లు, కూఁతురి నిత్యాది రూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది.**

కూఁతు అనుశబ్దమునకు ప్రథమావిభక్తి ఏకవచనమున 'రు' అనుప్రత్యయము వచ్చును.

'కూఁతు' అనునది ప్రాతిపదిక. దీనిపై ప్రథమావిభక్తి ఏకవచనమును వివక్షింపగా ప్రస్తుతసూత్రముచే రువర్ణము వచ్చి, 'కూఁతురు' అని అగును.

'కూఁతుశబ్దము' అనుటచే ఇతరశబ్దములకు రువర్ణము రాదు. కొమారిత.

'ప్రథమా' అనుటచే ఇతరవిభక్తులలో 'కూఁతు' శబ్దమునకు రువర్ణము రాదు. కూఁతును, కూఁతునందు మొ. కూఁతురును, లేదా కూఁతురిని అని కాదు.

'ఏకవచనంబునకు' అనుటచే ప్రథమావిభక్తియందును బహువచనమున రువర్ణము రాదు. కూఁతులు. కూఁతురులు, లేదా కూఁతుళ్లు అనువిధముగా బహువచనమునందు రువర్ణము చేయుట లక్షణమునకు విరుద్ధము.

ఏకవచనమున నిత్యము. కావున రువర్ణకము లేకుండ 'కూఁతు' అని ఉండదు.

**10. చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు.**

**చెయువుఱు - చెయువులు. చెయువుఱను - చెయువులను.**

ప్రథమాబహువచనము అయినలువర్ణమునందును, బహుత్వమున ద్వితీయాది విభక్తులకు వచ్చినలడాగమలవర్ణమునందును ఉన్నలకారము బహువచన లకారము. శకటరేఫము (ఱ) అలఘురేఫము.

చెయువు అనుశబ్దముపై నున్న బహువచన మగు లు, ల అనువర్ణములం దున్నలకారముస్థానమున శకటరేఫము వికల్పముగా ఆదేశముగా వచ్చును.

చెయువు అనుశబ్దముపై ప్రథమావిభక్తి బహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, చెయువు+లు అని యుండగా ప్రస్తుతసూత్రముచే అందలిలకారమునకు శకటరేఫము వచ్చి, 'చెయువుఱు' అని అగును.

'విభాష' అనుటచే ఒకపక్షమునందు అలఘురేఫము రాక, 'చెయువులు, చెయువులను' అనుతీరుగా లకారము అట్లే ఉండును.

'చెయువు' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు. కాయువులు కాయువులకు.

'బహువచనలకారంబునకు' అనుటచే 'చెయువులాభము' మొద లగుచోట్ల ఇతర మైనలకారమునకు ఈకార్యము లేదు. 'చెయువులలోపల' అనుచో లోపల అనునది బహువచనమె అయినను లడాగమమువలన 'లోపల' ప్రత్యయము లోనిలకారమునకు అలఘురేఫము రాదు.

'అలఘురేఫంబు' అనుటచే లఘురేఫ కాని, ఇతరవర్ణము కాని రాదు. కావున చెయువురు ఇత్యాదిగా రూపములు ఉండవు.

**11. ఆల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు.**

**ఆండ్రు - ఆండ్రను, ఆలు - చెలియలు - చెల్లెలు - కోడలు - మఱఁదలు- ఇవి యాల్వాదులు.**

ఆలు మొద లగునవి ఆల్వాదులు, ఆలు, చెలియలు చెల్లెలు, కోడలు మరదలు అనుఅయిదుశబ్దములు మాత్రమె ఆల్వాదులు. ఇవి ఆల్వాదులు అనుటచే ఈ అయిదింటికంటె వే రయినశబ్దము అల్వాదులలో ఉండదు. ప్రథమాబహువచన మగు'లు'వర్ణమునందును, బహుత్వమునందు ద్వితీయాదివిభక్తులకు వచ్చిన లడాగమమునందును ఉన్నలకారము బహువచనలకారము. ఆలు మొద లగు శబ్దములకు పరముగా నున్న బహువచనము లగు 'లుల' అనువానియందలి లకారముస్థానమున రేఫము ఆదేశముగా వచ్చును. ఆలు మొద లగుశబ్దములందు చివర ఉన్న 'లు' వర్ణముస్థానమున సున్న ముందు గలిగినడకారము (ండ్) ఆదేశముగా వచ్చును.

ఆలు అనుశబ్దముపై ప్రథమాబహువచనమున 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, ఆలు+లు అగును. పిదప ప్రస్తుతసూత్రముచే బహువచనలకారమునకు రేఫము వచ్చి (ఆలు+రు), ముం దున్న లువర్ణమునకు 'ండ్' అనునది ఆదేశము కాగా, ఆండ్+రు - ఆండ్రు అని అగును. ఇట్లే ఆలు + లను - ఆండ్రను మొ.

'ఆల్వాదుల' అనుటచేత 'ఆలు' మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈ కార్యము లేదు. కాలులు - కాండ్రు అని కాదు.

'రేఫంబును, డకారంబును' అనుచోటిసముచ్చయార్థక మగు'ను'శబ్దములచేత ఈకార్యములు రెండును కలిసియే వచ్చును. కావున రేఫము మాత్రమె వచ్చిన 'ఆలురు' అనువిధ మైనరూపములు గాని, బిందుపూర్వకడకారము మాత్రమే వచ్చిన 'ఆండ్లు' అనువిధ మైనరూపములు గాని ఉండవు.

'బిందుపూర్వక' అనుచో బిందు వని సామాన్యముగా చెప్పుటచే ఖండబిందువు వచ్చినను (ఆఁడ్రు) 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందువునకుం బూర్ణం బగు' అనుసూత్రముచే దానికి నిండుసున్న వచ్చి 'ఆండ్రు' అని అగును. కావున 'ఆఁడ్రు' అనువిధ మైనరూపములు ఉండవు.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున ఆలులు (ఆళ్లు) అనువిధముగా ఈకార్యము రానిరూపములు ఉండవు.

**12. బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.**

**గుండ్లు – గుండులు. గిండ్లు – గిండులు. కాళ్ళు – కాలులు. మొసళ్లు– మొసలులు. గొంట్లు – గొంటులు. తుంట్లు – తుంటులు. గోర్లు – గోరులు. సీవిర్లు – సీవిరులు, బహుళగ్రహణముచే విల్లులు, పిల్లులు, పులులు ఇత్యాదులందు లోపంబు లేదు. తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు. కోట్లు – కోటులు. పిప్పళ్ళు – పిప్పలులు.**

బహువచనము పరముగా నున్నపుడు అచ్చికములు అయిన ప్రాతిపదికలకు చివర ఉన్న 'డు, లు, టు, రు' అనుఅక్షరములయందలి హ్రస్వ మైనఉకారమునకు బహుళముగా లోపము వచ్చును.

'గుండు' శబ్దముపై ప్రథమాబహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, గుండు+లు అని యుండగా ప్రస్తుతసూత్రముచేత డువర్ణమునందలిఉత్వము లోపించి, గుండ్లు అని అగును. బహుళము కావున ఉత్వము లోపింపనిపక్షమునందు 'గుండులు' అనియె ఉండును. బహుళశబ్దముచే ఇట్టిచోట్ల విభాష.

'డలటరల' అనుచోటిలకారముచే అలఘులకారమును, 'ర' అనువర్ణముచే అలఘు వైనరేఫమును గ్రహింపబడును. కావున అలఘువు లైన ళ, ఱ లయందును ఉత్వమునకు లోపము బహుళముగా వచ్చును. ఏఱులు – ఏర్లు, కాఱులు–కార్లు, ఏళులు–ఏళ్లు, ఊళులు–ఊళ్లు మొ.

విల్లులు, పులులు మొద లగుకొన్నిచోట్ల లోపము లేదు. కావున విళ్లు, పుళ్లు అనురీతిరూపములు ఉండవు. బహుళపదముచే ఇట్టిచోట్ల అప్రవృత్తి.

కోటి, పిప్పలి అనుశబ్దములు అచ్చికములు కాకున్నను లోపము వచ్చుచున్నది. కోటి+లు – కోట్లు, పిప్పలి+లు – పిప్పళ్లు. బహుళపదముచే ఇచట అన్యకార్యము.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు ఈకార్యము లేదు. త్రాడు, కాలు, గాటు, పేరు, మొ. ఇచట త్రాడ్ ఇత్యాదిగా ఉత్వమునకు ఈసూత్రముచే లోపము రాదు.

'డలటరల' అనుటచే ఇతరవర్ణములందు లోపము రాదు. మేకులు, రాగులు త్రాఁచులు మొ.

'ఉత్వంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు లోపము రాదు. మాడలు, కోడెలు, జోలలు, జోలెలు మొ.

**13. బహువచనము పరం బగునపు దసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలరల కలఘులకారంబు బహుళంబుగా నగు.**

**త్రాళులు - త్రాడులు. గుమ్మళులు - గుమ్మడులు, మొగిళులు - మొగిలులు, పిడికిళులు - పిడికిలులు, ఊళులు - ఊరులు, పందిళులు - పందిరులు.**

అసంయుక్తము అనగా వే రొకహల్లుతో కూడియుండనిది. హ్రస్వ మైనఉకారము చివర గలది ఉదంతము. అలఘులకారము 'ళ' అనురూపమున ఉండును.

వే రొకహల్లుతో కూడనివియు, హ్రస్వ మగుఉకారము చివర కలవియు అయిన, డకారము, లకారము, రేఫము అనుహల్లులకు బహువచనము పరముగా నున్నపుడు అలఘు వైనళకారము బహుళముగా ఆదేశముగా వచ్చును.

త్రాడు శబ్దముపై ప్రథమాబహువచనవివక్షయందు 'లువర్ణంబు బహు వచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, త్రాడు+లు అని ఉండగా, ప్రస్తుత సూత్రముచే డకారముస్థానమున అలఘువు అయినళకారము వచ్చి, త్రాళులు అని అగును. 'బహుళము' అనుటచే ళకారము రానపుడు 'త్రాడులు' అనియే ఉండును. ఇట విభాష.

'డలరలకు' అనుచోటిలఘురేఫముచే అలఘువు గ్రహింపబడును. ఏఱులు- ఏళులు మొ. ఇచట విధింపబడినది అలఘులకారమే. కావున అనగా, ఈసూత్రము ప్రవర్తించినపిదపనే అలఘులకారము ఉండును. కావున సూత్రము నందలిలఘులకారముచే అలఘులకారము గ్రహింపబడదు.

దోపిడులు, గాలులు, విరులు ఇత్యాదులలో ఈకార్యము లేదు. బహుళ మనుటచే ఇట్టిచోట్ల అప్రవృత్తి.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు ళకారము రాదు. త్రాడు, కాలు, పేరు, మొ.

'అసంయుక్తంబు లయి' అనుటచే వే ఱొకహల్లుతో కూడిన డలరలకు ళకారము రాదు' గ్రుడ్డులు కఱ్ఱులు మొ.

'ఉదంతంబు లయిన' అనుటచేత ఉదంతములు కానివానికి ఈకార్యము లేదు. మాడలు, కోడెలు, జోలలు, జోలెలు, బారలు, గారెలు మొ.

'డలర'కు అనుటచే డలరలకంటె వే రయినవర్ణములుకు ఈకార్యము లేదు. మేకులు, రాగులు, ప్రేటులు, మొ.

'అలఘులకారంబు' అనుటచే ఇతరవర్ణము (వర్ణాంతర మైనళకారము, లేదా లఘులకారము మొ.) రాదు. త్రాలులు, ఊలులు మొద లగురీతిని కాదు.

**14. బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు.**

**త్రాళ్లు – గుమ్మళ్లు – మొగిళ్లు – విళ్లు – సిళ్లు.**

బహువచనశ్లిష్టములు అనగా బహువచనము (లు, ల) లతో సంయోగమును చెందినవి. అద్విరుక్తము లనగా ద్విత్వము లేనివి.

బహువచనము పర మయినపుడు డు,లు అనువర్ణములందలిఉత్వము లోపించుటచే మీద నున్నబహువచనముతో కలిసిన డకారముయొక్కయు, (లఘువును, అలఘువును ఐన)లకారముయొక్కయు స్థానమున అలఘువు అయిన 'ళ'కారము నిత్యముగా ఆదేశముగా వచ్చును.

త్రాడు అనుశబ్దముపై ప్రథమాబహువచనమును 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే 'లు' వచ్చి, త్రాడు+లు అని యుండగా 'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అను సూత్రముచే ఉత్వము లోపించి, 'త్రాడ్లు' అని కాగా ప్రస్తుతసూత్రముచే డకారమునకు ళకారము వచ్చి, త్రాళ్+లు – త్రాళ్లు అని అగును.

ఇట్లే మొగిలు+లు – మొగిల్+లు – మొగిళ్+లు –మొగిళ్లు మొ.

'బహువచనశ్లిష్టంబు లయి' అనుటచే ఉత్వలోపము లేక, బహువచనముతో సంయుక్తము కానపుడు డకారలకారములకు ళకారము నిత్యము కాదు. 'బహువచనము పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతంబు లయిన డలరల కలఘులకారంబు బహుళంబుగ నగు' అనుసూత్రముచే బహుళముగా వచ్చును. త్రాళులు, త్రాడులు. ఇట్లే మొగిళులు, మొగిలులు. మొ.

'అద్విరుక్తంబు లయిన' అనుటచే ద్విత్వముతో కూడిన'డల' లకు ళకారము రాదు. గ్రుడ్డు+లు – గ్రుడ్లు. గ్రుళ్లు అని కాదు.

'డకారలకారంబులకు' అనుటచే ఇతర మగువర్ణమునకు ఈకార్యము లేదు. పేరులు, పేర్లు. (పేళులు అనుదానినుండి పేళ్లు అని అగును.)

'నిత్యంబుగ' అనుటచే ళకారము తప్పకుండ వచ్చును. కావున త్రాడ్లు, మొగిల్లు, అనువిధముగా ళకారము రానిరూపములు ఉండవు.

**15. సమానపదంబునందు సంయోగము పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు.**

**అనఁటులు – అనంట్లు. పనఁటులు – పనంట్లు. గోఁటులు – గోంట్లు. తేఁటులు – తేంట్లు. ఏఁడులు – ఏండ్లు. కాఁడులు – కాఁడ్లు.**

**ఏండ్లు, కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి. తెనుఁగున బిందుపూర్వకస్థిరము లేమింజేసి, యది గ్రాహ్యంబు గాదు.**

సమానపదము అనగా ఒక్కటి అయినపదము, సంయోగము అనగా అనేకము లగుహల్లుల కలయిక.

ఒకే పదమునందు సంయుక్తాక్షరము పరముగా ఉన్నపుడు దానికి పూర్వము నందు ఉన్నఅరసున్నకు అన్నిచోట్లను నిండుసున్న నిత్యముగా వచ్చును.

అనఁటి శబ్దముపై ప్రథమాబహువచనమున 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణము వచ్చి, అనఁటి+లు, 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అనఁటు+లు. 'బహువచనము పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ఉత్వము లోపించి, అనఁట్లు అని కాగా 'హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగా నగు' అనుసూత్రముచే నిండుసున్న వికల్పముగా రావలసియుండగా ప్రస్తుతసూత్రముచే నిత్యముగా వచ్చి, 'అనంట్లు' అని యగును.

'సమానపదంబునందు' అనుటచే వేరొకపదముమొదటిసంయుక్తాక్షరము, పర మగునపుడు ముందరిఅరసున్నకు నిండుసున్న రాదు. నాతోఁ బ్రారంభము – నాతోం బ్రారంభము అని కాదు.

'సంయోగంబు పరం బగునపుడు' అనుటచే అసంయుక్తము పర మయినచోట అరసున్నకు నిండుసున్న రాదు. అనఁటులు, తేఁటులు.

'ఎల్లచో' అనుటచే ఈసూత్రముచే అగుపూర్ణబిందువు సాధ్యపూర్ణమె అయినను దీర్ఘముమీద గూడ వచ్చును. తేఁటులు అని యుండగా ఉత్వము లోపించి, 'తేఁట్లు' అని కాగా ప్రస్తుతసూత్రముచే వచ్చుపూర్ణబిందువు 'ఎల్లచో' అనుదళముచే 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనులక్షణమును బాధించి వచ్చును. తేంట్లు.

మాఁడుచు – మాడ్చు మొద లగుకొన్నిచోట్ల నిండుసున్న రాక, అరసున్నయు లోపించుచున్నది.

'అగు' అనుటచే పూర్ణబిందువు నిత్యము. కావున అనఁట్లు, తేఁట్లు అను విధముగా నిండుసున్న రానిరూపములు ఉండవు.

**16. ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు.**

**కొడవలి - కొడవండులు. ఉల్లోపంబు. కొడవండ్లు. పక్షంబునం దలఘులకారంబు. కొడవళులు, కొడవళ్లు, కొడవలులు. రోఁకలి ప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది. ఇల్లు-ఇండులు-ఇండ్లు-ఇల్లులు. ఇట్లు కల్లు ముల్లు విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది. మద్యనిమ్నార్థకంబు లయిన కల్లు, పల్లు శబ్దంబులును తెల్లుప్రభృతిశబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.**

'ఇ, టి, తి' అనునవి ఔపవిభక్తికములు. ఇవి చేరుటకు అర్హము అయిన ప్రాతిపదికలకును ఔపవిభక్తికములు అని పేరు. లకారముతో కూడినలువర్ణము (ల్లు) సలలువర్ణము. బహువచనము పరముగా ఉన్నపుడు ఔపవిభక్తికములు అయినశబ్దములయొక్క చివర ఉన్న 'లి'వర్ణముస్థానమునను, 'ల్లు'వర్ణము స్థానమునను నిండుసున్న ముం దున్నడువర్ణము (ండు) బహుళముగా ఆదేశముగా వచ్చును.

'కొడవలి' అనుశబ్దమునకు ప్రథమాబహువచనమునందు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే 'లు'వర్ణకము వచ్చి, కొడవలి+లు అని యుండగా ప్రస్తుతసూత్రముచే 'లి'వర్ణముస్థానమున 'ండు' వర్ణము ఆదేశముగా వచ్చి 'కొడవండులు' అని అగును. 'బహువచనము పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచేత ఉత్వము లోపించి, 'కొడవండ్లు' అని అగును. బహుళము గావున ఉల్లోపము రానిచో 'కొడవండులు' అని అగును. 'ండు' వర్ణము వచ్చుటయు బహుళము కావున కొడవలి+లు అనుచో 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, కొడవలులు అని అగును. ఇట్లే ఇల్లు - ఇండులు - ఇండ్లు మొ. ఇట్టిచోట్ల విభాష.

'ఔపవిభక్తికంబుల' అనుటచే ఔపవిభక్తికములు కాని, పులి, తెల్లు మొదలగుశబ్దములలో లివర్ణ, సలలువర్ణమునకు 'ండు' వర్ణము రాదు. పులులు, తెల్లులు. ఇచట పుండులు, తెండులు అని కాదు.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు 'ండు' వర్ణము రాదు. కొడవలిని, ఇంటిని మొ.

'పూర్ణబిందు' అనుటచే అరసున్న ముం దున్నడువర్ణము రాదు. కావున కొడవఁడులు అనువిధ మయినరూపములు ఉండవు.

**17. ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు.**

**కొడవండ్లులు – కొడవళ్లులు. కొడవండ్లులను – కొడవళ్లులను. ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.**

నామంబు అనగా ప్రాతిపదికము. 'లువర్ణంబు బహువచనంబు'. సంయుక్తము అయిన బహువచనము చివర గలది సంశ్లిష్టబహువచనాంతము.

కొన్ని శబ్దములు ప్రాతిపదికము చివరిహల్లు 'లు' అనుబహువచనముతో సంయోగము చెందినరూపముతో సమాన మయినరూపమును పొంది పిదప బహువచనమును పొందును.

కొడవలి అన్నది ప్రాతిపదిక. దీనిచివరిహల్లు బహువచనలువర్ణముతో సంయోగము చెందినరూపము 'కొడవండ్లు – కొడవళ్లు' అని ఉండును. 'కొడవలి' అనుప్రాతిపదికము ప్రస్తుతసూత్రముచేత సంశ్లిష్టబహువచనాంతము అయిన కొడవండ్లు లేదా కొడవళ్లు అనురూపమును పొంది, దానిపయి బహువచనము కలుగును. ప్రథమావిభక్తిని వివక్షించినపుడు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, కొడవండ్లులు. ఇట్లే ద్వితీయాదులలో కొడవండ్లులను మొ.

'నామంబు' అనుటచే కొడవలి అనురీతి ప్రాతిపదికమే కొడవండ్లు అనురీతి రూప మందును. కావున 'కొడవండ్లు' అనునది ప్రాతిపదికమే.

'సంశ్లిష్టబహువచనాంతతుల్యము' అనుటచే 'కొడవండులు, కొడవళులు' అను రీతిగా బహువచనముతో సంయోగము చెందనిరూపము కలుగదు. కావున 'కొడవండులులు' అనురీతిరూపములు ఉండవు.

'సంశ్లిష్టబహువచనాంత' అనుటచే కొండవండ్లను, అనువిధ మైనరూపము కలుగదు. చివర నున్ననువర్ణము బహువచన మైనను సంశ్లిష్టత చివర లేదు. కావున 'కొడవండ్లనులు' అనురీతిరూపములు కలుగవు.

'తుల్యంబు' అనుటచే సంశ్లిష్టబహువచనాంతముతో సమాన మైనదే కాని 'సంశ్లిష్టబహువచనాంతము కాదు. కావున ఇచ్చటి 'కొడవండ్లు' అనునది పదము కాదు.

'బహువచనంబు' అనుటచే సంశ్లిష్టబహువచనాంతతుల్య మగునామముపై బహువచనమే కాని ఏకవచనము రాదు. కొడవండ్లును, కొడవండ్లుచేత అనువిధ మైన ఏకవచనాంతరూపము లుండవు.

**18. కలన్వాదులనువర్ణంబు కు జగు, బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు.**

**కలఁకు – కలను. కలఁకులు. కలను – కెలను – కొఱను – కొలను– గవను – నెఱను – మ్రాను – వరను – వలను. ఇవి కలన్వాదులు.**

కలను మొద లగునవి కలన్వాదులు. ఈశబ్దములు అన్నిటియందును చివర నువర్ణము కలదు. కలను మొద లగుశబ్దములలో చివరనున్న 'ను' వర్ణముయొక్క స్థానమున 'కుజ్' అనునది ఆదేశముగా వచ్చును. బహువచనము పరముగా నున్నపుడు కుజు నిత్యముగా వచ్చును. బహువచనమునందు నిత్యము అనుటచే ఏకవచనమునందు అనిత్యము. కుజులో జకారము ఇత్తు. జకారము ఇత్తుగా కలది కావున కువర్ణము జిత్తు. 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే ఈకువర్ణమునకు పూర్వమునందు అరసున్నయు, నిండుసున్నయును వచ్చును.

'కలను' అనుశబ్దమునకు 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, కలను+లు అని ఉండగా ఈసూత్రముచే నువర్ణముయొక్క స్థానమునందు కుజు వచ్చి, కలను+లు అని కాగా, 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే నువర్ణమునకు ముందు అరసున్న వచ్చిన, 'కలఁకులు' అని అగును. నిండుసున్న వచ్చినచో 'కలంకులు' అని అగును.

ఏకవచనమునందు అనిత్యము. కావున ఏకవచనములో కుజు రానిరూపమును ఉండును. కలఁకు – కలను మొ.

'కలన్వాదుల' అనుటచే కలను మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈకార్యము రాదు. కౌను–కౌనులు మొ.

'నువర్ణంబు' అనుటచే ఇతరవర్ణమునకు ఈకార్యము రాదు. కలఁకు.

'బహువచనము పరం బగునపుడు' నిత్యము అనుటచే బహువచనమందు కలనులు, గవనులు అనువిధముగా కుజు రానిరూపములు ఉండవు. ముసలి 'మానులు' అనురీతిప్రయోగములు విశేషస్థలములు.

**19. అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గు జగు.**

**రేఁగు – రేను – రేఁగులు. గోఁగు – గోను – గోఁగులు.**

రేను, గోను అనుశబ్దములయందలి 'ను'వర్ణముయొక్క స్థానమున 'గుజ్' అనునది ఆదేశముగా వచ్చును. 'అట్లు' అనుటచే 'కలన్వాదులనువర్ణంబు కు జగు బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు' అనుపూర్వసూత్రమును అనుసరించి బహువచనము పర మయినపుడు నిత్యము. ఏకవచనమునందు

అనిత్యము. గుజులో జకారము ఇత్తు. అందుచే గువర్ణము జిత్తు. కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే ముందు సున్న వచ్చును.

'రేను' అనుశబ్దముపై ప్రథమాబహువచనమునందు 'లువర్ణంబు బహు వచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, రేను+లు అని ఉండగా ప్రస్తుత సూత్రముచే నువర్ణముయొక్క స్థానమునందు గుజు వచ్చి, (రే+గు+లు) 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే గువర్ణమునకు పూర్వమునందు అరసున్న వచ్చి 'రేఁగులు' అని అగును. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనుసూత్రముచే నిండుసున్న రాదు. కావున రేంగులు, గోంగులు అని కాదు.

'అట్లు' అనుటచే కలన్వాదులకుజువలెనె ఈగుజు కూడ బహువచనము పర మైనపుడు నిత్యము. కావున రేనులు, గోనులు అనువిధముగా బహువచనమునందు గుజు రానిరూపములు ఉండవు. అట్లే ఏకవచనమునందు గుజు అనిత్యము. కావున 'గుజ్' వచ్చినచో 'రేఁగు' అనియు, రానిచో 'రేను' అనియు ఉండును. అట్లే గోఁగు, గోను.

'రేను గోనుశబ్దముల' అనుటచే వే రొకశబ్దమునకు ఈకార్యము లేదు. కౌను-కౌనులు మొ.

'నువర్ణంబు' అనుటచే ఇతరవర్ణము లట్లె యుండును.

**20. బహువచనము పరం బగునపుడు చేను పేను మీనుశబ్దంబుల నువర్ణంబు లోపించు.**

**చేను - చేలు. పేను - పేలు. మీను - మీలు.**

బహువచనము (లు, ల) అనునవి పరముగా ఉన్నపుడు, చేను, పేను, మీను, అనుమూడుశబ్దములలోను చివర ఉన్న'ను'వర్ణమునకు లోపము వచ్చును.

చేను అనుశబ్దముపై ప్రథమాబహువచనమునందు 'లువర్ణంబు బహు వచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, 'చేను+లు' అని యుండగా ప్రస్తుత సూత్రముచే 'నువర్ణము' లోపించి, 'చేలు' అని అగును. ఇట్లే ఇతరవిభక్తులలో బహువచనమునందు - చేను + లను - చేలను. మొ.

'బహువచనము పరం బగునపుడు' అనుటచే ఏకవచనమునందు ఈలోపము లేదు. చేను, పేనిని, మీనునకు మొ.

'చేను పేను మీను శబ్దంబుల' అనుటచే ఈమూడింటికంటె ఇతర మైన శబ్దములకు ఈకార్యము లేదు. కౌనులు మొ. 'కౌలు' అనురీతిగా 'ను' లోపించినరూపములు ఉండవు.

'నువర్ణంబు' అనుటచే మిగిలినవర్ణములు అట్లే ఉండును. చేలు, పేలు, మీలు

'లోపించు' అనుటచే ఈలోపము నిత్యము. కావున చేనులు, మీనులు, అనువిధముగా బహువచనమున నువర్ణము లోపింపనిరూపములు ఉండరాదు.

**21. బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుది యక్షరంబు లోపించు.**

**రేయి-రేలు, ఊయి-ఊలు, వేయి-వేలు, వ్రాయి-వ్రాలు. ఇత్యాదులు. ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు. రేరాజు, మగఊపతకము, వేవెలుగు.**

బహువచనము (లు, ల) పరముగా ఉన్నపుడు రేయి మొద లగుశబ్దములలోని చివరిఅక్షరమునకు లోపము వచ్చును.

రేయి అనుశబ్దమునకు ప్రథమావిభక్తిబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అనుసూత్రముచే లువర్ణకము వచ్చి, రేయి+లు అని కాగా ప్రస్తుతసూత్రముచే 'యి' వర్ణము లోపించి, 'రేలు' అని అగును. ఇట్లే రేలను మొ.

'బహువచనంబు పరం బగునపుడు' అనుటచేత ఏకవచనమునందు ఈలోపము లేదు. రేయి, జాతిని మొ. కాని సమాసమునందు గలుగుట విశేషము. రే(యి)రాజు, మగఊ(యి)పతకము.

'రేయిప్రభృతుల' అనుటచే రేయి మొద లగువానిలో చేరనిశబ్దమున ఈలోపము లేదు. ప్రోయి-ప్రోయులు, కూయి-కూయులు మొ.

'అక్షరంబు' అనుటచే అచ్చుతో గూడినహల్లు మొత్తము లోపించును. 'తుది' శబ్దముచే ఇతర మైనఅక్షరము లోపింపదు. రేలు.

'లోపించు' అనుటచే లోపము నిత్యము, కావున రేయిప్రభృతులకు రేయులు అనువిధముగా యివర్ణము లోపింపనిరూపము ఉండదు.

రే, వే అనుఏకాక్షరశబ్దము లున్నను, రేయి, వేయి శబ్దములనుండి రేయులు వేయులు అనురూపములు వారించుటకు వానిని ఇందు చేర్చెను.

**22. బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులతుది యక్షరంబునకు లోపంబు విభాష నగు.**

**ఆవు-ఆలు-ఆవులు, జాము-జాలు-జాములు. చుట్టము-చుట్టలు-చుట్టములు. మీసము-మీసలు-మీసములు.**

బహువచనము (లు, ల) పరముగా ఉన్నపుడు అవు మొద లగుశబ్దములలో చివరిఅక్షరమనకు వికల్పముగా లోపము వచ్చును.

'ఆవు' అనుశబ్దముపై ప్రథమావిభక్తిబహువచనమునందు 'లువర్ణంబు బహు వచనంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, ఆవు+లు అని ఉండగా ప్రస్తుత సూత్రముచే వువర్ణము లోపించి, 'ఆలు' అని అగును. 'విభాష' కావున లోపము రానిపక్షమునందు 'ఆవులు' అని యుండును.

'బహువనంబు పరం బగునపుడు' అనుటచేత ఏకవచనమునందు లోపము లేదు. ఆవు, ఆవును మొ.

'ఆవుప్రభృతుల' అనుటచే ఆవు మొద లగువానిలో చేరనిశబ్దమునందు ఈలోపము లేదు. ప్రేవులు, వేసములు, మొ.

'తుదియక్షరంబునకు' అనుటచే ఇతరస్థలములం దున్నఅక్షరములకు లోపము లేదు. మీసము - మీసలు మొ.

'అక్షరంబునకు' అనుటచేత అచ్చుతో గూడినహల్లు మొత్తము లోపించును.

**23. ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు.**

**కన్నియ - కన్నె. జన్నియ - జన్నె. వన్నియ - వన్నె. కొంచియము- కొంచెము. కొండియము - కొండెము. బహుళగ్రహణముచే సందియము కాఱియ మొద లగుశబ్దములం దెత్వము లేదు. ఇయ శబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి. ముత్తియము - ముత్తెము - ముత్యము.**

నామము అనగా ప్రాతిపదికము. ఇచట ఆదేశ మయిన 'ఎ' వర్ణము ఏకాల్లు (ఒకేవర్ణము) 'అలో ఽన్త్యస్య అనుపాణినీయపరిభాషను అనుసరించి చివరి వర్ణమునకు మాత్రమె ఆదేశముగా వచ్చును. అయినను 'ఇయకు మాఱుగా' అనుటచేత 'ఇయ' అనుభాగము మొత్తముస్థానమున ఆదేశముగ వచ్చును.

ప్రాతిపదికము చివర ఉన్న 'ఇయ' అనుభాగమునకు బదులుగా అనగా 'ఇయ' అనురెండక్షరములస్థానమునను 'ఎ' అనునది బహుళముగా ఆదేశముగా వచ్చును. బహుళము అనుటచే ప్రవృత్తి అప్రవృత్తి, విభాష, అన్యకార్యము అను నాలుగువిధములుగా అగుటకు అవకాశము కలదు.

ప్రవృత్తి : కొన్ని శబ్దములలో ఇయకు ఎత్వము నిత్యముగా వచ్చును. బల్లియము బల్లెము, ఇట బల్లియము అనుచో 'ఇయ' చివర గలరూపములు

కానరావు.

అప్రవృత్తి: సందియము, కాఱియ, సకియ, చెలియ మొద లగుశబ్దములలో 'ఇయ' అనుదానికి ఎత్వము రాదు. కావున సందెము, కాఱె అనువిధ మయిన రూపములు ఉండవు.

విభాష : కన్నియ అనుశబ్దమునందు ఇయకు ఎత్వము రాగా, కన్నె అని అగును. ఎత్వము రానిపక్షమునందు కన్నియ అని 'ఇయ' అట్లే ఉండును. ఇట్లె వన్నియ–వన్నె మొద లగుచోట్ల ఎత్వము విభాష.

అన్యకార్యము: ఇయకు వికల్పముగా ఎత్వము వచ్చుటతోపాటు ఇయలో 'ఇ' కారము లోపించుటయు కలదు. ముత్తియము–ముత్యము. (పల్లియము–పల్యము మొ.)

'ఇయకు మాఱుగా' అనుటచేత ఇతర మైనభాగమునకు ఈకార్యము లేదు. చిన్నయ. మొ.

'నామ' అనుటచే క్రియలయం దెత్వము లేదు. కదియన్ – కదెన్ అని కాదు.

'నామాంతంబునకు' అనుటచే ప్రాతిపదికము నడుమ నున్న 'ఇయ'కు ఎత్వము రాదు. చెలియలు – చెలెలు అని కాదు.

# సర్వనామప్రకరణము

**24. అన్ని ప్రభృతులు సర్వనామంబులు.**

**అన్ని – ఇన్ని – ఎన్ని – కొన్ని – పెక్కు – పలు – ఆ – ఈ – ఏ – నీ – నా – మన – తా – సంఖ్యావాచకంబులు అన్ని ప్రభృతులు.**

**వీనికిం బ్రథమాంత రూపంబు లుదాహరించెద.**

**వీనిలో డుమంతంబుల కెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది.**

**బహువచనలకారంబునకు రాదేశంబును, ఋర్వాగమంబును బ్రథమా బహువచనంబునకుం బోలె నెఱుంగునది.**

**విశేషాకారంబులు గలిగె నేనిఁ గొండొకచో ద్వితీయవఱకును, గొండొకచోఁ దృతీయయం దొక్కరూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద.**

**శేషం బూహించునది.**

అన్ని మొద లగుశబ్దంబు లాఱును, ద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబు లగు

నమహదర్థంబు లేకవచనాంతంబు లగు.

ఇందు నీ మొద లగునాల్గు శబ్దంబులు సర్వార్థంబులం దుల్యరూపంబు లయియుండు.

'మ' అనునది మహదర్థ మనుటకు, 'అ' అనునది యమహదర్థ మనుటకు, 'ప్ర' మొద లయినవి ప్రథమాదివిభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

| | | మ. | అ. |
|---|---|---|---|
| సర్వతావదర్థకము | ప్ర. | అందఱు, అందొఱు | అన్ని |
| ఇయదర్థకము | ప్ర. | ఇందఱు | ఇన్ని |
| కియద్యావదర్థకము | ప్ర. | ఎందఱు | ఎన్ని |
| కతిపయార్థకము | ప్ర. | కొందఱు | కొన్ని |
| బహ్వర్థకము | ప్ర. | పెక్కండ్రు, పెక్కురు | పెక్కు. దీనికి బహువచనముం గలదు. |

ఈశబ్దంబు లౌపవిభక్తికంబు లగుటంజేసి అన్నిటి – అన్నింటి, ఇన్నిటి– ఇన్నింటి, ఎన్నిటి – ఎన్నింటి, కొన్నిటి – కొన్నింటి, పెక్కిటి – పెక్కింటి యను రూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపు డమహత్త్వంబునం దగు నని తెలియునది.

బహ్వర్థకము ప్ర. పలుగురు, పలుగుండ్రు అమహత్త్వంబున దీనికి

వ్యస్తప్రయోగంబు లేదు.

మ. తదర్థకము ప్ర. వాఁడు వారు, వారలు, వాండ్రు

ద్వి. వానిని వారిని, వారలను, వాండ్రను.

అ. ప్ర. అది అవి.

అద్ది అవ్వి.

ప్ర. ఆయది ఆయవి

అయ్యది అయ్యవి

| | | | |
|---|---|---|---|
| | ద్వి. | దానిని, | వానిని |
| | | అద్దానిని | అవ్వానిని |
| మ. ఇదమర్థకము | ప్ర. | వీఁడు | వీరు, వీరలు, వీండ్రు |
| | ద్వి. | వీనిని | వీరిని, వీరలను, వీండ్రను |
| అ. | ప్ర. | ఇది | ఇవి |
| | | ఇద్ది | ఇవ్వి |
| | | ఈయది | ఈయవి |
| | | ఇయ్యది | ఇయ్యవి |
| | ద్వి. | దీనిని, | |
| | | ఈదానిని, ఇద్దానిని | వీనిని |
| మ. యత్కిమర్థకము | ప్ర. | ఏఁడు | ఏరు |
| | | ఏవాఁడు | ఏవారు, ఏవారలు, ఏవాండ్రు, |
| | | ఎవ్వాఁడు | ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాండ్రు, |
| | | ఎవ్వఁడు | ఎవ్వరు, ఎవ్వండ్రు, |
| | | ఎవఁడు | ఎవరు, ఎవండ్రు |

| | | |
|---|---|---|
| ద్వి. | ఏనిని | ఏరిని |
| | ఏవానిని | ఏవారిని, ఏవారలను, ఏవాండ్రను |
| | ఎవ్వానిని | ఎవ్వారిని, ఎవ్వారలను, ఎవ్వాండ్రను |
| | ఎవ్వనిని | ఎవ్వరిని, ఎవ్వండ్రను, ఎవరిని |
| | ఎవనిని | ఎవండ్రను |
| అ. ప్ర. | ఎది | ఎవి |
| | ఏది | ఏవి |
| | ఎద్ది | ఎవ్వి |
| | ఏయది | ఏయవి |
| | ఎయ్యది | ఎయ్యవి |
| ద్వి. | దేనిని | వేనిని |
| | ఏదానిని | ఏవానిని |

ఎద్దానిని ఎవ్వానిని

మహతి వాచ్యం బగునే నేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు

ఎవ్వరిత – ఎవ్వర్త – ఎవ్వత, ఎవరిత – ఎవర్త – ఎవత, ఎవ్వరితి – ఎవ్వర్తి – ఎవ్వతి. ఎవరితి – ఎవర్తి – ఎవతి, ఎవ్వరితె – ఎవ్వర్తె – ఎవ్వతె, ఎవరితె – ఎవర్తె – ఎవతె, ఎవ్వర్తుక – ఎవ్వతుక – ఎవర్తుక – ఎవతుక అని యిరువది రెండు రూపములు వడయు.

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు అతఁడు – ఆతఁడు. ఇతఁడు – ఈతఁడు, ఎతఁడు – ఏతఁడు అనురూపంబులు వడయు. మహతీవాచకంబులు – ఆమె – ఆపె – ఆకె. ఈమె – ఈపె – ఈకె. ఏమె – ఏపె – ఏకె అనురూపంబులు వడయు.

యుష్మదర్థకము ప్ర. నీవు – మీరు, మీరలు
ఈవు – ఈరు, ఈరలు
ద్వి. నిన్నును – మిమ్మును;
తృ. నీచేతను – మీచేతను

అస్మదర్థకము ప్ర. నేను, ఏను – మేము, నేము, ఏము.
ద్వి. నన్నును – మమ్మును
తృ. నాచేతను – మాచేతను

ఉభయార్థకము నిత్యబహువచనాంతము.
ప్ర. మనము; ద్వి. మనలను; తృ. మనచేతను – మనలచేతను

ఆత్మార్థకము ప్ర. తాను – తాము, తారు, తమరు
ద్వి. తన్నును – తమ్మును
తృ. తనచేతను – తమచేతను.

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద.

మ. ఏకార్థశబ్దము ప్ర. ఒకఁడు – ఒకరు, ఒకంద్రు
ఒకొఁడు – ఒకరు, ఒకంద్రు
ఒక్కఁడు – ఒక్కరు, ఒక్కంద్రు
ఒక్కొఁడు – ఒక్కొరు, ఒక్కంద్రు
ఒక్కొరుఁడు – ఒకరులు, ఒకళులు, ఒకళ్ళు.

ఒకొొరుఁడు - ఒకొొరులు, ఒకొొళులు, ఒకొొళ్లు
ఒక్కొరుఁడు - ఒక్కరులు, ఒక్కళులు, ఒక్కళ్లు
ఒక్కొరుఁడు - ఒక్కొరులు, ఒక్కొళులు, ఒక్కొళ్లు
ఒకరువుఁడు - ఒకరువులు
ఒకొొరువుఁడు - ఒకొొరువులు
ఒక్కరువుఁడు - ఒక్కరువులు
ఒక్కొరువుఁడు - ఒక్కొరువులు
ఒరుఁడు - ఒరులు
ఒరువుఁడు - ఒరువులు
ఒండు - ఒండులు, ఒండ్లు
ఒడ్డు - ఒడ్డులు, ఒడ్లు

ద్వితీయాదివిభక్తిరూపంబు లూహించుకొనునది.

అ. ప్రథమైకవచనాంతములు

ఒకటి-ఒకొొటి-ఒక్కటి-ఒక్కొటి-ఎక్కటి-ఒకఁడు-ఒకొొఁడు- ఒక్కఁడు-ఒక్కొఁడు-ఒండు. ఈశబ్దమునకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహతి వాచ్యం బగునపు డేకత్వంబున వక్ష్యమాణరూపంబు లెఱుంగునది. మహత్యర్థకము -

ఒకరిత-ఒకర్త-ఒకర్తు-ఒకర్తుక-ఒకత-ఒకతుక-ఒకొొరిత-ఒకొొర్త-ఒకొొర్తు-ఒకొొర్తుక-ఒకొొత-ఒకొొతుక-ఒక్కరిత-ఒక్కర్త-ఒక్కర్తు-ఒక్కర్తుక-ఒక్కత-ఒక్కతుక-ఒక్కరిత-ఒక్కర్తి-ఒక్కొర్తు-ఒక్కొర్తుక-ఒక్కొత-ఒక్కొతుక-ఒకరితి-ఒకర్తి-ఒకతి-ఒకొొరితి-ఒకొొర్తి-ఒకొొతి-ఒక్కరితి-ఒక్కర్తి-ఒక్కతి-ఒక్కొరితి-ఒక్కొర్తి-ఒక్కొతి-ఒకరితె-ఒకర్తె-ఒకతె-ఒక్కొరితె-ఒకొొర్తె-ఒకొొతె-ఒక్కరితె-ఒక్కర్తె-ఒక్కతె-ఒక్కొరితె-ఒక్కొర్తె-ఒక్కొతె-ఓర్త-ఓర్తి-ఓర్తు-ఓర్తుక.

ఇంక ద్విప్రభృతిసంఖ్యావాచకంబులు వక్కాణించెద.

| | మ. | | అ. |
|---|---|---|---|
| ప్ర. | ఇద్దఱు, ఇరుగురు | - | రెండు |
| ప్ర. | మూగురు, ముగ్గురు, ముగురు | - | మూఁడు. |
| ప్ర. | నలుగురు | - | నాలుగు |

అయిదుగురు - అయిదు

ఏగురు - ఏను

ఆఱుగురు - ఆఱు

ఏడుగురు - ఏడు

ఎనమండ్రు - ఎనిమిది

తొమ్మండ్రు - తొమ్మిది.

పదుగురు, పదురు, పదుగుండ్రు, పదుండ్రు - పది.

పదునొకరు - పదునొకటి

ఇచ్చట నేకశబ్దార్థరూపంబు లెల్ల నర్థానురూపంబుగం గూర్చుకొనునది.

పదునొకండు - పదునొకటి. ఇత్యాదులు

పన్నిద్దరు, పన్నిరుగురు - పండ్రెండు

పదుమూగురు, పదముగ్గురు, పదుముగురు - పదుమూఁడు

పదునలుగురు - పదునాలుగు

పదునయిదుగురు-పదునయిదు; పదునేగురు-పదునేను; పదునాఱుగురు-పదునాఱు; పదునేడుగురు-పదునేడు; పదునెనమండ్రు-పదునెనిమిది; పందొమ్మండ్రు-పందొమ్మిది; ఇరవండ్రు-ఇరువది; ఇరువదియొకరు-ఇరువదియొకటి; ముప్పండ్రు-ముప్పది; నలువండ్రు-నలువది; ఏఁబండ్రు-ఏఁబది; అఱువండ్రు-అఱువది; డెబ్బండ్రు-డెబ్బది; ఎనుబండ్రు-ఎనుబది; తొంబండ్రు-తొంబది; నూఱుగురు-నూఱు; వేగురు-వేయి; పదువేగురు-పదివేలు. ఇత్యాదు లూహ్యంబులు.

రెండు మొద లగునవి యౌపవిభక్తికశబ్దంబు లగుటంజేసి ద్వితీయాదివిభక్తులు పరంబు లగునపుడు టింటు లగు నని యెఱుంగునది. రెండిటిని-రెండింటిని-రెంటిని; మూఁడింటిని-మూఁడింటిని-మూఁటిని; ఇత్యాదులు, ఏకశబ్దమునకు ఒంటి-ఒకానొకఁడు-ఒకొనొకటి-ఒకొనొకరిత-ఒరిమ-ఒండొకరు-ఓరట్ట అనురూపంబులును, ద్విశబ్దార్థంబునకు ఇనుమడి - ఈరాఱు అనురూపంబులు నర్థవిశేషంబులం జూపట్టెడు.

అన్ని మొద లగుశబ్దములకు సర్వనామములు అని సంజ్ఞ. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా, అనుశబ్దములును, ఒక మొద లగుసంఖ్యావాచకములును అన్ని మొద లగునవి. వీనికి తెలుగునందు సర్వనామములు అని పేరు. 'నామములు' అనగా వస్తువును బోధించుశబ్దములు

అనియు, అట్టినామములు అన్నిటికి బదులుగా ఉపయోగింపబడునవి కావున వీనికి 'సర్వనామములు' అనుపేరు సార్థక మనియు వాడుక.

అన్నిప్రభృతులు అనుటచే అన్ని మొద లగు వానిలో చేరనిశబ్దమునకు సర్వనామ సంజ్ఞ ఉండదు.

**25. సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు.**

**రెండవవాఁడు - రెండవది. మూఁడవవాఁడు - మూఁడవది.**

పూరణము అనగా 'పూర్తి అగుట' అవక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కావున కిత్తు అయిన 'అవ' అనునది విధించినదానికి అనగా సంఖ్యావాచకమునకు చివర వచ్చిచేరును.

సంఖ్యను తెలియజేయుశబ్దమునకు దీనితో ఆసంఖ్య పూరింపబడినది అను అర్థమున ఆసంఖ్యావాచకమునకు చివర 'అవ' అనునది ఆగమముగా చేరును.

'రెండు' అనుసంఖ్య వీనిచే పూరింపబడినది అనుఅర్థమునందు 'రెండు' అను సంఖ్యావాచకమునకు చివర 'అవ' అనునది ఆగమముగా వచ్చి, రెండు+అవ అని అగును. 'అంద్వగాగమంబులం దప్ప' అనుటచేత ఇచట 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, రెండవ అని అగును. విభక్తివివక్షలో తచ్ఛబ్దము చేరి, మహద్వాచక మయినపుడు రెండవవాఁడు, రెండవవానిని అనువిధముగా ఆయావిభక్తులలో రూపములు ఏర్పడును, కృష్ణుఁడు రెండవవాఁడు. అమహద్వాచక మయినచో రెండవది, రెండవదానిని అనువిధముగా ఆయావిభక్తులతో రూపములు ఏర్పడును. సత్యభామ రెండవది. పెండ్లి రెండవది. మొ.

'పూరణార్థంబునందు' అనుటచే పూరణార్థము లేనపుడు ఈకార్యము లేదు. రామలక్ష్మణులు ఇద్దరు.

'అగు' అనుటచే అవగాగమము నిత్యము. కావున రెండవవాఁడు లేదా రెండవది అనుఅర్థమున ' రెండు' అనువిధముగా అవగామము రానిరూపములు ఉండవు.

**26. సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతి కగు.**

**వారిద్దఱు రుక్మిణీసత్యభామలు. వీరు ముప్వురు శ్రీభూనీళలు.**

మహతి అనగా స్త్రీవాచకము. స్త్రీతిర్యగ్జడములును వానివిశేషణములును అమహత్తులు. కావున స్త్రీవాచకము లయినశబ్దములకు అమహత్తులకు కలుగు

కార్యములు వచ్చి అమహద్రూపములె అగును. అది మేడ, మేడ మెఱయుచున్నది. అది సీత. సీత ప్రోచుచున్నది.

సర్వనామములును, క్రియాపదములును స్త్రీత్వమునం దున్నపుడు బహు వచనములో మహత్తులకు కలుగుకార్యములను పొంది మహద్రూపముతో ఉండును.

వా రిద్దరు రుక్మిణీసత్యభామలు, రుక్మిణీ సత్యభామలు స్త్రీవాచకము. దానికి విశేషణము లైన ఆ, రెండు అనుశబ్దములును ఇచట స్త్రీవాచకములె అయినవి. బహుత్వమునం దున్నవి. కావున వీనిపై బహువచనము చేరగా ప్రస్తుతసూత్రముచే ఆ, అనుశబ్దమును, రెండు అనుశబ్దమును మహత్తులకు కలుగుకార్యములను పొంది, 'వారు, ఇద్దరు' అని అగును.

రుక్మిణీసత్యభామలు వచ్చుచున్నారు. అనుచోట రుక్మిణీసత్యభామలను, బోధించుటచే 'వచ్చు' అనునది స్త్రీ అర్థమునం దున్నది. బహుత్వమునం దుండుటచే వర్తమానమున బహువచనము చేరగా, ప్రస్తుతసూత్రము ననుసరించి మహత్తునకు కలుగుకార్యములు వచ్చి, 'వచ్చుచున్నారు' అని యగును.

'సర్వనామక్రియాపదంబుల' అనుటచే సర్వనామములును, క్రియాపదములును కానిశబ్దములు స్త్రీఅర్థమునం దున్నను, మహద్రూపమును పొందవు. కళత్రములు మొ.

'బహువచనంబు' అనుటచే ఏకవచనమున మహద్రూపము కలుగదు. అది సీత. సీత రక్షించుచున్నది మొ.

'మహత్తునకుం బోలె' అనుటచే స్త్రీవాచకములు అమహత్తు లగుటచే రావలసిన అమహత్కార్యము రాదు. కావున అవి రుక్మిణీసత్యభామలు, రుక్మిణీసత్యభామలు వచ్చుచున్నవి అనుతీరుగా అమహద్రూపములు ఉండవు.

'మహతికి' అనుటచే తిర్యగ్జడములను బోధించునపుడు మహత్కార్యము గలుగదు. అవి ఏనుగులు. మేడలు మెఱయుచున్నవి. ఇచట వారు ఏనుగులు, మేడలు మెఱయుచున్నారు అనుతీరుగా మహత్కార్యములు ఉండవు.

**27. అపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాష నగు.**

**పలుగురు - పలువురు, ఇరుగురు - ఇరువురు, వేగురు - వేవురు, తొగ - తొవ, పగలు - పవలు.**

పదము మొదట నున్నది పదాద్యము, పదాద్యము కానిది అపదాద్యము.

వే ఱొకహల్లుతో కూడినది సంయుక్తము. సంయుక్తము గానిది అసంయుక్తము. గకారంబునకు అనుచోటిషష్ఠీవిభక్తివలన గకారముస్థానమున అని అర్థ మగును. పదమునందు మొదటిది కానిదియును, వే ఱొకహల్లుతో కూడనిదియును, అయిన గకారముస్థానమున వికల్పముగా వకారము వచ్చును.

'పలుగురు' అనుచో ప్రస్తుతసూత్రముచే గకారముపొల్లు రాగా, పలువురు అని అగును.'విభాష' అనుటచే వకారము రానపుడు 'పలుగురు' అనియె యుండును.

'అపదాద్యం బయి' అనుటచే పదము మొదట నున్నగకారమునకు వకారము రాదు. గాలి, గిత్త, గుర్తు మొ.

'అసంయుక్త మయిన' అనుటచే వే ఱొకహల్లుతో కూడినగకారమునకు వకారము రాదు. లగ్గు, మొగ్గరము మొ. ఇచట లవ్వు, మొవ్వరము అనురీతి రూపములు లేవు.

'గకారంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు ఈకార్యము లేదు. మెకము, ఆట మొ.

ఇందలి 'విభాష' అనుపదమునకు కొన్నియెడల గకారమునకు వకారము అసలు రా దని వ్యవస్థ (నియమము) చేసికొనవలయును, తగరము, పొగ, అగడిత మొ. నిండుసున్నమీదిగకారమునకు వకారము లేదు. బంగారము, ఉంగరము, తంగేడు మొ. అరసున్న పైని గకారమునకు వకారము కొన్నియెడల గలదు. వకారము వచ్చినపుడు స్థిరపరక మగుటచే అరసున్న లోపించును. తీఁగ –తీవ మొ. నాఁగేలు – నావేలు అగుట లేదు. వీఁగెను మొ. పుట్టువు – పుట్టుగు, పవడము – పగడము మొద లగుకొన్నిచోట్ల వకారమునకు గకారము కలిగిన దందురు.

**28. ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.**

**విభక్తినిమిత్తకంబు లయి యాదేశాగమాత్మకంబు లయినఇటితివర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.**

వక్ష్యమాణము అనగా చెప్పబోవునది. ఈపరిచ్ఛేదమునందు ఈసూత్రము నకు పిదప చెప్పబోవుచున్న ఇ – టి – తి అనుమూడువర్ణములకును ఔపవిభక్తిక ములు అని పేరు. సూత్రమునందలి 'వక్ష్యమాణంబులు' అనుదానిని సూరి 'విభక్తినిమిత్తకంబు లయి యాదేశాగమాత్మకంబు లయిన'వి అని వివరించెను. 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిఁ

బ్రాయికయగ నగు'ను. ద్వితీయాద్యేకవచనము లగువిభక్తులను నిమిత్తముగా చేసికొని ప్రాతిపదికల చివరిఅక్షరమలకు, ఆదేశములుగను, ఆగమములుగను వచ్చుచున్న ఇ–టి–తి అనువర్ణములకు ఔపవిభక్తికములు అని సంజ్ఞ. ఊరు, ఊరిని. ఇచట 'ఇ'వర్ణము ద్వితీయైకవచనవిభక్తిని నిమిత్తముగా ఊరులోని ఉత్వమునకు ఆదేశముగా వచ్చినది, అన్నిటిని – ఇచట 'టి' అనునది ఆగమముగా చేరినది. ఇట్లే గోతిని, అటితిని మొ.

'ఇటితివర్ణంబులు' అనుటచే ఇటితి అనువానికంటె ఇతరము లయినవర్ణములకు ఔపవిభక్తికము అనుసంజ్ఞ లేదు. కావున పగంటిని, కంటిని అనుచో పూర్ణబిందువు, మూఁడిటికి, అటితికి, అనుచో ఇత్వము, క్రిందటికి, మాపటికి అనుచో అత్వము మొద లగునవి ఔపవిభక్తికములు కావు.

'వక్ష్యమాణంబులు' అనుట స్పష్టతకు అనవచ్చును. దీనికి పూర్వము ఈపరిచ్ఛేదమునందు ఇటితివర్ణములు చెప్పబడలేదు. దీనికి తరువాతి పరిచ్ఛేదములందును టి,తి చెప్పబడలేదు కాని చెప్పిన క్త్వార్థకేకారము మొద లైనవానికి ఈసంజ్ఞ లేదు.

**29. ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు.**

**కాలు - కాలిని-కాలిచే, నాఁగటిని-నాఁగటిచే, నేతిని-నేతిచే. ద్వితీయైకవచనంబు పరం బగునపు డౌపవిభక్తికంబులు రా వని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు.**

ద్వితీయ మొద లగునవి ద్వితీయాదులు, ద్వితీయాదుల ఏకవచనములు ద్వితీయాద్యేకవచనములు. నామం బనగా ప్రాతిపదికము. ఇవి అనగా ఇటితి అనుపూర్వసూత్రము ననుసరించి ఔపవిభక్తికములు.

ద్వితీయ మొదలుకొని సప్తమివరకు గలవిభక్తులలో ఏకవచనములు పరముగా నున్నపుడు కొన్ని ప్రాతిపదికలకు ఇటితి అనుఔపవిభక్తికములు తఱుచుగా వచ్చును.

ఇ – (కాలు) కాలిని. టి – నాఁగటిచే. తి – (అఱ్ఱు) అఱితియందు మొ.

'ద్వితీయాది' అనుటచే ప్రథమావిభక్తి ఏకవచనమునందు ఔపవిభక్తికములు రావు. కాలు, నాఁగలి, నేయి.

'ఏకవచనంబులు' అనుటచే ద్వితీయాదులలో బహువచనములు పర మైనపుడు ఔపవిభక్తికములు రావు. కాళ్లను, నాగళ్లను, అఱ్ఱులను మొ.

'నామంబులకుం గొన్నింటికి' అనుటచే అన్ని ప్రాతిపదికలకు ఔపవిభక్తికములు రావు. దంతము అనుఅర్థమున 'పల్లు' అనుశబ్దమునకు ఔపవిభక్తికము చేరును, పంటిని. పల్లము అనుఅర్థమునందు 'పల్లు' అనుశబ్దమనకు ఔపవిభక్తికము రాదు. పల్లును, పల్లునందు.

'ప్రాయికము' అనుటచే ఔపవిభక్తికములు కొన్నిటికి వచ్చుటయు రాకుండుటయు అనగా వికల్పముగా వచ్చుట కలదు. కొడవటిని, కొడవలిని. సప్తమీనవర్ణకము పర మగునపు డౌపవిభక్తికము రాదు. ఊరున, చోటున. కొన్ని శబ్దములకు పర్యాయముగా వేరు వేరు ఔపవిభక్తికములు వచ్చుట కలదు. నోరిని, నోటిని మొ.

### 30. ఊరు మొద లగువాని కిత్వం బగు.

**ఊరు – ఊరిని, కాలు – కాలిని, మ్రాను – మ్రానిని, నోరు – నోరిని, చోటు – చోటిని.**

ఇత్వము అనగా 'ఇ'వర్ణము. ఇది ఏకాల్లు (ఒకేవర్ణము). కావున 'అలో కన్త్యస్య' అనుపరిభాషను అనుసరించి చివరివర్ణముస్థానమున ఆదేశముగా వచ్చును. ఇవర్ణము 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు' అను పూర్వమాత్రమును అనుసరించి ద్వితీయాద్యేకవచనము పర మయినపుడు వచ్చును.

ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనము పరముగా నున్నపుడు ఊరు మొద లగుశబ్దములలో చివరివర్ణముయొక్క స్థానమున ఔపవిభక్తికము అయిన 'ఇ' వర్ణము ఆదేశముగా వచ్చును.

ఊరు అనుశబ్దముపై ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షయందు 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచేత నువర్ణము వచ్చి, ఊరు+ను అని యుండగా, ప్రస్తుత సూత్రముచే ఇత్వము వచ్చి, ఊరి+ను అని కాగా, 'ఇకారంబు మీఁదికునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనుసూత్రముచే నువర్ణమునకు ఇత్వము వచ్చి, 'ఊరిని' అని అగును.

'ఊరు మొద లగువానికి' అనుటచే ఊరు మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఇత్వము రాదు. చివరను, మొగిలును మొ.

'అగు' అనుటచే ఇత్వము రాని 'ఊరును, ఊరుచేత' అనువిధ మయిన రూపములు ఉండవు.

### 31. టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి

**కంతాగమంబును గొన్నింటికి బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు.**

**ఆదేశము: త్రాడు-త్రాటిని, కాడు-కాటిని, నోరు-నోటిని, ఏరు-ఏటికి,**

**ఆగమము: అన్ని-అన్నిటిని, ఎనిమిది-ఎనిమిదిటిని.వేయి-వేయిటిని**

**ఉభయము: ఏమి-ఏటిని-ఏమిటిని; పగలు-పగటిని-పగలిటిని, మొదలు-మొదటిని-మొదలిటిని; రెండు-రెంటిని-రెండిటిని; మూఁడు -మూఁటిని-మూఁడిటిని; నూఱు-నూటిని-నూఱిటిని.**

ఔపవిభక్తిక మైన'టి'వర్ణము 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు' అనుసూత్రమును అనుసరించి ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనము పరముగా ఉన్నపుడె వచ్చును. ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనములు పరముగా ఉన్నపుడు, కొన్ని ప్రాతిపదికలలో చివరిఅక్షరమునకు ఆదేశముగను, మఱి కొన్ని శబ్దములకు ఆగమముగాను, ఇంక కొన్ని శబ్దములకు ఒకసారి చివరిఅక్షరమునకు ఆదేశముగాను, వేరొకసారి ఆగమముగాను 'టి' అనుఔపవిభక్తికము తఱుచుగా వచ్చును.

1. ఆగమము: త్రాడు మొద లగుశబ్దములలో చివరిఅక్షరమునకు ఆదేశముగా వచ్చును. త్రాడు+ను, త్రాటి+ను - త్రాటిని మొ.

2. ఆదేశము: అన్ని మొద లగుశబ్దములకు చివర టివర్ణము ఆగమముగా వచ్చును. అన్ని+ను - అన్ని+టి+ను - అన్నిటిని మొ.

3. ఉభయము: ఏమి మొద లగుశబ్దములకు ఒకసారి ఆదేశముగను, వేరొకసారి ఆగమముగను, రెండు విధములుగా టివర్ణము వచ్చును. చివరిఅక్షరమునకు ఆదేశముగా వచ్చుపక్షమునందు ఏమి+ను-ఏటి+ను- ఏటిని. చివర ఆగమముగా వచ్చుపక్షమునందు ఏమి+ను-ఏమి+టి+ను, ఏమిటిని.

'అంతాక్షరంబునకు' అనుటవలన అనేకాల్లు (ఒకటికంటె ఎక్కువవర్ణములు, ట్,ఇ) అయిన టివర్ణము ప్రాతిపదిక మొత్తమునకు ఆదేశము కాక చివరిఅక్షరము (అచ్చుతో కూడినహల్లు)నకు మాత్రమె ఆదేశముగా వచ్చును. మిగిలినఅక్షరములకు కాదు. త్రాటిని, మొ.

'అంతాగమము' అనుటచే చివరనే ఆగమముగా వచ్చును. కావున ఏమిటిని మొద లగుచోట్ల టియేమిని - ఏటిమిని, అనువిధముగా శబ్దమునందు ఇతర స్థలములలో ఆగమము కాదు.

'పర్యాయంబున' అనుటచే ఆగమముగను, ఆదేశముగను, రెండు విధములుగను వచ్చుశబ్దములకు ఒకసారి ఆదేశమును వేరొకసారి ఆగమమును

అగును. ఒకేసారి ఆదేశమును ఆగమమును రెండునై రాదు.

'ప్రాయికము' అనుటచే టివర్ణము కొన్నిటికి వికల్పముగా వచ్చుట కలదు. నోటిని, నోరిని. (నెత్తుటిమఱక, నెత్తురుచారలు) మొ.

**32. హ్రస్వముమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు.**

**అన్నింటిని – ఎనిమిదింటిని – పగంటిని – పగలింటిని – రెండింటిని– మూఁడింటిని.**

హ్రస్వముకంటె పై నున్న ఔపవిభక్తికము అయిన 'టి' వర్ణమునకు పూర్వము నందు బహుళముగా నిండుసున్న వచ్చును.

అన్ని అనుశబ్దముపై ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షయందు 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే నువర్ణము వచ్చి, అన్ని+ను అని యుండగా 'టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు' అనుసూత్రముచే 'టి'వర్ణము ఆగమముగా వచ్చి, అన్ని టి+ను అని కాగా, 'ఇకారంబుమీఁది' అనుసూత్రముచే నువర్ణమునకు ఇత్వము వచ్చి, అన్నింటిని, ఇట్లే పగంటిని మొ. 'బహుళము' అనుటచే నిండుసున్న రానిచో అన్నిటిని, పగటిని, అని యుండును, ఇట విభాష

బహుళము అనుటచే మొదటిని, మొద లగుచోట్ల అప్రవృత్తి. కావున మొదంటిని అనువిధముగా బిందువు వచ్చినరూపములు ఉండవు.

పదిటిని, అనుచోట పూర్ణబిందువు వికల్పముగా వచ్చి పదింటిని, పదిటిని అని అగుటతోపాటు నిండుసున్నకు పూర్వమునందు 'యి'వర్ణము ఆగమ మగును. పదియింటిని. బహుళశబ్దముచే ఇది అన్యకార్యము. ఇట్లె తొమ్మిదియింట మొ.

'హ్రస్వముమీఁద' అనుట స్పష్టతకు అనదగును. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనులక్షణముచే దీర్ఘముమీద పూర్ణబిందు వెట్లును ఉండదు.

'టివర్ణంబునకు ముందు' అనుటచే ఇతర మైనఔపవిభక్తికమునకు ఈకార్యము లేదు. అతితిని.

'పూర్ణబిందువు' అనుటచే ఖండబిందువు రాదు. కావున పగఁటిని, అన్నిఁటిని అనురీతిరూపము లుండవు.

**33. పదాద్యం బగుహ్రస్వంబుమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు.**

**కన్ను-కంటిని, మిన్ను-మింటిని. ఇల్లు-ఇంటిని. పల్లు-పంటిని.**

పదాద్యము అనగా పదము మొదట ఉన్నది. పదమునందు ఉన్నఅచ్చులు అన్నిటిలోను మొదటి దగుహ్రస్వ మయినఅచ్చునకు మీద ఉన్న ఔపవిభక్తికము అయినటివర్ణమునకు పూర్వమునందు నిండుసున్న నిత్యముగా వచ్చును. 'హ్రస్వము మీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళంబుగా నగు' అనుసూత్రముచే నిండుసున్న బహుళముగా ప్రాప్తించుచుండగా ఈసూత్రము నిత్యముగా చెప్పు చున్నది.

కన్ను అనుశబ్దముపై ద్వితీయైకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అను సూత్రముచే నువర్ణము వచ్చి, కన్ను+ను అని యుండగా 'టివర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు' అనుసూత్రముచే చివరిఅక్షరమునకు టివర్ణము ఆదేశ మై, క+టి+ను అని యుండగా 'హ్రస్వముమీఁదిటివర్ణంబునకు ముందు' అనుసూత్రమును బాధించి ఈసూత్రముచే టివర్ణమునకు పూర్వమునందు నిండుసున్న నిత్యముగా వచ్చి, కంటి+ను అని కాగా 'ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తుల' అనుసూత్రముచే నువర్ణమునకు ఇత్వము వచ్చి, 'కంటిని' అని అగును.

'పదాద్యంబు' అనుటచే మొదటిది కానిహ్రస్వమునకు పై నున్నటివర్ణమునకు పూర్వమునందు ఈసూత్రముచే నిండుసున్న నిత్యముగా రాదు. 'హ్రస్వంబు మీఁదిటివర్ణంబునకు' అనుసూత్రముచే బహుళముగా వచ్చును. పగటిని, పగంటిని.

'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనుసూత్రమును అనుసరించి దీర్ఘముపై సాధ్యపూర్ణము రాదు. కావున సూత్రమునందు 'హ్రస్వంబుమీఁది' అనుట స్పష్టతకె.

'పూర్ణబిందువు' అనుచో 'పూర్ణము' అనుటయు స్పష్టతకె, 'అఁటయిఁకచుఁ డు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' అనుసూత్రముచే పదాద్య మగుహ్రస్వముమీద ఖండబిందువు ఉండదు.

'అగు' అనుటచే నిత్యము, కావున (కంటికి)కటికి, (ఇంటికి)ఇటికి, అనువిధముగా నిండుసున్న రానిరూపములు ఉండవు.

**34. అట్టు మొద లగుశబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు.**

**అఱ్ఱు - అఱితిని, అఱ్ఱు - కఱ్ఱు - కొఱ్ఱు - గొఱ్ఱు - మిఱ్ఱు - వఱ్ఱు ఇవి యఱ్ఱు మొద లయినవి.**

ఔపవిభక్తిక మైన'తి'వర్ణము 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు' అనుసూత్రమును అనుసరించి ద్వితీయాద్యేకవచనములు పర మగునపుడు వచ్చును. అఱ్ఱు మొద లగుశబ్దములు ఆఱు. అఱ్ఱు, కఱ్ఱు, కొఱ్ఱు, గొఱ్ఱు, మిఱ్ఱు, పఱ్ఱు.

ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనము పరముగా నుండగా ఈఆరు శబ్దములకు చివర 'తి' అనుఔపవిభక్తికము ఆగమముగా వచ్చును. అప్పుడు పైశబ్దములలో ద్విరుక్తములుగా నున్నఅలఘురేఫములలో ఒకదానికి లోపము వచ్చును.

అఱ్ఱు అనుశబ్దమునకు ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షయందు 'నువర్ణంబు ద్వితీయ' అనుసూత్రముచే నువర్ణము వచ్చి, అఱ్ఱు+ను అని యుండగా ప్రస్తుత సూత్రముచే తివర్ణము ఆగమ మయి, (అఱ్ఱు+తి+ను) ఒకశకటరేఫకు లోపము వచ్చి, అఱుతి+ను అని కాగా, 'టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు' అనుసూత్రముచే ఇత్వము వచ్చి, 'అఱితిను' అని యై, 'ఇకారంబు మీఁదికునువుక్రియావిభక్తుల' అనుసూత్రముచే నువర్ణమునకు ఇత్వము వచ్చి 'అఱితిని' అని అగును.

'అఱ్ఱు మొద లగుశబ్దంబులకు' అనుటచే అఱ్ఱు మొద లగు ఆరు శబ్దముల కంటె వే ఱయినదానికి ఈకార్యము లేదు. గుఱ్ఱును మొ.

'అంతాగమంబు' అనుటచే తివర్ణము చివర వచ్చి చేరును. కావున తియఱు, అతిఱు అనురీతిగా ఇతరస్థలములందు ఆగమము కాదు.

'తివర్ణంబును, లోపంబును' అనుచోటిసముచ్చయార్థకము లగు'ను'శబ్దములచే ఈరెండుకార్యములు కలిసియే వచ్చును. కావున తివర్ణము ఒక్కటి మాత్రమే వచ్చి, అఱ్ఱితిని అని కాని, రేఫమునకు లోపము ఒక్కటి మాత్రమే వచ్చి, అఱును అని కాని, రూపములు ఉండవు.

'అగు' అనుటచే ఈవిధి నిత్యము. కావున అఱ్ఱును అనువిధముగా ఈ కార్యములు జరుగనిరూపములు ఉండవు.

**35. విభక్తి పరం బగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు తివర్ణం బగు.**

**గోయి - గోతులు, గోతిని, గోతులను. గోయి-చేయి-దాయి-నూయి-**

**నేయి-వాయి-రోయి. ఇత్యాదులు.**

విభక్తి పరముగా నున్నపుడు గోయి మొద లగుశబ్దములలో చివరిఅక్షరము స్థానమున 'తి' అను ఔపవిభక్తికము ఆదేశముగా వచ్చును. ఇది ఔపవిభక్తికము కావున 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు' అనులక్షణమను అనుసరించి ద్వితీయ మొద లగువిభక్తులలో ఏకవచనము పర మైనపుడు వచ్చును. ఈసూత్రమునందు 'విభక్తి పరం బగునపుడు' అని విశేషముగా ప్రారంభించుటచే ద్వితీయాద్యేకవచనములే కాక ఏవిభక్తి పరముగా ఉన్నను తివర్ణము గోయి ప్రభృతులకు వచ్చును.

గోయి శబ్దముపై ప్రథమాబహువచనవివక్షయందు 'లువర్ణంబు బహువచంబు' అనుసూత్రముచే లువర్ణము వచ్చి, గోయి+లు అని ఉండగా (ఇవి ద్వితీయా ద్యేకవచనంబులు పరంబు లగునపుడు' అనుసూత్రమును బాధించి, ప్రస్తుత సూత్రముచే యివర్ణము స్థానమున తివర్ణము ఆదేశముగా వచ్చి, గోతి+లు అని అగును. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అనుసూత్రముచే ఉత్వము వచ్చి, 'గోతులు' అని అగును.

'విభక్తి పరం బగునపుడు' అనుటచేత ప్రథమైకవచనమునందు తివర్ణము రాదు. గోయి ప్రభృతులు స్త్రీసమములు కావున వీనిపై ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును. కావున ప్రథమైకవచనమునందు విభక్తి పర మగుట ఉండదు. గోతి, చేతి అని ఉండదు.

'గోయిప్రభృతుల' అనుటచే గోయి మొద లగువానిలో చేరనిశబ్దమునకు తివర్ణము రాదు. రేయిని, రేయియందు మొ.

'తుదియక్షరంబు' అనుటచే 'తివర్ణము' అనేకాల్లు (ఒకటికంటె ఎక్కువ వర్ణములు త్, ఇ) కావున మొత్తమునకు ఆదేశము కాకుండ చివరిఅక్షరము (అచ్చుతో కూడినహల్లు) ఒక్కదానిస్థానమున ఆదేశ మగును. ఇతరవర్ణములు అట్లే ఉండును.

'అగు' అనుటచే నిత్యము. కావున తివర్ణము రాని, గోయులు, గోయిని మొద లగురూపములు ఉండవు.

**36. టితివర్ణంబులు పరం బగునపు దుత్వంబున కిత్వం బగు.**

**రెండిటికి-మూఁడిటికి-నాలుగిటికి-పగలిటికి-మొదలిటికి-పెక్కింటికి. కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు. నెత్తుటికి.**

టి, తి, అనుఔపవిభక్తికములు పరముగా ఉన్నపుడు వానికి పూర్వమునం దున్న ప్రాతిపదికముయొక్క చివరిహ్రస్వ మగుఉకారముస్థానమున హ్రస్వ మగు'ఇ'కారము ఆదేశముగా వచ్చును.

రెండు అనుశబ్దమునకు షష్ఠీవిభక్తి ఏకవచనమునందు కువిభక్తి వచ్చి, రెండు+కు అని యుండగా 'టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటికి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు' అనుసూత్రముచే టివర్ణము ఆగమముగా వచ్చి, రెండు+టి+కు అని యుండగా 'ప్రస్తుతసూత్రముచే దువర్ణమునందలిఉత్వమునకు ఇత్వము వచ్చి, రెండిటి+కు అని కాగా, 'ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తుల' అనుసూత్రముచే కువర్ణమునకు ఇత్వము వచ్చి, రెండిటికి(ని) అని అగును. ఇట్లే అఱు+తిని – అఱితిని మొ.

'టితివర్ణంబులు' అనుటచే మిగిలిన 'ఇ' అనుఔపవిభక్తికము పర మైనపుడు ఉత్వమునకు ఇత్వము రాదు. కాని ఇవర్ణము అంత్యాక్షరమునకు ఆదేశముగా వచ్చుటచే ఉత్వము ఉండదు. కావున ఇత్వమునకు ప్రసక్తి లేదు. ఊరిని, కాలిని.

'పరం బగునపుడు' అనుటచే టితివర్ణములు పరముగా లేనపుడు ఇత్వము రాదు.

'ఉత్వంబునకు' అనుటచే హ్రస్వ మగుఉకారముకంటె వే రయినఅచ్చునకు ఇత్వము రాదు. పగటికి, మూఁటిని, ఏటికి, మొ.

'అగు' అనుటచే నిత్యము. కావున 'రెండుటికి' అనువిధముగా ఉత్వము రానిరూపములు ఉండవు. కాని నెత్తుటికి, నుదుటికి, అఱుత మొదలుగా కొన్నిచోట్ల ఇత్వము వచ్చుట లేదు.

**37. టివర్ణంబు పరం బగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వం బగు.**

**క్రిందు – క్రిందటిని, మీఁదు – మీఁదటిని, ముందు – ముందటిని, మాపు – మాపటిని, అప్పుడు – అప్పటిని.**

అత్వము ఏకాల్లు (ఒకేవర్ణము) కావున అలో న్త్యస్య అని విధించినదానిలో చివరివర్ణమునకు ఆదేశముగా వచ్చును.

ఔపవిభక్తికము అయిన 'టి' వర్ణము పరముగా నున్నపుడు క్రిందు, మీదు, ముందు అనుశబ్దములందును, ప్రాతిపదికము చివర ఉన్నపువర్ణమునందును చివరిది అగుఉకారముస్థానమున హ్రస్వ మగుఅకారము ఆదేశముగా వచ్చును. వీనిలో చివర ఉత్వము కలదు. కావున 'టితివర్ణంబులు పరం బగునపు దుత్వంబున కిత్వం బగు' అనుసూత్రముచే ఇత్వము రావలసియుండగా దానిని బాధించి

యీసూత్రముచే అత్వము వచ్చును.

క్రిందుశబ్దముపై ద్వితీయైకవచనమునందు నువర్ణకము వచ్చి, క్రిందు+ను అని యుండగా 'టి' వర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం పర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు' అనుసూత్రముచే టివర్ణము ఆగమముగా వచ్చి, 'క్రిందు+టి+ను' అని కాగా 'టితివర్ణంబులు పరంబు లగునపు దుత్వంబున కిత్వం బగు' అనుసూత్రముచే రావలసినఇత్వమును బాధించి ప్రస్తుతసూత్రముచే అత్వము వచ్చి, క్రిందటి+ను ('ఇకారంబుమీఁది')క్రిందటిని అని అగును.

ఇట్లె అప్పుడు+ను అప్పుటిను, ఇచట ముందరిపువర్ణమునందలి ఉత్వమునకు అత్వము వచ్చి, అప్పటిను – అప్పటిని అని అగును.

'క్రిందు మీఁదు ముందు' అనుటవలన ఇతర మయినశబ్దమునకు అత్వము రాదు. 'టితివర్ణంబులు పరం బగునపుడు' అనుసూత్రముచే ఇత్వము వచ్చును. ఐదు – ఐదిటిని.

'పువర్ణము' అనుటవలన పువర్ణాంతములకు అన్నిటికి అత్వము వచ్చును: తేపటికి, మాపటికి మొ. ఇతరములకు రాదు. రెండిటికి.

'అగు' అనుటవలన అత్వము నిత్యము. కావున 'క్రిందుటిని' అనువిధముగా అత్వము రానిరూపములు ఉండవు.

**38. ఔపవిభక్తికములతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.**

**గోరను గీఱెను, ఊర నున్నాఁడు, గొడ్డట నఱికెను. ఇంట లేఁడు వఱుతఁ గలిసె, అఱుతఁ దూటె. పక్షంబునందు గోరిచేత నూరియం దిత్యాది.**

ఇటితి అనువర్ణములకు ఔపవిభక్తికములు అని సంజ్ఞ. ఈవర్ణములు చేరు ప్రాతిపదికలకును ఔపవిభక్తికములు అని పేరు. ఔపవిభక్తికములు అయిన శబ్దములకు పైనున్న తృతీయావిభక్తిస్థానమునను, సప్తమీవిభక్తిస్థానమునను హ్రస్వ మగుఅకారము బహుళముగా ఆదేశముగా వచ్చును.

గోరు అనుశబ్దముపై తృతీయావిభక్తియందు 'చేత' విభక్తి రాగా, గోరు+చేత అని ఉండగా ప్రస్తుతసూత్రముచేత 'చేత' ప్రత్యయముస్థానమున అత్వము వచ్చి, గోరు+అ, అని యయి, 'తృతీయాదులకు నుగాగమం బగు' అనుసూత్రముచే నుగాగమము రాగా, గోరు+అను అగును. 'ఊరు మొద లగువాని కిత్వం బగు' అనుసూత్రముచే ఇత్వము వచ్చి, గోరి+అను అని యై, అంద్వవగాగమంబులం

దప్పు నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, గోరను అని అగును. 'బహుళము' అనుటచేత అత్వము రానపుడు గోరిచేతను అని అగును. ఇట్లే ఇల్లు+అందు అనుచో సప్తమికి అత్వము వచ్చి, ఇల్లు+అను, ఇంటి+అను – ఇంటను మొ.

ఊరు మొద లగుశబ్దములపై తృతీయావిభక్త్యర్థము కుదరకపోవుటచే తృతీయ రాదు. కావున ఊరిచేత (ఊరను), అనురూపములే యుండవు. చేరిన సప్తమికి అత్వము వచ్చిన 'ఊరను' అనియు అత్వము రాకున్న 'ఊరియందు' లేదా 'ఊరున' అనియు ఏర్పడును.

'ఔపవిభక్తికముల' అనుటచేత ఔపవిభక్తికములు కానిశబ్దములపయిని ఈ కార్యము లేదు. ఱెల్లుచేత, ఱెల్లునందు మొ.

'తృతీయాసప్తములకు' అను సామాన్యనిర్దేశముచేత తృతీయావిభక్తు లగు 'చేత, తోడ' అనురెండింటికిని, సప్తమీవిభక్తులగు 'అందు, న', అను రెండింటికిని అత్వము వచ్చును. గోరిచేతను లేదా గోరితోడను – (చేత, తోడ లకు అత్వము) గోరను, గోరియందును లేదా గోరునను, (అందు, న అనువానికి అత్వము) గోరను. మొ. ఇట్లే ఏకవచనము లయినను, బహువచనము లయినను అత్వము వచ్చును. వఱ్ఱులయందును, వఱ్ఱులను మొ.

'తృతీయాసప్తములకు' అనునిర్దేశమువలననే చేత, తోడ, అందు, న, అను అనేకవర్ణములకు మొత్తమునకు ఏకాల్లు (ఒకే వర్ణము) అయిన అత్వము ఆదేశముగా వచ్చును.

'బహుళము' అనుటచేత కొన్ని ఔపవిభక్తికశబ్దములకును అత్వము వచ్చుట లేదు. గోయి – 'గోతను' అనురీతి రూపములు కానరావు.

**ఇది యాచ్ఛికపరిచ్ఛేదము**

# కారకపరిచ్ఛేదము

**1. ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు.**

**ప్రాతిపదికార్థమునందు - రాముఁడు, రావణుఁడు. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. సంబోధనమునందు - ఓరాముఁడ, ఓరావణుఁడ. ఉక్తార్థమందు - రాముఁడు రావణుని సంహరించెను. ఉక్త మనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచక మగు రామశబ్దమునకుఁ బ్రథమ యయ్యెను. రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె. ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచక మగురావణశబ్దంబునకుం బ్రథమ యయ్యె నని యెఱుంగునది.**

ప్రాతిపదికసంబోధనోక్తార్థము అనునది ద్వంద్వసమాసము. ఈసమాసము చివర నున్నశబ్దము సమాసమునందలి అన్నిపదములతోను ప్రత్యేకముగా అన్వయించును. కావున ప్రాతిపదికార్థమునందును, సంబోధనార్థమునందును, ఉక్తార్థమునందును ప్రథమావిభక్తి వచ్చును.

శబ్దమును ఉచ్చరించిన వెంటనే నియతముగా (తప్పక) స్ఫురించు అర్థము పాతిపదికార్థము. 'రామ' అనుశబ్దమును ఉచ్చరింపగనే 'దశరథునికొడుకు' స్ఫురణకు వచ్చును. అట్లు స్ఫురించునది ప్రాతిపదికార్థము. ఆఅర్థమునందు ప్రాతిపదికకు ఈసూత్రముచే ప్రథమావిభక్తి వచ్చును. రాముఁడు (దశరథుని కొడుకు)

సంబోధనము అనగా పిలుపు. ఆఅర్థమునందును ప్రాతిపదికకు ప్రథమావిభక్తి వచ్చును. ఓ రాముఁడ.

ఉక్తము అనగా చెప్పబడినది. క్రియావిభక్తిచేత చెప్పబడుట ఉక్తార్థము. రాముఁడు సంహరించెను. ఇచట 'సంహరించెను' అనుక్రియాపదమునందలి కర్త్రర్థక మగు(డుజునకు వచ్చిన) 'ఎను' కర్త అయిన రాముని తెలుపుచున్నది. కావున కర్తను తెలుపు 'రామ' అనుశబ్దమునకు ఈసూత్రముచే ప్రథమావిభక్తి వచ్చి, రాముఁడు అని అయినది.

'ప్రథమ' అనుటచే యథాసంభవముగా డుమువులు మొ. ప్రథమావిభక్తులు వచ్చును. రాముఁడు, వనము, ధేనువు, ప్రాతిపదికసంబోధనోకార్థములలో బహుత్వమున ఇట్లే లువర్ణము వచ్చును. రాములు, వనములు, ధేనువులు మొ.

**2. కర్మంబున ద్వితీయ యగు.**

**ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు, దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుటకు వంట చేసె నని యర్థము. వంటఫలము. చేయుట వ్యాపారము. వంట యనఁగాఁ బాకము. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మ మయ్యె నని యెఱుంగునది.**

కర్మను తెలియజేయుశబ్దమునకు ద్వితీయావిభక్తి వచ్చును. 'ధాతువుయొక్క అర్థము ధాత్వర్థము. ధాతువునకు వ్యాపారము, ఫలము అని రెండు అర్థములు. అందులో ధాతువుయొక్క అర్థ మైనఫలము ఆశ్రయించినది ధాత్వర్థఫలాశ్రయము. అది 'కర్మ' అగును. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఈవాక్యమునందు 'వండెను' అనుక్రియాపదమునకు వంటను చేసెను అని అర్థము. ఇందు (వంట) చేయుట అనునది వ్యాపారము. వంట, అనగా వండబడినపదార్థము ఫలము. ఆ 'వంట' అనగా పాకమునకు ఆశ్రయము వంటకము ధాత్వర్థఫలాశ్రయము. కావున (వండబడినపదార్థమును తెలుపు) 'వంటక' అనుశబ్దము కర్మము అయినది. కర్మ అయిన 'వంటక' శబ్దమునకు 'కర్మంబున ద్వితీయ యగు' అనుసూత్రముచే ద్వితీయావిభక్తి వచ్చి, 'వంటకమును' అని యగును.

'కర్మంబున' అనుటచే కర్మము కానిదానికి ద్వితీయ రాదు. దేవదత్తునిచేత వండబడెను. ఇట దేవదత్తుడు కర్త కావున ద్వితీయ ప్రాప్తింపదు. 'చేత వర్ణకంబు కర్త కగు' అనుసూత్రముచే చేత వర్ణకము వచ్చును.

'ద్వితీయ యగు' అనుటచే కర్మకు ఇతరవిభక్తి రాదు. 'దేవదత్తుడు వంటకముచేత వండెను' ఇత్యాదిగా ఇతరవిభక్తులు ఉండవు. ('వంటకము వండబడెను అనురీతిగా ఉక్తార్థమునందు కర్మకు విశేషవిధిచే ప్రథమ రావచ్చును.)

**3. చేతవర్ణకంబు కర్త కగు.**

**ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు. దేవదత్తునిచేత వంటకము వండఁబడియె. వండఁబడియె ననఁగా వంటచేయఁబడె నని యర్థము. చేయుట కాశ్రయుఁ డగుటంజేసి దేవదత్తుఁడు కర్త యయ్యె.**

కర్తను తెలియజేయుశబ్దమునకు చేత అనుతృతీయావిభక్తి వచ్చును. కర్త అనగా ధాత్వర్థవ్యాపారాశ్రయము. ధాతువునకు వ్యాపారము, ఫలము అని రెండు అర్థములు. వీనిలో ధాతువుయొక్క అర్థము అయినవ్యాపారము దేనిని ఆశ్రయించి యుండునో అది కర్త. దేవదత్తునిచేత వంటకము వండఁబడియె. ఇచట 'వండు' ధాతువునకు అర్థ మైన 'వంట చేయుట' అనువ్యాపారము దేవదత్తుని ఆశ్రయించి యుండుటచే దేవదత్తుఁడు కర్త. కాగా అట్టికర్తను బోధించునట్టి 'దేవదత్త' అను

శబ్దమునకు ఈసూత్రముచేత 'చేత' అనుప్రత్యయము వచ్చి, 'దేవదత్తునిచేత' అని అగును.

'చేతవర్ణకంబు' అని నిర్దేశించుటచే ఇతరవిభక్తిప్రత్యయములు రావు. 'దేవదత్తునితోడ వంటకము వండఁబడియె' అని మొదలుగా ఉండదు. (దేవదత్తుడు వండెను అనుతీరుగా విశేషవిధిచే ఉక్తార్థమునందు కర్తకు ప్రథమ రావచ్చును.)

'కర్త కగు' అనుటచేత కర్త కానిదానికి ఈసూత్రముచే చేత రాదు. దేవదత్తుడు వంటకముచేత వండెను' అనురీతిగా కర్మ మొద లగువానికి చేతవర్ణకము రాదు.

**4. చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగు పంచమికిని బహుళంబుగా నగు.**

**ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు. క్రియాసిద్ధిం బ్రకృష్టోప కారకంబు కరణంబు. హేతువునకు – ధనముచేత సౌఖ్యంబు గలుగు. విద్యచేత యశంబు గలుగు. పక్షంబున వలన వర్ణకం బగు.**

**కరణంబునకు – ఖడ్గంబుచేత ఖండించె. కోలచేతఁ గూలనేసె. పక్షంబునం దోడవర్ణకం బగు.**

**గ్రహ్యాదియోగంబునందు – జరాసంధుండు రాజులచేతఁ గప్పంబు గొనియె. మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె. ఈయర్థంబు నీచేత నెఱింగితి. ఈవృత్తాంతంబు వానిచేత వింటి. పక్షంబున వలన వర్ణకం బగు. ఇత్యాదు లెఱుంగునది.**

హేతువును తెలియఁజేయుశబ్దమునకును, కరణమును బోధించుశబ్దమునకును, గ్రహణము మొద లగుఅర్థములలో వచ్చు పంచమీవిభక్తిస్థానమునను బహుళముగా చేత అనుతృతీయావిభక్తి అగును.

ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు. ఫలమును సాధించుటకు తగినపదార్థము హేతువు. ధనముచేత సౌఖ్యంబు గలుగు. సౌఖ్యము అనుఫలమును సాధించుటకు తగినపదార్థము ధనము. కావున సౌఖ్యమునకు ధనము హేతు వగుచున్నది. అందుచే దానిని తెలియజేయ 'ధన' అనుశబ్దమునకు ప్రస్తుత సూత్రముచే 'చేత' ప్రత్యయము వచ్చి, ధనముచేత అని అయినది. ఇట్లే 'విద్యచేత' యశంబు గలుగు మొ. బహుళము అనుటచే చేత ప్రత్యయము రానిపక్షమునందు హేతువునకు వలన అనుపంచమీవిభక్తి వచ్చును. ధనమువలన సౌఖ్యంబు గలుగు, విద్యవలన యశంబు గలుగు. మొ.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారణంబు కరణంబు. క్రియ సిద్ధించుటలో మిక్కిలిగా

ఉపయోగించునట్టిసాధనమునకు కరణము అని సంజ్ఞ. ఖడ్గంబుచేత ఖండించె. 'ఖండించుట' అనుక్రియ సిద్ధించుటకు ఉపయోగించుసాధనము అగుటచే ఖడ్గము కరణము. కావున దానిని బోధించు 'ఖడ్గ' శబ్దమునకు ప్రస్తుతసూత్రముచే 'చేత' అనుతృతీయ వచ్చి 'ఖడ్గంబుచేత' అని అయినది. ఇట్లె కోలచేతఁ గూలనేసె. మొ. బహుళము అనుటచే 'చేత' విభక్తి రానపుడు 'కరణసహార్థతుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడ వర్ణకం బగు' అనుసూత్రముచే 'తోడ' అనుతృతీయ వచ్చి, ఖడ్గంబుతోడ ఖండించె, కోలతోడఁ గూల నేసె మొ.

గ్రహి (గ్రహణము) మొద లగునవి గ్రహ్యాదులు. కొనుట, వినుట, ఎఱుంగుట మొద లగునవి. వీనితో అన్వయము కలిగినపుడు 'అపాయ భయజుగుప్సాపరాజయ ప్రమాదగ్రహణ' మొద లగుసూత్రముచే వలన అనుపంచమీవిభక్తి వచ్చును. అట్లు వచ్చినట్టి పంచమీవిభక్తిస్థానమున ఈసూత్రముచే 'చేత' ప్రత్యయము వచ్చును. జరాసంధుడు రాజులచేతఁ గప్పంబు గొనియె. ఇచట కప్పము 'గ్రహించుట' రాజులనుండి. కావున రాజశబ్దమునకు 'అపాయభయ' ఇత్యాదిసూత్రముచే వలనప్రత్యయము రాగా, దానికి ఈసూత్రముచే 'చేత' వచ్చి, 'రాజులచేత కప్పంబు కొనియె' అని ఐనది. బహుళము అనుటచే చేతవిభక్తి రానిపక్షమునందు 'వలన' అనుపంచమీవిభక్తి అట్లే ఉండును. 'రాజులవలనఁ గొనియె'.

'చేతవర్ణకంబు' అనుటచేత ఇతరప్రత్యయములు రావు. 'ధనముతోడ సౌఖ్యంబు గలుగు' మొద లగువిధముగా ఉండదు.

'హేతుకరణంబులకు' అనుటచే ఇతరములకు ఈకార్యము లేదు. రామునిచేత కన్య నిచ్చెను ఇత్యాదిగా సంప్రదానము మొద లైనఅర్థములలో చేతవిభక్తి రాదు.

'గ్రహ్యాదియోగజం బగుపంచమికి' అనుటచే అపాయము మొద లగు ఇతరార్థములందు వచ్చినపంచమికి 'చేత' రాదు. రాజ్యంబువలన భ్రష్టుఁడు అనుచోట 'రాజ్యముచేత భ్రష్టుడు' అనువిధముగా ఉండదు.

**5. కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు.**

**కరణంబునందు – కోలతోడఁ గూలనేసె. సహార్థంబునందు – రాజు సేనలతోడ వచ్చె. సేనాసహితుం డయి వచ్చె నని యర్థము. తుల్యార్థ యోగంబునందు – చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. తృతీయ కనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుం డని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.**

కరణమును తెలియజేయుశబ్దమునకు, సహార్థము(కూడ)నం దున్న శబ్దము లకును, తుల్యార్థముతో అన్వయించునట్టిశబ్దములకును సంస్కృతవ్యాకరణము

ననుసరించి వచ్చినతృతీయావిభక్తికి తెలుగులో 'తోడ' అనుప్రత్యయము వచ్చును.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. క్రియ సిద్ధించుటలో మిక్కిలిగా ఉపయోగించునట్టిసాధనమునకు కరణము అని సంజ్ఞ. కోలతోడఁ గూల నేసె. ఇచట 'ఏయుట' అనుక్రియ సిద్ధించుటకు మిక్కిలిగా ఉపకరించినసాధనము కావున 'కోల' కరణము, దానిని తెలియజేయు 'కోల' అనుశబ్దమునకు ప్రస్తుతసూత్రముచే 'తోడ' అనుతృతీయావిభక్తి వచ్చి 'కోలతోడ' అని ఐనది.

రాజు సేనలతోడ వచ్చె. వచ్చినది రాజు. అతడు సేనలతో కూడి వచ్చెను. కావున 'సేన' అనుశబ్దము సహార్థమునం దుండుటచే దానికి ఈసూత్రముచే తోడ ప్రత్యయము ఐనది.

'తుల్యము' అనుఅర్థముతో అన్వయించునట్టిశబ్దములకు తోడ అనుతృతీయ అగును. చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. తుల్యశబ్దముతో అన్వయించుటచే 'చైత్ర' శబ్దమునకు ఈసూత్రముచే 'తోడ' విభక్తి అయినది. ఇట్లే 'మైత్రుడు చైత్రునితో సమానము. మొ.

'కరణసహార్థతుల్యార్థయోగంబులందు' అనుటచే ఇతరార్థములందు ఈకార్యము లేదు. 'దేవదత్తుడు వంటకముతోడ వండెను' అనురీతిగా కాదు.

'తృతీయకు' అనుటచేత తృతీయ రానిపక్షమున షష్ఠి వచ్చును. 'తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్' అనుసంస్కృతలక్షణము ననుసరించి తుల్యార్థకశబ్దములతోడియోగమునందు తృతీయ వికల్పము. తృతీయ రానిపక్షమునందు 'షష్ఠీ శేషే' అని షష్ఠి వచ్చును. కాగా, తృతీయకు తోడ రాగా, తృతీయ రానపుడు సంస్కృతమునందువలె షష్ఠీవిభక్తి వచ్చి, దానికి తెలుగున 'కు' అనుప్రత్యయము వచ్చును. చైత్రునకు మైత్రుడు తుల్యుండు.

'తోడవర్ణకం బగు' అనుటవలన తృతీయయే అయినను 'చేత' రాదు. చైత్రుని చేత వచ్చెను. చైత్రునిచేత తుల్యుఁడు అని సహార్థతుల్యార్థయోగములలో చేతతో రూపము లుండవు.

**6. వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకువర్ణకంబులు ప్రాయికంబుగ నగు.**

**మైత్రుండు చైత్రునితోడ ని ట్లనియె, మైత్రుండు చైత్రుని కి ట్లనియె. ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.**

వచిధాతువుయొక్క అర్థము వచ్యర్థము. 'ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే' అని వచ ధాతువు ఇగంతముగా నిర్దేశింపబడినది. చెప్పు, పలుకు, అను మొద లగునవి వచ్యర్థములు. ముఖ్యము కానికర్మము అముఖ్యకర్మము.

అను మొద లగుధాతువులయొక్క ముఖ్యము కానిది అయినకర్మమునకు,

తోడ, కు అనువిభక్తులు తఱుచుగా వచ్చును. కర్మము అగుటచే 'కర్మంబున ద్వితీయ యగు' అనుసూత్రముచే ద్వితీయ రావలసియుండగా దానిని బాధించి, ఈసూత్రము తోడ అనుతృతీయను, కు అనుషష్ఠిని విశేషముగా చెప్పుచున్నది.

మైత్రుండు చైత్రునితోడ ఇట్లు అనియె. ధాత్వర్థఫలాశ్రయములు అగుటచే, ఇట్లు, చైత్ర అనుశబ్దములు రెండును కర్మములె. మాటలవిధము చెప్పబోవుటను అనుసరించి 'ఇట్లు' అనునదె అనుధాత్వర్థఫలమునకు ముఖ్యముగా ఆశ్రయ మగుచున్నది. కావున ఇది ముఖ్యకర్మము. 'అట్లు' పలికినమాటలు 'చైత్రునిగూర్చి'. చైత్ర అనునది అముఖ్యకర్మము. కావున దానికి ఈసూత్రముచేత తోడప్రత్యయము వచ్చినచో 'చైత్రునితోడ ఇట్లు అనియె' అనియు, 'కు' అనుప్రత్యయము వచ్చినచో 'చైత్రునకు ఇట్లు అనియె' అనియు అగును.

'వచ్యర్థ' అనుటచే ఇతర మైనఅర్థమునందలి ధాతువుయొక్క అముఖ్యకర్మమునకు తోడ, కు వర్ణకములు రావు. ద్వితీయయె వచ్చును. దేవదత్తుడు వంటకమును ఇట్లు వండెను మొ.

'అముఖ్యకర్మంబునకు' అనుటచే ముఖ్య మైనకర్మమునకు తోడ కు వర్ణకములు రావు. వాఁడు సత్యమును పలికెను.

'ప్రాయిక' మనుటచే తోడ, కు వర్ణకములు రాక ద్వితీయయు అరుదుగా వచ్చును. మైత్రుండు చైత్రు ని ట్లనియె.

**7. ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు.**

**నియమపూర్వకవిద్యాస్వీకారం బుపయోగం బనంబడు. రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి. సాందీపనివలన అని అర్థము.**

నియమములతో విద్యను స్వీకరించుట ఉపయోగము అనబడును. ఆఖ్యాత అనగా చెప్పువాడు. అనగా గురువు. నియమములతో విద్యను పొందునట్టి అర్థమునందు గురువును బోధించుశబ్దమునకు 'తోడ' అనుతృతీయావిభక్తి వచ్చును.

రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి. గురువు అయిన సాందీపని శబ్దమునకు ఈసూత్రముచేత 'తోడ' అనుప్రత్యయము వచ్చినది. ఇచట 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ' మున్నగుసూత్రముచే గ్రహణార్థమునందు వలనవర్ణకము వచ్చి సాందీపనివలన చదివిరి అనియు రూప ముండును.

**8. సంప్రదానంబునకుం జతుర్థి యగు.**

**త్యాగోద్దేశంబు సంప్రదానంబు నాఁబడు. జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చెను. కొన్నియెడల నుద్దేశమాత్రంబున కగు. పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱుచుగఁ బ్రయోగంబులం గానంబడియెడి. జనకుఁడు రామునకుఁ గన్య నిచ్చెను. పురుషార్థంబునకు యత్నింపవలయు.**

త్యాగమునకు ఉద్దేశింపబడినది సంప్రదానము అనుసంజ్ఞను పొందును. ఎవ్వరిని ఉద్దేశించి అనగా ఎవ్వరికి ఇచ్చుట జరుగునో అది సంప్రదానము. ఆ సంప్రదానమును తెలియజేయుశబ్దమునకు 'కొఱకు, కయి' అనుచతుర్థీవిభక్తులు వచ్చును.

జనకుండు రామునికొఱకు కన్య నిచ్చెను. కన్యను ఇచ్చుటకు ఉద్దేశింపబడిన వాడు కావున రాముడు సంప్రదానము. సంప్రదాన మగురాముని బోధించు శబ్దము 'రామ' అనునది. దానికి ప్రస్తుతసూత్రముచేత చతుర్థీవిభక్తి వచ్చును. రామునికొఱకు. కయి ప్రత్యయ మైనచో – రామునికయి కన్య నిచ్చెను.

కొన్నియెడల త్యాగము లేకున్నను కేవలము ఉద్దేశింపబడినదానికి కూడ చతుర్థి వచ్చుట కలదు. 'పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. ప్రయత్నము పురుషార్థము ఉద్దేశించినది. ఇచ్చట త్యాగము (ఇచ్చుట) లేదు. అయినను ఉద్దేశింపబడినది అయిన పురుషార్థమును తెలుపునట్టి పురుషార్థశబ్దమునకు చతుర్థి వచ్చి 'పురుషార్థంబుకొఱకు' అని అయినది.

ఇచట 'కు' అనుషష్ఠీవిభక్తియె తఱుచుగా కవిప్రయోగములలో కనబడుచున్నది. జనకుడు రామునకు కన్య నిచ్చెను, పురుషార్థంబునకు యత్నింపవలయును.

'సంప్రదానంబునకు' అనుటచే ఇతర మైనఅర్థములందు ఈకార్యము లేదు.

'చతుర్థి' అని సామాన్యముగా చెప్పుటచే చతుర్థీవిభక్తులు అయిన కొఱకు, కయి అనుప్రత్యయములు రెండును వచ్చును. రామునికొఱకు ఇచ్చెను. రాముని కయి ఇచ్చెను మొ.

**9. అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు.**

**అపాయము–విశ్లేషము. భయము–వెఱపు. జుగుప్స–ఏవ. పరాజయము –డయ్యుట. ప్రమాదము–పరాకు. గ్రహణము–కొనుట. ఎఱుఁగుట. వినుట ఇత్యాది. భవనము–పుట్టుట. త్రాణము–కాచుట. విరామము–విరమించుట. అంతర్ధి–మఱుఁగుట. వారణము–వారించుట.**

**అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుం డయ్యె. భయంబునకు - చోరునివలన భయపడియె. జుగుప్సకు - పాపంబువలన నేవగించె. పరాజయమునకు- అధ్యయనమువలన డస్సె. ప్రమాదమునకు- పాడివలనం బరాకుపడియె. గ్రహణంబునకు- మైత్రునివలన ధనంబు గొనియె. భవనంబునకు- మనువువలనం బ్రజలు పుట్టిరి. త్రాణంబునకు- చోరునివలనం గాచె. విరామంబునకు- భోగంబులవలన విరమించె. అంతర్ధికి- కృష్ణుండు తల్లివలన దాఁగె. వారణంబునకు- శోకంబువలన వారించె. పంచమికి షష్ఠియుం గొండొక యెడల నగు. చోరునకు వెఱచె. పాపంబున కేవగించె. అధ్యయనంబునకు డస్సె. పాడికిం బరాకువడియె. మనువునకు నిక్ష్వాకుండు పుట్టె. ఇత్యాదు లూహించునది.**

అపాయము అనగా ఎడబాటు, దేనినుండి ఎడబాటు కలుగునో దానిని తెలియజేయుశబ్దమునకు వలన అనుపంచమీవిభక్తి వచ్చును. 'రాజ్యమువలన భ్రష్టు డయ్యె' రాజ్యమునుండి ఎడబాటు కలిగినది. కావున రాజ్యమును బోధించు 'రాజ్య' అనుశబ్దమునకు ఈసూత్రముచే 'వలన' అనుప్రత్యయము వచ్చి రాజ్యము వలన అని అగును. ఇట్లే భయము, అసహ్యము, అలసత, పరాకు, గ్రహించుట, పుట్టుట, రక్షించుట, విరమించుట, దాగుట, నివారించుట' అనునవి దేనినుండి కలుగునో దానిని తెలియజేయుశబ్దమునకు 'వలన' ప్రత్యయము వచ్చును. చోరునివలన భయపడియె, శోకంబులన వారించె మొ.

అపాయ, భయ - ఇత్యాదిగ చెప్పుటనుబట్టి వీనికంటె ఇతర మైనఅర్థములలో ఈకార్యము లేదు.

'వలన వర్ణకంబు' అనుటచే ఇతరవర్ణకములు రావు. రాజ్యముకంటె భ్రష్టుఁడు, శోకంబుబట్టి వారణము మొద లగువిధముగా ఉండవు.

కొన్ని అర్థములలో మాత్రము 'కు' అనుషష్ఠీవిభక్తి వచ్చును. చోరునివలన వెఱచె, అనుచో 'భయమున' వలనకు మారుగా 'కు' విభక్తి వచ్చి, చోరునకు వెఱచె అని అగును. ఇట్లే మనువువలన ఇక్ష్వాకుడు పుట్టెను - మనువునకు ఇక్ష్వాకుడు పుట్టెను.

ఈషష్ఠి కొండొకయెడల మాత్రమే. కావున అపాయాదు లగు అన్నిఅర్థము లందును రాదు. రాజ్యమునకు భ్రష్టుడు. చోరునకు గాచెను. మొద లగువ్యవహార ముండదు.

**10. ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు.**

**హిమగిరివలననుండి గంగ వొడమె. నాకంబువలననుండి నారదుండు**

వచ్చె.

అనుప్రయుక్తము అనగా అనుసరించి ప్రయోగింపబడినది. 'వలన' అను ప్రత్యయమునకు పైని కొన్నియెడల 'ఉండి' అనుపదము ప్రయోగింపబడును అని అర్థము.

హిమగిరివలన గంగ వొడమె, ఇచట భవనార్థమునందు 'అపాయభయ జుగుప్సాపరాజయప్రమాదగ్రహణభవనత్రాణవిరామాంతర్థివారణంబు లెద్దాన నగు దానికి వలనవర్ణకం బగు' అనుసూత్రముచే వలనవర్ణకము వచ్చి, హిగిరివలనను అని కాగా, ప్రస్తుతసూత్రముచే 'వలనకు' పైని 'ఉండి' పదము చేరి, 'హిమగిరివలననుండి' అని అగును.

'ఉండిపదంబు' అనుటచే ఇతరపదము చేరదు. కావున వనము(వలన)నుంచి అనురీతిగా ఉంచి పదమును చేర్చిప్రయోగించుట లక్షణవిరుద్ధము.

'ఒకానొకచో' అనుటచే ఈకార్యము విరళము. కావున 'ఉండి' పదము అను ప్రయుక్తము కానిరూపములే తఱచుగా నుండును.

'అనుప్రయుక్తము' అనుటచే వలనవర్ణకమును అనుసరించి ప్రయుక్తము కావలయును. కావున వలనప్రత్యయము తరువాత చేరును. కావున వనముండి వలన అనురీతిగా కాదు.

**11. ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాపప్తములు ప్రాయికంబుగ నగు.**

**వనమునుండి వచ్చె, వనమందుండి వచ్చె. ఊరినుండి వచ్చె. ఊరనుండి వచ్చె. వనమునుంచి, ధనమునుంచి యని యుంచిశబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవిప్రయోగారూఢంబు గా దని యెఱుంగునది.**

అనుప్రయుక్తము అయిన ఉండి అనుపదము పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునందు ఉన్న 'వలన' ప్రత్యయముస్థానమున ద్వితీయావిభక్తియును, సప్తమీవిభక్తియును తఱచుగా వచ్చును.

అపాయమునందు అపాయభయజుగుప్సా- మొద లగుసూత్రముచేత 'వన శబ్దమునకు వలన ప్రత్యయము వచ్చి, వనమువలన అని అగును. 'ఉండి పదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే 'ఉండి' పదము చేరగా, వనమువలనను+ఉండి అని కాగా, ప్రస్తుతసూత్రముచే వలనకు ద్వితీయావిభక్తి యగు 'నువర్ణము' వచ్చినచో, వనమును+ఉండి – వనమునుండి అని అగును. ఇచ్చట వలనకు ద్వితీయ రాక, ప్రస్తుతసూత్రముచేతనె సప్తమి

వచ్చినచో, వనమునందు+ఉండి – వనమునందుండి అని అగును.

'ఉండిశబ్దము పరం బగునపుడు' అనుటచే ఉండి అనుప్రయుక్తము కాని సందర్భమునందు వలనకు ద్వితీయాసప్తములు రావు. వనమును వచ్చెను వనమునందు వచ్చెను అని యుండదు.

'ద్వితీయాసప్తములు' అనుసామాన్యనిర్దేశముచే ద్వితీయయందును సప్తమీ యందును ఉన్న ప్రత్యయములు అన్నియు వచ్చును. ద్వితీయందు 'ను' వర్ణ మొక్కటె. వనమునుండి. సప్తమియందు అందు, న, అనునవి రెండు కలవు. కావున రెండును వచ్చును. వనమందుండి వచ్చెను, వనముననుండి వచ్చెను.

'ప్రాయికము' అనుటచే ద్వితీయాసప్తములు రాక 'వలన' అట్లే యుండుటయు అరుదుగా కలదు. వలమువలన నుండి వచ్చె మొ.

## 12. కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు.

**రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు. లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు. ఇచట షష్ఠియు నగు. రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు. అన్యము–ఇతరము–పూర్వము–పరము–ఉత్తరము–ఇత్యాదు లన్యాదులు.**

అన్యము, ఇతరము మొద లగునవి అన్యాదులు. అన్యము మొద లగు శబ్దములఅర్థముతో అన్వయము కలిగినశబ్దమునకు 'అన్యారాదితరర్తే..' మున్నగు సంస్కృతలక్షణము ననుసరించి సంస్కృతమున పంచమీవిభక్తి వచ్చును. అట్లు కలగినపంచమీవిభక్తికి తెలుగున 'కంటె' అను(పంచమీ)ప్రత్యయము వచ్చును.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేడు. 'రామ' శబ్దార్థము ఇచట 'అన్యుడు' అనుచోటిఅన్యశబ్దముయొక్క అర్థముతో అన్వయము కలిగిఉన్నది. కావున రామ శబ్దమునకు సంస్కృతానుసారముగా వచ్చినపంచమీవిభక్తికి తెలుగులో కంటె వర్ణకము వచ్చి, 'రామునికంటె నన్యుడు' అని వ్యవహరింపబడును.

లోభముకంటె ఇతరము దోషము లేదు. ఇచట ఇతరము అనుదానితో అన్వయమున కంటె ప్రత్యయము ఐనది.

అన్యార్థాదియోగమునందు పంచమికి బదులుగా కు అనుషష్ఠీవిభక్తి కూడ వచ్చును. రామునకు అన్యుండు, లోభమునకు ఇతరము. మొ.

'కంటె వర్ణకంబు' అనుటచే వలన మొద లగుఇతరప్రత్యయములు రావు. 'రామునివలన నన్యుడు' అనుమొద లగువిధముగా ఉండదు.

'అన్యార్థాది(యోగజంబు) అనుటచే అన్యాదులలో చేరనిశబ్దముతో యోగము ఉన్నచో కంటె ప్రత్యయము రాదు. రాముడు గొప్ప ధానుష్కుడు.

'(అన్యార్థాది)యోగజంబు' అనుటచే అన్యము మొద లగువానితో యోగము లేనపుడు (పంచమి) కంటె రాదు. రాముడు అన్యులకు అసాధ్యుడు.

**13. కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు.**

**ఎచట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు గలిగియుండు నచటం బంచమి యగు. ఆపంచమికిం గంటె వర్ణకం బగు నని యర్థము.**

నిర్ధారణమునందు పంచమీవిభక్తి అగును. ఆపంచమీవిభక్తికి కంటె అనుప్రత్యయము వచ్చును. నిర్ధారణము అనగా నిశ్చయించి చెప్పుట. జాతి, గుణము, క్రియ, సంజ్ఞ అను నాలుగులక్షణములతో నిర్ధారణము జరుగును. నిర్ధరింపబడునట్టివస్తువు దేనినుండి నిర్ధారింపబడుచున్నదో దానితో జాతి, గుణము, క్రియ, సంజ్ఞ అనువానిలో ఏదో ఒకలక్షణముచే భేదము గలిగిఉండుచో అచ్చుట దేనినుండి నిర్ధారింపబడునో దానికి సంస్కతలక్షణము (పంచమీవిభక్తే. నిర్ధార్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పఞ్చమీ స్యాత్.) ననుసరించి పంచమీవిభక్తి రాగా, ఆపంచమికి తెలుగున కంటె అనుప్రత్యయము వచ్చును.

జానపదులకంటె నాగరులు వివేకులు. ఇచట వివేకమునుబట్టి జానపదుల నుండి నాగరులు నిర్ధారింపబడిరి. నాగరులు అనునది జానపదులతో జాతిరూపము అయినభేదము గలిగిఉన్నది. నాగరులు జానపదులనుండి నిశ్చయింపబడిరి. కావున 'జానపద'శబ్దమునకు ఈసూత్రముచే 'కంటె' అనుప్రత్యయము వచ్చి, జానపదులకంటె అని ఐనది. ఇట్లే గుణమునకు – తెలుపుకంటె నలుపు మేలు. క్రియకు – నడచువారికంటె పరువెత్తువారు శీఘ్రగాములు. సంజ్ఞకు – కృష్ణునికంటె రాముడు గొప్పవాడు.

'కంటెవర్ణకంబు' అనుటచే 'జానపదులవలన నాగరులు వివేకులు' మొద లగువిధముగా ఇతరవిభక్తులు గలుగవు.

'నిర్ధారణ' అనుటచే నిర్ధారణము లేనపుడు 'కంటె' రాదు. జానపదులును నాగరులును మిత్రులు.

దేనినుండి నిశ్చయింపబడుచున్నదో దానితో భేదము లేనపుడు నిర్ధారణమున కంటె రాదు. లోపల వర్ణకము వచ్చును. మనుష్యులలోపల క్షత్రియుడు శూరుడు.

**14. పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు.**

**జ్ఞానముఁబట్టి ముక్తుఁ డగు. నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నయితి.**

**ఇచట వలన వర్ణకంబు నగు. జ్ఞానమువలన ముక్తుం డగు.**

ఫలమును సాధించుటకు తగినవస్తువు హేతువు. హేతువు అయిన గుణమును తెలుపుశబ్దమునకును, హేతువు అయినక్రియను (వ్యాపారమును) తెలుపు శబ్దమునకును 'పట్టి' అనుపంచమీవిభక్తిప్రత్యయము వచ్చును. 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగు పంచమికిని బహుళముగా నగు' అనుసూత్రముచే బహుళముగా వచ్చుచున్న 'చేత'ను బాధించి ఈసూత్రముచే 'పట్టి' వచ్చును.

'జ్ఞానమునుబట్టి ముక్తుం డగు'. 'ముక్తు డగుట' అనుఫలము సాధించుటకు తగినవస్తువు కావున 'జ్ఞానము' హేతువు. ఇది గుణము, కావున హేతువు అయిన గుణమును తెలుపు 'జ్ఞాన' అనుశబ్దమునకు ఈసూత్రముచే పట్టివిభక్తి వచ్చి 'జ్ఞానముబట్టి' ముక్తుం డగు అని అగును.

నీవు వచ్చుటంబట్టి ధన్యుండ నయితి అనుచో ధన్యు డగుటకు 'వచ్చుట' అను క్రియ హేతు వయినది. కావున దానిని తెలుపు వచ్చుట అనుశబ్దమునకు పట్టి విభక్తి చేరి, 'వచ్చుటంబట్టి' అని అయినది. (క్రియ హేతు వైనపుడు పంచమి వచ్చుట తెలుగులో విశేషము.)

ఇచట వలనప్రత్యయమును వచ్చును. జ్ఞానమువలన ముక్తు డగు. మొ.

'పట్టివర్ణకంబు' అనుటచే 'జ్ఞానముకంటె ముక్తుం డగు' అనువిధముగా ఇతర విభక్తి రాదు.

'హేతువు లగు' అనుటచే హేతువులు కానిగుణక్రియలకు పట్టి వర్ణకము రాదు. జ్ఞానము గొప్పగుణము మొ.

'గుణక్రియలకు' అనుటచే గుణమును క్రియయును కాని హేతువునకు పట్టి ప్రత్యయము రాదు. 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు' అనుసూత్రముచే 'చేత' వర్ణకము వచ్చును. విద్యచేత యశంబు కలుగును.

## 15. శేషషష్ఠికి యొక్కయు నగు.

**ఇచట శేషం బనఁగా సంబంధంబు. రామునియొక్క గుణములు, నాయొక్క మిత్రుఁడు. వానియొక్క తమ్ముఁడు. కువర్ణకంబును గొన్నియెడల సంబంధమునం దగు. నాకుఁ దమ్ముఁడు. మీకు నెచ్చెలి.**

శేషము అనగా సంబంధము. సంబంధార్థమునందు దేనికి సంబంధించినచో దానిని తెలుపుశబ్దమునకు సంస్కృతలక్షణము (షష్ఠీ శేషే) ననుసరించి షష్ఠీవిభక్తి వచ్చును. ఆషష్ఠికి యొక్క అనుప్రత్యయము కూడ వచ్చును.

రామునియొక్క గుణములు. ఇందు గుణములు రామునికి సంబంధించినవి అగుటచే 'రామ' శబ్దమునకు షష్ఠీవిభక్తియు దానికి ప్రస్తుతసూత్రముచే యొక్క ప్రత్యయమును వచ్చి, రామునియొక్క అని అయినది. ఈయొక్క అనుప్రత్యయము గుణములు రామునికి చెందిన వగుటను ద్యోతకము చేయును.

'శేషషష్ఠికి' అనుటచే నిర్ధారణార్థమునం దగుషష్ఠికి యొక్క రాదు. దేవతల లోపల శ్రీకాంత అధికురాలు. ఇచట 'దేవతలకు' అని ఉండదు.

'యొక్కయు' అనుచోటిసముచ్చయముచే యొక్కతోపాటు వేరొకపక్షమునందు కువర్ణకమును గలదు. రామునియొక్క తమ్ముఁడు – రామునకు తమ్ముడు. మొ.

## 16. నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు.

**జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబు నకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణం బగు నచ్చట షష్ఠికి లోపల వర్ణకం బగు నని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు. గోవులలోపలఁ గపిల బహుక్షీర. అధ్వగులలోపలఁ బాఱువాఁడు శీఘ్రగామి. ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు. ఇట సప్తమియుం గలదు. మనుష్యులందు క్షత్రియుండు శూరుండు. ఇత్యాదు లెఱుంగునది.**

సముదాయము (గుంపు)నుండి ఆసమూహములోని ఒకభాగము, జాతి గుణము, క్రియ, సంజ్ఞ అనువానినిబట్టి వేరుచేయుట నిర్ధారణము. దేనినుండి నిర్ధారణము అగునో దానికి అనగా సముదాయమును తెలియజేయుశబ్దమునకు 'యత శ్చ నిర్ధారణమ్' అని సంస్కృతమున షష్ఠీసప్తమీవిభక్తులు చెప్పబడినవి. అట్లు నిర్ధారణమున వచ్చినషష్ఠి(శేషషష్ఠి)కి తెలుగున 'లోపల' అనుప్రత్యయము వచ్చును.

'మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు'. మనుష్యులసమూహమునుండి ఆమనుష్యుల(సముదాయము)లో భాగ మయిన 'క్షత్రియులు' అనునది (జాతిని బట్టి) వేరు చేయబడినది. 'మనుష్యులనుండి' నిర్ధారణ జరుగుటచే 'మనుష్య' శబ్దమునకు ఈసూత్రముచే లోపల అనుషష్ఠీవిభక్తి వచ్చినది.

ఇచట (సంస్కృతము ననుసరించి) సప్తమి గూడ వచ్చును. మనుష్యులందు క్షత్రియుడు శూరుడు. మనుష్యసముదాయమున క్షత్రియుడు శూరుడు.

గోవులలోపల కపిల బహుక్షీర. అనుచోట గోవుల (సముదాయము) నుండి కపిల అనునది గుణమునుబట్టి, అధ్వగులలోపల పాఱువాడు శీఘ్రగామి అనుచో పాఱువాడు పరుగెత్తుట అనుక్రియను అనుసరించియు, ఛాత్రులలోపల మైత్రుండు

సమర్థుండు 'అనుచోట మైత్రుడు అనునది సంజ్ఞనుబట్టియు వేఱుచేయబడినవి. కావున 'లోపల' వచ్చినది.

'నిర్ధారణ'షష్ఠికి అనుటచే ఇతరార్థములందు వచ్చినషష్ఠికి లోపల ప్రత్యయము రాదు. రామునియొక్క గుణములు. ఇట రామునిలోపలగుణములు అని ఉండదు.

నిర్ధారణ'షష్ఠికి' అనుటచే నిర్ధారణమునందు వచ్చిన ఇతరవిభక్తులకు లోపల రాదు. జానపదులకంటె నాగరులు వివేకులు, ఇచట జానపదులలోపల నాగరులు అని ఉండదు.

'లోపలవర్ణకంబు' అనుటచే మనుష్యులకు, లేదా మనుష్యులయొక్క, క్షత్రియుండు శూరుండు' అనువిధముగా నిర్ధారణషష్ఠికి ఇతరషష్ఠీవిభక్తులు రావు.

## 17. అధికరణంబునకు సప్తమి యగు.

**అధికరణంబు నా నాధారంబు. ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకం బని యాధారంబు త్రివిధంబు. ఘటమందు జల మున్నది. మోక్షమం దిచ్ఛ గలదు. అన్నింటియం దీశ్వరుండు గలండు.**

అధికరణము అనగా ఆధారము. ఏది ఆధారమొ దానిని తెలుపుశబ్దమునకు సప్తమీవిభక్తి వచ్చును. ఆధారము మూడువిధములు.

1. ఔపశ్లేషికము : వస్తువునందు ఏకదేశము మాత్రము ఆధారము అయినచో అది ఔపశ్లేషికము. ఉప–శ్లేష దగ్గరిసంబంధము కలది. ఘటమందు జల మున్నది. జలము కుండను ఆధారము చేసికొనియున్నది. కుండలోపలిభాగము అనగా కుండయందు ఏకదేశము మాత్రము జలమునకు ఆధారము. కాన ఇది ఔపశ్లేషికము. దానికి ప్రస్తుతసూత్రముచే సప్తమి వచ్చి, సప్తమికి అందు ప్రత్యయము రాగా, 'ఘటమందు'. నవర్ణకము వచ్చినచో 'ఘటమున' అని అగును.

2. వైషయికము : విషయమునకు సంబంధించినఆధారము వైషయికము. మోక్షమున ఇచ్ఛ గలదు. ఇచట మోక్షము అనునది జలము మొద లగువానివలె వస్తువు కాదు. విషయము. కావున ఇచ్ఛ అనుదానికి ఆధారము అగుటచే (మోక్షమును ఆధారముచేసికొని ఇచ్ఛ యున్నది.) మోక్షము అనునది విషయమునకు సంబంధించిన ఆధారము వైషయికము. కావున 'మోక్ష' శబ్దమునకు ఈసూత్రముచే సప్తమియు, దానికి 'న'వర్ణకమును వచ్చి 'మోక్షమున' అని అగుచున్నది.

అభివ్యాపకము : అన్నియెడల వ్యాపించియున్నట్టి ఆధారము అభివ్యాపకము.

'అన్నింటియం దీశ్వరుండు గలండు' ఈశ్వరునకు ఆధారము. 'సమస్తము'. లోపల, వెలుపల, అంత భాగమును ఇచ్చట ఆధారము. కావున అభివ్యాపక మగుఈ ఆధారమునకు ప్రస్తుతసూత్రముచే సప్తమియు, సప్తమికి అందు ప్రత్యయమును వచ్చి 'అన్నింటియందు' అని అగును.

అధికరణము అని సామాన్యముగా చెప్పుటచే అన్ని (మూడు) విధము లయిన ఆధారములకును పయివిధముగా సప్తమి వచ్చుచున్నది.

'సప్తమి' అను సామాన్యనిర్దేశముచేత 'అందు, న' అనుసప్తమీవిభక్తులు రెండును యథావకాశముగా వచ్చును. ఘటమందు, ఘటమున.

**18. ఉకారాంతజడంబునకు నవర్ణకం బగు.**

**ఘటంబున జలం బున్నది. దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.**

ఉకారము చివర గలిగినశబ్దము ఉకారాంతము. జడము అనగా అచేతనము. వర్ణకము అనగా ప్రత్యయము. ప్రత్యయము అయిననవర్ణము 'అందు న సప్తమి' అనుసూత్రముచే సప్తమియు, 'డుమువున లేకవచనంబులు అనుసూత్రముచే ఏకవచనమును అగును. జడమును బోధించునదియును, ఉకారము చివర గలిగినదియును, అయినశబ్దమునకు సప్తమీవిభక్తి ఏకవచనమునందు నవర్ణకము వచ్చును.

ఊరు ప్రాతిపదిక. సప్తమీ ఏకవచనవివక్షలో ప్రస్తుతసూత్రముచే నవర్ణకము వచ్చి, ఊరున. 'తృతీయాదులకు నగాగమం బగు' ఊరునను. ఇట్లే ఘటమునను, ధనువునను మొ.

'ఉకారాంత' అనుటచే ఉకారాంతములు కానిశబ్దములకు నవర్ణకము రాదు. రమయందు, హరియందు, మొద లగువిధముగా అందు ప్రత్యయమె అగును.

'జడంబునకు' అనుటచే జడవాచకము గానిశబ్దములకు నవర్ణకము రాదు. రామునందు, కళత్రమునందు, ఏనుగునందు మొ.

ఉకారాంతము లగుజడములకు నవర్ణకముతోపాటు అందు ప్రత్యయమును రావచ్చును. ఘటమందు ధనువునందు మొ. నవర్ణకము ఏకవచనము గావున బహుత్వమున ఉకారాంతజడములకును 'అందు' ప్రత్యయమె వచ్చును. ఘటములందు. ఘటములన అనురీతిగా నుండదు. (లడాగమము విభక్తికే కావున అదంతతచే నవర్ణకము రా దని భావింపరాదు.)

**19. విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు.**

**నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు.**
**దేవకీపుత్రుని హరిని నుతింతు నెపుడు.**
**శుభవిధాయుల రామకృష్ణుల భజింతు.**
**భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.**

విశేషణముచే చెప్పదగినవిశేషము కలది విశేష్యము. విశేష్యమునందలి విశేషమును తెల్పునది విశేషణము. విశేష్య మగుశబ్దము ఏలింగము, ఏవిభక్తి, ఏవచనమునం దుండునో అదే లింగము,విభక్తి, వచనము విశేషణమునకు కల్గును.

నందతనయుండు కృష్ణుడు నాకు దిక్కు. ఇందు 'కృష్ణుఁడు' అనునది విశేష్యము. పుంలింగము, ప్రథమావిభక్తి, ఏకవచనమునందు ఉన్నది. కావున దానికి విశేషణ మయిన 'నందతనయ' శబ్దమునకును పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము కలిగి 'నందతనయుండు' అని యుండును.

'భువనవంద్య రుక్మిణి' అనుచో విశేష్యము స్త్రీలింగ మగుటచే విశేషణ మగు 'భువనవంద్య' శబ్దమును స్త్రీలింగమునం దున్నది.

భువనవంద్యను రుక్మిణిని అనుచో విశేష్యము ద్వితీయావిభక్తియం దుండుటచే విశేషణమును ద్వితీయయం దుండి 'భువనవంద్యను' అని యైనది.

శుభవిధాయుల రామకృష్ణులను – అనుచో రామకృష్ణులను అనువిశేష్యము (పుంలింగము, ద్వితీయావిభక్తి) బహువచనమునం దున్నది. కావున విశేషణమునకు బహువచనము అయి 'శుభవిధాయులను' అని యైనది.

'విశేష్యంబునకుం బోలె' అనుటచే విశేష్యమునకు భిన్న మైనలింగవిభక్తి వచనములతో విశేషణమును ప్రయోగింపరాదు. ఘను డైన సీత, రాముని ఘనుడు, ఘను లైనరాముడు, మొద లగురీతిగా ఉండవు.

'విశేషణంబునకు' అనుటచే వాక్యమునందు ఇతరశబ్దములకు ఈనియమము లేదు. రాముడు రాక్షసులను చంపెను. మొ.

**20. స్త్రీసమంబు లగువిశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.**

**మాటలు పె క్కేల, మాటలు పెక్కు లేల.**

**కులిశధారల్ కుంఠితం బయ్యె, కులిశధారల్ కుంఠితంబు లయ్యె.**

**ఇష్ట మగుపదార్థములు. ఇష్టము లగుపదార్థములు.**

ప్రథమైకవచనము లోపించునట్టిఆచ్ఛికశబ్దములు స్త్రీసమములు. స్త్రీసమము

లును. ప్రథమైకవచనమునందు మువర్ణకము వచ్చుశబ్దములును విశేషణములు అయినపుడు వానియొక్కబహువచనము స్థానమున బహుళముగా ఏకవచనము వచ్చును. విశేష్యము బహువచనాంత మయినపుడు 'విశేష్యంబునకుంబోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' అనుసూత్రమును అనుసరించి విశేషణమునకు బహువచనము కలుగుచుండగా ఈసూత్రము ఏకవచనమును బహుళముగా విధించుచున్నది.

మాటలు పెక్కు. ఇచట మాట అనునది విశేష్యము. స్త్రీసమము. ప్రథమా విభక్తిలో బహువచనమునం దున్నది. కావున విశేషణ మయిన 'పెక్కు' అను శబ్దమునకును 'విశేష్యంబునకుంబోలె' అనుసూత్రముచే ప్రథమయందు బహు వచనము వచ్చుచుండగా ప్రస్తుతసూత్రముచే ఏకవచనము కలిగి, శబ్దము స్త్రీసమము గావున ఆప్రథమైకవచనము లోపించి, మాటలు 'పెక్కు' అని అగును. బహుళము అనుటచే ఏకవచనము రానపుడు బహువచనముతో 'మాటలు పెక్కులు' అని యుండును.

ఇట్లే ఇష్టము అగుపదార్థములు. ఇష్టములు అగుపదార్థములు. ఇట విభాష.

బహుళ మనుటచే కొన్నియెడల నిత్యము (ప్రవృత్తి). ఇం పయిన ప్రియురాం(డు.

'స్త్రీసమంబులు' అనుటచే ఇతరము లగువిశేషణములకు ఏకవచనము రాదు. మహాత్ము లగు బ్రహ్మలు మొ.

'ముువర్ణకాంతంబులు' అనుటచే ఇతరములకు ఏకవచనము రాదు. పటువు లగు మనువులు.

'విశేషణంబుల' అనుటచే విశేష్యములబహువచనము అట్లే ఉండును. మాటలు పెక్కు. మాట పెక్కు అని యుండదు.

'బహువచనంబునకు' అనుసామాన్యనిర్దేశముచే ఎల్లవిభక్తులయందును ఏకవచనము కల్గును. మాటలను పెక్కింటిని మొ.

**21. ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు.**

**మైత్రుండు గృహమును వెడలెను. గృహమునుండి యని యర్థము.**

**వాహనమును దిగెను. వాహమునుండి యని యర్థము.**

**వారు సుఖ మున్నారు. సుఖముతో నని యర్థము. ఇత్యాదు లెఱుంగునది.**

ఆయాఅర్థములలో వచ్చినఆయావిభక్తులకు బదులుగా వే ఱొకవిభక్తి

వచ్చుటయు ఒక్కొక్కచోట కలదు.

'మైత్రుండు గృహమును వెడలెను'. అపాయమునందు 'అపాయ భయ జుగుప్సా పరాజయ' మొద లగుసూత్రముచే వలనవర్ణకము వచ్చి, గృహము వలనను అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ఆపంచమికి ద్వితీయావిభక్తి వచ్చి 'గృహమును వెడలెను' అని అగును.

సహార్థమున తృతీయ వచ్చి, సుఖముతో ఉన్నారు. అని ఉండగా ప్రస్తుత సూత్రముచే తృతీయకు ప్రథమ వచ్చి, (సుఖము ఉన్నారు) సుఖ మున్నారు. అని అగును.

'ఒకానొకచో' అనుటచే ఒక విభక్తికి మరి యొకవిభక్తి యగుట కొన్ని స్థలములందే. కాని ఎల్లయెడల కాదు. ఘటమందు జల మున్నది.

'మఱి యొకవిభక్తియును' అనుచోట సముచ్చయార్థకనుశబ్దముచే మరి యొక విభక్తి రాకుండుటయు సిద్ధించును. గృహమువలన వెడలెను. సుఖముతో నున్నారు. మొ.

**22. జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.**

**రాముఁడు వాని నొక్కకోలం గూల నేసె, కోలతో నని యర్థము.**

**లంకం గలకలంబు పుట్టె. లంకయం దని యర్థము.**

**బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు.**

**అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె. బాణములచే నని యర్థము. మీనంబులు జలంబుల నుండు. జలంబులం దని యర్థము.**

జడము అనగా అచేతనము. జడమును బోధించుశబ్దములకు పైనున్న తృతీయావిభక్తిస్థానమునను, సప్తమీవిభక్తిస్థానమునను ద్వితీయావిభక్తి బహుళముగా వచ్చును.

కోలతోడ కూల నేసె. ఇచట కరణవాచకము అయిన కోలశబ్దమునకు తృతీయా విభక్తి రాగా, ప్రస్తుతసూత్రముచేత తృతీయస్థానమున ద్వితీయ వచ్చి, కోలను కూలనేసె, అని అగును. 'లంకయందు కలకలంబు' అనుచోట ఆధార మయిన లంకా శబ్దమునకు సప్తమి రాగా, దానికి ప్రస్తుతసూత్రముచే ద్వితీయ వచ్చి 'లంకను గలకలంబు' అని అగును. బహుళము అనుటచే ద్వితీయ రానపుడు కోలతోడ కూల నేసె, లంకయందు కలకలంబు అనువిధముగా తృతీయాసప్తములు అట్లే యుండును. ఇచట విభాష.

'బహుళము' అనుటచేత ఉదంతములు అయినశబ్దముల తృతీయాసప్తములకు ఏకవచనమునందు ద్వితీయ రాదు. బాణముచేత రూపుమాపె, జలమునం

దుండును. ఇచట అప్రవృత్తి.

'మనుష్యుల విప్రుండు' అనుచో అన్యకార్యము. అజడము సప్తమికి ద్వితీయ.

'జడంబు' అనుటచే జడవాచకంబులు కానిశబ్దములపైని తృతీయాసప్తములకు ద్వితీయ రాదు. రాజులచేత కప్పంబు గొనియె, దేవతలయందు దయ మెండు.

'తృతీయాసప్తములకు' అనుటచేత ఇతరవిభక్తులకు ద్వితీయ రాదు. కోలను చూచెను. మొ.

**23. ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు.**

**రాముఁ డొక్కబాణంబున వాలిం గూల నేసె. బాణముచే నని యర్థము.**

ఉకారము చివర గలిగి, అచేతనములను బోధించుశబ్దములకు పరముగా నున్న తృతీయావిభక్తిస్థానమున 'న' అనుసప్తమీప్రత్యయము వచ్చును.

బాణంబున కూలనేసె. కరణము అయిన బాణశబ్దమునకు 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనుసూత్రముచే 'చేత' అనుతృతీయ వచ్చి, బాణముచేత అని కాగా, ప్రస్తుత సూత్రముచేత తృతీయకు 'న' అనుప్రత్యయము వచ్చి, బాణమునను అని అగును.

'ఉదంతము' అనుటచే ఉదంతములు కానివానికి నవర్ణకము రాదు. కోలచేత కూలనేసె మొ.

'జడంబు' అనుటచే జడము గానిశబ్దముపై తృతీయకు నవర్ణకము రాదు. రాముచేత, వధువుచేత, ఏనుగుచేత మొ. ఇచట 'రామున' అనురీతిరూపము లుండవు.

'నవర్ణకంబు' అనుటచే ఇతరప్రత్యయము రాదు. బాణమునందు కూల్చెను అనురీతిగా ఉండదు.

నవర్ణకము రాక బాణముచేత లేక బాణముతోడ అనువిధముగా తృతీయ గూడ ఒకపక్షమునందు ఉండును.

**24. జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు.**

**వాఁడు పూవులు దెచ్చె - వాఁడు పూవులను దెచ్చె.**

**ఆమె సొమ్ములు దాల్చె - ఆమె సొమ్ములను దాల్చె.**

**వాఁ డిల్లు వెడలె - వాఁడింటిని వెడలె.**

**బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమ రాదు.**

అచేతనములను బోధించుశబ్దములకు పై నున్న ద్వితీయావిభక్తిస్థానమున

ప్రథమావిభక్తి బహుళముగా వచ్చును.

వాఁడు పూవులను దెచ్చె. ఇచట కర్మ అగుటనుబట్టి పూవు శబ్దమునకు 'కర్మంబున ద్వితీయ యగు' అనుసూత్రముచే ద్వితీయ వచ్చి, పూవులను అని యున్నది. ఆద్వితీయకు ప్రస్తుతసూత్రముచే ప్రథమావిభక్తి రాగా బహుత్వమున పూవులు అని యుండును. వాఁడు పూవులు దెచ్చె. 'బహుళము' అనుటచే ప్రథమావిభక్తి రానిపక్షమునందు ద్వితీయతో "పూవులను దెచ్చె' అనియె యుండును. ఇచట విభాష.

బహుళ మనుటచే 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనుసూత్రముచే తృతీయాసప్తములకు ఆదేశముగా వచ్చినద్వితీయకు మాత్రము ప్రథమ రాదు. ఇచట అప్రవృత్తి. బాణముచేతను కూల్చె అనుచో 'బాణము కూల్చె' అని కాదు.

'జడంబు' అనుటచే 'జడము' కానిశబ్దముపై ఈకార్యము లేదు. రావణుని చంపెను. సీతను దెచ్చెను. మొ.

'ద్వితీయకు' అనుటచే ఇతరవిభక్తులకు ప్రథమ రాదు. పూవులతో వచ్చె - పూవులు వచ్చె అని కాదు.

**25. కాలాధ్వములకుం బ్రాయికంబుగా బ్రథమ యగు.**

**వాఁడు నిన్న వచ్చె. వీఁడు నేఁడు వోయె. మాపు నిలుపుము. తేపు పొమ్ము. వారు క్రోశము నడచిరి. వీ రామడ వోయిరి.**

కాలము అనగా సమయము. అధ్వము అనగా మార్గము. కాలమును తెలియజేయుశబ్దములకును, మార్గమును బోధించుశబ్దములకును తఱుచుగా ప్రథమావిభక్తి వచ్చును.

వాఁడు నిన్న వచ్చె. 'నిన్న' అన్నది కాలమును బోధించుశబ్దము. ప్రస్తుత సూత్రముచే ప్రథమావిభక్తి రాగా, స్త్రీసమము కావున ప్రథమైకవచనము లోపించి నిన్న వచ్చె అని యున్నది.

వారు క్రోశము నడచిరి. 'క్రోశ' అనునది మార్గమును తెలియజేయునట్టి శబ్దము. దానికి ప్రస్తుతసూత్రముచే ప్రథమావిభక్తి రాగా, ఏకవచనమున క్రోశము అని అగును.

'కాలాధ్వములకు' అనుటచే ఇతరములకు ఈకార్యము లేదు.

'ప్రాయికము' అనుటచే అరుదుగా ప్రథమావిభక్తి రాకుండుటయు కలదు.

నిన్నను బోయెను. క్రోశమును నడచిరి. అనువిధముగా ద్వితీయ యుండును. అర్థవిశేషముల ననుసరించి ప్రొద్దున పోయెను. రేపటికి పోవును. ఇత్యాదిగా ఇతరవిభక్తులు ఉండును.

**26. సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందు ప్రయోగింపఁబడు దానిద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.**

**అన్ని గుఱ్ఱములకు, అన్నింటికి గుఱ్ఱములకు,**

**గుఱ్ఱము లన్నింటికి, గుఱ్ఱముల కన్నింటికి - సాహిణులు ముప్వురు.**

**రెండు గుఱ్ఱములకు, రెండింటికి గుఱ్ఱములకు,**

**గుఱ్ఱములు రెండింటికి, గుఱ్ఱములకు రెండింటికి - సాహిణులు నలుగురు.**

**లక్ష గుఱ్ఱములకు, లక్షకు గుఱ్ఱములకు,**

**గుఱ్ఱములు లక్షకు, గుఱ్ఱములకు లక్షకు - రవుతులు లక్ష ఇత్యాదులు.**

అన్ని మొద లగునవి సర్వనామములు. సంఖ్యాభిధానములు అనగా సంఖ్యను బోధించుశబ్దములు. తెలుగున సంఖ్యావాచకములు సర్వనామములే. సంస్కృతమున సంఖ్యావాచకములు సర్వనామములు కాకపోవుటచే సంస్కృత సమము అయిన (సర్వనామములు కాని) సంఖ్యావాచకశబ్దములకును ఈకార్యము సిద్ధించుటకయి సర్వనామములతోపాటు 'సంఖ్యాభిధానములు' అనునది ప్రత్యేకముగా పేర్కొనబడినది.

1. విశేషణము లయినసర్వనామములును, 2. సంఖ్యావాచకములును, 3. వానివిశేష్యములును అయినశబ్దములలో ఏది పూర్వమునందు ప్రయోగింపబడునో దానియొక్క ద్వితీయ మొద లగువిభక్తులస్థానమున ప్రథమావిభక్తి బహుళముగా వచ్చును.

అన్ని గుఱ్ఱములకు, ఇచట గుఱ్ఱములకు అనునది విశేష్యము. షష్ఠీవిభక్తియం దున్నది. 'అన్ని' అనుసర్వనామము దానికి విశేషణము. 'విశేష్యంబునకుంబోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' అనుసూత్రముచేత విశేష్యమునకు వలె 'అన్ని' అనువిశేషణమునకును షష్ఠీవిభక్తి వచ్చి, 'అన్నింటికి గుఱ్ఱములకు' అని యగును. ఇందు 'అన్నింటికి' అనుసర్వనామవిశేషణము పూర్వమునందు ప్రయోగింపబడినది. కావున ప్రస్తుతసూత్రముచే ఆషష్ఠికి ప్రథమావిభక్తి వచ్చి 'అన్ని గుఱ్ఱములకు' అని యగును. బహుళము అనుటచే ప్రథమ రానపుడు విశేష్యానుసారముగా షష్ఠీవిభక్తితో 'అన్నింటికి గుఱ్ఱములకు' అని యుండును.

'గుఱ్ఱములకు అన్నింటికి' అనువిధముగా ఒకవేళ విశేష్యమే విశేషణమునకు పూర్వమునందు ప్రయోగింపబడినచో విశేష్యముయొక్క షష్ఠికే ప్రథమ వచ్చి 'గుఱ్ఱములు అన్నింటికి' అనియు, బహుళ మనుటచే ప్రథమ రాకున్నచో 'గుఱ్ఱములకు అన్నింటికి' అని షష్ఠితోడిరూపమును ఉండును.

'సర్వనామసంఖ్యాభిధానములు' అనుటచే ఇతరము లగుశబ్దముల సందర్భమున ఈనియమము లేదు. (అభిరామునకు రామునకు) రామునకు అభిరామునకు.

'ఎయ్యది ముందు ప్రయోగింపబడు దాని' అనుటచే తరువాత ప్రయుక్త మైనది విశేష్యము అయినను, విశేషణము అయినను దానికి ప్రథమ రాదు. అన్ని గుఱ్ఱములకు, గుఱ్ఱములు అన్నింటికి మొ.

'బహుళము' అనుటచే మమ్ము అందరిని, మా అందరిని అనురీతిగా కొన్నియెడల 'యొక్క' ప్రత్యయముతోడిరూపము కల్గుచున్నది. 'మేము అందరిని' అని ఇచట ప్రథమ కానరాదు. ఇట్టిచోట్ల అప్రవృత్తి.

**27. ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు.**

**సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద.**

**సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.**

విశేషణములయొక్క షష్ఠీవిభక్తిస్థానమున ప్రథమావిభక్తి కొన్నియెడల వికల్పముగా వచ్చును. విశేష్యము షష్ఠీవిభక్తిలో ఉన్నపుడు 'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబు లగు' అనుసూత్రముచే విశేషణములును షష్ఠీవిభక్తితో నుండును. విశేషణములయొక్క ఆషష్ఠీవిభక్తికి ఈసూత్రముచే ప్రథమ వచ్చును.

సుగుణాభిరామునకు రామునకు – రామునకు అనువిశేష్యము షష్ఠియం దుండుటచే విశేషణ మగు 'సుగుణాభిరామ' శబ్దమునకు 'విశేష్యంబునకుంబోలె' అనుసూత్రముచే షష్ఠీవిభక్తి రాగా, ఆషష్ఠీవిభక్తికి ప్రస్తుతసూత్రముచే ప్రథమావిభక్తి వచ్చి, 'సుగుణాభిరాముఁడు రామునకు' అని యగును.

'విభాష' అనుటచే ప్రథమ రానిపక్షమునందు షష్ఠితో 'సుగుణాభిరామునకు రామునకు' అని యుండును.

'ఒకానొకచో' అనుటచే విశేషణముషష్ఠికి ప్రథమ అరుదుగా వచ్చును.

'విశేషణంబుల' అనుటచే విశేష్యములయొక్క షష్ఠికి ప్రథమ రాదు. సుగుణాభిరాముడు రామునకు.

'షష్ఠికి' అనుటచే ఇతరవిభక్తులకు ప్రథమ రాదు. సుగుణాభిరాముని రాముని గొలిచెద.

ఇచట విశేష్యము పూర్వమునందు ప్రయోగింపబడుచో ఈకార్యము రా దని తోచుచున్నది. 'రామునకు సుగుణాభిరాముఁడు జోహారు వొనర్చెద' అని ఉండదు. ఇట్టిసందర్భమున 'రామునకు సుగుణాభిరామునకు' అని షష్ఠి అట్లే ఉండును.

**28. భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు.**

**అగు మొద లగునవి భవత్యర్థకములు. విద్యాశాలి యగుపురుషుని సకలజనులు సన్మానింతురు. భూతదయాళు రగుమహాత్ములకు శ్రేయంబు గలుగును. అతిమానుష మత్యద్భుత మయినకేశవార్జునకృతిన్.**

'భూ' అనుసంస్కృతధాతువుయొక్క అర్థము కలవి భవత్యర్థకములు. 'ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే' యని ఇచట భూధాతువు 'శ్తిప్' చేర్చి నిర్దేశింపబడినది. అగు మొద లగునవి భూధాతువు అర్థము కలిగినవి. వ్యవహితము అనగా వ్యవధానము (ఎడము) కలిగినవి. నడుమ నున్న అగు మొద లగుశబ్దములచే విశేష్యముతో ఎడము కలిగియున్న విశేషణములయొక్క అన్నివిభక్తులకును ప్రథమావిభక్తి వచ్చును.

విద్యాశాలి యగుపురుషుని సకలజనులు సన్మానింతురు. ఇందు పురుషుని అనువిశేష్యము ద్వితీయావిభక్తియం దుండుటచే విశేషణ మగు 'విద్యాశాలి' శబ్దమునకు 'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' అనుసూత్రముచే ద్వితీయావిభక్తి రాగా, 'విద్యాశాలిని అగుపురుషుని' అనువిధముగా నుండును. 'అగు' ధాతుజవిశేషణముతో విశేషణవిశేష్యములకు వ్యవధానము కలదు. కావున ప్రస్తుతసూత్రముచే 'విద్యాశాలిని' అనువిశేషణము యొక్క ద్వితీయావిభక్తికి ప్రథమావిభక్తి వచ్చి, విద్యాశాలి అగుపురుషుని అనియగును.

'భవత్యర్థ' అనుటచే ఇతరశబ్దములతో వ్యవధాన మున్నపుడు ఈకార్యము లేదు. 'సకలగుణధాముఁ గొల్తు శ్రీరాము నెపుడు' సకలగుణధాముడు గొల్తు రాముని' అని కాదు.

'భవత్యర్థవ్యవహితంబు లగు' అనుటచే అగుమొద లగువానిచే వ్యవహితములు కానపుడు విశేషణములు (ద్వితీయాదుల)కు ప్రథమ రాదు. 'విద్యాశాలిని పురుషుని' అని ద్వితీయాదివిభక్తులు అట్లే యుండును.

'అగు' అనుటచే నిత్యము. కావున ప్రథమ రానిరూపములు ఉండవు. 'విద్యాశాలిని నగుపురుషుని' అనువిధ మయినరూపము లుండవు.

**29. భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకు, దానిముందు విశేషణంబుల కయిపదంబును బహుళముగా ననుప్రయుక్తం బగు.**

**అతులుఁ డయి యప్రమేయుఁ డౌహరిని గొలుతు.**

భవత్యర్థకంబు అనగా అగు మొద లగునవి. సన్నిహితవిశేషణము అనగా విశేష్యమునకు సమీపమునందు ప్రయోగింపబడినవిశేషణము. విశేష్యమునకు పూర్వమునందు సమీపమున (ఆనుకొని) ఉన్నవిశేషణమునకు 'అగు' మొద లగు శబ్దములు బహుళముగా అనుప్రయుక్తము లగును. ఆవిశేషణములకు పూర్వమునందు ప్రయోగింపబడినవిశేషణములకు 'అయి' అనుపదము బహుళముగా అనుప్రయుక్తము అగును.

అతులుఁ డయి ప్రమేయుఁ డౌహరిని గొలుతు. హరిని అనువిశేష్యమునకు అతులుఁడు, అప్రమేయుఁడు అనునవి రెండు విశేషణములు. వీనిలో అప్రమేయుఁ డనువిశేషణము విశేష్యమునకు సమీపమునందు ప్రయుక్త మయిఉన్నది. కావున దానికి (అగు – అవు) ఔ అనునది చేరి, 'అప్రమేయుఁ డౌహరిని' అని ఐనది. సన్నిహిత మగు 'అప్రమేయుఁడు' అనువిశేషణమునకు పూర్వమునందు ప్రయోగింపబడిన 'అతులుడు' అనువిశేషణమునకు ఈసూత్రముచే 'అయి' అనుపదము చేరి, 'అతులుఁ డయి, యప్రమేయుఁ డౌహరిని' అని అగుచున్నది.

'భవ్యతర్థకంబు' అనుటచే అతులు డయి యప్రమేయుఁ డయినహరిని గొలుతు మొద లగువిధముగా అయిన మొద లగునవియును చేరును.

'సన్నిహితవిశేషణంబునకు' అనుటచే అతులుఁ డగు అప్రమేయుఁ డగు హరిని, అని సన్నిహితవిశేషణమునకు ముం దున్నదానికి ' అగు' మొద లగునవి చేరవు. సన్నిహితవిశేషణమునకు అయిపదమును చేరదు. 'అతులుఁ డయి యప్రమేయుఁడయి హరిని' అని ఉండదు.

'అయిపదంబును' అనుసముచ్చయార్థకశబ్దముచే ఈరెండుకార్యములును గలిసియె వచ్చును. కావున 'అతులుఁ డయి యప్రమేయుని హరిని', అని ఉండదు.

బహుళము అనుటచే 'అయి అగులు' రెండును లేకుండ 'ఆద్యు నప్రమేయుని హరిని' అని యుండవచ్చును.

**30. అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబున కేని, విశేషణంబుల కన్నింటి కేని మీఁద సముచ్చయార్థకంబు విభాషం బ్రయోగింపఁబడు.**

**ఆద్యుఁ డప్రమేయుదు నగుహరిని గొలుతు,**

**ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌహరిని గొలుతు.**
**ఆద్యు దప్రమేయుం దగుహరిని గొలుతు.**

సముచ్చయార్థకము అనగా సముచ్చయమును (కూడ అనుఅర్థమును) బోధించునట్టి 'ను' (యును) శబ్దము. 'భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానికి ముందు విశేషణంబుల కయిపదంబును బహుళంబుగ ననుప్రయుక్తంబు లగు' అనుసూత్రమునందలి బహుళశబ్దముచే అయి అనుపదము అనుప్రయుక్తము కానపుడు చిట్టచివరివిశేషణమునకు ఒక్కదానికి గాని, లేదా విశేషణములకు అన్నింటికి గాని పైని 'ను' (యును) అను (సముచ్చయార్థక) శబ్దము వికల్పముగా ప్రయోగింపబడును.

ఆద్యుఁడు అప్రమేయుఁడు నగుహరిని. ఇచట సన్నిహిత విశేషణము అయిన 'అప్రమేయుడు' అనుదానికి (కార. 29 సూత్రముచే) అగు అనుభవత్యర్థకము అనుప్రయుక్త మయి, దానికి ముం దున్న 'ఆద్యుడు' అనువిశేషణమునకు అయి అనుపదము అనుప్రయుక్తము కాలేదు. కావున చివరి దగుఅప్రమేయుడు (అగు) అనువిశేషణమునకు ప్రస్తుతసూత్రముచే 'ను' శబ్దము చేరి, 'ఆద్యుడు అప్రమేయుడు నగుహరిని' అని అయినది. ఈసూత్రముచేతనె అన్ని విశేషణములకు 'నుశబ్దము' చేరినచో 'ఆద్యుడును అప్రమేయుడును అగు హరిని' అని అగును. విభాష అనుటచే ఏఒక్కవిశేషణమునకును 'ను' శబ్దము చేరనిపక్షమునందు 'ఆద్యుడు అప్రమేయుడు అగు హరిని' అని యుండును.

'అయిపదానుప్రయోగంబు లేనిచో' అనుటచే అయిపదము అనుప్రయుక్తము అయినపుడు దేనికిని నుశబ్దము చేరదు. అనగా ఆద్యుఁ డయి యప్రమేయుఁ డు నగు హరిని, అని కాని, ఆద్యుఁడు నయి అప్రమేయుడు నగుహరిని అని కాని ఉండదు.

'ఏని' అనుశబ్దముచేత, తుదివిశేషణమునకు మాత్రము ఒకపర్యాయము నుశబ్దము చేరుటతోను, విశేషణములకు అన్నింటికి వేరొకపర్యాయము నుశబ్దము చేరుటతోను రెండు విధము లయినరూపము లగును.

'విభాష' అనుటచే ఏవిశేషణమునకును నుశబ్దము చేరక, మూడవవిధ మైనరూప ముండును. 'అతిమానుష మత్యద్భుత మయిన కశవార్జునకృతిన్'

'మీఁద' అనుటచే విశేషణమునకు పైనె నుశబ్దము చేరును. కావున ఆద్యుడు అప్రమేయుడు అగును హరిని, అని అనుప్రయుక్త మగుభవత్యర్థకముపైని 'ను' శబ్దము చేరదు.

**31. ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయిపదం బను ప్రయుక్తం బగు.**

**ఆద్యుఁ డయి, యప్రమేయుఁ డై యెసంగెడుదేవుని నభినుతింతు.**

**ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది.**

ధాతువునుండి ఏర్పడినవిశేషణములు ధాతుజవిశేషణములు. ఎడి, ఎడు, వానిలోపము, ఉన్న, కల, న, ని అనుఏడును చివర కలిగి ఒక్కొక్కధాతువు నుండి 7 విధములు అయిన విశేషణము రూపములు ఏర్పడును. వండెడు వాఁడు వె౹. వీనిని ధాతుజవిశేషణములు అందురు. విశేష్యమునకును దానివిశేషణములకును ధాతుజవిశేషణముతో వ్యవధానము (ఎడము) ఉన్నపుడు విశేషణములకు అన్నింటికిని 'అయి' అనుపదము అనుప్రయుక్తము అగును.

ఆద్యుడు అయి, అప్రమేయుడు అయి, అఖిలసేవ్యుడు అయి, ఎసంగెడు దేవుని – అభినుతింతు. ఇచట 'దేవుని అనువిశేష్యమునకును 'ఆద్యుడు' అప్రమేయుడు, అఖిలసేవ్యుడు అనువిశేషణములకును నడుమ 'ఎసంగెడు' అను ధాతుజవిశేషణముతో వ్యవధానము కల్గినది. కావున ప్రస్తుతసూత్రముచే అన్ని విశేషణములకును అయి అనుపదము అనుప్రయుక్త మయి 'ఆద్యుఁ డయి అప్రమేయుఁ డయి ఎసంగెడు దేవుని' అనువిధముగా అగును.

'ధాతుజవిశేషణ' అనుటచే ఇతరశబ్దములతో వ్యవధానము గలిగినచో ఈకార్యము లేదు. రమ్యగుణసాంద్రు సేవింతు రామచంద్రు.

'వ్యవధానంబున' అనుటచే ధాతుజవిశేషణముతో వ్యవధానము లేనపుడు ఈకార్యము లేదు. ఆద్యు డగుహరిని గొలుతు.

'విశేషణంబు లన్నింటికి' అనుటచే విశేషణములు కానివానికి ఈకార్యము లేదు.

'అన్నింటికి' అనుటచే 'ఆద్యుడు, అప్రమేయు డయి యెసంగెడు' అని కొన్నింటికి మాత్రమే అనుప్రయుక్త మగుట ఉండదు.

'అగు' అనుటచే నిత్యము గావున అయి పదము లేకుండ, ఆద్యుడు, ప్రమేయుడు ఎసంగెడుదేవుని అని ఉండదు.

**32. భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు.**

**రాముఁడు వచ్చుట. రాముఁడు రాఁగా లక్ష్మణుండు గాంచె.**

**రాముఁడు వి ల్లందినం ద్రిలోకంబు లాకులంబు లగు.**

**రాముఁడు పట్టినప్రతిన వారింపఁ దరంబు గాదు.**

భావము అనగా ధాతువుయొక్క అర్థము. ఈఅర్థమున 'ట' అనుప్రత్యయము వచ్చును. వచ్చుట మొ. ఇవి భావార్థకములు. భావార్థకములు మొద లగునవి భావార్థకాదులు. రాఁగా మొద లగుతుమర్థకములు, అందినన్ మొద లగు చేదాద్యర్థకములు, ధాతుజవిశేషణములు మొద లగునవి భావార్థకాదులు. ఇట్టి భావార్థకము మొద లగువానితో అన్వయించునపుడు కర్తను తెలుపుశబ్దమునకు ప్రథమావిభక్తి వచ్చును.

రాముడు వచ్చుట తెలిసి. ఇచ్చట వచ్చుట అనునది భావార్థకము. వచ్చుట అనువ్యాపారము రాముని ఆశ్రయించియున్నది. కావున రాముడు కర్త. కావున కర్త యైన రాముని తెలుపు 'రామ' శబ్దమునకు 'చేతవర్ణకంబు కర్త కగు' అనుసూత్రముచే 'చేత' అనుప్రత్యయము రావలసియుండగా ప్రస్తుతసూత్రముచే ప్రథమావిభక్తి వచ్చి, ఏకత్వమున 'రాముఁడు' అని అగును.

ఇట్లే రాముడు రాగా, రాముడు విల్లందిన మొ.

'భావార్థకాదియోగంబున' అనుటచే అట్టిఅన్వయము లేనపుడు ప్రథమ రాదు. దేవదత్తునిచేత వంటకము వండబడుట. వండబడుట అనుచో వండుట అను వ్యాపారమున కాశ్రయ మగుటచే దేవదత్తుడు కర్త అయినను వండబడుట అనుదానితో అన్వయించునది 'వంటకము' కావున దేవదత్త శబ్దమునకు ప్రథమ కాక 'చేతవర్ణకంబు కర్త కగు' అని చేతయే వచ్చినది.

భావార్థకాదియోగమున కర్మమునకును ప్రథమయే వచ్చును. రావణుఁడు చంపఁబడుట. ఇది ఉక్తార్థ ప్రథమ యనియు 'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనుదానిచేతనె ఉక్తార్థమునందు ప్రథమ వచ్చిన దనియు పేర్కొందురు.

**33. ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వును లును, బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.**

యుష్మద్ (నీ) అస్మద్ (నా) అనువానియొక్క విశేషణములు యుష్మదస్మ ద్విశేషణములు. ప్రథమావిభక్తి ఏకవచనము చివర గలిగినయుష్మద్విశేషణమునకు చివర 'వు' అనునదియు, అస్మద్విశేషణమునకు చివర 'ను' అనునది తఱచుగా ఆగమముగా వచ్చును.

నీవు రమవు. ఇచట రమ అనునది నీవు అనుదానికి విశేషణము. ఏకత్వార్థమునం దున్నది. కావున ప్రస్తుతసూత్రముచే దీనికి చివర 'వు' అనునది ఆగమ మై, 'రమవు' అని అగును.

నేను రమను. ఇచట రమ అనునది నేను అనుదానికి విశేషణము.

ఏకత్వార్థమునం దున్నది. కావున ప్రస్తుతసూత్రముచే దీనికి చివర 'ను' అనునది ఆగమ మై, 'రమను' అని అగును.

ప్రథమావిభక్తి బహువచనము చివర గలిగిన యుష్మద్విశేషణమునకు చివర 'రు' అనునదియు అస్మద్విశేషణమునకు చివర 'ము' అనునదియు తఱుచుగా ఆగమముగా వచ్చును.

మీరు జ్ఞానులరు. ఇచట జ్ఞానులు అనునది మీరు అనుయుష్మదర్థమునకు విశేషణము. బహుత్వమునం దున్నది. కావున ప్రస్తుతసూత్రముచే దీనికి చివర 'రు' అనునది ఆగమ మై, జ్ఞానులు+రు. 'ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు' అని అత్వము వచ్చి, జ్ఞానులరు.

మేము భక్తులము. ఇచట భక్తులు అనునది మేము అనుఅస్మదర్థమునకు విశేషణము. బహుత్వమునం దున్నది. కావున ప్రస్తుతసూత్రముచే దీనికి చివర 'ము' అనునది ఆగమ మై, భక్తులు+ము. 'ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు' అని అత్వము వచ్చి, భక్తులము.

'ప్రథమాంతంబులు' అనుటచే ద్వితీయాదివిభక్తులు చివర గలిగిన విశేషణములకు ఈఆగమములు రావు. నన్ను గర్వగరిష్ఠుని, మిమ్ము మహాత్ములను మొ.

'యుష్మదస్మద్విశేషణంబులు' అనుటచే ఇతరవిశేషణములకు ఈకార్యము లేదు. భక్తు లగునట్టివారు మొ.

'అంతాగమంబులు' అనుటచే నుమువురు అనునవి విశేషణము లగు శబ్దములకు చివరనే చేరును. నురమ, కవువి ఇత్యాదిగా ఉండదు.

**34. ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు.**

**నీవు ధన్యుఁడవు. నేను ధన్యుఁడను - మీరు ధన్యులరు. మేము ధన్యులము. ఇకారంబు మీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు ననుసూత్రముచేత వునుల కిత్వం బగు. నీవు సుకృతివి. నేను సుకృతిని. ఆర్తిహరుఁడ వౌ నిను గొల్తు నంబుజాక్ష. గర్వగరిష్ఠుం డగు నిన్ను, మీరలు పెద్దలు ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితము లయ్యె.**

"ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు' అనుసూత్రముచే చెప్పబడిన 'నుము, - వురు' అను ఆగమములు పరముగా ఉన్నప్పుడు ముందరి శబ్దమున చివర ఉన్న హ్రస్వ మయినఉకారముస్థానమున హ్రస్వ

మయినఅకారము ఆదేశముగా వచ్చును.

నీవు ధన్యుడు అనుచో 'ప్రథమాంతంబు లగు –' అనుసూత్రముచే వువర్ణము ఆగమ మయి, ధన్యుడు+వు అని యుండగా ప్రస్తుతసూత్రముచే అత్వము వచ్చి ధన్యుఁడవు అని అగును. ఇట్లే ధన్యులరు మొ.

'ఈయాగమంబులు' అనుటచే రాములకు+ను, ధేను+వును మొద లగుఇతర ఆగమములు పర మయినపుడు ఈకార్యము లేదు.

'పరం బగునపుడు' అనుటచే ఈఆగమములు లేనపుడు అత్వము రాదు. మీరలు పెద్దలు. పెద్దల అని కాదు.

'ఉత్వంబునకు' అనుటచే హరివి, వదినెవు మొద లగుచోట్ల అత్వము లేదు.

'అగు' అనుటచే నిత్యము. కావున అత్వము రాని, భక్తులురు, కవులుము అనురీతిరూపములు ఉండవు.

**35. అదిశబ్దంబునకు వునులు పరంబు లగునపుడు సంబోధనంబు నందును దాన యనునాదేశం బగు.**

**నీవు చిన్నదానవు, నేను జిన్నదానను, ఓ చిన్నదాన.**

యుష్మదస్మద్విశేషణములకు చివర ఉన్న 'ఆది శబ్దమునకు 'వును'లు పరముగా నున్నపుడు 'అది' శబ్దముయొక్క స్థానమున దాన అనుఆదేశము వచ్చును. అట్లే సంబోధనమునందును 'దాన' ఆదేశము వచ్చును. (నీవు) చిన్నది అనుశబ్దమునకు 'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును' అనుసూత్రముచే వువర్ణము ఆగమముగా వచ్చి, చిన్నది+ వు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ఆదిశబ్దముస్థానమున 'దాన' అనునది ఆదేశముగా వచ్చి, చిన్నదానవు అని అగును. ఇట్లే అస్మద్విశేషణమునకు– చిన్నదానను. సంబోధనమునందు – చిన్నదాన.

'అదిశబ్దము' ఏకవచనాంతము. కావున ఏకత్వమునం దగు'వును'లే పరముగా నుండును. బహుత్వమునందు 'అది' యుండదు. వునులును పరముగా నుండవు. కావున ఈకార్యములును ఉండవు. మీరు చిన్నవారరు, మేము చిన్నవారము.

'అదిశబ్దమునకు' అనుటచే ఇతరశబ్దములకు ఈకార్యము లేదు. దేవుడవు. భక్తుడను.

'వునులు పరంబు లగునపుడు' అనుటచే ఇతరము పర మైనపుడు ఈకార్యము లేదు. చిన్నది వచ్చెను.

'సంబోధనంబునందును' అనుటచే (ప్రాతిపదికాది) ఇతరార్థములందు

ఈకార్యము లేదు. చిన్నది.

'అగు' అనుటచే ఈఆదేశము నిత్యము. కావున చిన్నదివి, చిన్నదిని, ఓ చిన్నదీ అనువిధ మయినరూపములు ఉండవు.

మహతి, మహతీరము అనువివక్ష చేయకుండుటచే అమహత్త్వమునందు ఎల్లయెడల 'అది' అనుశబ్దమునకు 'దాన' వచ్చును. చిలుకా, చిన్నదానవే.

**36. అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు. వారును మీరును ధన్యులరు. మీరును మేమును ధన్యులము.**

అన్యము అనగా యుష్మదస్మదర్థముల(నీ,నా)కంటె వే రయినది. యుష్మదర్థమును పురస్కరించుకొని రావలసినప్రత్యయాదిక మగుకార్యము యుష్మత్కార్యము. ఇట్లె అన్యకార్యము, అస్మత్కార్యము. ఒకే స్థలమున, అన్యార్థము, యుష్మదర్థము, అస్మదర్థము అనువానిలో ఏ రెం డైన, మూ డైన ప్రాప్తించుచున్న ఆయాకార్యములకంటె పైమూడింటిలో ఒకదానికంటె తరువాతిది బలీయ మైనది.

1. అన్యయుష్మత్కార్యములలో యుష్మత్కార్యము బలీయము.

వారను మీరును ధన్యులరు. ఇచట ధన్యులు అనునది 'మీరు' అనుయుష్మదర్థమునకు మాత్రమె కాక 'వారు' అనుఅన్యార్థమునకును విశేషణ మయినది. ప్రస్తుతసూత్రముచే యుష్మత్కార్యము బలీయము కావున అన్యమునకును విశేషణము అయినప్పటికిని 'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున' అనుసూత్రముచే యుష్మద్విశేషణము నకు చెప్పిన రువర్ణాగమకార్యము ధన్యులు అనుదానికి వచ్చి 'ధన్యులరు' అని అగును.

ఇట్లే క్రియాపదములవిషయమునను. వారును మీరును వచ్చితిరి. ఇచట వచ్చుట అనుక్రియకు వారు అను అన్యార్థమును, మీరు అనుయుష్మదర్థమును కర్త లయినను మీరు అను యుష్మదర్థము ననుసరించి మధ్యమపురుష క్రియయె ప్రయోగింపబడును. వారును మీరును వచ్చిరి అనువిధముగా అన్యకర్తృకత్వము ననుసరించి ప్రథమపురుషకార్యము గలుగదు.

2. యుష్మదస్మత్కార్యములతో అస్మత్కార్యము బలీయము.

మీరును మేమును ధన్యులము. ఇచ్చట ధన్యులు అనునది మేము అను అస్మదర్థకమునకే కాక మీరు అనుయుష్మదర్థమునకు గూడ విశేషణము. అయినను అస్మత్కార్యము బలీయము అగుటచే అస్మద్విశేషణమునకు చెప్పిన 'ము' వర్ణాగమకార్యమునే పొంది ధన్యులము అని యైనది. యుష్మద్విశేషణము కూడ

అయినను 'మీరును మేమును ధన్యులరు' అనురీతిగా యుష్మత్కార్య మగు రువర్ణాగమము రాదు.

ఇట్లే క్రియాపదములలో మీరును మేమును వచ్చితిమి. ఇచట వచ్చుట అనుక్రియకు మీరు అనుయుష్మదర్థము, మేము అను అస్మదర్థమును కర్త లయినను మేము అనుఅస్మదర్థము ననుసరించి ఉత్తమపురుషక్రియయె ప్రయోగింపబడును. మీరును మేమును వచ్చితిరి అనువిధముగా మధ్యమపురుషకార్యము గలుగదు.

ఇట్లె అన్య అస్మత్కార్యములలో అస్మత్కార్యము బలీయము. వారును మేమును ధన్యులము, వచ్చితిమి.

వారును మేమును ధన్యులము, వారును మీరును, మేమును వచ్చితిమి అను మొద లగువిధముగా అన్యయుష్మదస్మత్కార్యములు మూడింటిలో అస్మత్కార్యమె బలీయ మయి ప్రవర్తించును.

**37. ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపంజను.**

**పూర్వ మిది పర మిది యనునియమ మపేక్షింపక వాక్యమం దెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపఁదగు. ఏనిప్రభృతిశబ్దంబులు కొన్ని నియమసాపేక్షంబు లయియుండు. గాలి చల్లగా వీచెను. చల్లగా గాలి వీచెను. వీచెను జల్లగా గాలి. వీచెను గాలి చల్లగా, గాలి వీచెను జల్లగా. చల్లగా వీచెను గాలి.**

ఏని మొద లగుకొన్నిశబ్దములు తప్ప మొదట ఈపదమె ఉండవలెను, పిదప ఈపదమె ఉండవలయును అనువిధ మయిననియమము లేకుండ ఒకేవాక్యమునందలిపదములను అన్నింటిని యథేష్టముగా ప్రయోగించు కొనవచ్చును.

గాలి చల్లగా వీచెను. అనువాక్యమునందు గల మూడుపదములను మూడుచోట్ల వేర్వేరుగా ఉంచి ఆరువిధములుగా ప్రయోగించుకొనవచ్చును. చల్లగా గాలి వీచెను. వీచెను గాలి చల్లగా, గాలి వీచెను చల్లగా. చల్లగా వీచెను గాలి మొ.

'ఏకవాక్యంబునందు' అనుటచే ఒకటికంటె ఎక్కువ అయినవాక్యములందు ఉన్నపదములను ఇట్లు యథేష్టముగా కలిపి ప్రయోగింపరాదు. సత్యము శ్రేయము, అది లేనిచో సర్వధర్మములు చెడును. ఇవి రెండువాక్యములు. వీనిలోనిపదములను 'సత్యము చెడును లేనిచో శ్రేయము అది సర్వధర్మములు' మొద లగువిధముగా యథేచ్ఛముగా ప్రయోగింపరాదు.

'ఒకానొక్కండు దక్క' అనుటచే ఏని మొద లగుకొన్నిపదములను మాత్రము ఆవరుసలోనే ప్రయోగింపవలెను. 'సీత నిచ్చె నేని రావణుడు బ్రతికియుండును' అనువాక్యమును 'రావణు డిచ్చె నేని సీత బ్రతికియుండును' ఇత్యాదిగా క్రమము మాఱినచో అర్థభంగ మగును. కావున నట్టిచోట్ల పదప్రయోగములో క్రమాపేక్ష గలదు.

'సర్వపదంబులు' అనుటచే కర్త, కర్మ, క్రియ ఇత్యాదిగా పదములు ఏ వైనను క్రమాపేక్ష లేకుండ ప్రయోగింపవచ్చును. అందుకే సూరి 'గాలి చల్లగా వీచెను' అనువాక్యములోని మూడుపదములను మూడు స్థానములలో ఉంచి చూపెను.

'ప్రయోగింపం జను' అనుటచే ఇది నియమము కాదు. యథావకాశముగా యథావసరముగా ప్రయోగింపవచ్చును.

**ఇది కారకపరిచ్ఛేదము**

# సమాసపరిచ్ఛేదము

**1. సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసంబు.**

**పృథగ్భూతంబు లగునర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు.**

**పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబుల కేకార్థమునందు వృత్తి సామర్థ్యము.**

సమర్థములు అయినపదములు కలిసి ఒకే పదముగా ఏర్పడుటకు సమాసము అని సంజ్ఞ. సామర్థ్యము కలది సమర్థము. వేరు వేరుగా ఉన్న (పృథగ్భూతంబు లగు) అర్థములు కలిసి ఒకే అర్థము గలవి అగుట (ఏకార్థీభావము) సామర్థ్యము. నల్లనిఆవు. నల్ల, ఆవు అని ఇందు రెండుపదములు ఉన్నవి. ఇవి విడిగా ఉన్నపుడు దేనిఅర్థముతో అది భిన్న మయియుండును. నలుపు వేరు, గోవు వేరు, ఈఅర్థములు రెండును కలిసి 'నలుపు కలిగినఆవు' అని ఒకేఅర్థమును బోధించుట ఏకార్థీభావము.

వేరు వేరుగా ఉన్న రెండర్థములును కలిసి ఒకేవస్తువును బోధించుచు ఒకే అర్థము కలదిగా ఏర్పడినది. ఇదియె సామర్థ్యము. ఈసామర్థ్యము అర్థమునకు చెందినది.

అట్లే ప్రత్యేకముగా దేని కదిగా ప్రసిద్ధ మైనఅర్థము కలిగిన (పృథక్ ప్రసిద్ధార్థంబు లగు) పదములను ఒకే అర్థమును ఇచ్చుటయందు (ఏకార్థమునందు) వర్తింపజేయుట (వృత్తి) సామర్థ్యము. 'నల్ల' అనుపదమును, 'ఆవు' అనుపదమును దేని కది ప్రసిద్ధ మైనఅర్థము కలిగియున్నవి. నల్ల, ఆవు అనుపదములను 'నల్లదనము కలిగినఆవు' అనువిధముగా ఒకే అర్థమును ఈయగలుగునట్లు చేయుట (అనగా కలుపుట) సామర్థ్యము. ఈసామర్థ్యము శబ్దస్వరూపమునకు చెందినది.

మొత్తముమీద, శబ్దములు ప్రసిద్ధము అయిన వేరు వేరు అర్థముతో ఉండి, ఆఅర్థములు కలిసి ఒకే అర్థమును బోధింపగలిగి, అట్టి ఒకే అర్థమునందు వర్తింపగల్గుట – అనుసామర్థ్యము కలిగినపదములు ఒకేపదముగా ఏర్పడుట సమాసము. నల్లనియావు, రామునిబాణము మొ.

**2. సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు.**

**సాంస్కృతికం బని యాచ్ఛికం బని, మిశ్రం బని సమాసంబు త్రివిధంబు.**

**అందు సాంస్కృతికంబు సిద్ధం బని, సాధ్యం బని ద్వివిధంబు. కేవల సంస్కృతశబ్దములసమాసంబు సిద్ధంబు నాబడు. రాజాజ్ఞ, తటా కోదకము, లక్ష్మీవల్లభుఁడు. సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు నాఁబడు. రాజునాజ్ఞ, తటాకంబునుదకము, లక్ష్మీవల్లభుఁడు. తక్కినతెనుఁగులసమాసం బాచ్ఛికం బనఁబడు. తేనియానతి, చెఱువునీరు, సిరిచెలువుఁడు. ఉభయంబులఁ గూడినది మిశ్రం బనంబడు. రాజుముదల, చెఱువు నుదకము, సిరివల్లభుడు.**

1. సాంస్కృతికసమాసము, 2. ఆచ్ఛికసమాసము, 3. మిశ్రసమాసము, అని తెలుగుభాషయందలిసమాసములు మూడు విధములుగా ఉన్నవి.

1. సాంస్కృతికసమాసము :తెలుగులో నున్నసంస్కృతమునకు సంబంధించిన సమాసమునకు సాంస్కృతికసమాసము అని పేరు. ఈసాంస్కృతికసమాసము 1. సిద్ధసమాసము, 2. సాధ్యసమాసము అని రెండు విధములు.

i) సిద్ధసమాసము : కేవలము సంస్కృతశబ్దములకు కలిగినసమాసమునకు సిద్ధసమాసము అని సంజ్ఞ. కేవలసంస్కృతశబ్దములకు తెలుగున సమాసము చేయుటకు అవకాశము లేదు. కావున సంస్కృతభాషయందే సమాసముగా ఏర్పడి ఆమొత్తము ప్రాతిపదికగ తెలుగునందు ప్రవేశించినసమాసము సిద్ధసమాసము. తెలుగున చేరునప్పటికే సమాసము (సంస్కృతమున) సిద్ధము అయిఉన్నది. కావున దీనికి సిద్ధసమాసము అనుపేరు సార్థకము. రాజ్ఞః – ఆజ్ఞా – రాజాజ్ఞా – రాజాజ్ఞ.

ii) సాధ్యసమాసము : సంస్కృతసమములకు చేయబడినసమాసము సాధ్యసమాసము. సంస్కృతశబ్దములను తత్సమములుగా చేసికొని వానికి సమాసము తెలుగులో సాధింపబడిన దగుటచే ఇది సాధ్యసమాసము అగుచున్నది. రాజుయొక్క+ఆజ్ఞ – రాజునాజ్ఞ.

2. ఆచ్ఛికసమాసము : ఆచ్ఛికశబ్దములు అనగా సంస్కృతసమములకంటె వే రయినశబ్దములకు చేయబడినసమాసముఆచ్ఛికసమాసము. తేనియొక్క ఆనతి – తేనియానతి.

3. మిశ్రసమాసము : సంస్కృతసమ మయినశబ్దమునకును, ఆచ్ఛిక శబ్దమునకును కలిపి చేయబడినసమాసము మిశ్రసమాసము. సంస్కృతసమము, ఆచ్ఛికమును మిశ్రములై (కలిసి) ఉండుటచే ఈసమాసమునకు మిశ్రము అనుపేరు సార్థకము. రాజుయొక్క ఆనతి – రాజునానతి. సమాసములందలి శబ్దమునుబట్టి ఈవిభాగము చేయబడినది.

**3. తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు.**

**తత్పురుషబహుబ్రీహిద్వంద్వంబు లని సమాసంబు లెల్లం ద్రివిధంబు లయియుండు. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థప్రధానంబు లయియుండు.**

**అందుఁ దత్పురుషంబు సమానాధికరణంబు వ్యధికరణం బని ద్వివిధంబు. ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు. నెలతాల్పు, నెలతక్కువవాఁడు, దేవరమేలు, దొంగభయము, రాముని బాణము, మాటనేర్పరి.**

**విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁ బడు. ఇదియె కర్మధారయ మనఁబడు. సరసపువచనము. తెల్లగుఱ్ఱము. మంచిరాజు.**

**అది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు. ముజ్జగములు. ముల్లోకములు.**

**బహుబ్రీహి - ముక్కంటి చలివెలుగు.**

**ద్వంద్వము - తల్లిదండ్రులు. అన్నదమ్ములు.**

**ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబు దొడరనిసమాసంబుం గల దని సూచింపఁబడియె. దానంజేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదు లయినయుపమానపూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు. ముఖ పద్మము, చరణకమలములు. ఇట్టియుపమానోత్తరపదంబులు గలవు, గాని విపరీతంబులు సిద్ధంబులు లే వని యెఱుఁగునది.**

**సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు. రాజపురుషుడు, నీలోత్పలము. పీతాంబరుఁడు. రామ లక్ష్మణులు.**

**కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు. దానంజేసి యనేకమాఱు లల్పదం డిత్యాదులు దుష్టము లని తెలియునది.**

తత్పురుషము మొద లగుసమాసములయొక్క లక్షణము తఱుచుగా సంస్కృతమునందు చెప్పబడినట్లే తెలుగునను చెల్లును. సమాసము లన్నియు 1. తత్పురుషము, 2. బహుబ్రీహి, 3. ద్వంద్వము అని మూడువిధములు.

1. తత్పురుషము : ఉత్తరపదము (సమాసమునందు చివరిపదము) యొక్క అర్థము ప్రధానముగా కలిగినది తత్పురుషసమాసము. ఉత్తరపదమె క్రియతో అన్వయము కలిగియుండును. ఇది సమానాధికరణము, వ్యధికరణము అని రెండు విధములు.

i. సమానాధికరణము : విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసమునకు సమానాధికరణము అని పేరు. అనగా విశేషణము పూర్వపదమును, విశేష్యము ఉత్తరపదమును అయిఉండును. తెల్లగుఱ్ఱము. ఇందు 'తెల్లఁ'దనమును, 'గుఱ్ఱము' తనమును, గుఱ్ఱము అనుఒక్కదాని(ఆధారముచేసికొని)యందు ఉన్నవి. కావున ఇది సమానాధికరణసమాసము. సమానాధికరణసమాసమునే 'కర్మధారయ సమాసము' అని కూడ అందురు.

ద్విగువు : ఈకర్మధారయసమాసములో పూర్వపదము అయినవిశేషణము సంఖ్యావాచకము అయినచో తెలుగున ద్విగుసమాసము అందురు. మూ డైనజగములు – ముజ్జగములు.

ii వ్యధికరణము : ద్వితీయ మొద లగువిభక్తులు చివర కలిగినశబ్దములకు పైపదముతో చేసినసమాసమునకు వ్యధికరణము అని పేరు. నెలతాల్పు – 'నెల' తనము – నెలయందును, 'తాల్పు' తనము 'తాల్పు' నందును ఉండుటచే అధికరణము (ఆధారము) వే రయినది. కావున ఇది వ్యధికరణసమాసము. ఇచట నెలను అనుద్వితీయాంతమునకు తాల్పు (తాల్చినవాడు) అనుపైపదముతో సమాసము అయినది. కావున ఇది ద్వితీయాతత్పురుషము. ఇట్లే నెలచేత తక్కువవాఁడు– నెలతక్కువవాడు. (తృతీయాతత్పురుషము) దేవర(కొఱకు)మేలు (చతుర్థీతత్పురుషము). దొంగ(వలన)భయము (పంచమీతత్పురుషము). రాముని (యొక్క)బాణము (షష్ఠీతత్పురుషము) మాట(యందు)నేర్పరి (సప్తమీతత్పురుషము).

2. బహువ్రీహి : సమాసమునందు ప్రయోగింపబడినపదములకంటె ఇతర మైనపదముయొక్క అర్థము ప్రధాన మయిఉండునది బహువ్రీహిసమాసము. ముక్కంటి. మూడు, కన్ను(లు) అనుసమాసమందలిపదములకంటె ఇతరముగా మూఁడు కన్నులు కలిగినవే రొకవ్యక్తి బోధింపబడుటచే ఇది అన్యపదార్థప్రధానము. ముక్కంటి మండిపడెను.

3. ద్వంద్వము : పూర్వపదముయొక్కయు, ఉత్తరపదముయొక్కయు అనగా సమాసమునందలిరెండుపదములయొక్క అర్థము ప్రధానము అయిఉండునది ద్వంద్వసమాసము. తల్లిదండ్రులు మెచ్చిరి.

ప్రాయికశబ్దముచేత తెలుగునందలి కొన్నిసమాసములు సంస్కృతమునందు చెప్పబడినలక్షణమునకు భిన్నముగా ఉండుటయు కలదు. సంస్కృతమున ఉపమానపూర్వపదకర్మధారయములు లేవు. తెలుగున ఉన్నవి. చిగురుఁగేలు. చిగురువంటి కేలు అనుచో విశేషణము అయిన 'చిగురు' శబ్దము ఉపమానము. ఉపమానము పూర్వపదముగా కలిగినసమాసము కావున ఇది ఉపమాన

పూర్వపదకర్మధారయము. ఇట్లె జు(న్ను)ంటివంటి మోవి – జుంటిమోవి మొ. ఇంక సంస్కృతమునందు గల ముఖపద్మము, చరణకమలము వంటి ఉపమానము ఉత్తరపదముగా గలకర్మధారయములు తెలుగునను ఉండును. మోవిపండు, (పండువంటిమోవి), కైసిగురు (చిగురువంటి కై) మొ.

సంస్కృతమునందు సిద్ధము అయిఉన్నసమాసములు అన్నియు తెలుగున ప్రయోగింపదగును. రాజపురుషుఁడు (వ్యధికరణము) నీలోత్పలము (కర్మ ధారయము) పీతాంబరుడు(బహుర్వీహి) రామలక్ష్మణులు (ద్వంద్వము) మొ.

తత్సమము చేయనిసంస్కృతశబ్దమునకును అచ్చతెలుగుశబ్దమునకును సమాసము కుదురదు. 'అనేక' అనునది కేవలము సంస్కృతశబ్దము. మారు అనునది ఆచ్ఛికము. ఈరెండింటికి సమాసము చేయరాదు. కావున అనేకమారులు అనుట సాధువు గాదు. సంస్కృతశబ్దములు తత్సమము లయినపుడు తెలుగుతో సమాసము చేయవచ్చును. అనేకపుమారులు, తటాకమునుదకము.

**4. ఆ ఈ ఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు.**

తచ్ఛబ్దముయొక్క అర్థము కలిగినది. 'ఆ' అనుశబ్దము, 'ఇదమ్' శబ్దము అర్థము కలిగినది. 'ఈ' అనుశబ్దము. యత్, కిమ్, అనుశబ్దములయొక్క అర్థము కలిగినది 'ఏ' అనుశబ్దము. ఈమూడుశబ్దములును సర్వనామములు. ఈ మూడుశబ్దములకును 'త్రికము' అని సంజ్ఞ.

'ఆఈఏ' అని నిర్దేశించుటచేత అన్ని మొద లగుఇతరములు అయిన సర్వనామములకు ఈసంజ్ఞ ఉండదు.

'సర్వనామంబులకు' అనుటచేత వర్ణమాలలో ఉన్నవి మొద లయిన 'ఆఈఏ' అనువర్ణములకు త్రికము అనుపేరు ఉండదు.

**5. కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదం బయి యుండు.**

**ఆచందము–ఈచిందము–ఏబృందము–వాఁడిమాట–పోఁడిపాట–బెడిదపుటడిదము–మడిసెడుదడములు. ఈనియమముచే బల్లిదుఁడు మల్లుడు, కావలుఁడు రావణుఁడు – ఇత్యాదుల సమాసంబు లేదు.**

సమాసమునందలి మొదటిఅవయవమునకు పూర్వపద మని పేరు. విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసమునకు కర్మధారయము అని పేరు. కావున కర్మధారయములో పూర్వపదము విశేషణము అగును. ఆ, ఈ, ఏ, అనుసర్వనామములకు త్రికము అని పేరు. ప్రథమావిభక్తి ఏకవచనము లోపించు

ఆచ్ఛికశబ్దములు స్త్రీసమములు. ముగంతములు అనగా ప్రథమావిభక్తి ఏకవచనమునందు మువర్ణకము వచ్చుశబ్దములు అని అభిప్రాయము. ధాతువునుండి ఏర్పడినవిశేషణములు ధాతుజవిశేషణములు. ఎడి, ఎడు, వాని లోపము, ఉన్న, కల, న, ని, అనునవి చివర గలిగిన 7 విధము లైన విశేషణరూపములు ధాతువునుండి ఏర్పడును.

కర్మధారయసమాసములలో పూర్వపద(మగు విశేషణ)ము ఆఈఏ–లు, స్త్రీ సమము, మువర్ణకాంతము, ధాతుజవిశేషణము అనువానిలో ఏదో ఒకటి అయి ఉండును. ఇట్లు చెప్పుటచే త్రికము మొద లగువానికి ఈసూత్రముచేతనే మీది విశేష్యముతో కర్మధారయసమాసము కలగుచున్నట్లు గ్రహింపవచ్చును.

'ఆచందము' చందము అనునది విశేష్యము. (ఆ అనుత్రికమునకు చందము అనువిశేష్యముతో ప్రస్తుతసూత్రముచే కర్మధారయసమాస మయినది.) ఈకర్మధారయమున 'ఆ' అనుత్రికవిశేషణము పూర్వపదము అయియున్నది. ఇట్లె ఈచిందము – ఏబ్బందము.

వాఁడిమాట, పోఁడిపాట, అనుకర్మధారయములలో వాఁడి, పోఁడి అను పూర్వపదములు స్త్రీసమములు.

బెడిదపుటడిదము అనుకర్మధారయమున 'బెడిదము' అనుపూర్వపదము మువర్ణకాంతము.

మడిసెడుదడములు అనుచోట 'మడిసెడు' అనుపూర్వపదము ధాతుజ విశేషణము.

'కర్మధారయంబు' అనుటచే ఇతరసమాసములందు ఈనియమము లేదు. కావున త్రికము మొద లగువానికి భిన్న మైనశబ్దము పూర్వపదము గావచ్చును. రామునిబాణము.

'త్రిక..' అనుటచే త్రికము మొద లగువానిలో చేరనిశబ్దము కర్మధారయమున పూర్వపదము కాదు. బల్లిదుడు మల్లుడు, కావలుడు రావణుడు అనురీతిగా, డుమంతము లయినశబ్దములు పూర్వపదములు కావు.

**6. స్త్రీసమఘటితంబ యొకానొకందు బహువ్రీహి చూపట్టెడు.**

**ముక్కంటి – వేగంటి – చలివెలుగు – వేవెలుగు – మోటబరి ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.**

అన్యపదార్థము ప్రధానముగా కలిగినసమాసము బహువ్రీహి. ప్రథమావిభక్తి' ఏకవచనము లోపించునట్టిఆచ్ఛికశబ్దములు స్త్రీసమములు. తెలుగునందు

బహువ్రీహిసమాసము స్త్రీసమములు అయినశబ్దములతో కూర్పబడినదే అరుదుగా కనబడుచున్నది. ఇట్లు చెప్పుటవలన తెలుగున ఏర్పడినబహువ్రీహి సమాసము లందు పూర్వోత్తరపదములు రెండును స్త్రీసమములే అగును.

ముక్కంటి - మూఁడు కన్నులు కలవాడు అనువిగ్రహము చొప్పున మూఁడు కన్ను అనుస్త్రీసమము లయినశబ్దములకు ప్రస్తుతసూత్రముచే బహువ్రీహిసమాస మేర్పడి, మూఁడు+కన్ను అని యుండగా 'సమానాధికరణం బగునుత్తపదంబులు పరం బగునపుడు మూఁడుశబ్దముడుజ్వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనుసూత్రముచే లోపద్విత్వములు వచ్చి, 'మూ+క్కన్ను' అని కాగా, 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే 'ముక్కన్ను' అని అగును. 'బహువ్రీహిని సమాసాంత కార్యంబులు చూపట్టెడి' అనుసూత్రముచే 'ముక్కంటి' అని అగును.

'స్త్రీసమఘటితంబ' అనుటచే స్త్రీసమములు కానిశబ్దములకు తెలుగున బహువ్రీహిసమాస మేర్పడదు. అంద మైనముక్కు కలది, సొగ సయినమొగము కలవాడు మొద లగునవి. మచ్చెకంటి అనుచో మచ్చెము అనుపూర్వపదము క్లీబసమము. ఇది విశేషస్థలము.

'ఒకానొకండు' అనుటచేత తెలుగున బహువ్రీహి అరుదుగా నుండును.

'చూపట్టెడు' అనుటచే కవిప్రయోగమునందు కానబడినవానిని మాత్రమే గ్రహింపవలయును. కావున సొగసుగంటి ఇత్యాదిగా స్త్రీసమములకును స్వతంత్రముగా బహువ్రీహి కల్పింపరాదు.

**7. ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు.**

**అన్నదమ్ములు-తల్లిదండ్రులు-ఊరువల్లెలు-ఆలుమగలు.**

**మగఁడును బిడ్డలును, పల్లమును గల్లెమును ఇత్యాదులు సమసింప వని యీనియమంబున నెఱుంగునది.**

సంస్కృతసమముకంటె వే రయినతెలుగుశబ్దము ఆచ్ఛికము. ప్రథమావిభక్తి ఏకవచనము లోపించుఆచ్ఛికశబ్దము స్త్రీసమము. 'స్త్రీసమంబు' అని ప్రథమా విభక్తితో నిర్దేశించుటచేత 'ఉపసర్జనము' అనుసంజ్ఞను పొంది (స్త్రీసమము) ఈసమాసములో పూర్వమునందు ఉండును. తెలుగున ద్వంద్వసమాసము స్త్రీసమము అయినశబ్దమునకు ఆచ్ఛిక మైనశబ్దముతో తఱుచుగా ఏర్పడును.

అన్నయును తమ్ముఁడును అనుఅర్థమున ఈసూత్రముచే అన్న అను

స్త్రీసమమునకు తమ్ముడు అనుఆచ్ఛికశబ్దముతో ద్వంద్వసమాసము ఏర్పడి 'అన్నదమ్ములు' అని అగును.

'ఆచ్ఛికశబ్దంబుతోడ' అనుటచే ద్వంద్వసమాసమున ఉత్తరపదము సంస్కృత సమము కాదు. ఆలును భర్తయును – ఆలుభర్తలు అని కాదు.

ఆచ్ఛిక మనుసామాన్యనిర్దేశముచే ఉత్తరపదము స్త్రీసమము, (తల్లి+తండ్రి – తల్లిదండ్రులు) క్లీబసమము, లేదా పుంలింగతుల్యము (అన్న+తమ్ముఁడు – అన్నదమ్ములు) కావచ్చును.

'స్త్రీసమంబు' అనుటచే పూర్వపదము స్త్రీసమేతరము కాదు. కావున మగఁడును, బిడ్డలును – మొద లగుచోట్ల సమాసము లేదు.

'ప్రాయికంబుగ' అనుటచే అందమును చందమును – అందచందములు అనురీతిగా పూర్వపదము అరుదుగ క్లీబసమ మగుట గుర్తింపనగును.

## 8. సర్వశబ్దంబులు సంబంధమునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు.

**నావాఁడు–నాయది. ఇంటివాఁడు–ఇంటిది. రామునివాఁడు–రామునిది.**

సంబంధార్థమునందు సంస్కృతసమములును ఆచ్ఛికములును ఐనఅన్ని శబ్దములును తత్ అనుసంస్కృతశబ్దముయొక్క అర్థము గలిగిన – వాఁడు, అది మున్నగుశబ్దములతో సమాసమును పొందును.

నాకు సంబంధించినవాడు అనుఅర్థమున సంబంధార్థమునందు వచ్చిన 'యొక్క' షష్ఠితో నున్న నాయొక్క అనుశబ్దమునకు మహదర్థమునందు ప్రస్తుతసూత్రముచే తదర్థకము అయిన 'వాఁడు' అనుదానితో సమాసము కలిగి, విభక్తిలోపాదులతో 'నావాడు' అని అగును. అమహదర్థమునందు 'అది' అనుదానితో సమాసమును పొంది – నాది, నాయది మొ.

బహుత్వమునందు నావారు, నాయవి మొ.

సంబంధమునందు విధింపబడుటచే ఇచటితచ్ఛబ్దార్థక మగు'ఆ'శబ్దము సంబంధమును మాత్రమే తెలుపును. కాని తదర్థమును ఈయదు. ఈపుస్తకము నాది. రాముడు నావాడు.

'సర్వశబ్దంబులు' అనుటచే ఆచ్ఛికములును సంస్కృతసమములు గూడ ఇట్లు సమాసమును పొందును. రామునియొక్క వాడు – రామునివాడు. రామునివి.

'సంబంధమునందు' అనుటచేత సంబంధార్థము లేనపుడు ఈకార్యము లేదు. నేను దానిని చూచితిని.

'తచ్ఛబ్దంబుతోడ' అనుటచే సంబంధార్థమునందు నాయితఁడు, నాయిది

అనువిధముగా ఇతరశబ్దములతో సమాసము లుండవు.

**9. ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు.**

**వచ్చినవాఁడు - వచ్చినది. రానివాఁడు - రానియది.**

ఎడి, ఎడు, వానిలోపము, ఉన్న, కల, న, ని, అనునవి చివర గలిగియుండి ధాతువునుండి 7 విధము లయినవిశేషణరూపములు ఏర్పడును. ధాతువునుండి యేర్పడినయావిశేషణములు ధాతుజవిశేషణములు. ఎడి, ఎడు మొద లగుఈ ప్రత్యయములు కృత్తులు. కృత్ప్రత్యయములు చివర కలిగినఈశబ్దములు (కృత్తద్ధిత సమాసా శ్చ) ప్రాతిపదిక లగును. వీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును. ప్రథమ మొద లగువిభక్తులను చెప్పదలచినపుడు ధాతుజవిశేషణములకు మీద 'తత్' అనుశబ్దముయొక్క అర్థము నిచ్చు 'ఆ' అనుసర్వనామశబ్దము అనుప్రయుక్త మగును.

'వచ్చిన' అనుధాతుజవిశేషణముపై ప్రథమావిభక్తి ఏకవచనమును వివక్షింపగా ప్రస్తుతసూత్రముచే ధాతుజవిశేషణము మీద 'ఆ' అనుశబ్దము చేరి, వచ్చిన+ఆ అని యుండును. మహదర్థమునందు ప్రథమావిభక్తిఏకవచనమున 'ఆ' అను సర్వనామమునకు 'వాఁడు' అనురూప మగును. కావున 'వచ్చినవాఁడు' అని అగును. ఇట్లె ఇతరవిభక్తులయందు వచ్చినవానిని, వచ్చినవానియందు మొద లగువిధముగా రూపములు ఏర్పడును.

'ధాతుజవిశేషణంబులకు' అనునది ఇతరము లయిన కొన్ని విశేషణములకును ఉపలక్షణము అందురు. అట్టివాఁడు మొ.

'విభక్తి వివక్షించునపుడు' అనుటచే అట్టివివక్ష లేనపుడు అనగా ధాతుజ విశేషణములను విభక్త్యంతముగా ప్రయోగింపదలచనపుడు తచ్ఛబ్దము చేరదు. వచ్చినరాముఁడు. మొ.

'అనుప్రయుక్తంబు' అనుటచే ఇచటి తచ్ఛబ్దము తదర్థము నీయదు. విభక్త్యర్థమును మాత్రమే తెలుపును.

**10. ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టి యనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు.**

**వచ్చినట్టిరాముఁడు-వచ్చినరాముఁడు. వచ్చునట్టివాఁడు-వచ్చువాడు.**

ధాతువునుండి యేర్పడినవిశేషణములు ధాతుజవిశేషణములు. సమాసము లోను, వ్యస్తతయందు (సమాసము కానపుడును) అట్టి అనుపదము ధాతుజ

విశేషణములమీద వికల్పముగా వచ్చి చేరును.

'వచ్చినరాముడు' అను (కర్మధారయ) సమాసమునందు 'వచ్చిన' అనునది ధాతుజవిశేషణము. ప్రస్తుతసూత్రముచే దానిపై 'అట్టి' అనుపదము చేరి, 'వచ్చినట్టి రాముఁడు' అని అగును. 'విభాష' అనుటచేత 'అట్టి' పదము అనుప్రయుక్తము కానిపక్షమునందు 'వచ్చినరాముఁడు' అనియే ఉండును.

విభక్తివివక్షలో తచ్ఛబ్దము అనుప్రయుక్తము అయిన 'వచ్చువాడు' అనువిధ మయినవ్యస్తరూపమునందు ధాతుజవిశేషణమునకు అట్టిపదము చేరగా, వచ్చునట్టివాడు. విభాష అనుటచే వికల్పము కావున అనుప్రయుక్తము కానిచో – వచ్చువాడు.

'ధాతుజవిశేషణంబులకు' అనుటచేత ఇతరవిశేషణములమీద 'అట్టి' చేరదు. పెద్దవాడు, గొప్పవాడు మొ.

## 11. యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరం బగునపుడు దుగాగమంబు విభాష నగు.

**నీదుకరుణ – నీకరుణ. నాదునేరిమి – నానేరిమి. తనదురూపు – తనరూపు.**

యుష్మత్ అనుశబ్దముయొక్క అర్థము కలది 'నీ' అనుశబ్దము. 'అస్మత్' శబ్దముయొక్క అర్థము కలది 'నా' అనుశబ్దము. ఆత్మార్థకము 'తా' శబ్దము. ఉత్తరపదము అనగా సమాసమునందు చివరిపదము. దుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. కావున 'దు' వర్ణము కిత్తు. కిత్తు అగుటచే విధించినదానికి చివర చేరును.

సమాసమునందు తరువాతిపదము పరముగా ఉన్నపుడు నీ, నా, తా అను మూడుశబ్దములకును చివర 'దు'అనువర్ణము వికల్పముగా ఆగమముగా వచ్చును.

నీయొక్క కరుణ అనువిగ్రహము చొప్పున షష్ఠీతత్పురుషసమాసమునందు విభక్తి లోపించి, నీ+కరుణ అని యుండగా ప్రస్తుతసూత్రముచే దువర్ణము చేరి 'నీదుకరుణ' అని అగును. విభాష అనుటచే దుగాగమము రానిపక్షమునందు నీకరుణ అని యుండును. ఇట్లే తనయొక్క రూపు – తనదురూపు, తనరూపు.

'యుష్మదస్మదాత్మార్థకంబులకు' అనుటచే ఇతరశబ్దమునకు ఈకార్యము లేదు. ఆబృందము. మనదుశక్తి అని మనశబ్దమునకు ఒకచోట దుగాగమము కన్పించును.

'ఉత్తరపదంబు పరం బగునపుడు' అనుటచే వ్యస్తతలో ఈఆగమము రాదు. నీవు రమ్ము, నన్ను చూచి మొ.

**12. గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు.**

**నల్లనిగుఱ్ఱము – నల్లగుఱ్ఱము. నల్ల – తెల్ల – పచ్చ – ఎఱ్ఱ – చామ – తియ్య – కమ్మ – పుల్ల – విన్న – చల్ల ఇత్యాదులు నల్లాదులు.**

గుణమును తెలుపునవి గుణవచనములు. నల్ల మొద లగునవి నల్లాదులు. విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసము కర్మధారయము. నిక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. నివర్ణము కిత్తు. కావున నల్లాదులకు చివర చేరును. కర్మధారయసమాసమునందు గుణమును తెలుపు నల్ల మొద లగుశబ్దములకు చివర బహుళముగా నివర్ణము ఆగమముగా వచ్చును.

నల్లని దైనగుఱ్ఱము అనువిగ్రహముచొప్పున కర్మధారయసమాసమునందు నల్ల+గుఱ్ఱము అని యుండగా ప్రస్తుతసూత్రముచే నివర్ణము ఆగమ మై, నల్లని గుఱ్ఱము అని అగును. బహుళము అనుటచే నిగాగమము రానిపక్షమునందు నల్లగుఱ్ఱము అని ఉండును. ఇట్టిచోట్ల  వికల్పము.

చక్క మొద లగుశబ్దములకు నిగాగమము నిత్యము. చక్కనివాడు, చిక్కనిపాలు. ఇచట ప్రవృత్తి.

కమ్మ+తేనె అని యుండగా నుగాగమము వచ్చి, కమ్మందేనె అనురూపము ఏర్పడును. బహుళశబ్దముచే ఇది అన్యకార్యము.

'గుణవచనంబు లగు' అనుటచే గుణవాచకము కానపుడు నిగాగమము రాదు. నల్ల (నెత్తురు) యేరు మొ.

'నల్లాదులకు' అనుటచే నల్ల మొద లగువానిలో చేరనిశబ్దములకు నిగాగమము ఉండదు. (కావున ఇచట 'అప్రవృత్తి' యుండదు) పెద్దవాడు మొ.

'కర్మధారయమునందు' అనుటచే కర్మధారయము కానపుడు నిగాగమము రాదు. నల్ల చూచి.

**13. ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు.**

ద్విరుక్తము అనగా రెండుసార్లు ఉచ్చరింపబడినది. ఆచ్ఛికము అనగా సంస్కృత సమము కానితెలుగు. ద్విత్వముతో కూడినహల్లు పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునందు ఉన్న అచ్చతెలుగు అయినదీర్ఘమునకు హ్రస్వము వచ్చును.

ఊయేల అనుశబ్దమునందు 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అనుసూత్రముచే యకారమునకు ద్విత్వము వచ్చి,

ఊయ్యేల అని కాగా ప్రస్తుతసూత్రముచే ముందరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి, ఉయ్యేల అని యగును. ఇట్లె ఆ+కాలము – అక్కాలము.

'ద్విరుక్తం బగుహల్లు' అనుటచే పరముగా ద్విత్వము లేనిచో హ్రస్వము రాదు. ఊయెల.

'పరం బగునపుడు' అనుటచే ద్విరుక్తము అయినహల్లునకు పూర్వమునందలి దీర్ఘమునకే కాని తరువాత ఉన్నదీర్ఘమునకు హ్రస్వము రాదు. అక్కాలము – అక్కలము అనురీతిగా కాదు.

'ఆచ్ఛికంబు' అనుటచే అచ్చతెలుగు కానిదీర్ఘమునకు హ్రస్వము రాదు. వాక్కు రాట్టు మొద లగునవి సంస్కృతసమములు. కావున వక్కు, రట్టు అని కాదు.

**14.త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.**

**అక్కన్య – ఆకన్య. ఇక్కాలము – ఈకాలము. ఎల్లోకము – ఏలోకము. అయ్యశ్వము – ఆయశ్వము. బాహుళకముచే నూష్మరేఫములకు ద్విత్వము కలుగదు. ఆరూపము – ఏషండము – ఆసుకృతి – ఆహయము.**

సర్వనామములు అయిన ఆ, ఈ, ఏ అనుమూడుశబ్దములకును త్రికము అని పేరు. సంయుక్తము అనగా వే రొకహల్లుతో కూడినహల్లు. సంయుక్తము కానిది అసంయుక్తము. ఆ ఈ ఏ అనుసర్వనామములమీద ఉన్న వేరొక హల్లుతో కూడని (ఒంటిగా ఉన్న) హల్లునకు బహుళముగా ద్విత్వము వచ్చును. అనగా మఱల అదే హల్లు ఇం కొకటి వచ్చిచేరును.

'ఆ+కన్య' అని ఉండగా ప్రస్తుతసూత్రముచే మీదిహల్లునకు ద్విత్వము వచ్చి, ఆ+క్కన్య అని కాగా, 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే ముందరిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి, అక్కన్య అని అగును. బహుళము అనుటచే ద్విత్వము రానిపక్షమున (హ్రస్వమును రాదు.) ఆకన్య అని యుండును. ఇట్టిచోట్ల వికల్పము.

త్రికమునకు మీద ఉన్న ర,శ,ష,స,హ అనుహల్లులకు ద్విత్వము లేదు. ఆరూపము, ఈహయము. బహుళ మనుటచే ఇచట అప్రవృత్తి.

'త్రికంబుమీఁది' అనుటచే త్రికము కానిదానికి మీద ఈద్విత్వము కాదు. మీయమ్మ, మాయిల్లు.

'అసంయుక్తహల్లునకు' అనుటచే సంయుక్త మయినహల్లునకు ద్విత్వము రాదు. ఆవ్యాధుడు. ఈక్షత్రియుడు మొ.

నీవు ఈప్రయోగమున – నీ విప్ప్రయోగమున అనురీతిగా సంయుక్తమునకు

ద్విత్వము వచ్చుట అన్యకార్యముగా సాధింపవచ్చును.

**15. కృతహ్రస్వం బగుత్రికంబుమీఁదిచోటుశబ్దంబునోత్వంబున కత్వ హ్రస్వంబులు విభాష నగు.**

**అచ్చోటు - అచ్చటు - అచ్చొటు. ఇచ్చోటు - ఇచ్చటు - ఇచ్చొటు. ఎచ్చోటు - ఎచ్చటు - ఎచ్చొటు. వీనిద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపం బగు. అచటు - అచొటు, ఇచటు - ఇచొటు, ఎచటు- ఎచొటు. ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చొటులు అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.**

కృతహ్రస్వము అనగా చేయబడినహ్రస్వము కలది. సర్వనామములు అయిన ఆ, ఈ, ఏ అనుశబ్దములు మూడింటికి త్రికము అని పేరు. 'త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ఆఈఏ లకు పైనున్న చోటుశబ్దమునందలి చకారమునకు ద్విత్వము రాగా, 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అను సూత్రముచే హ్రస్వము వచ్చి, త్రికము కృతహ్రస్వ మగుచున్నది. ఇ ట్లేర్పడిన - అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు అనుశబ్దములయందు 'చోటు' అనుచోట చకారమునకు పైనున్న ఓకారముయొక్క స్థానమున హ్రస్వ మగుఅకారము కాని, లేక హ్రస్వము (ఒ) కాని ఆదేశముగా వికల్పముగా వచ్చును.

'అచ్చోటు' అనుశబ్దమునందలి ఓకారమునకు ప్రస్తుతసూత్రముచే హ్రస్వ మైనఅకారము వచ్చినపక్షమునందు 'అచ్చటు' అని అగును. కాక ఓత్వమునకు హ్రస్వము (ఒ) వచ్చినపక్షమునందు 'అచ్చొటు' అని అగును. విభాష అనుటచే, అత్వమును, హ్రస్వమును రెండును రానిపక్షమునందు 'అచ్చోటు' అని ఓత్వము అట్లే ఉండును.

'కృతహ్రస్వంబు' అనుటచే హ్రస్వము లేని ఆచోటు, ఈచోటు, ఏచోటు, అనుశబ్దములందు అత్వ,హ్రస్వములు రావు. ఆచటు, ఈచొటు, ఏచటు అనువిధ మయినరూపములు ఉండవు.

'త్రికంబుమీఁది' అనుటచే త్రికము కానిశబ్దముమీద ఈకార్యము లేదు. కాని ముచ్చటులు, ముచ్చొటులు అనువిధముగా మూడుశబ్దముమీద ఈకార్యము కానవచ్చుటను సూరి విశేషముగా ప్రస్తావించెను.

'చోటుశబ్దంబునోత్వంబునకు' అనుటచే ఇతర మగుశబ్దమునందు ఈకార్యము లేదు. అక్కోయిల. ఇగ్గోడు, ఎజ్జోడు మొ.

**16. ఉత్తరపదం బగుచోటశబ్దముటాక్షరమునకు లోపంబు విభాష నగు.**

**చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దానియంతిమాక్షరము సప్తమ్యాదేశ మయినయకారంబుతోడం బాక్షికంబుగ లోపించు నని యర్థము. అచ్చో నున్నాఁడు - అచ్చోట నున్నాఁడు. ఒకచో నుండె - ఒకచోట నుండె.**

సమాసమునందు చివరిపదమునకు ఉత్తరపదము అని సంజ్ఞ. చోటు అనుశబ్దము ఔపవిభక్తికము. కావున దీనికి పై నున్నసప్తమీవిభక్తికి (చోటు శబ్దము పై తృతీయావిభక్తి ఉండదు.) ఔపవిభక్తికంబులతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే అత్వము వచ్చినపుడు, చోటన్ అని అగును. సమాసమునందు చివరిపదముగా ఉన్న 'చోటన్' అనుశబ్దమునందలి 'ట' అనుఅక్షరము (అకారముతో కూడినటకారము)నకు వికల్పముగా లోపము వచ్చును.

ఆ+చోటన్ - అచ్చోటన్ అని ఉండగా, ప్రస్తుతసూత్రముచే 'ట' వర్ణము లోపింపగా 'అచ్చోన్' అని అగును. 'విభాష' అనుటచే టవర్ణము లోపింపని పక్షమునందు 'అచ్చోటన్' అనియె ఉండును. ఇట్లే ఒకచోన్, ఒకచోటన్ మొ.

'ఉత్తరపదంబు' అనుటచే 'చోటన్' అనునది వ్యస్తముగా (సమాసము కాక) ఉన్నపుడు టవర్ణమునకు లోపము రాదు. చోటన్ - 'చోన్' అని కాదు.

'చోటశబ్దము' అనుటచే ఇతరశబ్దమునందు ఈలోపము లేదు. అప్పాటన్, ఇమ్మాటన్ మొ.

'టాక్షరమునకు' అనుటచే ఇతరఅక్షరమునకు లోపము లేదు. అచ్చోటు, అచ్చోటికి, మొద లగువిధముగా ఉన్నపుడు టు,టి అనువర్ణములకు లోపములేదు.

**17. సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దముడుజ్వర్ణమునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.**

**మూఁడుజగములు-ముజ్జగములు. మూఁడులోకములు-ముల్లోకములు.**

ఉత్తరపదము అనగా సమాసమునందు చివరిపదము. సమాన మైన అధికరణము కలది సమానాధికరణము. డుజ్ అనగా 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే బిందువుతో గూడిన 'డు' వర్ణము. పూర్వపద మయిన 'మూడుశబ్దముయొక్క అర్థము దేనిని ఆశ్రయించిఉన్నదో దానినే ఆశ్రయించి యున్నఅర్థము గలఉత్తరపదము పరముగా ఉన్నపుడు మూఁడు శబ్దములోని అరసున్నతో గూడినడువర్ణమునకు లోపమును, దానికి మీద ఉన్నహల్లునకు ద్విత్వమును వచ్చును.

మూఁడు అయిన జగములు అనుఅర్థమునందు సమాస మయి, మూఁడు+ జగములు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే డుజు లోపించి (మూ+జగములు) మీదిహల్లునకు ద్విత్వము రాగా, మూజ్జగములు అని అగును. అపుడు 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే హ్రస్వము వచ్చి, 'ముజ్జగములు' అనురూప మగును.

'కర్మధారయమునందు' మొద లగువిధముగా చెప్పకుండ 'సమానాధికరణం బగునుత్తరపదంబు' అనుటచే కర్మధారయము కానిసమాసములోను సామానాధికరణ్యము ఉన్నపుడు ఈకార్యము కల్గును. మూడు కన్నులు గలవాడు – ముక్కంటి (బహువ్రీహి). సమానాధికరణము లేనపుడు (డువర్ణమును ఉండదు) మూటి యొక్క లెక్క మూటిలెక్క ఇత్యాదిగనె అగును.

'ఉత్తరపదంబు' అనుటచే సమాసము కానపుడు ఈకార్యములు లేవు. చిచ్చులు మూఁడు చూచెను.

'లోపంబును ద్విత్వంబును' అనుచోట్ల నున్నసముచ్చయార్థకము లయిన 'ను' శబ్దములచే లోపద్విత్వములు రెండును కలిసియె వచ్చును. కావున లోపము మాత్రమే వచ్చిన 'మూజగములు', ద్విత్వము మాత్రమే వచ్చిన 'మూఁడుజ్జగములు' అనువిధ మయినరూపములు ఉండవు.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము, కావున సమాస మయినపుడు లోప ద్విత్వములు రాక 'మూఁడుజగములు' మూడుకంటి అని యుండదు .'మూఁ డుజగములు' అని యుండురూపము సమస్తము కాదు. వ్యస్తము.

**18. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గాదు.**

**ముచ్చిచ్చు – ముక్కారు – ముప్పాతిక – ముత్రోవ – ముప్విధములు.**

విశేషణమునకు విశేష్యముతో చేసినసమాసమునకు సమానాధికరణము లేదా కర్మధారయము అని పేరు. ఈకర్మధారయసమాసములో పూర్వపదము అయిన విశేషణము సంఖ్యావాచకము అయినచో ఆసమాసమునకు తెలుగున ద్విగువు అని పేరు. ఇ ట్లేర్పడిన ద్విగుసమాసము ఆచ్ఛికము అయినచో దానికి అన్ని విభక్తులయందును తఱుచుగా ఏకవచనము వచ్చును. (సంస్కృతసమమును ఆచ్ఛికమును కలిసి) మిశ్ర మయినచో రాదు.

మూఁ డైన చిచ్చులు అనువిగ్రహముచొప్పున సమాసము ఏర్పడి, మూఁడు + చిచ్చు అనునది (సమా. 17, 18 సూత్రములచే) ముచ్చిచ్చు అని ఏర్పడును. (కృత్తద్ధితసమాసా శ్చ అని) సమాసము ప్రాతిపదికము కావున దీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును. చిచ్చులు మూడు అగుటచే బహుత్వమునం

దుండుటవలన బహువచనమె అగును. ప్రస్తుతసూత్రముచే దానికి ఏకవచనము. ఇది స్త్రీసమము కావున ప్రథమావిభక్తియందు ఏకవచనము లోపించి, 'ముచ్చిచ్చు' అని అగును.

మూడు+విధ ('విధము' అనునది తత్సమము కావున) ముష్విధ అను సమాసము మిశ్రమము. మిశ్రద్విగువునకు ఏకవచనము లే దనుటవలన బహువచనమె అగును. ముష్విధములు. ముష్విధము అని కాదు. నల్దిక్కు వంటి ప్రయోగము లరుదుగ గలవు.

'ద్విగువునకు' అనుటచే ఇతర మయినసమాసమునకు ఏకవచనము (బహుత్వమున) లేదు. తెల్లగుఱ్ఱములు. కాని కూడుచీర అనువిధముగా ద్వంద్వమునం దేకవచనము కొన్నియెడల గలదు.

'ఏకవచనంబు' అనుసామాన్యనిర్దేశముచే అన్నివిభక్తులయందును ఏకవచనమె కలుగును. ముచ్చిచ్చును, ముచ్చిచ్చునందు మొ.

'ప్రాయికము' అనుటచే కొన్నియెడల ఏకవచనము వికల్పముగా వచ్చును. నల్గడ – నల్గడలు, నల్దెస – నల్దెసలు.

**19. కొండొకచో సమాసంబులందు నామ్వాదికనుమ్వాదుల మువర్ణంబులు పఝ్ఫువర్ణంబు లగు.**

**నాఁపచేను – పాఁపతేఁడు. కనుపపులు – జనుపనార.**

**నాము–పాము–ప్రేము–వేము–అమ్ము–ఎమ్ము. ఇవి నామ్వాదులు. కనుము–ఇనుము–ఉడుము–ఎనుము–జనుము–మినుము ఇత్యాదులు కనుమ్వాదులు.**

నాము మొద లగునవి నామ్వాదులు. నాము, పాము, ప్రేము, వేము, అమ్ము, ఎమ్ము అను ఆరుశబ్దములును నాము మొద లగునవి. కనుము, ఇనుము మొద లగునవి కనుమ్వాదులు. నామ్వాది కనుమ్వాదులు – పఝ్ఫువర్ణంబులు అనుచో యథాక్రమముగా అన్వయము. (ఇచటిముపర్ణము విభక్తి కాదు. కావున సమాసమున దీనికి లోపముప్రసక్తి లేదు.)

సమాసములందు నాము మొద లగుశబ్దములందలిముపర్ణముస్థానమున పఝ్ఫర్ణము ఆదేశముగా వచ్చును. ఈపఝులో ఝకారము ఇత్తు. పవర్ణము జిత్తు. కావున పవర్ణమునకు ముందు బిందువు వచ్చును.

నాముయొక్క చేను అనుఅర్థమున సమాస మయి, నాము+చేను అని కాగా ప్రస్తుతసూత్రముచే ముపర్ణమునకు పఝు వచ్చి 'జిత్తు బిందుపూర్వం బగు'

అనుసూత్రముచే ముందు అరసున్న చేరి, 'నాఁపచేను' అని అగును. దీర్ఘముమీదసాధ్యపూర్ణము లేదు. కావున ఇచట పూర్ణబిందువు రాదు.

సమాసమునందు కనుము మొద లగుశబ్దములందలి మువర్ణముయొక్క స్థానమున 'ప' అనువర్ణము ఆదేశముగా వచ్చును. కనుముయొక్క పులు అను అర్థమున సమాసమున కనుము+పులు అని కాగా, మువర్ణమునకు ఈసూత్రముచే 'ప' వర్ణము వచ్చి, 'కనుపపులు' అని అగును.

'కొండొకచో' అనుటచే ఈకార్యము లేకుండుటకును అవకాశము కలుగు చున్నది. పాముకుబుసము – ఉడుముపట్టు మొ.

'సమాసంబులందు' అనుటచే సమాసము కానపుడు పజ్బవర్ణములు రావు. నాము ఉన్నది. మినుము పండినది.

'నామ్వాది' అనుటచే నాము మొద లగుఆరింటికి తప్ప వే రొకశబ్దమునకు పజ్వర్ణము రాదు. ఇనుపకత్తి అనుచోట ఇనుఁపకత్తి, ఇనుంపకత్తి అనురూపములకు అవకాశము లేదు.

'కనుమ్వాదుల' అనుటచే కనుమ్వాదులలోలో చేరనిశబ్దములకు పవర్ణమును రాదు. మొగముసొగసు మొ.

**20. నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.**

**నిక్కల – కవ్వడి – పువ్విలుకాడు ఇత్యాదులు.**

నిక్కల మొద లగుసమాసరూపములు ప్రయోగములను అనుసరించి గ్రహింపవలయును. నిక్కల మొద లగు సమాసములలో లోపించుట, ఆగమము లుగా వచ్చుట, ఆదేశములుగా వచ్చుట మొద లగువర్ణవికారములు ఒక్కొక్కచోట పెక్కువిధములుగా ఉన్నవి. అవి అన్నియు లక్షణబద్ధము చేయుటవలన ఒక్కొక్క రూపమునకు పెక్కుసూత్రములు చెప్పవలసివచ్చుట, లేదా నిపతించుట మొదలుగా లక్షణమునకు గౌరవము కలుగును. అంతకంటెను ప్రయోగములనుండి ప్రయోగములను అనుసరించి గ్రహించుటయే లాఘవము. సంస్కృతవ్యాకరణ సంప్రదాయమును గూడ అనుసరించి సూరి నిక్కల మొద లగువానిని ప్రయోగానుసారముగా గ్రహింపదగు నని పేర్కొనెను.

నిక్కము+కల–నిక్కల. ఇచట నిక్కములో 'కము' లోపించి, నిక్+కల నిక్కల. కవ+వడి ఇచట కవలో అత్తు లోపించి (కవ్+వడి) కవ్వడి. ఇట్లే పువ్విలుకాడు మొద లగురూపములను ప్రయోగములనుండి (ఆయావర్ణవికారములతో) గ్రహింప వలెను.

'నిక్కలాదు' లనుచో ఆదిశబ్దముచే ప్రయోగములనుబట్టి ఆయా సమాసములను గ్రహింపవలెను. (ప్రౌఢ.సమాస.36)

**21. ఆకారంబున కామ్రేడితంబునకు దదర్థకంబున కయియాయి యనుశబ్దంబులు విభాష నగు.**

**వక్ష్యమాణవిధిచేత నయి యనుదాని కైకారాదేశంబు నగు.**

**ఆయయికాలము-ఆయాయికాలము. అయ్యయికాలము- అయ్యాయికాలము. ఆయైకాలము - అయ్యైకాలము. ఆయాకాలము - ఆయక్కాలము. అయ్యాకాలము - అయ్యక్కాలము.**

ద్విరుక్తముయొక్క పరరూపమునకు ఆమ్రేడితము అని పేరు. 'తత్' అను శబ్దముయొక్క అర్థమును ఇచ్చునది అయిన 'ఆ' అనుసర్వనామము ద్విరుక్తము (ఆ ఆ) అయినపుడు అందు రెండవది అగు 'ఆ' శబ్దముయొక్క స్థానమునందు, అయి, లేదా ఆయి అనుశబ్దములు వికల్పముగా ఆదేశముగా వచ్చును.

ఆ+ఆకాలము అని యుండగా రెండవ దగు 'ఆ'శబ్దమునకు ప్రస్తుత సూత్రముచే 'అయి' అనునది ఆదేశముగా వచ్చిన, ఆ+అయికాలము, యడాగమముతో 'ఆయయికాలము' అని అగును. 'అయి' ఆదేశము కానిపక్షమున 'ఆయి' అనునది ఆదేశ మయి, యడాగమముతో, ఆయాయికాలము అని అగును. 'విభాష' అనుటచే అయి, ఆయి అనుశబ్దములు రెండును రానిపక్షమునందు యడాగమముతో ఆయాకాలము అని యుండును.

'ఆకారంబునకు' అనుటచే ఆకారము లేనిచో ఈకార్యము లేదు. అతనియతనిమాటలు, వారివారివాక్కులు మొ.

'ఆమ్రేడితమునకు' అనుటచే ఆమ్రేడితము లేనపుడు ఈకార్యము లేదు. ఆకాలము అనుచో అయికాలము, ఆయికాలము అనువిధ మైనరూపము లుండవు.

'తదర్థకంబునకు' అనుటచే వర్ణమాలలో ఉండునది మొద లగు ఆకారమునకు ఈకార్యములేదు. ఆ ఆ - ఆయయి, ఆయాయి అని కాదు.

**22. బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి.**

**ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.**

'సమాసాంతకార్యము' అనగా సమాసమునందు చివర కలుగువర్ణములయొక్క మార్పు. తెలుగునందలి బహువ్రీహిసమాసములయందు చివర వర్ణముల వికారములును కనబడుచున్నవి.

మూఁడు కన్నులు కలవాడు అనువిగ్రహముచొప్పున బహువ్రీహిసమాస

మయి, మూడు+కన్ను అనునది (సమా. 17,13) ముక్కన్ను అని అగును. ప్రస్తుతసూత్రముచే సమాసాంతకార్యముగా 'న్ను' వర్ణమునకు 'ంటి' అనువర్ణము ఆదేశము కాగా, 'ముక్కంటి' అని యేర్పడును.

'బహువ్రీహిని' అనుటచే ఇతరసమాసములందు తెనుగున సమాసాంత కార్యములు లేవు. నల్లనికలువ, నెలతాల్పు, తల్లిదండ్రులు మొ.

'సమాసాంతకార్యంబులు' అని సామాన్యముగా చెప్పుటచే ఆయావర్ణవికార ములు కవిప్రయోగముల ననుసరించి గ్రహింపవలయును. ముక్కంటి, అనుచో 'ంటి' ఆదేశము, గట్టువిలుతుడు అనుచో తు ఆగమము. ఇట్లు ఇతరస్థలములందు గుర్తింపదగును.

'కానంబడియెడి' అనుటచే కవిప్రయోగములందు కనబడినవానినే గ్రహింప వలయును. స్వతంత్రముగా కల్పింపరాదు. నలువాయి - నలువ అయినది గదా యని నలుసేయి - 'నలుసె' అని కల్పింపరాదు.

**23. బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁదిమేనునకు బోఁడి యగు.**

**అలరుబోఁడి - ననబోఁడి - పూబోఁడి - విరిబోఁడి.**

స్త్రీవ్యక్తిని బోధించునట్టి బహువ్రీహిసమాసములలో, ఉపమానమును తెలుపు పూర్వపదమునకు పైనున్న 'మేను' అనుశబ్దముయొక్క స్థానమునందు 'బోఁడి' అనునది ఆదేశముగా వచ్చును.

అలరువంటి మేను కలది – స్త్రీ అనుఅర్థమున బహువ్రీహి సమాస మేర్పడి, అలరు+మేను అని ఉండగా ప్రస్తుతసూత్రముచే 'మేను' అనుశబ్దముస్థానమున 'బోఁడి' అనునది ఆదేశముగా వచ్చి, 'అలరుబోఁడి' అని అగును.

'బహువ్రీహిని' అనుటచేత ఇతరసమాసములలో ఈఆదేశము లేదు. అలరువంటిమేను అనుఅర్థమున (ఉపమానపూర్వపద మగు) కర్మధారయ సమాసములో 'అలరుమేను' అనియె యుండును.

'స్త్రీ వాచ్యం బగుచో' అనుటచే స్త్రీ బోధింపబడునపుడే ఈఆదేశము కలుగును. ఈచిలుక చిగురుబోడి (చిగురుమేనిది)- రాముఁడు చిగురుబోడి (చిగురుమేనివాడు) అనువిధముగా ఉండదు.

'ఉపమానంబుమీఁది' అనుటచే పూర్వపదము ఉపమానవాచకము కానిచో ఈఆదేశము రాదు.

'అగు' అనుటచే నిత్యము. చిగురువంటి మేనుగలస్త్రీ అనుఅర్థమున చిగురు బోఁడి అనియే కాని 'చిగురుమేను' అనువిధముగా బోఁడి ఆదేశము

కానిరూపములు ఉండవు. 'బోఁడి' అనుఈఆదేశము బకారము మొదట గలిగినశబ్దము కావున అలరుబోఁడి, పూబోఁడి, విరిబోఁడి ఇత్యాదిగా ఇచట బోఁడికి ముందు బిందు వుండదు.

**24. ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు.**

**మాత్రపితలు – మాతాపితలు ఇత్యాదులు.**

ద్వంద్వసమాసమునందు పూర్వపదము చివర ఉన్నఋకారముయొక్క స్థానమున 'ర' అనువర్ణము వికల్పముగా ఆదేశముగా వచ్చును. ఋకారము అచ్చతెలుగున లేదు. కావునను ద్వంద్వములు సాధ్యమిశ్రసమాసములును గుదురవు కావునను ఈకార్యము సిద్ధ(సంస్కృత)ద్వంద్వసమాసముననే అని స్పష్టము.

'మాతృపితృ' అనుసిద్ధద్వంద్వసమాసమునందు పూర్వపద మయిన 'మాతృ' శబ్దమునం దున్నఋకారమునకు ప్రస్తుతసూత్రముచే రవర్ణము ఆదేశ మయి మాత్రపితృ అనుఋకారాంతసమాసప్రాతిపదికము ఏర్పడగా ప్రథమావిభక్తిలో మాత్రపితలు అనువిధముగా తత్సమరూప మగును. విభాష అనుటచే 'రవర్ణము' ఆదేశము కానిపక్షమునందు సంస్కృతవ్యాకరణమును అనుసరించి 'ఆనజ్ ఋతో ద్వన్ద్వే' అని ఆఋకారమునకు 'ఆనజ్' ఆదేశముగా వచ్చి, మాతాపితృ – 'మాతాపితలు' అని అగును.

'ద్వంద్వంబునందు' అనుటచే ద్వంద్వముకంటె ఇతరము లైనసమాసములలో ఋకారమునకు రవర్ణము రాదు. పితృవాక్యము, విధాతృపలుకు మొ.

'ఋకారంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు ఈకార్యము లేదు. తల్లిదండ్రులు, బలరామకృష్ణులు మొ.

ఆనజునకు కాక 'ఋకారంబునకు' రవర్ణము విభాషగా విధించుటనుబట్టి ఆనజాదేశము రానితావులందును ఋకారమునకు రవర్ణము వచ్చుటను సూరి ఉద్దేశించియుండవచ్చును. మాంధాతృరఘుక్షితీశ – మాంధాత్రరఘుక్షితీశులు.

**25. సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు.**

**రామునిబాణము – సరసపువచనములు – వేవెలుగు – గుణములప్రోక.**

సమాసమునం దున్న ప్రథమ మొద లగువిభక్తులకు లోపము వచ్చును. బహుత్వమున ద్వితీయాదివిభక్తులకు ఆగమముగా వచ్చినలడాగమలవర్ణము మాత్రము లోపింపదు.

రామునియొక్క అనుషష్ఠ్యంత మగుశబ్దమునకు బాణములు అనుమీది పదముతో సమాసము చేయగా, రామునియొక్క+బాణము. ప్రస్తుతసూత్రముచే

యొక్క, ము అనువిభక్తులు లోపించును. రాముని + బాణ. ఈసమాసము (కత్తద్ధితసమాసా శ్చ) ప్రాతిపదిక మగును. దీనిపై ప్రథమావిభక్తి ఏకవచనము వివక్షింపగా మువర్ణకము వచ్చి, 'రామునిబాణము' అని అగును.

గుణములయొక్క+ప్రోక అనుచో 'ల' అనునది యొక్కవిభక్తికి 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' అనుసూత్రముచే వచ్చినఆగమము. 'యదాగమా స్తద్గుణీభూతాః తద్గ్రహణేన గృహ్యన్తే' అనున్యాయమును అనుసరించి విభక్తికి ఆగమ మయిన ఈ 'లడాగగమము' కూడ విభక్తియే అగును. కావున 'సమాసవిభక్తికి లోపం బగు' అనుదానిచే లోపింపవలసియుండగా 'లట్టునకుఁ గాదు' అనుటచే 'లట్టు' (మీది యొక్క లోపించును)లోపింపదు. గుణములప్రోక.

'సమాస' అనుశబ్దము తద్ధితవృత్తికి ఉపలక్షకము. కావున తద్ధితప్రత్యయములు మయినపుడును ప్రస్తుతసూత్రముచే విభక్తులు లోపించును. రామునియొక్క+తన – రామునితనము.

'సమాస(విభక్తికి)' అనుటచే సమాసము కానిచో విభక్తికి లోపము లేదు. రామునిచేత రక్షణము.

'విభక్తికి' అనుటచే విభక్తి కానిది లోపింపదు. రామునియొక్క బాణము అనుచోట 'ని' అనునది 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' అనుసూత్రముచే ప్రాతిపదికకు ఆగమ మయినది. కావున 'యదాగమాః' అనున్యాయముచే ప్రాతిపదికలో భాగమె కాని 'విభక్తి' కాదు. కావున అది లోపింపదు. రామునిబాణము. ఇట్లే గుణములప్రోక అనుచోట ముగాగమమును విభక్తి కాకుండుటచే లోపింపలేదు. వధువుముఖము మొ.

'అగు' అనుటచే లోపము నిత్యము. కావున సమాసమునందు విభక్తి లోపింపకుండుటకు వీలు లేదు. దొంగవలన భయము. ఇది సమాసము కాదు.

**26. కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబలె వానితోడ సమసించు.**

**రాముఁడు రక్షించినభృత్యుఁడు – రాముఁడు వాలి నేసినబాణము – రాముఁడు గోవు నిచ్చినవిప్రుఁడు – రాముఁడు వెడలినవనంబు – రాముఁడు వసించినపర్ణగృహము – రాముఁడు వసించినచోటు.**

కర్మ మొద లగునవి కర్మాదులు. కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అనునవి అయిదును ఇచ్చట కర్మాదులు. ప్రాధాన్యము అనగా క్రియలోనికి అన్వయము కలుగుట. ధాతువునుండి ఏర్పడినవిశేషణములు,

ధాతుజ విశేషణములు. ఎడి, ఎడు, వానిలోపము, ఉన్న, కల, న, ని అనునవి చివర గలిగి ధాతువునుండి కర్త్రర్థమున విశేషణరూపములు 7 ఏర్పడును. ఈధాతుజ విశేషణములు కర్తతో ఎట్లు సమాసమును పొందునో అదే విధముగా ప్రాధాన్యమును పొందినట్టి కర్మ మొద లగువానితో గూడ సమాసమును పొందును.

రాముడు రక్షించినభృత్యుడు. ఇచట రాముడు భృత్యుని రక్షించెను. అనునది వాక్యము. రక్షించెను అను భూతార్థకక్రియాపదము భూతార్థకధాతుజవిశేషణ మయి కర్తతో సమాసమును పొందగా 'భృత్యుని రక్షించినరాముడు' అని యుండును. ఇచట కర్త యైన రామునకే ప్రాధాన్యము కలిగినది. అట్లు కాక కర్మకు ప్రాధాన్య మీయదలచినపుడు రక్షించిన అనుధాతుజవిశేషణము కర్మ యైన భృత్యశబ్దముతో సమసించి (రక్షించినరాముడు అని కర్తతో సమసించినట్లుగా) 'రక్షించినభృత్యుడు' అని యగును. 'భావార్థకాదియోగంబునఁ గర్తకుం బ్రథమ యగు' అనుసూత్రముచే కర్తను తెలుపు రామశబ్దమునకు ప్రథమ వచ్చి, 'రాముడు రక్షించినభృత్యుడు' అని యగును. రక్షించినవాడు రాముడే కాని భృత్యుడు కాదు. కావున రక్షించిన, భృత్యుడు అనుశబ్దములకు ఏకార్థీభావము కుదురదు. సమసించుటకు ఈపదములు సమర్థములు కావు. కావున ఈసూత్రము ధాతుజ విశేషణములు కర్మాదులతో సమసించుటను విశేషముగా విధించుచున్నది.

'ప్రాధాన్యవివక్షయందు' అనుటచే ప్రాధాన్యమును చెప్పదలచుకొననపుడు సమాస ముండదు. రక్షించినభృత్యుని రాముఁడు అని వాక్య ముండదు.

'ధాతుజవిశేషణంబులు' అనునిర్దేశముచే ధాతుజవిశేషణములకు అన్నింటికి ఇట్లు సమాసము కలుగును.

భృత్యులను రక్షించుచున్న రాముడు – రాముడు రక్షించుచున్న భృత్యులు

భృత్యులను రక్షించెడు రాముఁడు – రాముఁడు రక్షించెడు భృత్యులు.

భృత్యులను రక్షింపఁగలరాముడు – రాముఁడు రక్షింపఁగల భృత్యులు. మొ.

**ఇది సమాసపరిచ్ఛేదము**

# తద్ధితపరిచ్ఛేదము

## 1. తనవర్ణకంబు త్వార్థంబునం దగు.

**త్వార్థం బనగా భావంబు. ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు. రామునితనము - రాముతనము. మనుమనితనము - సీతతనము- గొప్పతనము - కొఱతనము - నల్లఁదనము - పుల్లఁదనము.**

'త్వ' అనుప్రత్యయముయొక్క అర్థము. త్వార్థము. 'తస్య భావ స్త్వతలౌ' అని సంస్కృతమున 'త్వ' అనుప్రత్యయము భావార్థమునందు విధింపబడినది. కావున త్వార్థము అనగా ప్రకృతి=ప్రాతిపదికనుండి, జన్య=కలుగునట్టి, బోధనంబునందు= జ్ఞానమునందలి, ప్రకారము=ధర్మము. భావము అనగా ప్రాతిపదికవలన కలుగు జ్ఞానమునందలిధర్మము. ఉదాహరణమునకు రామ అనునది ప్రకృతి. దీనివలన కలుగుజ్ఞానము దశరథునిపుత్రుడు అనునది. అందలిధర్మము. అనగా దశరథుని పుత్రునియొక్క ధర్మము - రామత్వము. ఇట్లే 'దొంగ' అను ప్రకృతివలన తెలిసిన తస్కరణము చేయువాడు అనువానియందలి ధర్మము 'దొంగతనము' అగును.

భావార్థమునందు తెలుగున 'తన' అనుప్రత్యయము వచ్చును. త్వప్రత్యయము వలె ఈతనప్రత్యయమును షష్ఠీవిభక్తి చివర కలిగినశబ్దముపై వచ్చును.

రామునియొక్క భావము అనుఅర్థమున రామునియొక్క అనుషష్ఠ్యంత మగు పదముపై 'తన' అనుప్రత్యయము చేరి, రామునియొక్క+తన అని ఉండగా, 'సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు' అనుసూత్రముచే యొక్క ప్రత్యయము లోపించి, 'రామునితన' అని అగును. తద్ధితప్రత్యయము చివర గలిగినశబ్దమునకు 'కృత్తద్ధితసమాసా శ్చ' అనుసంస్కృతలక్షణమును అనుసరించి ప్రాతిపదికసంజ్ఞ కలుగును. ఇట్లు 'రామునితన' అనునది ప్రాతిపదికము. తన ప్రత్యయశబ్దము క్లీబసమము. కావున తనప్రత్యయాంతమునకు క్లీబసమమె అగును. అందుచే ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, 'రామునితనము' అని అగును.

## 2. ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు.

**స్పష్టము.**

ఉత్సర్గము అనగా సామాన్యశాస్త్రము, విశేషశాస్త్రము సామాన్యశాస్త్రమును నిత్యముగా బాధించును. కాని ఈతద్ధితపరిచ్ఛేదమునందు మాత్రము విశేష శాస్త్రము సామాన్యవిధిని వికల్పముగనె బాధించును. అనగా విశేషవిధి స్థలము లందును సామాన్యవిధి ఒకపక్షమున ప్రవర్తించును.

'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనునది త్వార్థమునందు అన్ని శబ్దములకును సాధారణముగా 'తన' అనుప్రత్యయమును చెప్పుచున్నది. సామాన్యముగా చెప్పబడినది కావున ఇది సామాన్యవిధి. 'చిన్నాదులకు తికవర్ణకం బగు' అనుసూత్రము చిన్నాదులకు త్వార్థమునందు 'తిక' అనుప్రత్యయము విధించినది. చిన్నాదులకు కొన్నింటికి ప్రత్యేకముగా చెప్పునది కావున అది విశేషవిధి. కావున చిన్నాదులకు తనప్రత్యయమును బాధించి తిక ప్రత్యయమే వచ్చును. చిన్నతికము అని అగును. ప్రస్తుతసూత్రముచే విశేషవిధి సామాన్యవిధిని వికల్పముగ మాత్రమె బాధించును. కావున తనప్రత్యయమును బాధింపనిపక్షమునందు తనప్రత్యయుమె వచ్చి, చిన్నతనము అనియు రెండవరూపము అగును. ఈవిధానము లేకున్నయెడల విశేషవిధి సామాన్యవిధిని నిత్యముగా బాధించును. కావున 'చిన్నతికము' అనియె కాని 'చిన్నతనము' అని తనప్రత్యయము వచ్చుట కవకాశము ఉండెడిది కాదు.

'ఇట' అనుటచే ఈనియమము తద్ధితపరిచ్ఛేదమునందు మాత్రమే. కావున మిగిలినపరిచ్ఛేదములందు విశేషవిధి సామాన్యవిధిని నిత్యముగానే బాధించును. 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును' అనువిశేషవిధి 'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' అనుసామాన్యవిధిని నిత్యముగా బాధించి, సంధి నిత్యముగా మాత్రమే వచ్చును. ఏలితి+అపుడు– ఏలి తపుడు.

**3. చిన్నాదులకు తికవర్ణకం బగు.**

**చిన్నతికము – కన్నెతికము. చిన్న – కన్నె – చుట్టము – దొంగ – పేద – మిండ – లంజె ఇత్యాదులు చిన్నాదులు.**

చిన్న, కన్నె మున్నగునవి చిన్నాదులు. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనుపూర్వసూత్రమునుండి 'త్వార్థంబునందు' అనునది అనువర్తించును. త్వార్థము అనగా భావము. చిన్న మొద లగుశబ్దములకు పరముగా భావార్థమునందు 'తిక' అనుప్రత్యము వచ్చును.

చిన్నయొక్క భావము అనుఅర్థమున చిన్నయొక్క అనుషష్ఠ్యంతముపై 'తన వర్ణకంబు త్వార్థంబునం దగు' అనుసూత్రముచే ప్రాప్తించుచున్న 'తన' వర్ణకమును

బాధించి, ప్రస్తుతసూత్రముచే టిక ప్రత్యయము రాగా, చిన్నయొక్క+టిక. సమాస విభక్తికి లోపం బగు' అనుసూత్రముచే యొక్క విభక్తి లోపించి చిన్నటిక. ఇది క్లీబసమము గావున ప్రథమావిభక్తి ఏకవచనమునం దు మువర్ణకము వచ్చి, 'చిన్నటికము' అని అగును. 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనుసూత్రము ననుసరించి ఈవిధి తనవర్ణకమును బాధింపనిపక్షమునందు తనప్రత్యయము వచ్చి, చిన్నతనము అని అగును. ఇట్లే చుట్టటికము – చుట్టపుఁ దనము మొ.

'చిన్నాదులకు' అనుటచే చిన్న మున్నగువానిలో చేరనిశబ్దమునకు టిక ప్రత్యయము లేదు. దొంగతనము.

**4. ఉత్వంబున కత్వంబు టికము పరం బగునపు డగు.**

**తొత్తటికము – వెడ్డటికము – వెజ్జటికము.**

'చిన్నాదులకు టికవర్ణకం బగు' అనుసూత్రముచే 'టిక' అనునది భావార్థమున వచ్చును. ఆ'టిక' ప్రత్యయము పర మగుచుండగా దానికి పూర్వమునం దున్న హ్రస్వ మయినఉకారముయొక్క స్థానమున హ్రస్వ మయినఅకారము వచ్చును.

'తొత్తుయొక్క భావము' అనుఅర్థమున తనవర్ణకమును బాధించి, 'చిన్నాదులకు టికవర్ణకం బగు' అనుసూత్రముచే టిక ప్రత్యయము వచ్చి, విభక్తి లోపింపగా, తొత్తు+టిక అని యుండగా ప్రస్తుతసూత్రముచే ముందరిఉత్వమునకు అత్వము వచ్చి, తొత్తటిక. ఇది క్లీబసమము గావున ప్రథమావిభక్తి ఏకవచనమునందు మువర్ణకము వచ్చి – తొత్తటికము అని అగును.

'ఉత్వంబునకు' అనుటచే ఉత్వము కానిఅచ్చునకు అత్వము రాదు. లంజెటికము, కన్నెటికము మొ.

'టికము పరం బగునపుడు' అనుటచే ఇతరప్రత్యయము పర మయినపుడు అత్వము లేదు. తొత్తుఁదనము, వెజ్జుఁదనము మొ. ఇట్లే తొత్తు, వెజ్జు ఇత్యాదిగా ఏప్రత్యయమును పరముగా లేకున్నను అత్వము రాదు.

**5. పేర్వాదుల కిమివర్ణకం బగు.**

**పేరిమి – కడిమి. పేరు – కడు – ప్రముచ్చు – మేలు – చెలి – పోఁడి– వాఁడి – వేఁడి ఇత్యాదులు పేర్వాదులు.**

పేరు మొద లగునవి పేర్వాదులు, పేరు కడు మొద లగునవి. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనుసూత్రమునుండి క్రమముగా ఈసూత్రములోనికి 'త్వార్థంబునందు' అనునది అనువర్తించును. త్వార్థ మనగా భావము. భావార్థము

నందు పేరు మొద లగుశబ్దములకు పరముగా 'ఇమి' అనుప్రత్యయము వచ్చును.

పేరుయొక్క భావము అనుఅర్థమున పేరుయొక్క అనుషష్ఠ్యంతముపై (తన వర్ణకమును బాధించి) ప్రస్తుతసూత్రముచే 'ఇమి' అనుప్రత్యయము వచ్చి, విభక్తి లోపింపగా, పేరు+ఇమి అని యుండును. 'అంద్వవగాగమంబులం దప్ప - అనుసూత్రముచే సంధి జరిగి, పేరిమి అని అయిన ఈతద్ధితాంతపు స్త్రీసమ పాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనమునకు లోపము వచ్చును. పేరిమి.

'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనుసూత్రము ననుసరించి ఈవిధి తనవర్ణకమును బాధింపనిపక్షమునందు తనప్రత్యయము వచ్చి, పేరుఁదనము అని అగును.

'పేర్వాదులకు' అనుటచే పేరు మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'ఇమి' ప్రత్యయము రాదు. చిన్నఱికము, పెద్దఱికము మొ.

**6. నవర్ణకంబు గుణవచనంబు లగునల్లాదుల కగు.**

**నల్లన - తెల్లన. నల్ల-తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-చామ-తియ్య-కమ్మ-పుల్ల-చప్ప-విన్న-తిన్న-అల్ల-ఒయ్య-తిమ్మ-చక్క-ద్రేఁక ఇత్యాదులు నల్లాదులు.**

గుణవచనము అనగా గుణమును తెలుపునది. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనుసూత్రమునుండి 'త్వార్థమునందు' అనుపదము క్రమముగా ఈ సూత్రములోనికి అనువర్తించును. గుణమును తెలుపునట్టి నల్ల మొద లగు శబ్దములకు పరముగా భావార్థమునందు 'న' అనుప్రత్యయము వచ్చును.

'నల్లయొక్క భావము' అన అర్థమున 'నల్లయొక్క' అనుషష్ఠ్యంతముపై (తన వర్ణకమును బాధించి) ప్రస్తుతసూత్రముచే 'న'వర్ణకము వచ్చి, విభక్తి లోపింపగా, నల్లన అని అగును. తద్ధితాంత మగు ఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిమీది ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. నల్లన.

'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనుసూత్రము ననుసరించి ఈవిధి తనవర్ణకమును బాధింపనిపక్షమునందు తనప్రత్యయము వచ్చి, నల్లఁదనము అని అగును.

'గుణవచనంబు లగు' అనుటచే గుణమును తెలుపునవి కానపుడు ఈ శబ్దములకును నవర్ణకము రాదు. నల్ల(నెత్తురు)యొక్క భావము నల్లతనము.

'నల్లాదులకు' అనుటచే నల్ల మొద లగువానిలో చేరనిశబ్దమునకు నవర్ణకము రాదు. పెద్దతనము.

**7. ఇక వర్ణకం బగ్గలాదుల కగు.**

**అగ్గలిక - ఒమ్మిక. అగ్గలము - ఒమ్మి.**

అగ్గల మొద లగునవి అగ్గలాదులు. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనుసూత్రమునుండి 'త్వార్థమునందు' అనుపదము క్రమముగా ఈసూత్రము లోనికి అనువర్తించును. భావార్థమునందు అగ్గల మొద లగుశబ్దములకు పరముగా ఇక అనుప్రత్యయము వచ్చును.

అగ్గలముయొక్క భావము అనుఅర్థమున 'అగ్గలముయొక్క' అనుషష్ఠ్యంతముపై (తనవర్ణకమును బాధించి) ప్రస్తుతసూత్రముచే 'ఇక' ప్రత్యయము వచ్చి విభక్తి (ముపర్ణము కూడ) లోపించి, అగ్గల+ఇక అని యుండగా 'అంద్వవగాగమంబు లందప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, అగ్గలిక అని అగును. తద్ధితాంత మగు ఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిమీదిప్రథమావిభక్తిఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. అగ్గలిక.

'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనుసూత్రము ననుసరించి ఈవిధి తనవర్ణకమును బాధింపనిపక్షమునందు తనప్రత్యయము వచ్చి, 'అగ్గలపుఁదనము' అని అగును.

'అగ్గలాదులకు' అనుటచే అగ్గల మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఇకప్రత్యయము రాదు. గొప్పతనము.

**8. మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.**

**మగఁటిమి - మగతనము. పేదఱిమి - ఒజ్జనము - కోటరము - కోడంట్రము - కోడంట్రికము - కోడరికము - కోమలికము - చెలికారము- తెలుపు - ఎఱుపు - పసుపు. ఱికాదులు రానిపక్షమునఁ దనప్రత్యయం బన్నింటి కగు. చిన్నతనము- ముచ్చుఁదనము - నల్లఁదనము - అగ్గలంపుఁదనము - ఒజ్జతనము.**

'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనుసూత్రమునుండి 'త్వార్థంబునందు' అనునది క్రమముగా ఇందును అనువర్తించును. భావార్థమున నుండు 'మగఁ టిమి' మొద లగుశబ్దములు ప్రయోగములను అనుసరించి గ్రహింపవలయును. ఒక్కొక్కశబ్దమునకు వేర్వేరుప్రత్యయములును, వేర్వేరువర్ణవికారములును కానవచ్చుటచేత వానిఅన్నింటికి లక్షణము చెప్పుటలో లాఘవము లేదు. అందుకే అట్టివి కవిప్రయోగములనుండి గ్రహింపవలయు నని సూరి ఇట్లు సూత్రించెను.

మగనియొక్క భావము అనుఅర్థమున టిమిఙ్ అనుప్రత్యయము వచ్చి, మగని (యొక్క) టిమి. నిగాగమము లోపించి, మగఁటిమి – మగంటిమి అని అగుచున్నది. ఇట్లే తన ప్రత్యయము వచ్చినపుడు నిగాగమము లోపించుచున్నది. మగతనము. పేదఱిమి – పేద శబ్దమునకు భావార్థమునందు 'ఱిమి' అనుప్రత్యయము. ఒజ్జనము – ఒజ్జశబ్దమునకు భావార్థమున 'న'వర్ణకము. ఇది క్లీబసమము. కావున ప్రథమైకవచనమునందు మువర్ణకము. ఇట్లు ఆయావానిని ప్రయోగములనుండి గ్రహింపవలెను.

**9. అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకం బగు.**

**అరమరిక–ఆమిక. అరమర –ఆము – అల్లిబిల్లి – గండి – నడవడి నాడు – నివ్వాళి – పొత్తి – మాన – మేలి – వాలు ఇత్యాదు లరమరాదులు.**

అరమర మొద లగునవి అరమరాదులు. స్వార్థము (స్వ – అర్థము) అనగా తనఅర్థము. స్వార్థమందు అనగా ప్రాతిపదికార్థమునందు అని ఇచ్చట గ్రహింపదగును. కాగా స్వార్థికప్రత్యయముచేరుటవలన అంతకుముందరి అర్థములో మా ర్పుండదు. అరమర మొద లగుశబ్దములకు పరముగా అదే అర్థములో 'ఇక' అనుప్రత్యయము వచ్చును.

'అరమర' అనుప్రాతిపదికముపై ప్రస్తుతసూత్రముచే 'ఇక' అనుప్రత్యయము వచ్చి, అరమర+ఇక అని ఉండగా 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, అరమరిక అని అగును. తద్ధితాంత మగుఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిమీదిప్రథమావిభక్తిఏకవచనమునకు 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. అరమరిక = అరమర.

'అరమరాదులకు' అనుటచే అరమరాదులలో చేరనిశబ్దమునకు ఈ 'ఇక' ప్రత్యయము లేదు. అగ్గలము మొ.

**10. ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు.**

**చిఱుతుక – నాఁతుక. చిఱుత–నాఁతి–నెలఁత–మెలఁత–పడఁతి– మడఁతి–పొలఁతి–వెలఁది–నిప్పు–ఎమ్ము. ఇత్యాదులు చిఱుతాదులు.**

చిఱుత మొద లగునవి చిఱుతాదులు. స్వార్థము అనగా ఇచట ప్రాతిపదిక యొక్క అర్థము. చిఱుత మొద లగుప్రాతిపదికలకు పరముగా అదే అర్థములో 'ఉక' అను ప్రత్యయము వచ్చును.

చిఱుత అనుప్రాతిపదికపయి స్వార్థమునందు ఈసూత్రముచే 'ఉక' అనుప్రత్యయము వచ్చి, చిఱుత+ఉక అని యుండగా 'అంద్వగాగమంబులం

దప్ప – అనుసూత్రముచే సంధి జరిగి 'చిఱుతుక' అని అగును. తద్ధితాంత మగు ఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే లోపము వచ్చును. చిఱుతుక, చిఱుత.

'చిఱుతాదులు' అనుటచే చిఱుత మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఉకవర్ణకము రాదు. ఆము మొ.

**11. కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.**

**కాప్రత్యయాంతంబునకు మగాదిగణగణనంబునంజేసి డు జగు. ఆటకాఁడు – ఆటకత్తియ. ఆట–అడపము–ఎమ్మె–ఓయారము–కటారి కొల్ల–చెలిమి–చేరువ–చౌరవ–జట్టి–జాజర–జూదము–తిండి–తేర–దొడ్డ నీటు–నేస్తము–బేరము–వగ–విలు–వెచ్చము–సొగసు ఇత్యాదు లాటాదులు.**

మతుప్ అనుప్రత్యయముయొక్క అర్థము మతుబర్థము. 'త ద స్యా స్త్యస్మి న్న స్తీతి మతుప్' అనుసూత్రముచే సంస్కృతమున 'కల' అనుఅర్థమున 'మతుప్' అనుప్రత్యయము విధింపబడినది. అట మొద లగునవి ఆటాదులు. ఆట మొద లగుప్రథమాంతము లయినశబ్దములకు మీద మతుప్ ప్రత్యయముయొక్క అర్థమున పురుషుడు బోధింపబడునపుడు 'కా' అనుప్రత్యయమును, స్త్రీ బోధింపబడునపుడు 'కత్తియ' అనుప్రత్యయమును వచ్చును.

ఆట కలిగినపురుషుడు అనుఅర్థమున ఆట అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే 'కా' ప్రత్యయము రాగా, 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే ఆట శబ్దముపైని ప్రథమైకవచనము లోపించి, 'ఆటకా' అని అగును. కాప్రత్యయాంతములు మగాదులలో చేరియున్నవి. కావున తద్ధితాంత మయినఈ ప్రాతిపదికమునకు ప్రథమావిభక్తి ఏకవచనమునందు 'మహత్తు లగు మగాదులకుం గయిరాదులకు డు జగు నుత్వంబు గాదు' అనుసూత్రముచే డుజ్ ప్రత్యయము వచ్చి, ఆటకాఁడు అని అగును. ఆట కలిగినది (స్త్రీ) అనుఅర్థమున ఈసూత్రముచే 'కత్తియ' అనుప్రత్యయము వచ్చి, 'ఆటకత్తియ' అని అగును. కత్తియ అనుతద్ధితప్రత్యయము చివర గలిగినప్రాతిపదికలు స్త్రీసమములు. కావున ప్రథమైకవచనలోపముతో ఆటకత్తియ. ఇయకు ఎత్వము వచ్చినచో ఆటకత్తె.

'పుంస్త్వస్త్రీత్వంబుల' అనుటచే స్త్రీవాచకము కానిఅమహదర్థమున ఈ ప్రత్యయములు లేవు. ఆట కలది (పక్షి) అనుఅర్థమున ఆటకత్తియ అనురీతిగా ఏర్పడదు.

'మతుబర్థంబునందు' అనుటచే ఇతర మైనఅర్థములలో ఈకార్యము లేదు.

'ఆటాదులకు' అనుటచే ఆట మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈ ప్రత్యయములు రావు. 'విలు' శబ్దము ఆటాదులలో ఉన్నది. విలుకాఁడు విలుకత్తియ. 'విల్లు' శబ్దము ఆటాదులలో లేదు. కావున విల్లుకాఁడు విల్లుకత్తియ అనురూపములు ఉండవు.

**12. కాకత్తియలకకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి.**

**అందగాఁడు - అందగత్తియ. కొండెగాఁడు - కొండెగత్తియ. బేరగాఁడు - బేరగత్తియ ఇత్యాదులు.**

కా, మరియు కత్తియ అనుతద్ధితప్రత్యములందు ఉన్నకకారపుపొల్లు స్థానమున అరుదుగా గకారపుపొల్లు ఆదేశముగా వచ్చుట కనబడుచున్నది.

అందము కలది (స్త్రీ) అనుఅర్థమున అందము శబ్దముపై 'కాకత్తియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' అనుసూత్రముచే' కత్తియ' ప్రత్యయము వచ్చి, విభక్తిలోపముతో అంద+కత్తియ అని ఉండగా, ప్రస్తుతసూత్రముచే కకారమునకు గకారము వచ్చి, 'అందగత్తియ' అని అగును. ఇట్లే అందగాఁడు. ఇబ్బంది అనుశబ్దముపై 'కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి' అనుసూత్రముచే కాప్రత్యయము వచ్చి, 'ఇబ్బంది కా' అని కాగా ప్రస్తుతసూత్రముచే కకారమునకు గకారము వచ్చి ఇబ్బందిగా- ఇబ్బందిగాఁడు అని అగును.

'కాకత్తియల' అనుటచే (ఇక మొద లగు)ఇతరప్రత్యయములలో కకారమునకు గకారము లేవు. అరమరిక మొ.

'కకారంబునకు' అనుటచే ఇతరహల్లులు అట్లె యుండును. అందగత్తియ.

'కొండొకచో' అనుటచే గకారము అన్నియెడల రాదు. ఆటకాఁడు, ఆటకత్తియ.మొ.

'కానంబడియెడి' అనుటచే కాకత్తియలకకారమునకు గకారము ఏశబ్దము లందు గలుగు నన్నది కవిప్రయోగములు చూచి అచ్చట మాత్రమె గ్రహింప వలయును. కేవలము జనవ్యవహారమును (విని) అనుసరించి ఆటగాఁడు ఇత్యాదిగా గకారము కల దని తలపరాదు.

**13. కాకత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు.**

**చెలికాఁడు - చెలికత్తియ. హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.**

స్వార్థము అనగా ఇచట ప్రాతిపదికయొక్క అర్థము. 'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' అనులక్షణముచే కా,కత్తియ ప్రత్యయములు మతుబర్థమునందు విధింపబడినవి. మతుబర్థమునందే కాక కొన్ని పురుషవాచకశబ్దములకు పరముగా స్వార్థమునందును 'కా' అనుప్రత్యయమును స్త్రీవాచకములకు 'కత్తియ' ప్రత్యయమును గనబడుచున్నది.

చెలి – మిత్రుఁడు మిత్రురాలు. మిత్రుడు అనుఅర్థమునందు 'చెలి' అను ప్రాతిపదికపయిని అదే అర్థమునందు ప్రస్తుతసూత్రముచేత 'కా' అనుప్రత్యయము వచ్చి, 'చెలికా' అని కాగా, 'మహత్తు లగుమగాదులకు..' అనుసూత్రముచే డుజు వచ్చి, చెలికాఁడు అని అగును. అట్లే మిత్రురాలు అనుఅర్థము కలిగిన 'చెలి' అనుప్రాతిపదికపయి అదే అర్థమునందు ప్రస్తుతసూత్రముచేత 'కత్తియ' అనుప్రత్యయము వచ్చి, స్త్రీసమము కావున ప్రథమైకవచనలోపముతో 'చెలికత్తియ' అని అగును.

'కొండొకవానికి' అనుటచే కాకత్తియలు స్వార్థమునందు అరుదు అనియు కొన్ని శబ్దములకే అగును. కావున ఎల్లశబ్దములపై రావు. సొగసు అనుఅర్థమున సొగసుకాడు, సొగసుకత్తియ అని కాదు.

'చూపట్టెడి' అనుటచే కవిప్రయోగములందు కానవచ్చినచోట్ల మాత్రమె కాకత్తియలను స్వార్థమునం దయినవానిని గుర్తింపవలెను.

### 14. కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.

### ఇబ్బందిగాఁడు – ఒంటిగాఁడు – కొమ్ముకాఁడు – పరికాఁడు.

తిర్యక్కులు అనగా పశువులు పక్షులు మొద లగునవి. కా అనుప్రత్యయము తిర్యక్కులను బోధించుశబ్దములపై గూడ కనబడుచున్నది.

'ఇబ్బంది' అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే 'కా' ప్రత్యయము వచ్చును. ఇబ్బందిశబ్దముపై ప్రథమైకవచనము 'సమానవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే లోపింపగా 'ఇబ్బందికా' అని అగును. కాప్రత్యయము (అమహత్తులు అయిన) కయిరాదులలోను గణింపబడును. కావున 'మహత్తు లగుమగాదులకు' అను సూత్రముచే డుజు వచ్చును. 'కాకత్తియలకకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి' అనుసూత్రముచే గకార మయి, ఇబ్బందిగాఁడు అని అగును. ఇబ్బందిగాఁడు = పెద్దపులికిని చిఱుతపులికిని పుట్టినమృగము.

'కానంబడియెడి' అనుటచే తిర్యక్కులపయిని కాప్రత్యయము వచ్చుస్థలములను కవిప్రయోగములందు చూచి వానిని గ్రహింపవలెను.

**15. అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు.**

**ఈప్రత్యయంబు మగాదిగణంబు. అటమటీఁడు - కమ్మతీఁడు. అటమటము - కమ్మతము - కన్నడమ - కొండెము - బానసము - బూటకము - మందడి - మన్నెము - సుంకము.**

**ఉక్కివంబునకు వలోపంబు నగు. ఉక్కీఁడు ఇత్యాదులు.**

అటమట మొద లగునవి అటమటాదులు. మతుప్ ప్రత్యయముయొక్క అర్థము (కల) మతుబర్థము. ప్రథమావిభక్తి చివర గలిగిన అటమట మొద లగుశబ్దములకు పరముగా పురుషుడు బోధించునపుడు మతుప్ ప్రత్యయముయొక్క అర్థములో 'ఈ' అను ప్రత్యయము వచ్చును.

అటమటము కలవాడు అనుఅర్థమున 'అటమటము' అనుశబ్దముపై ప్రస్తుత సూత్రముచే 'ఈ' అనుప్రత్యయము వచ్చి అటమటము+ఈ. 'సమాసవిభక్తికి లోపం బగు -' అనుసూత్రముచే ముచిభక్తి లోపించి, అటమట+ఈ. 'అంద్వవ గాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, అటమటీ అని అగును. తద్ధిత మగు'ఈ'ప్రత్యయము చివర గలిగినశబ్దము మగాదులలో చేరియున్నది. కావున తద్ధితాంత మగుఈప్రాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనమున 'మహత్తు లగు మగాదులకు' అనుసూత్రముచేత డుజ్ ప్రత్యయము వచ్చి, అటమటీఁడు అని అగును.

ఉక్కివము + ఈ - ఉక్కివ+ఈ అనుచో ఉక్కివములో 'వ' లోపించి, ఉక్కి+ ఈ-ఉక్కీఁడు.

'ఆటమటాదులకు' అనుటచే ఆటమట మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈ ప్రత్యయము రాదు. కల్ల కలవాడు కల్లీఁడు అని కాదు.

'పుంస్త్వంబునందు' అనుటచే స్త్రీ బోధింపబడునపుడు ఈప్రత్యయము రాదు.

**16. ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు.**

**మొక్కలీఁడు - కల్లరీఁడు.**

'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అను సూత్రము 'ఈ' ప్రత్యయము (పుంస్త్వమున) మతుబర్థమునందు చెప్పినది. ఈ ప్రత్యయము కొన్ని శబ్దములకు స్వార్థమునందే (పురుషుని బోధించునపుడు) వచ్చును.

కల్ల కలవాడు అనుఅర్థమున 'అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు' అనుసూత్రముచే అరిప్రత్యయము వచ్చి, 'కల్లరి' అని అగును. కల్లరి

అనుప్రాతిపదికకు అదే అర్థమున ప్రస్తుతసూత్రముచే 'ఈ' అనుప్రత్యయము వచ్చి (కల్లరి+ఈ). 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి అయి, కల్లరీ అని అగును. తద్ధిత మగు'ఈ'ప్రత్యయము చివర గలిగినశబ్దము మగాదులలో చేరియున్నది. కావున దీనిపై 'మహత్తు లగుమగాదులకు' అనుసూత్రముచే డుఙు రాగా, కల్లరీఁడు అని అగును. కల్లరీఁడు అనగా 'కల్లరి' అనియే అర్థము.

'కొన్నింటికి' అనుటచే అన్నిశబ్దములకు రాదు. జాలరీఁడు, ఓయారీఁడు అనువిధ మైనరూపము లుండవు. ప్రత్యయమువచ్చు కొన్నిశబ్దములను కవిప్రయోగముల ననుసరించి గ్రహింపవలెను.

## 17. అరి వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు.

**జాలరి – ఒఱపరి. జాల – ఒఱపు – కల్ల – చదువు – జూదము – టక్కు – తగవు – తీరుపు – తెంపు – తెరువు – నేరుపు – మతకము – వెరవు – వేఁట – సిగ్గు – సుంకము ఇత్యాదులు.**

మతుప్ప్రత్యయముయొక్క అర్థము (కల) మతుబర్థము. జాల మొద లగునవి జాలాదులు. జాల మొద లగుప్రథమావిభక్తి అంతమందు గలిగినశబ్దములకు పరముగా మతుబర్థమునందు 'అరి' అనుప్రత్యయము వచ్చును.

జాల కలిగినవాడు అనుఅర్థమునందు జాల అనుశబ్దముపయిని ప్రస్తుత సూత్రముచే 'అరి' ప్రత్యయము వచ్చి, (జాల+అరి) జాలశబ్దముపై ప్రథమైక వచనము 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే లోపించి, జాల+అరి అని యుండగా 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, 'జాలరి' అని అగును. తద్ధితాంత మగుఈస్త్రీసమప్రాతిపదికపైని ప్రథమైకవచనమునకు లోపము వచ్చి, 'జాలరి' అనుపద మేర్పడును. ఇట్లె ఒఱపరి.

'జాలాదులు' అనుటచే జాల మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'అరి' ప్రత్యయము లేదు. ఒప్పు గలవాడు ఒప్పరి అని కాదు.

'మతుబర్థంబున' అని మాత్రమె చెప్పుటచే మహదర్థమునను, అమహ దర్థమునను అరి ప్రత్యయము వచ్చును. ఒఱపరి అగురాముఁడు ఒఱపరి అగుసీత. ఇట్లె గోడ ఒఱపరి అనుటయు ఒప్పును.

## 18. ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు.

**ఓయారి – అక్కసి. ఓయారము–అక్కసము–కడలు–చాగము–జోగము తమకము–తుటారము–బండారము–బిత్తరము–బిటారము–బేహారము–ముచ్చరము–మిటారము–విన్నాణము–వెక్కసము ఇత్యాదులు.**

ఓయారము మొద లగుప్రథమావిభక్తి చివర గలిగినశబ్దములకు పరముగా మతుప్ ప్రత్యయముయొక్క అర్థమునందు 'ఇ' అనుప్రత్యయము వచ్చును.

ఓయారము కలవాడు అనుఅర్థమునందు ఓయారము అనుశబ్దముపై ప్రస్తుత సూత్రముచే ఇప్రత్యయము వచ్చి, ఓయారము+ఇ. 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే మువిభక్తి లోపింపగా, ఓయార+ఇ. 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, ఓయారి అని అగును. తద్ధితాంత మగు ఈ ప్రాతిపదికము స్త్రీసమము. కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అను సూత్రముచే ప్రథమైకవచనము లోపించి, ఓయారి అనుపదము ఏర్పడును.

'ఓయారాదులకు' అనుటచే ఓయారము మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'ఇ'ప్రత్యయము రాదు. ఒప్పుగలవాడు – ఒప్పి అని కాదు.

సామాన్యముగా విధించుటచే ఈ 'ఇ' ప్రత్యయము కూడ మహదర్థమునను, అమహదర్థమునను వచ్చును. నేహారి – బిత్తరి – కడలి మొ.

**19. తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు.**

**కొఱవత – చాకిత. కొఱవ–చాకి–బోయ–వానె–వ్రే–సాలె ఇత్యాదులు కులవాచకంబులు.**

కులమును బోధించుశబ్దములు కులవాచకములు. స్త్రీవ్యక్తిని బోధించునపుడు కులమును తెలుపునట్టి ప్రథమాంతము లగుశబ్దములకు పైని మతుప్ ప్రత్యయయముయొక్క అర్థమునందు తెలుగున 'త' అనుప్రత్యయము వచ్చును.

'కొఱవ' కులమునకు చెందినస్త్రీ అనుఅర్థమున 'కొఱవ' అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే 'త' అనుప్రత్యయము వచ్చి, 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే కొఱవ శబ్దముపైని ప్రథమైకవచనము లోపించి, కొఱవత అని అగును. తద్ధితాంత మగుఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిపై ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చి, 'కొఱవత' అని అగును.

'కులవాచకంబునకు' అనుటచే ఇతరశబ్దమునకు 'త' ప్రత్యయము రాదు. సొగసు కలిగినస్త్రీ అనుచో 'సొగసుత' అని కాదు.

'స్త్రీ వాచ్యం బగునపుడు' అనుటచే పురుషుడు బోధింపబడునపుడు తప్రత్యయము రాదు. కొఱవజాతి పురుషుడు 'కొఱవత' అని కాదు.

### 20. తవర్ణకంబు పరం బగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు. చెంచెత - మాలెత.

ఎత్వము అనగా హ్రస్వ మగు 'ఎ' కారము. ఇది ఏకాల్లు (ఒకే వర్ణము) కావున 'అలో కన్త్యస్య' అనునియమముచే చివరివర్ణముస్థానమున ఆదేశ మగును. 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు' అనుసూత్రముచే వచ్చిన 'త' అనుప్రత్యయము పరముగా ఉండగా ఆ'త' ప్రత్యయమునకు పూర్వమునందు ఉన్నకులవాచకము అయినశబ్దమునందలి చివరివర్ణముస్థానమున హ్రస్వ మగు'ఎ'కారము కొన్నియెడల ఆదేశముగా వచ్చును.

చెంచుకులమునకు చెందిన స్త్రీ అనుఅర్థమున తప్రత్యయము వచ్చి, చెంచు+త అని యుండగా ప్రస్తుతసూత్రముచే చెంచులో చివరివర్ణము (ఉత్వము) స్థానమున ఎత్వము వచ్చి, చెంచెత అగును.

'తవర్ణకంబు పరం బగుచో' అనుటచే తవర్ణము పరముగా లేనపుడు ఎత్వము రాదు. చెంచుది, చెంచుపడతి మొ.

'ఒకానొకచో' అనుటచే ఈ ఎత్వము కొన్ని శబ్దములందు మాత్రమె. కొఱవత చాకిత మొద లగుచోట్ల ఎత్వము లేదు. బోయెత బోయత అనుచో వికల్పముగా కలుగుచున్నది.

### 21. యువతివిటీజస్వలలు గుబ్బెతమిండతముట్టుతలు నాఁబడుదురు. స్పష్టము.

యువతి అనుఅర్థమున 'గుబ్బెత' అనియు, విటి అనుఅర్థమున 'మిండత' అనియు, రజస్వల అనుఅర్థమున 'ముట్టుత' అనియు తెలుగున రూపములు ఉండును.

గుబ్బ - మిండ - ముట్టు అనుశబ్దములకు మతుబర్థమునందు స్త్రీ వాచ్య మగుచుండగా 'త' అనుప్రత్యయమును, 'త' ప్రత్యయము పర మగుచుండగా 'గుబ్బ' అనుశబ్దమునందు చివరివర్ణమునకు ఎత్వమును ఈసూత్రముచే నిపతింపబడినవి. గుబ్బ, మిండ, ముట్టు అనుశబ్దములు కులమును తెలుపునవి కావు. అందుచే 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు' అనుసూత్రముచే 'తప్రత్యయము ప్రాప్తింపకపోవుటచే (గుబ్బెత - ఎత్వమును) ఇవి ఇట్లు నిపతింపబడినవి.

గుబ్బలు కలిగిన స్త్రీ అనుఅర్థమున గుబ్బలు అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే

తవర్ణకము వచ్చి, విభక్తి (లువర్ణము)లోపించి, ఎత్వము రాగా, 'గుబ్బెత' అని ఏర్పడును. ఈస్త్రీసమప్రాతిపదికమునకు మీద ప్రథమావిభక్తిఏకవచనము 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అనుసూత్రముచే లోపించును. ఇట్లె మిండలు (విటులు) గలది – స్త్రీ (విటి). మిండలు+త – మిండత. ముట్టు (రజస్సు) కలది (రజస్వల) ముట్టుత.

**22. వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడివర్ణకం బగు.**

**వగలాఁడి. వగ – చిన్నె – దొమ్మి – ఎమ్మె ఇత్యాదులు వగాదులు.**

వగ మొద లగునవి వగాదులు. మతుప్ప్రత్యయముయొక్క అర్థము (మతు+అర్థము) మత్వర్థము. మతుబర్థక మగుప్రత్యయము ప్రథమాంతములపై చేరును. కావున ఇచ్చట బహువచనాంతము అనగా ప్రథమావిభక్తి బహువచనము (లువర్ణకము) చివర గలిగినది అని అర్థము. ప్రథమావిభక్తి బహువచనము 'చివర గలిగిన'వగ'మొద లగుశబ్దములకు పరముగా స్త్రీ బోధింపబడునపుడు మతుప్ ప్రత్యయముయొక్క అర్థమునందు 'ఆఁడి' అనుప్రత్యయము వచ్చును. 'బహువచనాంతంబులకు' అని నిర్దేశించినసామర్థ్యముచే 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే రావలసినవిభక్తిలోపము ఇచ్చటి 'లు' విభక్తికి రాదు.

వగలు కలిగిన స్త్రీ అనుఅర్థమునందు 'వగలు' అనుశబ్దముపై ప్రస్తుత సూత్రముచే 'ఆఁడి' అనుప్రత్యయము వచ్చి, వగలు+ఆఁడి అని కాగా, విభక్తి లోపింపక, 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, 'వగలాఁడి' అని అగును. తద్ధితాంత మగు ఈప్రాతిపదికము స్త్రీసమము కావున దీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. వగలాఁడి.

'వగాదులకు' అనుటచేత వగ మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'ఆఁడి' ప్రత్యయము లేదు. ఓయారములు కలిగిన స్త్రీ ఓయారములాఁడి అని కాదు.

'బహువచనాంతంబులకు' అనుటచే ఏకవచనాంతములకు 'ఆఁడి' రాదు. వగాఁడి, చిన్నాఁడి అను విధముగా కాదు.

'స్త్రీ వాచ్యం బగునపుడు' అనుటచేత ఇతరము బోధింపబడునపుడు ఆఁడి ప్రత్యయము రాదు. వగలు గలిగినచిలుక 'వగలాఁడి' కాదు.

**23. వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు.**

**ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు. వగలాఁడు. చిన్నెలాఁడు.**

వగ మొద లగునవి వగాదులు. బహువచనము అంతమందు గలది బహు వచనాంతము. మతుబర్థకము ప్రథమాంతముపయిని వచ్చును. కావున బహు వచనాంత మనగా ప్రథమాబహువచనాంతము. ప్రథమావిభక్తి బహువచనము (లు) చివర కలిగిన 'వగ' మొద లగుశబ్దములకు పరముగా పురుషుడు బోధింప బడునపుడు మతుప్ప్రత్యయముయొక్క అర్థమునందు 'ఆ' అనుప్రత్యయము వచ్చును. 'బహువచనాంతములకు' అని నిర్దేశించినసామర్థ్యముచే 'ఆ'ప్రత్యయము బహువచనముపై చేరవలసియున్నది. కావున 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే రావలసినవిభక్తిలోపము ఇచ్చటి 'లు' వర్ణకమునకు రాదు.

వగలు కలిగినపురుషుఁడు అనుఅర్థమునందు వగలు అనుశబ్దముపై ప్రస్తుత సూత్రముచే 'ఆ' ప్రత్యయము వచ్చి, 'వగలు+ఆ' అని కాగా బహువచనము లోపింపక, 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి 'వగలా' అని అగును. తద్ధిత మగు 'ఆ'ప్రత్యయము చివర గలిగినశబ్దము మగాదులలో చేరియున్నది. కావున ఈప్రాతిపదికమునకు ప్రథమావిభక్తి ఏకవచనమునందు "మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు నుత్వంబు గాదు' అనుసూత్రముచే డుజు వచ్చి, వగలాఁడు అని అగును.

'వగాదులకు' అనుటచేత వగ మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'ఆ' ప్రత్యయము రాదు. ఓయారములు కలపురుషుడు 'ఓయారములాఁడు' అని కాదు.

'బహువచనాంతంబులకు' అనుటచే ఏకవచనాంతముపై ఆప్రత్యయము రాదు. వగాఁడు, చిన్నాఁడు అని ఉండదు.

'పుంస్త్వంబున' అనుటచే ఇతరము బోధింపబడునపుడు 'ఆ' ప్రత్యయము రాదు. వగలు కలచిలుక 'వగలా' అని మొదలుగా కాదు.

## 24. ముక్కు లోనగువానికిం దదభావద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడివర్ణకం బగు.

**ముక్కిఁడి - ముక్కు లేనివాఁ డని యర్థము. ముక్కు-వాలు- వెరవు-సిగ్గు ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.**

తత్+అభావద్యోతకము అనగా 'అది లేకపోవుటను తెల్పునది' అని అర్థము. ముక్కు మొద లగుప్రథమాంతము లగుశబ్దములకు పరముగా 'అది లేకపోవుట' అను అర్థమును బోధించుచు మతుప్ప్రత్యయముయొక్క అర్థములో 'ఇఁడి' అను ప్రత్యయము వచ్చును. (అది లేకపోవుట కలది = లేనిది)

ముక్కు లేనివాడు అనుఅర్థమున ముక్కు అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే

'ఇఁడి' ప్రత్యయము వచ్చి (ముక్కు+ఇఁడి) ముక్కు శబ్దముపైని ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చి, 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, ముక్కిఁడి అని అగును. తద్ధితాంత మగుఈప్రాతిపదికము స్త్రీసమ మగుటచే దీనిపైని ప్రథమైక వచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. ముక్కిఁడి – ముక్కు లేకపోవుట కలవాఁడు – ముక్కు లేనివాఁడు, మహత్తయినను అమహత్తయినను ఇట్టి రూప మేర్పడును.

'ముక్కు లోనగువానికి' అనుటచే ముక్కు మొద లగువానిలో చేరనిశబ్దమునకు 'ఇఁడి' ప్రత్యయము రాదు. నోరు లేనివాడు నోరిఁడి అని కాదు.

'తదభావద్యోతకం బయి' అనుటచే భావార్థమున ఇఁడిప్రత్యయము రాదు. వెరవు గలవాఁడు అనుఅర్థమున 'వెరవిఁడి' అని కాదు.

'మతుబర్థంబునందు' అనుటచే 'ముక్కు లేకపోవుట' అను మొద లగుఇతర అర్థమునందు 'ముక్కిఁడి' అని కాదు.

**25. మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకం బగు.**

**తూమెఁడు – ముంతెఁడు – ఎత్తెఁడు – వీసెఁడు – జేనెఁడు – మూరెఁడు – కడెఁడు – గంపెఁడు.**

మానము అనగా పరిమాణము. పరిమాణమును బోధించుశబ్దములకు పరముగా ఏకత్వార్థమునందు 'ఎఁడు' అనుప్రత్యయము వచ్చును. ఇది కూడ ప్రథమాంత ములపయినె వచ్చును.

తూము పరిమాణము కలది అనుఅర్థమున తూము అనుశబ్దముపై ప్రస్తుత సూత్రముచే 'ఎఁడు' అనుప్రత్యయము వచ్చి, తూము శబ్దమునకు పైనున్న ప్రథమైకవచనమునకు 'సమాసవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చి, తూము+ఎఁడు. 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, తూమెఁడు అని అగును. తద్ధితాంత మగుఈప్రాతిపదిక స్త్రీసమము కావున (ఉదంత మైనను, ఊరు మొద లగువానిపైవలె) ప్రథమైకవచనము లోపించును. తూమెఁడు.

'మానార్థంబునకు' అనుటచే పరిమాణవాచకములు కానిశబ్దములపై ఎఁడు ప్రత్యయము రాదు. వానియంత, ఇంత మొ.

'ఏకత్వంబునందు' అనుటచే పరిమాణవాచకశబ్దము బహుత్వమం దున్నపుడు ఎఁడు ప్రత్యయము రాదు. రెండు తూములు పరిమాణము కలది 'రెండు తూమెఁడు' అని కాదు. అట్లే ఏకత్వమునందు వచ్చిన 'ఎఁడు' ప్రత్యయము చివర గలిగినశబ్దము కూడ ఏకవచనాంతమే అయిఉండును. జేనెఁడులు, జేనెఁ

డులను అనువిధముగా ఎఁడు ప్రత్యయాంతముపయి బహువచనము చేరదు. తూమెఁడు గింజలకు.

### 26. ఎఁడు వర్ణకంబు పరం బగునపుడు లివర్ణంబు లోపించు.

### కమికెఁడు-కొడిదెఁడు-దోసెఁడు-పిడికెఁడు-పుడిసెఁడు-సందెఁడు.

ఎఁడు అనుతద్ధితప్రత్యయము పరముగా ఉండగా దానికి పూర్వమునం దున్న (పరిమాణార్థక) శబ్దముయొక్క చివరి 'లి' వర్ణమునకు లోపము వచ్చును.

'కమికిలి' అను శబ్దముపై మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకం బగు' అనుసూత్రముచే 'ఎఁడు' ప్రత్యయమువచ్చి (విభక్తి లోపించి) కమికిలి+ఎఁడు అని అగును. ప్రస్తుతసూత్రముచే లివర్ణము లోపించి, కమికి+ఎఁడు అని కాగా 'అంద్వవగాగంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, (ప్రథమైకవచనము లోపించి) కమికెఁడు అని అగును.

'ఎఁడు వర్ణకంబు పరం బగునపుడు' అనుటచే ఎఁడు పరముగా లేనిచో 'లి' వర్ణము లోపింపదు. కమికిలి.

'లివర్ణంబు' అనుటచే ఇతర వర్ణములకు లోపము లేదు. వ్రేలు + ఎఁడు = వ్రేలెఁడు. జోలె + ఎఁడు = జోలెఁడు మొ.

'లోపించు' అనుటచే లివర్ణలోపము నిత్యము. కావున 'కమికిలెఁడు, దోసిలెఁడు' అనువిధముగా లివర్ణము లోపింపనిరూపములు ఉండవు.

### 27. దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు.

### మోఁకాలిబంటి-మోఁకాలికొలఁది, తొమ్మబంటి-తొమ్మకొలఁది.

దఘ్నచ్ అను (సంస్కృత)ప్రత్యయముయొక్క అర్థము దఘ్నార్థము. 'ప్రమాణే ద్వయసజ్ దఘ్నఙ్ మాత్రజః' అని దఘ్నచ్ ప్రత్యయము ప్రమాణము అనుఅర్థమున చెప్పబడినది. ఆఅర్థమునందు తెలుగున బంటి, లేదా కొలఁది అనుప్రత్యయములు వచ్చును. ఇవి తెలుగున షష్ఠీవిభక్తి అంతమందు కలిగినశబ్దములపై చేరును.

మోఁకాలియొక్క ప్రమాణము అయినలోతు కలది అనుఅర్థమున మోఁకాలియొక్క అనుశబ్దముపై ప్రస్తుతసూత్రముచే 'బంటి' అనుప్రత్యయము వచ్చి, మోఁకాలియొక్క+బంటి అని యుండగా, 'సమానవిభక్తికి లోపం బగు' అనుసూత్రముచే యొక్క విభక్తి లోపించి, మోకాలిబంటి అని అగును. తద్ధితాంత మగుఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిపైని ప్రథమైకవచనము 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు' అనుసూత్రముచే లోపించును. మోఁకాలిబంటి. ఈసూత్రముచేతనె (బంటి రాక) కొలఁది ప్రత్యయము వచ్చినచో మోకాలికొలఁది.

'దఘ్నార్థంబున' అనుటచే ఇతరార్థములందు రావు. మూరెఁడు చీర అనుఅర్థమున మూరబంటి, మూరకొలది అనురీతిగా ఉండవు.

**28. అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది.**

**మంటమారి – తిండిపోతు. తాచ్ఛీల్యంబున మారి పోతు వర్ణకంబులు. అడప – తాంబూల కరండవాహి. మతుబర్థంబునం ద ప్రత్యయంబు. పెండ్లము ఊఢ. పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు ఇత్యాదు లూహ్యంబులు.**

ఇంతకు పూర్వము (తద్ధితపరిచ్ఛేదమున) చెప్పబడిన త్వార్థము, స్వార్థము, మతుబర్థము మొద లగువానికంటె వే రయినఅర్థములందును పూర్వము చెప్పబడని ఆయాప్రత్యయములు మహాకవిప్రయోగములనుండి తెలియవలయును.

తాచ్ఛీల్యార్థమునందు, మారి, పోతు అనుప్రత్యయములు వచ్చును. మంటమారి తిండిపోతు. మతుబర్థమునందు పూర్వము చెప్పబడని అ, అము అనుప్రత్యయములు వచ్చును. అడపము+అ – అడప. పెండ్లి+అము – పెండ్లము. ఇట్లు ఆయా విశేషార్థములును ఆయాప్రత్యయములును కవిప్రయోగములనుండి గ్రహింప వలయును.

తత్+శీలముయొక్క భావము తాచ్ఛీల్యము. వానిస్వభావము అను అర్థమునందు. కొన్నిటికి మారి, కొన్నిటికి పోతు అనుప్రత్యయములు వచ్చును. మంటమారి, తిండిపోతు.

**ఇది తద్ధితపరిచ్ఛేదము**

# క్రియాపరిచ్ఛేదము

## 1. ధాతువునకు.

**ఇది యధికారసూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగు నని యెఱుంగునది.**

సంజ్ఞ, పరిభాష, విధి, నియమము, అతిదేశము అధికారము అనువిధముగా సూత్రము ఆరులక్షణములలో ఏదో ఒకటి అయిఉండును. 'ధాతువునకు' అను ఇది అధికారసూత్రము. దీనికి ప్రత్యేకముగా సంపూర్ణ మగుఅర్థ ముండదు. ఈ సూత్రము తరువాత చెప్పబోవు అన్ని లక్షణములందును అన్వయించును. అనగా ఈక్రియాపరిచ్ఛేదమున (కృదంతపరిచ్ఛేదమునను) ఏది విధింపబడునో అది ధాతువునకు కలుగును. ఇట్లే ఆసాంతము లక్షణము అనువృత్తము అయి అన్వయించుట 'అధికార' సూత్రలక్షణము.

వర్తమానంబున ల ట్టగు. అనునది తరువాతిసూత్రము. 'ధాతువునకు అనుప్రస్తుతసూత్రము మొత్తము తరువాతిసూత్రములోనికి చేరి, అన్వయించును. ఆసూత్రమునకు 'ధాతువునకు వర్తమానంబున ల ట్టగు' అని అర్థము. ఇట్లు సూత్రము లన్నింటిలో 'ధాతువునకు' అనుపదమును ప్రయోగింపవలసిన అవసరము లేకుండ ముందుగా అధికారసూత్రముగా చెప్పుటలో లాఘవము కలదు.

## 2. వర్తమానంబున ల ట్టగు.

**వర్తమానక్రియావృత్తి యగుధాతువునకు లడ్వర్ణకం బగు. వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు. అప్పటికి ముగియకుండునది.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రము ఇందు అనువర్తించును. వర్తమానము అనగా ప్రయోగించుసమయమున క్రియ ప్రారంభము అయి, ఇంకను పూర్తి కానిది. వర్తమాన మయిన (నడుచుచున్న) వ్యాపారమునందు వర్తించుచున్న ధాతువునకు 'లట్' అనుప్రత్యయము వచ్చును. లట్టులో టకారము ఇత్తు. లవర్ణమునందలి అకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. కావున లకారపు పొల్లు మాత్రమే వచ్చును. ఈలట్టు సంస్కృతవ్యాకరణము ననుసరించి యున్నది.

చదువుచున్నాఁడు. ఇట క్రియాపదము ప్రయోగించుసమయమునకు చదువుట అనుక్రియ ప్రారంభ మయిఉన్నది. కాని చదువుట పూర్తి కాలేదు. ప్రారబ్ధ మై అపరిసమాప్తము అగుటచే ఇది వర్తమానము. ఈఅర్థమున ఉన్న చదువు ధాతువునకు ప్రస్తుతసూత్రముచే లట్టు వచ్చి, చదువు+ల్. ప్రథమపురుషలో ఏక వచనము - చదువుచున్నాఁడు అని అగును. 'చదువు' అనుధాతువే వర్తమాన క్రియావృత్తి అయియున్నది. లట్టు లకారము ఆఅర్థమును ప్రకాశింపజేయును.

**3. భూతంబున లి ట్టగు.**

**భూతక్రియావృత్తి యగుధాతువునకు లిడ్వర్ణకం బగు. భూతంబు నా విద్యమానధ్వంసప్రతియోగి. ముం దుండి యప్పటికి లేకుండునది.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రమును అనుసరించి 'లిట్' ధాతువునకు వచ్చును. భూతము అనగా విద్యమానము అయినధ్వంసమునకు ప్రతియోగి. అనగా క్రియ ప్రయోగించుసమయమునకు నాశనము అగుటకు వ్యతిరిక్తము అయినది. అనగా అంతకుముందు ఉండి ప్రయోగించుసమయమునకు లేకుండు నది. ఇట్టిభూతార్థము అయినవ్యాపారమునందు వర్తించుచున్నధాతువునకు 'లిట్' అనుప్రత్యయము వచ్చును. లిట్టులో టకారము ఇత్తు. లివర్ణమునందలి ఇకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. వర్తమానమందలిలట్టునకు భిన్నము అగుటకు ఇచట ఉచ్చారణసౌకర్యమునకు ఇకారము గ్రహింపబడినది. లకారవుపొల్లె వచ్చును. లిట్టు సంజ్ఞ సంస్కృతవ్యాకరణమును అనుసరించియున్నది.

చదివెను. ఇచట క్రియాపదము ప్రయోగించుసమయమునకు చదువుట అనువ్యాపారము నష్ట మైనది. కాని అంతకు ముందు ఆవ్యాపారము కలదు. కావున ఇది భూతము. ఈఅర్థమునం దున్న 'చదువు' ధాతువునకు ప్రస్తుత సూత్రముచే లిట్టు వచ్చి, చదువు+ల్. ప్రథమపురుషలో ఏకవచనమున 'చదివెను'.

**4. భావిని లృ ట్టగు.**

**భావిక్రియావృత్తి యగుధాతువునకు లృడ్వర్ణకం బగు. భావి నా విద్యమాన ప్రాగభావప్రతియోగి. అప్పటికిఁ బుట్టకుండునది.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రమునుబట్టి ధాతువునకు వచ్చును. భావి అనగా క్రియాపదము ప్రయోగించుసమయమునకు లేకపోవుట అనుదానికి వ్యతిరిక్త మయినది. అనగా అప్పటికి ఇంకను పుట్టక ఆపైని కలుగునది. ఇట్టి 'భావి' అర్థము అయినవ్యాపారమునందు వర్తించుధాతువునకు 'లృట్' అను ప్రత్యయము వచ్చును. లృట్టులో టకారము ఇత్తు. 'లృ' అనుచోట 'ఋ'కారము

ఉచ్చారణసౌకర్యమునకయి చేర్పబడినది. లట్టు, లిట్టులకంటె భిన్న మని తెల్పుటకు ఇచట ఉచ్చారణసౌకర్యమునకై ఋకారము స్వీకరింపబడినది. కావున ధాతువునకు లకారపుపొల్లు మాత్రమె అగును. లృట్టు సంస్కృతవ్యాకరణమును అనుసరించి యున్నది.

చదువఁగలఁడు. ఇచట క్రియాపదము ప్రయోగించుసమయమునకు 'చదువుట' అనువ్యాపారము లేదు. తరువాత ఉండును. కావున ఇది భావి అర్థము. ఈఅర్థమునం దున్న 'చదువు' ధాతువునకు ప్రస్తుతసూత్రముచే లృట్టు వచ్చి, చదువు+ల్. ప్రథమపురుషఏకవచనమునందు 'చదువఁగలఁడు'.

**5. తద్ధర్మాదులందు లా ట్టగు.**

**తద్ధర్మక్రియావృత్తి యగుధాతువునకు లాడ్వర్ణకం బగు. తచ్ఛీల సంభావనా,సంప్రశ్న,సాతత్య,వర్తమాన,భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు.**

ధాతువుయొక్క ధర్మము తద్ధర్మము. తద్ధర్మము మొద లగునవి తద్ధర్మాదులు. తచ్ఛీలము, సంభావన మొద లగునవి. 'ధాతువునకు' అనుఅధికారసూత్రమును అనుసరించి ధాతువునకు అనుఅర్థము సిద్ధించును. తద్ధర్మము, తచ్ఛీలము మొద లగుఅర్థములలో నున్నవ్యాపారమునందు వర్తించుధాతువునకు 'లాట్' అను ప్రత్యయము వచ్చును. లాట్టులో టకారము ఇత్తు. 'లా' అనుచోట 'ఆ'కారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. లట్టు, లిట్టు,లృట్టు అనువానికంటె భిన్నముగా నుండుటకు ఇచ్చట లకారముపై 'ఆ'కారము ఉచ్చారణసౌకర్యమునకు స్వీకరింపబడినది. కాగా ధాతువునకు లకారపుపొల్లు మాత్రమే అగును. సంస్కృతముకంటె విశేషముగా తెలుగున మాత్రమే ఉన్నఈఅర్థమును సంపాదించుటకు 'లాట్టు' లకారమును సూరి స్వతంత్రముగా ఏర్పరచెను.

చదువును. ఇచట చదువు అనుధాతువు 'చదువుట' అనుధాతువుయొక్క ధర్మమును మాత్రమే బోధించుచున్నది. కావున తద్ధర్మార్థమునం దున్న 'చదువు' ధాతువునకు ప్రస్తుతసూత్రముచే లాట్టు వచ్చి, చదువు+ల్. ప్రథమపురుష ఏకవచనమునందు 'చదువును' అని అగును. తచ్ఛీలము మొద లగు అర్థములందును లాట్టు వచ్చి పైవిధముగా రూపములు ఏర్పడును.

**6. ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు.**

**ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకం బగు.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రము ననుసరించి ధాతువునకు అనుఅర్థము సిద్ధించును. ఆశీస్సు, శాపము, సంప్రార్థనము అనుఅర్థములతో కూడిన వ్యాపారమునందు వర్తించుధాతువునకు 'లూట్' అనుప్రత్యయము వచ్చును.

లూట్టులో టకారము ఇత్తు. 'లూ' అనుచోట 'ఊ' కారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు అనువానికంటె భిన్నముగా నుండుటకు ఇచ్చట ఊకారము (సంస్కృతవ్యాకరణమునందువలె) ఉచ్చారణసౌకర్యమునకు స్వీకరింపబడినది. కాగా ధాతువునకు లకారపు పొల్లు మాత్రమే అగును.

శుభంబు కలిగెడును. కలుగు అనుధాతువుపై ఆశీరర్థమున ప్రస్తుతసూత్రముచే లూట్టు వచ్చి, కలుగు+ల్. ప్రథమపురుషఏకవచనమునందు 'కలిగెడును'.

**7. వ్యతిరేకంబున లజీ యగు.**

**వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజీ వర్ణకం బగు.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రమును అనుసరించి ధాతువునకు అనుఅర్థము సిద్ధించును. వ్యతిరేక మగుఅర్థముతో కూడినవ్యాపారమునందు వర్తించుచున్న ధాతువునకు 'లజీ' అనుప్రత్యయము వచ్చును. లజీలో జీ వర్ణము ఇత్తు. మిగిలిన లవర్ణములో అకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. వర్తమానమున వచ్చు లట్టు టిత్తు. కాగా ఇది జీత్తు అయినది. కావున భేదము స్పష్టమే. లకారపు పొల్లు మాత్రమే వచ్చును.

చదువఁడు. ఇచట ధాతువు వ్యతిరేక మయినఅర్థముతో కూడినవ్యాపారమును (చదువుట అనువ్యాపారమునకు వ్యతిరేక మయినవ్యాపారమును - చదువక పోవుటను) బోధించుచున్నది. కావున 'చదువు' ధాతువునకు ప్రస్తుతసూత్రముచే లజీ అయి, చదువు+ల్. ప్రథమపురుషఏకవచనమునందు 'చదువఁడు'.

**8. లకారంబునకు డుఁబ్రువురునుము ఙ్ఞగు.**

**లడాదిలకారంబులం దొక్కొక్కటికి డుఁజాదు లాదేశంబు లగు. ఇందు ఇఁకారంబు ప్రత్యాహారార్థంబు.**

'లకారంబునకు' అనుచోటిషష్ఠీవిభక్తిచేత లకారముయొక్క స్థానమున అని అర్థ మగును. ముఞ్ అనుచోట ఞకారము ప్రత్యాహారముకొఱకు చేర్పబడినది. (డుఞ్ వుఞ్ మొ.) కావున అది ప్రత్యయములో భాగము కాదు. లకారముయొక్క స్థానమునందు, డుఞ్, రు, వు, రు, ను, ము అనునవి ఒక్కొక్కటి (ఆయా అర్థములందు) ఆదేశములుగా వచ్చును.

చదువు అనుధాతువుపై 'వర్తమానంబున ల ట్టగు' అనుసూత్రముచే లట్టు వచ్చి, చదువు+ల్ అని ఉండగా, ప్రస్తుతసూత్రముచే లకారముయొక్క స్థానమున డుఞు వచ్చి, చదువు+డుఞ్, చదువుచున్నాఁడు అని అగును. ఇట్లే చదువుచున్నారు. మొ.

'లకారంబునకు' అనుసామాన్యనిర్దేశముచేత వర్తమానాద్యర్థంబులందు

విధించిన లట్టు, లిట్టు, లృట్టు, లొట్టు, లూట్టు, లజీ, అనులకారములు ఆరింటి స్థానమునను ఈ 'డుజ్' మొద లగునవి వచ్చును. చదివితిని, చదువుదుము మొ.

**9. అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు.**

**డుజ్ - రు, ప్రథమము. వు-రు, మధ్యమము. ను-ము, ఉత్తమము.**

'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గు' అనుసూత్రముచే విధింపబడిన 'డుజ్ రు వు రు ను ము' అనువానిలో వరుసగా రెండు రెండు చొప్పున వర్ణములకు ప్రథమము, మధ్యమము, ఉత్తమము అని పేరు. యథాక్రమముగా, మొదటి రెండు అయిన డుజ్, రు, అనువానికి 'ప్రథమము' అని సంజ్ఞ. తరువాతిరెండు అయిన వు-రు అనువానికి మధ్యమము అని సంజ్ఞ. ఆతరువాతి రెండు అయిన 'ను-ము' అనువానికి ఉత్తమము అని సంజ్ఞ. ఇవే ప్రథమపురుషము, మధ్యమ పురుషము, ఉత్తమపురుషము అని వ్యవహరింపబడును.

**10. వానిలో రుములు బహువచనంబులు, పెఱ లేక వచనంబులు.**

బహుత్వసంఖ్యను బోధించుప్రత్యయము బహువచనము. ఏకత్వసంఖ్యను బోధించుప్రత్యయము ఏకవచనము. పెఱలు అనగా ఇతరములు. చెప్పగా మిగిలినవి అని అర్థము. 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గు' అను సూత్రమునందు చెప్పబడిన 'డుఙ్రువురునుము' అనువానియందు 'అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు' అనుసూత్రము ననుసరించి, 'డుఙ్రు' అనునవి ప్రథమపురుషములును, 'వురు' అనునవి మధ్యమపురుషములును, 'నుము' అనునవి ఉత్తమపురుషములును అగును.

వీనిలో 'రుము' అనునవి రెండు బహువచనములు. డుజ్, రు అనుచో ప్రథమపురుషయందును, 'వురు' అనుచో మధ్యమపురుషయందును 'రు' వర్ణము కలదు. రువర్ణము బహువచనము అనుటచేత ప్రథమ, మధ్యమపరుషములందలివి రెండును బహువచనములె. 'నుము' అనుఉత్తమపురుషలో మువర్ణము బహువచనము.

ఇంక మిగిలియున్నవి అనగా డుజ్, వు, ను అనునవి ఏకవచనములు. కావున డుజ్, ప్రథమపురుషఏకవచనము. రు-ప్రథమపురుషబహువచనము. వు-మధ్యమపురుషఏకవచనము. రు-మధ్యమపురుషబహువచనము. ను-ఉత్తమ పురుషఏకవచనము ము- ఉత్తమపురుషబహువచనము అని తెలియవచ్చును.

బహువచనములు ముందుగా చెప్పి ఏకవచనములను పెఱలుగా చెప్పుటలో సూత్రమున లాఘవము సంపాదింపబడిన దందురు. ఏకవచనములను

ముందుగా పేర్కొనినచో 'దుజ్వును' అనుమూడక్షరములను పేర్కొనవలసివచ్చుటచే సూత్రమున అక్షరగౌరవము గలిగెడి దని అభిప్రాయము.

## 11. నామయుష్మదస్మదర్థంబులందుం బ్రథమమధ్యమోత్తమంబు లగు.

'ధాతువునకు' (క్రియ. 1) యుష్మదర్థమును బోధించునపుడు ధాతువునకు మధ్యమపురుష అగును. యుష్మదర్థము అనగా నీవు, మీరు అనునవి కర్తలుగా ఉన్నపుడు ధాతువునకు మధ్యమపురుషప్రత్యయములు వచ్చును. (నీవు) చదువుచున్నావు. (మీరు) చదువుచున్నారు. అస్మదర్థమును బోధించునపుడు ధాతువునకు ఉత్తమపురుష అగును. అనగా నేను, మేము అనునవి కర్తలుగా ఉన్నపుడు ధాతువునకు ఉత్తమపురుషప్రత్యయములు వచ్చును. (నేను) చదువుచున్నాను. (మేము) చదువుచున్నాము.

నామార్థమును బోధించునపుడు ధాతువునకు ప్రథమపురుష వచ్చును. యుష్మదర్థము, అస్మదర్థము వేరుగా చెప్పబడినవి కావున యుష్మదస్మదర్థములకంటె వే అయిన దెల్ల 'నామ'శబ్దముచే గ్రహింపబడును. నీవు, మీరు, నేను, మేము అనువానికంటె వే రయినది ఏ దయినను కర్త (కర్మ)గా ఉన్నపుడు ప్రథమపురుష ప్రత్యయములు వచ్చును. (వాడు) చదువుచున్నాఁడు. (వారు) చదువుచున్నారు. ఇట్లే (వీడు, ఎవడు) రాముఁడు చదువుచున్నాఁడు మొ.

## 12. అమహదర్థంబునందు డుర్రులకు దువు లగు, నున్నానుబంధంబుమీఁద దివి యగు.

స్త్రీతిర్యగ్జడములు అమహత్తులు. అమహత్తును బోధించుసందర్భమునందు 'లకారంబునకు డుర్రువురునుము ఙ్గు' అనుసూత్రముచే ప్రథమపురుషయందు లకారమునకు ఆదేశముగా వచ్చిన డుజ్, రు' అనువానికి క్రమముగా 'దు, వు' అనునవి వచ్చును. అనగా డుజుస్థానమున దువర్ణమును, 'రు' స్థానమున 'వు' వర్ణమును వచ్చును.

(చిలుక) పలుకఁగలదు. ఇచట పలుకు అనుధాతువునకు భవిష్యదర్థమున లృట్టును లకారమునకు డుజును (కలజీ మొద లగునవియు) వచ్చి, పలుకఁ గలడుజ్ అని యగును. (చిలుక అను) అమహత్తుయొక్క క్రియను బోధించుచున్నది. కావున ప్రస్తుతసూత్రముచే డుజునకు దువర్ణము వచ్చి, చిలుక పలుకఁగలదు అని అగును. బహువచనమున (చిలుకలు) పలుకఁగల+రు అనుచోట 'రు' స్థానమున వువర్ణము వచ్చి, పలుకఁగలవు అని అగును. ఇట్లే చిలుక (చిలుక) పలుకదు (చిలుకలు) పలుకవు మొ.

అమహత్తుయొక్క వ్యాపారమును బోధించునపుడు ఉన్న అనుబంధముమీద

లట్టు లకారమునకు వచ్చిన డుఙు స్థానమున 'ది' అనువర్ణమును 'రు' స్థానమున 'వి' అనునదియును ఆదేశముగా వచ్చును. (చిలుక) పలుకుచున్న+డుఙ్ – పలుకుచున్నది. (చిలుకలు) పలుకుచున్న+రు – పలుకుచున్నవి.

'అమహదర్థంబునందు' అనుటచే మహదర్థమునందు ఈకార్యము లేదు. రాముఁడు చదువుచున్నాఁడు. లక్ష్మీసరస్వతులు చదువుచున్నారు. (ఇచట మహతి మహ త్తయినను మహత్కార్యము కలిగినది (ఆచ్ఛి. 26) 'డుఙ్రు' అనుటచే మధ్యమ పురుషయందును 'రు'వర్ణ మున్నప్పటికి డుఙుయొక్క సాహచర్యముచే (సహచరితా సహచరితయో స్సహచరిత స్యైవ గ్రహణమ్) ప్రథమపురుషయందలి రు వర్ణమె గ్రహింపబడును. కావున మధ్యమోత్తపురుషలయందు వచ్చు 'వురు, నుము' అనునవి అమహదర్థమునందును అట్లే ఉండును. 'ఉన్నానుబంధంబుమీఁద' అనుటచే 'ఉన్న' అనుదానికంటె ఇతర మైనఅనుబంధముమీద డుఙ్రులకు 'దివి' రావు. చిలుక పలుకఁగలదు. చిలుకలు పలుకఁగలవు. ఇచట కల అనుబంధముపై 'దువు'లే వచ్చినవి.

**13. ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు.**

**ఉదంతం బయినధాతువునకు లట్టు పరం బగునపుడు 'ఉన్న' అనుశబ్దం బనుప్రయుక్తం బగు.**

'ధాతువునకు' (క్రియ. 1) వర్తమానమున వచ్చినది లట్టు. సూత్రమునందు అనుబంధము అని చెప్పి వివరణమునందు అనుప్రయుక్తము అనుటచే తెలుగున అనుబంధము (సంస్కృతమున ఇద్వర్ణమును అనుబంధ మనుట గలదు) అనుప్రయుక్తము అనునవి సమానార్థకములు. కావున 'ఉన్న' ధాతువును అనుసరించి ప్రయోగింపబడును. లట్టు పరముగా ఉన్నపుడు హ్రస్వ మగు ఉకారము చివర కలిగినధాతువునకు చివర 'ఉన్న' అనుశబ్దము వచ్చిచేరును.

'వండు' అనుధాతువునకు 'వర్తమానార్థమునందు' వర్తమానంబు ల ట్టగు' అనుసూత్రముచే లట్టు వచ్చి, వండు+ల్ అని యుండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు చివర 'ఉన్న' అనునది చేరి, వండు+ఉన్న+ల్ అని అగును, 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గగు' అనుసూత్రముచే ప్రథమపురుష ఏకవచనమునందు డుఙు వచ్చి, వండు+ఉన్న+డుఙ్. చివరకు 'వండుచున్నాఁడు' అని అగును.

'ఉదంతమునకు' అనుటచే కల+ల్ మొద లగుచోట్ల ఉదంతము కాని దానికి 'ఉన్న' రాదు. కలఁడు మొ.

'లట్టు పరం బగునపుడు' అనుటచే లిట్టు మొద లగునవి పర మయినపుడు

'ఉన్న' రాదు. వండెను - వండును మొ.

**14. ఉన్న శబ్దంబు పరం బగునపుడు చువర్ణకం బగు.**

'ధాతువునకు' అనుఅధికారసూత్రముచే ధాతువునకు అనుఅర్థము సిద్ధించును. శబ్దంబు అనుదానిచే వర్తమానమునందు చేరిన ఉన్న అనుబంధమును 'ఉన్న కలజి నవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనుసూత్రముచే భవచ్ఛత్రర్థమున వచ్చిన 'ఉన్న' అనుప్రత్యయమును గ్రహింపబడును.

ఉన్న అనుశబ్దము పరముగా ఉన్నపుడు ధాతువునకు 'చు' అనుప్రత్యయము వచ్చును.

'వండు' ధాతువునకు లట్టు పరముగా నుండగా 'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు' అనుసూత్రముచే 'ఉన్న' వచ్చి, ప్రథమ పురుషైకవచనము లకారమునకు డుజు రాగా, వండు+ఉన్న+డుజ్ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు చువర్ణకము వచ్చి, వండుచు+ఉన్న+డుజ్ 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, వండుచున్న+ డుజ్ అని అయి, పిదప 'వండుచున్నాఁడు' అని అగును.

ఇట్లే ఉన్న ప్రత్యయము పరముగా ఉండగా, చువర్ణకము వచ్చి, వండుచున్నవాఁడు. మొ.

'ఉన్నశబ్దంబు' అనుటచే ఇతరశబ్దము పర మైనపుడు చువర్ణకము రాదు. వండఁగలఁడు - వండఁబడదు మొ.

'పరం బగునపుడు' అనుటచే 'ఉన్న' పరము కానపుడు చువర్ణకము లేదు. కలఁడు, కలవాఁడు మొ.

**15. దివీతరంబగు డుఞ్ఞు పరం బగునపు డున్నానుబంధంబునకు దీర్ఘం బగు.**

| | | |
|---|---|---|
| **ప్రథమము:** | **వాఁడు వండుచున్నాఁడు.** | **వారు వండుచున్నారు.** |
| | **అది వండుచున్నది.** | **అవి వండుచున్నవి.** |
| **మధ్యమము:** | **నీవు వండుచున్నావు.** | **మీరు వండుచున్నారు.** |
| **ఉత్తమము:** | **నేను వండుచున్నాను.** | **మేము వండుచున్నాము.** |

'డుఞ్' అనుప్రత్యాహారముచే 'లకారంబునకు డుర్రువురునుము ఞ్ఞగు' అనుచోటి 'డుంజ్,రు,వు,రు,వు,ము' అనునవి గ్రహింపబడును. 'అమహదర్థంబునందు డుర్రు లకు దువు లగు నున్నానుబంధంబుమీఁద దివి యగు' అనుసూత్రముచే డుజ్రులకు ఆదేశముగా వచ్చుటచే ది, వి, అనునవి

కూడ 'డుజ్ఞు' అనుదానిచే గ్రహింపబడును.

ది,వి అనువానికంటె వే రయిన, డుజ్,రు,వు,రు,ను,ము అనుక్రియావిభక్తులు పరముగా నున్నపుడు దానికి పూర్వమునందు ఉన్న 'ఉన్న' అనుబంధమునందలి చివరి అచ్చు (అత్తు) నకు దీర్ఘము వచ్చును. వండుచున్న+డుజ్ అని యుండగా ప్రస్తుతసూత్రముచే 'ఉన్న' కు దీర్ఘము వచ్చి, వండుచున్నాఁడు అని అగును. ఇట్లే వండుచున్నారు మొ.

'దివీతరంబు' అనుటచే 'ది,వి' అనునవి పర మైనపుడు దీర్ఘము రాదు. వండుచున్న+డుజ్ అనుచో 'అమహదర్థంబునందు డుత్రులకు దువు లగు నున్నానుబంధంబుమీఁది దివి యగు' అనుసూత్రముచే డుజుస్థానమున 'ది' వర్ణము రాగా, వండుచున్నది అనియె అగును. ఇట్లే బహువచనమున వండుచున్న+ రు = వండుచున్నవి. వండుచున్నాది, వండుచున్నావి అనుతీరుగా దీర్ఘము రాదు.

'డుఙ్ఞు పరం బగునపుడు' అనుటచే ఇతరము పర మైనపుడు దీర్ఘము లేదు. వండుట, వండక మొ.

'ఉన్నానుబంధంబునకు' అనుటచే ఇతరమునకు దీర్ఘము రాదు. వండఁ గలఁడు, వండఁగలవు మొ.

## 16. లిడ్లాట్టులడుజున కెనునువర్ణంబు లగు.

**లిడాదేశం బగుడుజున కెను అనునదియు, లాడాదేశం బగుడుజునకు 'ను' అనునదియు నాదేశంబు లగు.**

'భూతంబున లి ట్టగు' అనుసూత్రముచే భూతార్థమునందు లిట్టు వచ్చును. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అనుసూత్రముచే తద్ధర్మము మొద లగుఅర్థములందు లాట్టు వచ్చును. ప్రథమపురుషఏకవచనమునందు లకారమునకు డుజు వచ్చును. లిట్టుయొక్క స్థానమున ఆదేశముగా వచ్చిన 'డుజ్' స్థానమున 'ఎను' అనునది ఆదేశ మగును. లాట్టుయొక్క స్థానమున ఆదేశముగా వచ్చిన 'డుజు' స్థానమున 'ను' అనువర్ణము ఆదేశముగా వచ్చును.

వండు ధాతువునకు 'భూతంబు లి ట్టగు' అనుసూత్రముచే లిట్టు వచ్చి, వండు+ల్ అని ఉండగా 'లకారంబునకు డుత్రువురునుము ఙ్ఞగు' అనుసూత్రముచే ప్రథమపురుష ఏకవచనమునందు డుజు వచ్చి, వండు+డుజ్. ప్రస్తుతసూత్రముచే డుజుస్థానమున 'ఎను' అనునది రాగా, వండు+ఎను. 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, వండెను అని అగును. ఇట్లే లాట్టులో వండు+ల్, వండు+డుజ్ – వండును అని అగును.

'లిడ్లాట్టుల' అనుటచే లిట్టు, లాట్టు అనువానికంటె వే రయినలకారమునకు వచ్చినడుజునకు ఈకార్యము లేదు. వందుచున్నాఁడు వందఁడు. మొ.

'డుజునకు' అనుటచే ప్రథమపురుషబహువచనము మొద లగువానికి ఈ కార్యము లేదు. వండిరి – వందుదుము మొ.

## 17. భూతంబునం దిగాగమం బగు.

**భూతార్థవృత్తి యగుధాతువున కిగాగమం బగు.**

'ధాతువునకు (క్రియ. 1) ఇక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కిత్తు అయిన 'ఇ' వర్ణము ధాతువునకు చివర వచ్చి చేరును. భూతార్థమునం దున్నధాతువునకు చివర 'ఇ' అనువర్ణము ఆగమముగా వచ్చును.

వందు అనుధాతువునకు 'భూతంబున లి ట్టగు' అనుసూత్రముచే లిట్టును (వందు+ల్) ఆలకారమునకు 'లకారంబునకు డుఙ్రవురునుము ఙ్ఞగు' అను సూత్రముచే ప్రథమపురుషబహువచనమునందు రువర్ణమును వచ్చి, వందు+రు అని ఉండగా, ప్రస్తుతసూత్రముచే ధాతువునకు ఇగాగము వచ్చి (వందు+ఇ+రు), 'అంద్వగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, వండి+రు అని ఉండగా 'ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనుసూత్రముచేత రువర్ణమునకు ఇత్వము వచ్చి, 'వండిరి' అని అగును.

'లిట్టు పరం బగునపుడు' ఇత్యాదిగా చెప్పక 'భూతంబునందు' అని సామాన్యముగా చెప్పుటచే లిట్టులోనే కాక భూతార్థ మున్న అన్నియెడలను ధాతువునకు ఇగాగమము వచ్చును. వండినన్ – (చేదాద్యర్థము) వండినవాఁ డు– (క్తవదర్థము) మొ.

'భూతంబునందు' అనుటచే భూతముకంటె ఇతర మైనఅర్థములలో ఆగమము లేదు. వండుచున్నాడు, వండును మొ.

'భూతంబునందు' అని సామాన్యముగ చెప్పుటచే లిట్టులో ప్రథమపురుషైకత్వస్థలమున గూడ ఇగాగమము వచ్చును. కాని సూరి క్రియ. 50, 85 మొద లగుసూత్రములవద్ద – నగు+ఇయ్+ఎను అనురీతిగా చూపుటనుబట్టి ప్రథమపురుషఏకవచనమున ఇగాగమ నిషేధశాస్త్రమును ఊహింపవలసినట్లు తోచుచున్నది. (ముత్యము, జ్ఞానముఁబట్టి మొ.)

## 18. లిట్టువుఙ్ఞు పరం బగునపుడు తివర్ణకం బగు.

**ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తుల యనుసూత్రముచే రుఙ్ఞన కిత్వంబు.**

**ప్ర: వండెను–వండిరి. మ: వండితివి–వండితిరి ఉ: వండితిని–వండితిమి.**

లిట్టుయొక్క స్థానమున ఆదేశముగా వచ్చిన పుఙ్ఞు లిట్టు పుఙ్ఞు. 'పుఙ్' అనుప్రత్యాహారముచే 'లకారంబునకు దుఞ్జుపురునుము ఙ్నగు' అనువానిలో, 'పురునుము' అనునాలుగును గ్రహింపబడును. 'ధాతువునకు' అనుఅధికార సూత్రమునుబట్టి 'ధాతువునకు' అనుఅర్థము సిద్ధించును. లిట్టునకు ఆదేశముగా వచ్చిన పు,రు,ను,ము అనువిభక్తులు పరముగా ఉండగా ధాతువునకు 'తి' అనుప్రత్యయము వచ్చును.

వండు ధాతువుపై (క్రియా. 3) లిట్టును (వండు+ల్). లకారమునకు మధ్యమ పురుషైకవచనమున (క్రియా. 8.) పువర్ణమును (వండు+పు). ధాతువునకు (క్రియా. 17) ఇగాగమమును (వండు+ఇ+పు). సంధియు (సంధి. 11) వచ్చి వండి+పు అని యుండగా ప్రస్తుతసూత్రముచే తివర్ణకము వచ్చి, వండితి+పు అని అగును. 'ఇకారంబుమీఁది' అను (తత్స. 26) సూత్రముచే పువర్ణకమునకు ఇత్వము వచ్చి, 'వండితివి' అని అగును.

'లిట్టు' అనుటచే లిట్టు కానిలకారమునకు ఆదేశ మయినపుఙ్ఞు పర మగునపుడు తివర్ణకము రాదు. వండుచున్నావు, వండుదుము. మొ.

'పుఙ్ఞు' అనుటచే ప్రథమపురుషయందు తివర్ణకము రాదు. వండెను-వండిరి.

**19. కలజ్యనుబంధము లృట్టు పరం బగునపు డగు.**

**లృట్టు పరం బగునపుడు ధాతువునకు కలజి అనునది యనుప్రయుక్తం బగు.**

'ధాతువునకు' (క్రియ. 1) 'భావిని లృ ట్టగు' అనుసూత్రముచే భవిష్యదర్థమున లృట్టు వచ్చును. (కలజి) అనుబంధము అనగా అచట అనుప్రయుక్తము. అనగా అనుసరించి చివర చేరునది. లృట్టు పరముగా ఉండగా ధాతువునకు చివర కలజి అనునది వచ్చి చేరును. కలజి అనుదానిలో జివర్ణము ఇత్తు. కావున 'కల' అనునదే నిలుచును.

వండు అనుధాతువుపై 'భావిని లృ ట్టగు' అనుసూత్రముచే లృట్టు వచ్చి వండు+ల్ అని యుండగా, ప్రస్తుతసూత్రముచే ధాతువునకు 'కల' అనునది చేరి, వండు+కల+ల్ అని యుండును. పిదప ప్రథమపురుషఏకవచనమునందు 'వండఁగలఁడు' అని అగును.

'లృట్టు పరం బగునపుడు' అనుటచే లృట్టుకంటె వే రయినలకారము పర మయినపుడు 'కలజి' రాదు. వండుచున్నాఁడు - వండితిమి మొ.

**20. జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు.**

**జీత్తు పరం బగునపుడు ధాతువునుత్వంబున కత్వం బగు.**

'ధాతువునకు' (క్రియ. 1) 'జి' అనువర్ణము ఇత్తుగా గలది జీత్తు. కల(జి) పడు(జి) మొ. 'జి' అనునది ఇత్తుగా కలిగినశబ్దము పరముగా ఉన్నపుడు ధాతువుయొక్క చివర ఉన్న ఉకారముయొక్క స్థానమున హ్రస్వ మగు అకారము ఆదేశముగా వచ్చును.

వందు ధాతువుపై 'భావిని లృ ట్టగు' అనుసూత్రముచే లృట్టు వచ్చి, వందు+ల్ అని యుండగా 'కలజ్యనుబంధంబు లృట్టు పరం బగునపు డగు' అనుసూత్రముచే ధాతువునకు 'కలజి' వచ్చును. ఇందు జివర్ణము ఇత్తు. జివర్ణము ఇత్తుగా కలిగినది కావున 'కల' అనునది జీత్తు. వందు+కల – అనుచో జీత్తు అయిన 'కల' పరముగా నున్నది. కాన ప్రస్తుతసూత్రముచే ధాతువు చివరిఉత్వమునకు అత్వము వచ్చి, 'వంద+కల+ల్' అని యగును. పిదప ప్రథమపురుషఏకవచనమునందు వందఁ గలఁడు అని అగును.

'జీత్తు పరం బగునపుడు' అనుటచే జీత్తు కానిది పర మైనపుడు అత్వము లేదు. వందుచున్నాఁడు.

ఈఅత్వము ధాతువునకె. కావున జీత్తు పర మయినను ధాతువునందలిది కానిఉత్వమునకు అత్వము రాదు. వినకు+వుజి+ఎ–వినకువె. వినకవె అని కాదు.

'ఉత్వంబునకు' అనుటచే ఇతరమునకు అత్వము లేదు. చాక, ఈకు మొ.

**21. కలజిపడుజులు పరంబు లగునపుడు నుగాగమం బగు.**

**ద్రుతకార్యంబు.**

**ప్ర. వందఁగలడు – వందఁగలరు. వందఁగలదు – వందఁగలవు.**

**మ. వందఁగలవు – వందఁగలరు. ఉ. వందఁగలను – వందఁగలము.**

'ధాతువునకు' (క్రియ. 1) నుక్+ఆగమ అనుచో కకారము ఇత్తు. కి త్తయిన నువర్ణము ధాతువునకు చివర చేరును. కలజి, పడుజి, అనునవి పరముగా నున్నపుడు ధాతువునకు చివర 'ను' వర్ణము వచ్చి చేరును. 'కలజ్యనుబంధంబు లృట్టు పరం బగునపు డగు' అనుసూత్రముచే వచ్చు అనుబంధము అయిన కలజియును, 'ఉన్నకలజినవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనుసూత్రముచే భావిశత్రర్థమున వచ్చు ప్రత్యయము అయిన కలజియును సూత్రమునందలి 'కలజి' శబ్దముచే గ్రహింపబడును. పడుజి కర్మార్థమున (స్వార్థమునను) అనుబంధముగా మాత్రమే కలదు.

వందుధాతువుపై (క్రియా. 4) లృట్టును (వందు+ల్). కలజి (క్రియా. 13.) అనుబంధమును (వందు+కల+ల్). ధాతువునకు అత్వమును (క్రియా. 20) వచ్చి,

వండ+కల+ల్ అని యుండగా ప్రస్తుతసూత్రముచే నుగాగమము వచ్చి, వండను+కల+ల్ అని యుండగా, ప్రథమపురుషైకవచనమునందు డుజ్ (క్రియా. 8) వచ్చి, వండను+కలఁడు అని కాగా, ద్రుతకార్యములతో వండఁ గలఁడు అని యగును. ఇట్లే వండఁగలవాడు. వండఁబడదు మొ.

'కలజి పడుజులు' అనుటచే ఇతరము పర మయినపుడు నుగాగమము లేదు. వండుచున్నాఁడు, వండుకొనెను మొ.

**22. లాట్టురుఙ్ఞు పరం బగునపుడు దుగాగమం బగు.**

**ప్ర వండును. వండుదురు. మ, వండుదువు. వండుదురు.**

**ఉ. వండుదును. వండుదుము.**

**లాడర్థంబులం దోలి నుదాహరణంబులు వక్కాణించెద.**

**తద్ధర్మంబు – కులాలుఁడు కుండలు వానును.**

**తచ్ఛీలంబు – జ్వలనజ్వాలంబు లుప్పరం బెగయును.**

**సంభావన – ఇప్పుడు వాఁ డింట నుండును.**

**సంప్రశ్నము – ఉండునా – పోదునా?**

**సాతత్యము–సర్వంబునం దీశ్వరుఁ డుండును. సర్వం బీశ్వరునియం దుండును.**

**వర్తమానంబు – మేన నిప్పుడుం బులకలు వొడమెడును.**

**వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబు లగు.**

**భావి – వాఁడు తేఁపు వచ్చును. ఆశీస్సు – శుభం బగును.**

**వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడి.**

ధాతువునకు (క్రియ. 1) లాట్టునకు ఆదేశముగా వచ్చినరుఙ్ఞు లాట్టురుఙ్ఞు. రుఙ్ఞు అనగా 'లకారంబునకు డుఱ్రు వురు నుము ఙ్ఞగు' అనుసూత్రమున చెప్పబడిన 'రువురునుము' అను ప్రత్యయములు. దుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కిత్తు అయిన దువర్ణము ధాతువునకు చివర వచ్చిచేరును.

వండు అనుధాతువునకు 'తద్ధర్మాదులందు లా ట్టగు' అనుసూత్రముచే లాట్టు వచ్చి, వండు+ల్ అని యుండగా ప్రథమపురుషబహువచనమునందు 'లకారంబునకు డుఱ్రువురునుము ఙ్ఞగు' అనుసూత్రముచే రువర్ణము వచ్చి వండు+రు అని ఉండగా, ప్రస్తుతసూత్రముచే ధాతువునకు దుగాగమము వచ్చి 'వండుదురు' అని అగును. ఇట్లే వండుదువు మొ.

'లాట్టు' అనుటచే ఇతర మైనలకారములకు వచ్చిన 'డుఙ్ఞు' పర మయినపుడు

దుగాగమము లేదు. వందుచున్నాఁడు మొ.

'రుఙ్ఙు' అనుటచే లాట్టులో ప్రథమపురుషైకవచనమునందు ఈకార్యము లేదు. వందును.

**23. లాట్టురుఙ్ఙు పరం బగునపు డెదగాగమంబును బ్రథమ ను వర్ణకంబు పరం బగునపు డెడుగెడిగాగంబులును బహుళంబుగా నగు.**

**ప్ర. వండెదును, వండెడిని – వండెదరు. మ. వండెదవు – వండెదరు.**

**ఉ. వండెదను – వండెదము.**

'ధాతువునకు. (క్రియ. 1) లాట్టునకు ఆదేశ మయిన 'రుఙ్ఙు' లాట్టురుఙ్ఙు. రుఙ్ఙు అనగా 'లకారంబునకు డుఌవురునుము ఙ్ఙగు' అనిచెప్పబడిన 'రువురునుము' అనుప్రత్యయములు. ఎదక్+ఆగమ, ఎడుక్+ఆగమ, ఎడిక్+ఆగమ అనుచోట్ల కకారములు ఇత్తులు. కిత్తులు అయిన ఎద, ఎడు, ఎడి అనుఆగమములు ధాతువునకు చివర వచ్చిచేరును.

లాట్టునకు ఆదేశముగా వచ్చిన రువురునుము అనుప్రత్యయములు పరముగా నున్నపుడు ధాతువునకు చివర 'ఎద' అనునది బహుళముగా చేరును. లాట్టునకు వచ్చిన డుఌనకు ఆదేశముగా వచ్చిన 'ను' అనుప్రథమపురుషైకవచనము పరముగా ఉన్నపుడు ధాతువునకు చివర ఎడు, అనునదియును, ఎడి అనునదియును బహుళముగా చేరును.

వండుధాతువుపై (క్రియా. 5.) లాట్టును (వండు+ల్). లకారమునకు ప్రథమ పురుషబహువచనమున రువర్ణమును (క్రియా. 8) వచ్చి, వండు+రు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు చివర 'ఎద' అనునది ఆగమ మయి, వండు+ఎద+రు అని అగును. సంధి జరిగి (సంధి. 11) వండెదరు అని యగును. ఇట్లే వండెదవు మొ. బహుళము గావున ఎదగాగమము రానిపక్షమున 'లాట్టురుఙ్ఙు పరం బగునపుడు దుగాగమం బగు' అనుసూత్రముచే దుగాగమము వచ్చి వండుదురు, వండుదువు మొద లగువిధముగా అగును.

వండుధాతువుపై (క్రియా. 5.) లాట్టును (వండు+ల్). లకారమునకు ప్రథమ పురుష ఏకవచనమునందు (క్రియా. 8.) డుఌను (వండు+డుఌ్). డుఌనకు నువర్ణమును (క్రియా. 16) వచ్చి, వండు+ను అని యుండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు చివర 'ఎడు' అనునది ఆగమముగా వచ్చిన – వండు+ఎడు+ను అని యుండగా సంధి జరిగి (సంధి. 11) 'వండెడును' అని అగును. ఎడి అనునది ఆగమ మైనచో (వండు+ఎడి+ను). సంధి జరిగి (సంధి. 11), వండెడి+ను అని యుండగా 'ఇకారంబు మీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు'

అనుసూత్రముచే ఇత్వము వచ్చి, 'వండెడిని' అని అగును. బహుళము గావున ఎడు, ఎడి, అనునవి రెండును రానిపక్షమునందు 'వండును' అనియె ఉండును.

'లాట్టు' అనుటచే ఇతరలకారములలో ఈకార్యము లేదు. వండుచున్నారు.మొ.

'రుఙ్ఞు పరం బగునపుడు' అనుటచే ప్రథమపురుషఏకవచనమునందు 'ఎద' అనుఆగమము రాదు. వండును.

'ప్రథమ' అనుటచే ఉత్తమపురుషైకవచనము అయిననువర్ణము పర మయినపుడు ఎడు, ఎడి అనుఆగమములు రావు. వండెదను, వండుదును.

'నువర్ణకంబు' అనుటచే రుఙ్ఞు పర మైనపుడు ఎడు, ఎడి ఆగమములు రావు. వండెదరు మొ.

### 24. లిడ్లాట్టులవకారంబునకు లోపంబు విభాష నగు.

**వండితి - వండితివి; వండుదు - వండుదువు; వండెదు - వండెదవు.**

వకారము అనగా వకారపుపొల్లు. 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గు' అనుసూత్రముచే లకారమునకు ఆదేశ మగు డుజ్, రు, వు, రు, ను, ము అను ప్రత్యయములలో మధ్యమపురుషఏకవచనమునందు మాత్రమే వకారము ఉన్నది. కావున లిట్టునకును, లాట్టునకును ఆదేశముగా వచ్చిన మధ్యమపురుష ఏకవచన మగు వు (వి) వర్ణకమునందలి వకారపుపొల్లునకు వికల్పముగా లోపము వచ్చును. పొల్లునకు మాత్రము లోపము చెప్పుటచే దానిపై నున్నఅచ్చు (ఉ, ఇ) నిలిచి ఉండును.

వండెదవు అనుచోట 'వు' వర్ణము లాట్టునకు ఆదేశము అయినది. ప్రస్తుత సూత్రముచే అందలివకారమునకు లోపము వచ్చి, (ఉకారము మిగిలి) వండెద+ఉ అని ఉండగా 'అంద్వగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, వండెదు అని అగును. విభాష అనుటచే వకారము లోపింపనిపక్షమునందు వండెదవు అనియె ఉండును. ఇట్లే లిట్టులో వండితివి - వండితి + ఇ = వండితి.

'లిడ్లాట్టుల' అనుటచే ఇతరలకారములం దీకార్యము లేదు. వండుచున్నావు వండఁగలవు మొ. అట్లే ధాతువునందలివకారమునకును లోపము రాదు. వండెదు, వండితి. మొ.అండెదు, అండితి ఇత్యాదిగా కాదు.

'వకారంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు లోపము లేదు. వండును, వండుదురు మొ.

**25. తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిఙ్లాట్టులప్రథమ బహువచనంబున కేకవచనం బగు.**

**చిలుకలు పలికెను. చిలుకలు పలుకును – చిలుకలు పలికెడును.**

**మేఘములు గర్జిల్లెను మేఘములు గర్జిల్లును. మేఘములు గర్జిల్లెడును.**

తిర్యక్కు లనగా పశువులు పక్షులు మొద లగునవి. తిర్యక్కులు గాని, జడములు గాని బోధింపబడు(కర్తలు అయి)నపుడు లిట్టునందును, లాట్టునందును ప్రథమ పురుషయందు బహువచనముస్థానమున ఏకవచనము ఆదేశముగా వచ్చును.

చిలుకలు పలికెను. ఇచట పలుకు అనుధాతువునకు కర్త చిలుకలు అన్నది. ఇది తిర్యక్కు. బహుత్వమునం దున్నది, కావున భూతార్థమునం దున్న 'పలుకు' ధాతువుపై బహువచనమె వచ్చును. ఇట్లు పలుకు ధాతువుపై 'భూతంబున లిట్టగు' అనుసూత్రముచే లిట్టును (పలుకు+ల్) 'లకారంబునకు డుజ్రువురునుము ఙ్ఞగు' అనుసూత్రముచే ప్రథమపురుషబహువచనమునందు 'రు' వర్ణమును వచ్చి, పలుకు+రు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే రువర్ణకముస్థానమున ప్రథమపురుష ఏకవచన మగు 'డుజు' వచ్చి, పలుకు+డుజ్ అని కాగా, డుజునకు ఎను వచ్చి (క్రియా. 16) 'పలికెను' అని అగును. ఇట్లే జడములు వాచ్యము లైనపుడును, మేఘములు గర్జిల్లును మొ.

'తిర్యగ్జడములు వాచ్యంబు లగునపుడు' అనుటచే మహత్తు (మహతియు) వాచ్య మయినపుడు బహువచనము అట్లే ఉండును. రాములు వచ్చిరి. లక్ష్మీసరస్వతులు మెత్తురు.

'లిఙ్లాట్టుల' అనుటచే ఇతరలకారములందు బహువచనమునకు ఏకవచనము రాదు. చిలుకలు పలుకుచున్నవి. మేఘములు గర్జిల్లఁగలవు మొ.

'ప్రథమబహువచనంబునకు' అనుటచే మధ్యమ, ఉత్తమపురుషలయందు బహువచనమునకు ఏకవచనము రాదు. పలికితిరి, గర్జిల్లుదుము మొ.

**26. లూట్టుడుఙ్ఞున కెడు తవర్ణంబులు ద్రుతాంతంబు లగు.**

**ఆశీస్సు: మీకు మేలు కలిగెడును. మీకు మేలు కలుగుతను.**

**శాపంబు: నీకు రాక్షసత్వంబు కలిగెడును, నీకు రాక్షసత్వంబు గలుగుతను.**

**సంప్రార్థనంబు:హరి ననుఁగృపఁ గాంచెడును. హరి ననుఁ గృపఁ గాంచుతను.**

లూట్టునకు ఆదేశముగా వచ్చినడుఙ్ఞు లూట్టుడుఙ్ఞు, డుఙ్ఞు అనగా 'లకారంబునకు డుజ్రువురునుము ఙ్ఞగు' అనుసూత్రముచే వచ్చు 'డుజ్ రు వు రు ను ము' అనుప్రత్యయములు. లూట్టునకు ఆదేశముగా వచ్చిన ఈ ఆరు

ప్రత్యయములస్థానమునను ద్రుతము (నువర్ణము) చివర గలిగిన, ఎడు అనునదియు 'త' అనునదియు ఆదేశములుగా వచ్చును. అనగా ఎడును, తను అనునవి ఆదేశము లగును.

మీకు మేలు కలిగెడును. ఇచట ఆశీరర్థమున 'కలుగు' అనుధాతువుపై 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అనుసూత్రముచే లూట్టు వచ్చి, కలుగు+ల్ అని ఉండగా, ప్రథమపురుషఏకవచనమునందు 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గగు' అనుసూత్రముచే డుఙు రాగా, కలుగు+డుఙ్ అని అగును. ప్రస్తుతసూత్రముచే డుఙుస్థానమున 'ఎడును' అనునది ఆదేశ మై, సంధి జరిగి (సంధి. 11) లువర్ణమునకు ఇత్వము వచ్చి (క్రియా. 85) కలిగెడును అని అగును. 'తను' అనునది ఆదేశము అయినచో 'కలుగుతను' అని అగును.

'విధియందు లూట్టునకు మాఋగా నది యనుతచ్ఛబ్దంబును' అనుతరువాతి విశేషవిధిని అనుసరించి ప్రస్తుతసూత్రముచే విధింపబడిన 'ఎడును, తను' అనునవి ఆశీశ్శాపసంప్రార్థనార్థములు మూఁడింట మాత్రమే వచ్చును. శాపము : నీకు రాక్షసత్వంబు కలిగెడును. సంప్రార్థనము : హరి ననుఁ గృపఁ గాంచుతను.

'డుఙ్ఙు' అనుటచే అన్నిపురుషలయందును అన్నివచనములందును ఎడును తను అనునవి వచ్చును. నీవు దీర్ఘాయువ వయ్యెడును. మేము దీర్ఘాయుల మగుతను.

'లూట్టు డుఙ్ఙు'న కనుటచేత ఈఆదేశము ఇతరలకారములసందర్భమున ఉండదు. వండుచున్నాఁడు. వండఁగలవు. వండము మొ.

ఈకార్యము ప్రథమపురుషయందు మాత్రమే ప్రయోగములందు గల దందురు.

**27. విధియందు లూట్టునకు మాఋగా నది యనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు.**

**మైత్రుండు నానిర్దిష్టకార్యము చేయునది.**

**వానికి నీవు బానటయయి యుండునది.**

నుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. నువర్ణమునందలిఉకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. మిగిలియున్నపొల్లనకారము కిత్తు అగుటచే ముం దున్నధాతువునకు చివర వచ్చిచేరును. ఈసూత్రము 'లకారంబునకు డుఙ్రురువురునుము ఙ్గగు' అనుసూత్రమును బాధించి ప్రవర్తించును. 'విధి' అర్థమునందు వచ్చిన 'లూట్టు'నకు బదులుగా అనగా లూట్టు లకారము

స్థానమునందు తదర్థకము అయిన 'అది' అనుశబ్దము ఆదేశముగను, దానికి పూర్వమునం దున్నధాతువునకు చివర నకారపుపొల్లు ఆగమముగను వచ్చును.

మైత్రుండు చేయునది. విధ్యర్థమునందు 'చేయు' ధాతువుపై 'ఆశీశ్శాప సంప్రార్థనవిధులందు లూ ట్టగు' అనుసూత్రముచే లూట్టు రాగా, చేయు+ల్. ఆలకారము స్థానమునందు ప్రస్తుతసూత్రముచే ఆదిశబ్దము వచ్చి (చేయు+అది), ధాతువుచివర నకారము చేరి, (చేయున్+అది) 'చేయునది' అని అగును.

'విధియందు' అనుటచే ఆశీశ్శాపసంప్రార్థనార్థములందు ఈకార్యము లేదు. శుభము కలిగెడును. కలుగునది ఇత్యాదిగా ఏర్పడవు.

'లూట్టునకు మాఱుగా' అనుటచే అన్నిపురుషలయందును అన్నివచనము లందును ఈకార్యము కలుగును. మీరు వ్రాయునది. తన్ను తాను ఆజ్ఞాపించుకొను సందర్భమున కలుగుచో ఉత్తమపురుషయందును ఈకార్యమె కలుగును. నేను చదువునది మొ. (ఈకార్యము కవిప్రయోగములలో మధ్యమపురుషయందు మాత్రమే కల దందురు.)

'మాఱుగా' అని చెప్పుటలో ప్రయోజన మే దైన గల దేమో విచారింపవలెను.

ముందుగా అనగా ధాతువునకు (చివర) అని అర్థము. 'ధాతువునకు' అనుఅధికార సూత్రము ఉన్నను, అది యనుశబ్దము 'లూట్టునకు మాఱుగా' చెప్పుటచే, నుగాగమమును లూట్టునకే రాకుండుటకు 'ముందు' అనుశబ్దము సూత్రమునందు చేర్పబడినది.

## 28. ఎడుతలద్రుతంబున కచ్చు పరం బగునపుడు మకారం బగు. నీకు మేలు గలిగెడు మనియెను. నీకు మేలు గలుగుత మనియెను.

అచ్చు పరముగా ఉన్నపుడు ఎడును, తను అనుప్రత్యయములయందలి ద్రుతమునకు అనగా నువర్ణముయొక్క స్థానమున పొల్లమకారము ఆదేశముగా వచ్చును.

నీకు మేలు గలిగెడును+అనియెను అని యుండగా, ప్రస్తుతసూత్రముచే నువర్ణముస్థానమున మకారపుపొల్లు వచ్చి, కలిగెడుమ్+అనియెను – కలిగెడు మనియెను అని అగును. ఇట్లే కలుగుతను+అనియెను – కలుగుత మనియెను.

తవర్ణసాహచర్యముచే ఎడువర్ణము 'లూట్టుడుఇఞ్ఞన కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' అనుసూత్రముచే లూట్టు డుఇఞ్ఞనకు వచ్చినదే గ్రహింపబడును. కావున తద్ధర్మాదులలో ఎడుగాగమమునకు పైని ఈకార్యము లేదు. వచ్చెడును+ అతఁడు అనుచో 'ఎడు'పై ఉన్న ప్రథమపురుషైకవచన మగునువర్ణము ద్రుతమె. కాని దానికి ఈకార్యము లేదు. వచ్చెడు మతఁ డని

కాదు. వచ్చెదు నతఁడు.

తద్ధర్మాదులలో ఆశీరాదులు కలవు. అక్కడను ఈకార్యము లేదు. మేలు కలిగెడును+అనియె - కలిగెడు ననియె అగును. తద్ధర్మాదులలో ఆశీరాదుల లున్నను ప్రథమపురుషైకవచనేతరస్థలములందు 'ఎడును' ఉండదు. కావున 'శుభంబు లయ్యెడును, నీవు రాక్షసు డయ్యెడును' ఇత్యాదులయందలి 'ఎడును' లూట్టునందలిదే. కావున 'నీవు రాక్షసుఁ డయ్యెడు ననియె' అనువిధ మయిన రూపములు ఉండవు.

'అచ్చు పరం బగునపుడు' అనుటచే హల్లు పర మయినపుడు మకారము రాదు. మేలు కలిగెడును మీకు.

**29. లూణ్మధ్యమవురులకు ముడుజు లగు.**

**ఆశీస్సు : దీర్ఘాయువ వగుము, దీర్ఘాయుల రగుఁడు.**

**శాపము : రాక్షసుఁడ వగుము, రాక్షసుల రగుఁడు.**

**సంప్రార్థనంబు : నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుఁడు.**

**విధి : నా చెప్పినపని చేయుము, నా చెప్పినపని చేయుఁడు.**

లూట్టునకు ఆదేశముగా వచ్చిన మధ్యమపురుషప్రత్యయము లగు వు,రులు లూణ్మధ్యమవురులు. వానిస్థానమున ముడుజులు వచ్చును. యథాక్రమముగా లూట్టునకు ఆదేశముగా వచ్చిన మధ్యమపురుష ఏకవచన మగువువర్ణకము యొక్క స్థానమున ముపర్ణము ఆదేశ మగును. లూట్టునకు ఆదేశముగా వచ్చిన మధ్యమపురుషబహువచనము అగు 'రు' వర్ణకముయొక్క స్థానమున 'డుజ్' అనునది ఆదేశముగా వచ్చును. ఈవిశేషవిధి 'లూట్టుడుఇ్లున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' 'విధియందు లూట్టునకు మాఱుగా నది యనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు' అనుసామాన్యవిధులను బాధించును. ఇది వికల్పముగ మాత్రమే బాధించుట విశేషముగా గ్రహింపవలెను.

నీవు దీర్ఘాయువ వగుము. అగుధాతువుపై ఆశీరర్థమునందు (క్రియా. 6) లూట్టును (అగు+ల్), దానికి మధ్యమపురుషైకవచనమందు వువర్ణకమును (క్రియా. 8) వచ్చి, వందు+వు అని యుండగా ప్రస్తుతసూత్రముచే వువర్ణమునకు ముపర్ణము వచ్చి, 'అగుము' అని యగును. బహుత్వమునందు రువర్ణమునకు (అగు+రు) ఈసూత్రముచే డుజు రాగా, డు(జు) జిత్తు కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే డువర్ణమునకు ముందు సున్న వచ్చును. మీరు దీర్ఘాయులరు 'అగుఁడు'.

'లూట్టు' అనుటచే ఇతరలకారములందు ఈకార్యము లేదు. వండుచున్నావు. వండితిరి మొ.

'మధ్యమవురులకు' అనుటచే ప్రథమపురుషబహువచన మగురువర్ణమునకు డుజు రాదు. శుభములు కలిగెడును. మీరు చదువునది. ఇట్లె శుభము కలిగెడును. మేము దీర్ఘాయుల మయ్యెడును. మొ.

(వికల్పము గాన) ముడుజులు రానపుడు నీవు దీర్ఘాయువ వయ్యెడును. మీరు (బాసట యయి) ఉండునది అనియు 26, 27 సూత్రములచే నగును.

**30. ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు.**

**మనము వండుదము.**

**'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' ననుసూత్రముచే లజీ పరం బగునపుడు దత్వంబు. ప్ర. వండcడు, వండదు – వండరు, వండవు. మ. వండవు – వండరు. ఉ. వండను – వండము.**

అత్వము ఏకాల్లు (ఒకే వర్ణము) కావున 'అలో కన్త్యస్య' అని దుగాగమములో చివరివర్ణమునకు (ఉకారమునకు) ఆదేశ మగును. యుష్మదర్థము (నీవు, మీరు) అస్మదర్థము (నేను, మేము) అనుఉభయమును కర్తగా కలిగినప్రార్థనమునందు ధాతువునకు వచ్చిన 'దు' అనుఆగమమునందలిఉత్వముయొక్క స్థానమునందు అత్వము వచ్చును. 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అనుసూత్రముచే ప్రార్థనార్థమున లూట్టు చెప్పబడినది. కాని లూట్టులో దుగాగమము చెప్పబడలేదు. దుగాగమము లేకుండ దుగాగమమునందు అత్వము వచ్చుటకు అవకాశము లేదు. కావున దుగాగమమునకు అత్వమును చెప్పుచున్న ఈవిధానముయొక్క సామర్థ్యము ననుసరించి ఈసూత్రముచేతనె దుగాగమమును, ఈసూత్రముచేతనె దానికి అత్వమును వచ్చును.

వండు అనుధాతువుపై ప్రార్థనార్థమున 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అనుసూత్రముచే లూట్టు వచ్చి, వండు+ల్ అని యుండగా, 'యుష్మదస్మదుభ యార్థంబునందు (అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు' అనుసూత్రము ననుసరించి) ఉత్తమపురుషబహువచనమున 'లకారంబునకు డుమ్రువురునుము ఙ్ఞగు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, వచ్చు+ము అని యుండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు దుగాగమము వచ్చి, (వండుదుము) దానికి అత్వమును వచ్చి, 'వండుదము' అని అగును.

'ఉభయార్థము' లేనపుడు (దుగాగమముతో) ప్రార్థనార్థమును మృగ్యము. ప్రార్థనమున లాట్టుతో మేము వండుదుము, నీవు వండుదువు. లూట్టులో

వండుము - వండుఁడు అని మధ్యమపురుషమున నగును.

'ప్రార్థనంబు' అనుటచే ఇతరార్థమున ఈకార్యము లేదు. మనము విందుము.

దవర్ణమును ఆగమము చేయక దుగాగమ మనియు దానికి అత్వ మనియు చెప్పుటవలన భుజించుదము - భుజింతము (క్రియా. 108) పోవుదము - పోదము (క్రియా. 98) మొద లగువిధముగా దుగాగమకార్యములు వచ్చుట ప్రయోజనము.

## 31. మధ్యమముడుజులు ముజు నాఁబడు.

మధ్యమపురుషయందు వచ్చిన 'ము, డుజ్' అనుప్రత్యయములు రెంటికిని గలిపి 'ముజు' అని సంజ్ఞ. లూట్టునకు వచ్చిన మధ్యమపురుషప్రత్యయములు అగు 'వు,రు'లకు, 'లూణ్మధ్యమవురులకు ముడుజు లగు' అనుసూత్రముచే ముడుజులు ఆదేశముగా వచ్చును. వువర్ణమునకు ఆదేశ మైన 'ము' మధ్యమ పురుషఏకవచనము, 'రు' వర్ణమునకు ఆదేశ మయిన డుజు మధ్యమపురుష బహువచనము. వీనికే ముజు అని పేరు. వండుము, వండుఁడు మొ.

'మధ్యమ' అనుటచే ఉత్తమపురుష బహువచనము అయిన 'ము' వర్ణమునకు ప్రథమపురుషఏకవచనము అయిన డుజు వర్ణమునకును ముజు అనుసంజ్ఞ కలుగదు.

'ముడుజులు' అనుటచేత మధ్యమపురుష ప్రత్యయములే అయినను 'వురు'లకు ముజు సంజ్ఞ యుండదు.

## 32. వ్యతిరేకంబున ముజు పరం బగునపుడు కుజి యగు.

## నీవు వండకుము - మీరు వండకుఁడు.

'ధాతువునకు' (క్రియ. 1) ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టు వచ్చును. ఆలూట్టునకు మధ్యమపురుషయందు వచ్చిన 'వు,రు' అనువర్ణకములకు 'లూణ్యధ్యమవురులకు ముడుజు లగు' అనుసూత్రముచే ము, డుజ్ అనునవి ఆదేశములు అగును. ఈముడుజులకు ముజు అని పేరు. ఈముడుజులు పరముగా ఉన్నపుడు వ్యతిరేకార్థముతో కూడిన ఆశీశ్శాపసంప్రార్థనవిధ్యర్థములం దున్న ధాతువునకు 'కుజి' అనునది వచ్చును. కుజిలో జివర్ణము ఇత్తు. కావున అది లోపించును. కావున కువర్ణము నిలుచును.

వండు ధాతువుపై ప్రార్థనమున (క్రియా. 6) లూట్టును (వండు+ల్) లకారము నకు మధ్యమపురుషఏకవచనమునందు (క్రియా. 8.) వువర్ణమును (వండు+వు) వువర్ణముస్థానమున మువర్ణమును (క్రియా. 29) వచ్చి, వండు+ము అని

యుండగా వ్యతిరేకప్రార్థనార్థమున ప్రస్తుతసూత్రముచే కుజి వచ్చి, వండు+కు+ము అని యుండగా కు(జి) జీత్తు కావున 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి, 'వండకుము' అని అగును. ఇట్లె వండకుఁడు.

'వ్యతిరేకంబున' అనుటచేత వ్యతిరేకార్థము లేనపుడు 'కుజి' రాదు. వండుము – వండుఁడు.

'ముజు పరం బగునపుడు' అనుటచే ముజు కానిది పర మైనపుడు కుజి రాదు. వండఁడు, వండరు మొ.

'కుజి' ధాతువులో భాగము కాదు. కావున దీనికి అత్వము రాదు. వినకువె, వినకురె.

**33. సంప్రార్థనంబున ముజున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.**

**వండుమ – వండుమా. వండుమి – వండుమీ.**

**వండుఁడ – వండుఁడా. వండుఁడి – వండుఁడీ.**

**అ ఆ ఇ ఈ ఎ ఏ ఒ ఓ అమ్మ అయ్య ఇత్యాదులదాదులు.**

'అత్ – మొద లగునవి అదాదులు. అ,ఆ,ఇ,ఈ,ఎ,ఏ మొద లగునవి. 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టు' వచ్చును. ఆలూట్టునకు మధ్యమ పురుషయందు వచ్చిన వు,రు అనువర్ణములకు 'లూణ్మధ్యమవురులకు ముడుజు లగు' అనుసూత్రముచే ముడుజులు వచ్చును. ఆముడుజులకే ముజు అని పేరు. సంప్రానార్థమునందు వచ్చిన ఈముడుజులకు మీద వికల్పముగా అ, ఆ మొద లగునవి ప్రయోగింపబడును.

వండుము అనులూణ్మధ్యమపురుష ఏకవచనాంతక్రియాపదముపై ప్రస్తుత సూత్రముచే 'అ' అనునది చేరగా, 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, 'వండుమ' అని అగును. ఇట్లే వండుమీ, వండుఁడీ మొ. విభాష అనుటచే అనుప్రయుక్తము కానపుడు వండుము. వండుఁడు అనియె యుండును. ఇట్లే వ్యతిరేకప్రార్థనమున వినకుమ – వినకుము. వినకుఁడీ – వినకుఁడు మొ.

'సంప్రార్థంబున' అనుటచే ఆశీస్సు, శాపము, విధి అనుఅర్థములందు ఉన్న ముడుజులకు అదాదులు అనుప్రయుక్తములు కావు. దీర్ఘాయువ వగుమా, రాక్షసుల రగుఁడా, నాచెప్పిన పని చేయుఁడీ అనువిధముగా ఇతరార్థములందును ఇట్లు అనుప్రయోగము అసాధువు అగుట విచారింపదగును.

'ముజునకు' అనుటచే దీర్ఘాయువ వయ్యెదును, దీర్ఘాయుఁడ నగుతను.

ఇత్యాది సందర్భములందు అదాదులు అను్రపయుక్తములు కావు.

**34. ఏదాదు లను్రపయుక్తంబు లగునపుడు ముజునకు వుజీ రుజీ యగు.**

**వినవె - వినరే. వినరె - వినరే.**

**వినకువె - వినకువే. వినకురె - వినకురే.**

ఎత్ (అది) మొద లగునవి ఏదాదులు, ఎ ఏ ఒ ఓ అయ్య అమ్మ మొద లగునవి. లూట్టునందు మధ్యమపురుషయందలివురులకు ఆదేశముగా వచ్చిన ముడుజులకు ముజు అని పేరు. 'సం్రపార్థనంబున ముజున కదాదులు విభాష నను్రపయుక్తంబు లగు' అనుసూ్రతముచే అదాదులు వచ్చిచేరును. అ ట్లను ్రపయుక్తము లయిన అదాదులలోని ఎ, ఏ. మొద లగునవి పరముగా ఉన్నపుడు ముజునకు, వుజీయును, రుజీయును వచ్చును. అనగా ముడుజులలో మువర్ణము యొక్క స్థానమున వుజీయును, డుజ్వర్ణముయొక్క స్థానమున 'రుజీ'యును ఆదేశముగా వచ్చును. వుజీ, రుజీ అనుచోట్ల జివర్ణము ఇత్తు. కావున, వు, రు అనునవే నిలుచును.

విను ధాతువుపై ్రపార్థనార్థమున లూట్టును (్రకియా. 6-విను+ల్) లకారమునకు మధ్యమపురుషఏకవచనమునందు వువర్ణమును (్రకియా-8 - విను+వు) వువర్ణమునకు ముువర్ణమును (్రకియా-29. విను+ము) దానికి 'ఎ' అను్రపయోగమును (్రకియా-83) వచ్చి, విను+ము+ఎ అని యుండగా ్రపస్తుత సూ్రతముచే ముువర్ణమునకు 'వుజీ' వచ్చి, విను+వు+ఎ అని అగును. వు(జీ) జీత్తు కావున ధాతువునకు అత్వము వచ్చి (్రకియా-20. వినవు+ఎ) సంధి జరిగి సంధి. 11) వినవె అని అగును. ఇట్లే బహుత్వమున - వినరె.

'ఏదాదులు' అనుటచే అ,ఆ,ఇ,ఈ అనునవి ఆను్రపయుక్త మయినపుడు ఈకార్యము లేదు. వినుమ. వినుఁడీ, అను్రపయుక్తములు కానపు డెట్లును వుజీ, రుజీ రావు. వినుము - వినుఁడు.

**35. టవర్ణకంబు భావంబునం దగు.**

**భావం బనఁగా ధాత్వర్థంబు. వండు-వండుట. వినుట-కనుట.**

'ధాతువునకు' (్రకియ. 1) ధాతువుయొక్క అర్థమె (ఇచట) భావము. ధాతువునకు అర్థము మా్రతము బోధించునపుడు 'ట' అను్రపత్యయము వచ్చును. 'లకారంబునకు డు్రజువురునుము ఙ్గగు' అనుసూ్రతముచే విధింపబడినవానికంటె వే రయి, ధాతువుమీద చెప్పబడిన్రపత్యయమునను కృత్తు అని పేరు. కావున ఈ 'ట' ్రపత్యయము కృత్తు అగును. 'కృత్తద్ధితసమాసా శ్చ' అని కృ్రత్పత్యయము

చివర కలిగినదానికి ప్రాతిపదికము అనుసంజ్ఞ కలుగును. కావున దానిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును.

వండుధాతువునకు భావార్థమున ప్రస్తుతసూత్రముచే 'ట' ప్రత్యయము వచ్చి 'వండుట' అని అగును. కృదంత మగుఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిపైని ప్రథమైకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అను సూత్రముచే లోపము వచ్చును. వండుట, వండుటలు, వండుటయందు మొ.

'భావంబున' అనుటచే ఇతరార్థమునందు ఈకార్యము లేదు.

**36. కజివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు.**

**వండక మునుపు – వండుటకు మునుపు, చేయక మునుపు – చేయుటకు మునుపు. మునుపు, ముందు; మున్ను, తొల్లి.**

'ధాతువునకు' (క్రియ. 1) 'పురా' అనుదానిఅర్థముతో అన్వయించునట్టి భావార్థమునందు ధాతువునకు కజి అనుప్రత్యయము వికల్పముగా వచ్చును. 'పురా' శబ్దముయొక్క అర్థము నిచ్చుశబ్దములు తెలుగున మునుపు మున్ను తొల్లి మొద లగునవి. కజిలో జివర్ణము ఇత్తు. కావున 'క' అనునదే నిలుచును.

వండక మునుపు – పురార్థము (మునుపు శబ్దముయొక్క అర్థము)తో యోగము కలిగినభావార్థమునందు కజి ప్రత్యయము వచ్చి, వండు+క అని ఉండగా, క (జి) జిత్తు కావున 'జిత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి, 'వండక' అని అగును. (ఈకృదంత మగుఅవ్యయముపై విభక్తి లోపించును.) విభాష అనుటచే కజి వర్ణకము రానిపక్షమునందు 'టవర్ణకంబు భావంబునం దగు' అనుసూత్రముచే టవర్ణమె వచ్చి, షష్ఠీవిభక్తితో వండుటకు మునుపు అని ఉండును.

'పురార్థయోగంబున' అనుటచే అట్టిఅన్వయము లేనపుడు కజి వర్ణకము రాదు. చదువుట మునుపే మంచిది.

**37. వ్యతిరేకభావంబున మిజి యగు.**

**వ్యతిరేకవిశిష్టక్రియాభిధాయిధాతువునకు మిజి యగు. వండమి. పండమి.**

'ధాతువునకు' (క్రియ. 1) భావము అనగా ధాతువుయొక్క అర్థము. వ్యతిరేకార్థముతో కూడినవ్యాపారమును బోధించుధాతువునకు (వ్యతిరేక ధాత్వర్థమున) మిజి అనుప్రత్యయము వచ్చును. 'మిజి'లో జివర్ణము ఇత్తు. కావున 'మి'వర్ణమే నిలుచును. ధాతువునకు వచ్చిన డుజుకంటె వే రయినప్రత్యయము కావున 'మి' వర్ణకము కృత్తు. ఇది చివర గలది కృదంతము. 'కృత్తద్ధితసమాసా

శ్చ' అని కృదంతము ప్రాతిపదికసంజ్ఞను పొందును. కావున దీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును.

వండు అనుధాతువునకు వంట చేయకపోవుట అనువ్యతిరేకభావార్థమునందు ఈసూత్రముచే మిజీ ప్రత్యయము రాగా, వండు+మి. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి, వండమి అని అగును. కృదంత మగుఈప్రాతిపదికము స్త్రీసమము. కావున దీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును. వండమి. వండమియందు. మొ.

'వ్యతిరేక' అనుటచే వ్యతిరేకార్థవిశిష్టము కానిభావార్థమునందు మిజీ రాదు. టవర్ణకమె వచ్చును. వండుట.

'భావంబు' అనుటచే భావార్థము లేనిచో మిజీ రాదు. వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజీ వచ్చును. వండఁడు మొ.

**38. సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు.**

**ఏకాశ్రయంబు లగుక్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచి యగుధాతువున కివర్ణకం బగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు. వండి-పండి-విని-కని. సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధం బయ్యె.**

ఒకేదానిని ఆశ్రయించి యున్నఅనేకము లగువ్యాపారములలో పూర్వ కాలమునకు చెందినదానిని తెలుపుధాతువునకు 'ఇ' అనుప్రత్యయము వచ్చును. దీనిని క్త్వార్థము అందురు.

చైత్రుఁడు వండి తినెను. ఇచట వండుట, తినుట అనురెండు క్రియలు (కర్త యగు) చైత్రుని ఆశ్రయించి సమానాశ్రయము లయినవి. ఈరెండింటిలో 'తినుట' అనుదానికంటె 'వండుట' అనుక్రియ పూర్వకాలమునకు చెందినది. కావున 'వండు' ధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'ఇ' ప్రత్యయము వచ్చి, వండు+ఇ. అని యుండగా 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, 'వండి' అని అగును. ఈ 'ఇ'ప్రత్యయము చివర గలశబ్దము అవ్యయము. విభక్తి లోపించి, 'వండి' అను అవ్యయపద మేర్పడును.

ఎన్నిక్రియ లయినను, పూర్వకాలమునకు చెందినవానికి అన్నింటికి ఇప్రత్యయము వచ్చును. చైత్రుఁడు వండి, తిని, చదివి నిద్రించెను. 'పూర్వకాలికము' కాకుండుటచే అనగా తరువాత ఏక్రియయు లేకుండుటచే నిద్రించు అనుదానికి ఇప్రత్యయము రాదు.

'చైత్రునిచేత మైత్రుడు కొట్టంబడి మడిసె' అనుచోట కొట్టుట అనుక్రియకు కర్త చైత్రుడు కాగా, 'మడియుట' అనుక్రియకు కర్త మైత్రుడు. ఈక్రియలు (కొట్టు, మడియు) సమానకర్తృకములు కాలేదు. మైత్రుఁడు కొట్టుట అనుక్రియకు కర్మ కాగా, మడియుట అనుక్రియకు కర్త యగును. అనగా కర్తృరూపముననను కర్మ రూపముననను ఈక్రియలు మైత్రుని ఒక్కనినే ఆశ్రయించియుండుటచే సమానాశ్రయములు అయినవి. కావున ఇందు పూర్వకాలికము అయిన 'కొట్టఁ బడు' అనుకర్మార్థకరూపమునకు క్త్వార్థ మగుఇప్రత్యయము వచ్చి, 'కొట్టంబడి మడిసె' అని ఐనది. ఇట్టివానికయి సూత్రమునందు సంస్కృతము ననుసరించి 'సమానకర్తృకము' లనకుండ 'సమానాశ్రయంబులకు' అని చెప్పబడినది.

'సమానాశ్రయంబుల' అనుటచే సమానాశ్రయములు కానిచో ఈకార్యము లేదు. చైత్రుడు వండగా మైత్రుడు తినెను. మొ.

'పూర్వకాలంబునందు' అనుటచే పూర్వకాలికము కానిచో ఈకార్యము లేదు. చైత్రుడు తినుచు చదివెను. మొ.

**39. కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు.**

**వండక - పండక - కొట్టక - తిట్టక.**

'ధాతువునకు' (క్రియ. 1) వ్యతిరేకార్థముతో కూడినక్త్వార్థము వ్యతిరేకక్త్వార్థము. క్త్వార్థము సమానాశ్రయముల లయినక్రియలలో పూర్వకాలికత్వమును బోధించును. అట్లే పూర్వకాలిక మైనక్రియ వ్యతిరేకార్థవిశిష్ట మయినపుడు ధాతువునకు కజి అనుప్రత్యయము వచ్చును. కజిలో జివర్ణము ఇత్తు. కావున 'క' అనునది నిలుచును.

చైత్రుఁడు వండక పరుండెను. 'వండు' అనుధాతువుపై వ్యతిరేకక్త్వార్థమున ప్రస్తుతసూత్రముచే కజి వర్ణకము వచ్చి, వండు+క అని యుండగా, 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి 'వండక' అని అగును. కృదంత మగుఈవ్యతిరేకక్త్వార్థ(ప్రాతిపదిక)ము అవ్యయము. విభక్తి లోపించి, 'వండక' అనుఅవ్యయపదము ఏర్పడును.

పరుండుట వండుట అనునవి కర్త యగుచైత్రుని ఒక్కని ఆశ్రయించి సమానాశ్రయములు అయినవి. ఇందు పరుండుట అనుదానికంటె 'వండుట' అనునది పూర్వకాలికము. అది (వంట చేయకుండుట) వ్యతిరేకార్థమునం దున్నది. కావున దానికి 'కజి' ప్రత్యయము వచ్చినది. వ్యతిరేకార్థము లేనిచో 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనుసూత్రముచే 'ఇ' ప్రత్యయము వచ్చి, వండి (పరుండెను) అని అగును.

'వ్యతిరేక' అనుటచే స్వార్థమున కజి రాదు. వండి.

(వ్యతిరేక) 'క్త్వార్థంబున' అనుటచే ఇతరార్థములందు రాదు. వండఁడు. వండమి మొ.

## 40. తుమర్థభావలక్షణంబులందు నుజి యగు.

**భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ. తుమర్థం బందును భావలక్షణంబునందును ధాతువునకు నుజి వర్ణకం బగు. తుమర్థంబు: చైత్రుండు వండును బోయెను. పాకక్రియార్థము పోయె నని యర్థము. భావలక్షణము: చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము. వచ్చుట లక్ష్యము.**

'ధాతువునకు' (క్రియ. 1) 'తుమున్' అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము (తుమ్ – అర్థము) తుమర్థము. స్థూలముగా 'కొఱకు' అనుఅర్థము. వేఱొకక్రియ (యొక్క సమయము మొ.)ను సూచించుట భావలక్షణము. తుమ్ అనుప్రత్యయముయొక్క అర్థమునందును భావలక్షణార్థమునను ధాతువునకు 'నుజి' అనుప్రత్యయము వచ్చును. 'నుజి'లో జివర్ణము ఇత్తు. కావున నువర్ణమె నిలుచును.

వండు అనుధాతువునకు తుమర్థమునందు ప్రస్తుతసూత్రముచే 'నుజి' ప్రత్యయము వచ్చి, వండు+ను అని యుండగా నుజి జిత్తు కావున 'జిత్తు పరం బగునపు డుత్వంబున కత్వంబగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి, 'వండను' అని అగును. ఈ 'నుజి' ప్రత్యయాంతములు అవ్యయములు. విభక్తి లోపించి 'వండను' అను అవ్యయపద మేర్పడును. చైత్రుఁడు వండను బోయెను. వండుటకొఱకు పోయెను అని అర్థము. ఇట్లే భావలక్షణార్థమున నుజి యై 'వండను' అని ఏర్పడును.

'తుమర్థభావలక్షణంబులం' దనుటచే ఇతరార్థములందు గలుగదు.

## 41. చేదర్థంబునందును, వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు.

**వానలు గురిసినం బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.**

'ధాతువునకు' (క్రియ. 1) ద్రుతము (ను) చివర గలది ద్రుతాంతము. ద్రుతాంత మగునవర్ణము అనగా 'నను' అనునది. వృత్తము అనగా భూతార్థము. భావ లక్షణము అనగా వేరొక క్రియకు లక్షణము (సూచించునది) అయినక్రియ 'చేత్' అనుఅవ్యయ మైనసంస్కృతశబ్దముయొక్క అర్థమునందును భూతార్థముతో కూడిన భావలక్షణమునందును ధాతువునకు పరముగా 'నను' అనుప్రత్యయము వచ్చును.

వానలు కురిసినం బంటలు పండును. 'కురిసినచో' అనువిధముగా ఇచట కురియుట అనుక్రియ చేదర్థమునం దున్నది. కావున 'కురియు' అనుధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'నను' అనుప్రత్యయము వచ్చి, కురియు+నను అని యుండును. చేదర్థము భూతార్థమునం దుండునది. కావున 'భూతంబునం దిగాగమం బగు' అనుసూత్రముచే ఇగాగమము వచ్చి, కురియు+ఇ+నన్ అని కాగా ధాతువునందలి యకారమునకు సకారము వచ్చి (క్రియా–54), కురిసినను అని అగును.

'వృత్తం బగు' అనుటచే భావలక్షణక్రియ వృత్తము (భూతము) కానిచో 'తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు' అనుసూత్రముచే నుజీ వచ్చి 'అనను' అని అగును. ఇతరార్థములందు రాదు.

**42. ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు.**

**జాబిల్లి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె.**

అనంతరము అనగా వ్యవధానము. అనగా ఎడము. అనంతరము (న+ అంతర) అనగా అవ్యవహితము. (కాలము) ఎడము లేక. అనంతరమె అనంతర్యము. అవ్యవహితముగా – వెంటనే అని అర్థము. ద్రుతము (నువర్ణము) చివర గలది ద్రుతాంతము. 'ద్రుతాంతంబు డువర్ణకంబు' అనగా 'డును' అనుప్రత్యయము. 'ధాతువునకు' అనుఅధికారసూత్రమును అనుసరించి 'ధాతువునకు' అనుఅర్థము సిద్ధించును. ఎడము లేక వెంటనే అనుఅర్థముతో నున్నధాతువునకు పరముగా 'డును' అనుప్రత్యయము వచ్చును.

జాబిల్లి తోఁతెంచుడుం గువలయంబుల వికసిల్లె. ఇచట తోతెంచు అనుధాతువుపై అనంతర్యార్థమునందు ప్రస్తుతసూత్రముచే 'డును' అనుప్రత్యయము వచ్చి తోతెంచుడును అని యగును. ఈ 'డును' ప్రత్యయము చివర గలిగినశబ్దములు అవ్యయములు. విభక్తి లోపించి, 'తో తెంచుడును' అనుఅవ్యయపద మేర్పడును. జాబిల్లి కనబడిన వెంటనే కలువలు వికసించినవి.

'ఆనంతర్యంబున' అనుటచే అంతర మున్నపుడు డువర్ణకము రాదు.

**43. చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు.**

**చూచుచుం బోవుచున్నాఁడు– చూచుచుం బోయెను–చూచుచుం బోవఁగలడు.**

'ధాతువునకు' (క్రియ. 1) 'శతృ' అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము శత్రర్థము. 'లటశ్శతృశానచౌ' అని శతృప్రత్యయము వర్తమానార్థమునం దగును. ద్రుతము (నువర్ణము) చివర గలిగినది ద్రుతాంతము. 'ద్రుతాంతంబు చువర్ణకంబు' అనగా 'చును' అనుప్రత్యయము. శతృప్రత్యయముయొక్క అర్థమునందు క్రియతో

అన్వయము కలిగినపుడు తెలుగున ధాతువునకు పరముగా 'చును' అనుప్రత్యయము వచ్చును.

'చూచు' ధాతువునకు శత్రర్థమునందు ప్రస్తుతసూత్రముచే 'చును' అను ప్రత్యయము వచ్చి, చూచుచును అని అగును. శత్రర్థకాంతము అవ్యయము. విభక్తి లోపించి, 'చూచుచు' అనుఅవ్యయపదము ఏర్పడును. చూచుచుం బోయెను.

'క్రియాన్వయంబున' అనుటచే వేఱొకక్రియతో అన్వయము లేనపుడు 'చును' ప్రత్యయము రాదు. రాముఁడు చూచుచు అని యుండదు. చూచుచున్నాఁడు. చూచుచుం బోయెను, చూచుచుం బోవఁగలడు. అనుచో క్రియాపదము భూతము, లేదా భావిఅర్థమునం దున్నను ఆసమయమునందు 'చూచుట' యనునది ప్రారబ్ధమై అపరిసమాప్త మయియేఉండును. కావున శత్రర్థము సరిపడును.

## 44 తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు.

## ప్రహరించువాఁడు - ప్రవహరించెడువాఁడు. ప్రహర్త యని యర్థము.

'ధాతువునకు' (క్రియ.1) సంస్కృతమున 'ణ్వుల్తృచౌ' అనుసూత్రముచే కర్త్రర్థమున 'తృచ్' అనుప్రత్యయము వచ్చును. తృ(చ్) అనుప్రత్యయముయొక్క అర్థమునందు తెలుగున ధాతువునకు ఎడి, ఎడు అనుప్రత్యయములు వచ్చును.

ప్రహరించు అనుధాతువుపై తృవర్ణకార్థమునందు ప్రస్తుతసూత్రముచే 'ఎడి' అనుప్రత్యయము వచ్చి, ప్రహరించు+ఎడి అని కాగా, సంధి జరిగి (సంధి.11) ప్రహరించెడి అని అగును. ఎడుప్రత్యయము వచ్చినపక్షమునందు ప్రహరించెడు అని అగును. ధాతువునకు వచ్చిన డుజునకు భిన్న మయినఈప్రత్యయములు కృత్తులు. ఇవి అంతమందు గలిగినశబ్దములు కృదంతములు. ప్రాతిపదికసంజ్ఞను పొందును. కావున వీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును. 'ధాతుజ విశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే తచ్ఛబ్దము చేరి ప్రథమావిభక్తి ఏకవచనమున మహ త్తగునపుడు ప్రవహరించెడువాఁడు. ప్రవహరించెడివాఁడు అమహ త్తయిన ప్రహరించునది.

## 45. వానికి లోపంబు బహుళంబుగా నగు.

## ప్రహరించువాఁడు - ప్రహర్త యని యర్థము.

'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు' అనుసూత్రముచే విధింపబడిన, ఎడి, ఎడు అనుప్రత్యయములకు బహుళముగా లోపము వచ్చును.

'ప్రహరించు' ధాతువుపై 'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు' అనుసూత్రముచే 'ఎడి, ఎడు అనుప్రత్యయములు వచ్చి, ప్రహరించు+ఎడి, ప్రహరించు+ఎడు అని యుండగా ప్రస్తుతసూత్రముచే అవి లోపించును. ఎడి

ఎడు అను(కృత్తు లైన)ప్రత్యయములు వచ్చి లోపించుటచే ప్రహరించు అనుశబ్దములు (ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్ అనున్యాయము ననుసరించి) కృదంతములే అగును. కావున 'కృత్తద్ధితసమాసా శ్చ' అని ప్రాతిపదికసంజ్ఞను పొందును. అందుచే దీనిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును. 'ధాతుజ విశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే తచ్ఛబ్దము చేరి ప్రథమపురుషైకవచనమునందు మహత్త్వమున ప్రహరించువాఁడు అని అగును. బహుళ మనుటచే లోపము రానిచో ప్రవహించెడు వాఁడు - ప్రహరించెడివాఁడు.

తృవర్థకార్థమునందు వచ్చిన ఎడియెడులు లోపించుటచే అవి లోపించిన రూపములును ఆఅర్థమునం దుండును. కాగా తృవర్థకార్థమునందు ఎడి, ఎడు, వానిలోపములతో మూడువిధము లయినరూపములు ఉండును.

బహుళము అనుటచే అస్త్యర్థమునందు కలుగు ధాతువుపై ఎడి, ఎడులకు లోపము నిత్యము. కలవాడు, పుట్టుట మొద లగుఇతర మైనఅర్థములలో వికల్పమె. కలిగెడువాఁడు, కలిగెడువాఁడు మొ.

**46. ఉన్న కలఁజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు.**

**ఉన్నవర్ణకంబు వర్తమానార్థకశత్రర్థమునం దగు. కలఁజివర్ణకంబు భవిష్యదర్థకశత్రర్థంబునం దగు. ఇవి సత్త్వాభిధానంబునం దగు నని యెఱుంగునది. సుబంతవాచ్యంబు సత్త్వంబు నాఁబడు. వండుచున్నవాఁడు - వండఁగలవాడు - వండినవాఁడు.**

'ధాతువునకు' (క్రియ. 1) ధాతువునకు భవచ్ఛత్రర్థమున 'ఉన్న' అను ప్రత్యయమును, భావిశత్రర్థమున 'కలఁజి' అనుప్రత్యయమును, క్తవదర్థమునందు 'న' అనుప్రత్యయమును వచ్చును. ఉన్న, కలఁజి, న అనుఈప్రత్యయములు కృత్తులు. కావున ఇవి అంతమందు గలవి (కృదంతములు) ప్రాతిపదికసంజ్ఞను పొంది ప్రథమ మొద లగువిభక్తులను అందును.

1. వర్తమానార్థ మైనశత్రర్థమునందు ధాతువునకు ఉన్న అనుప్రత్యయము వచ్చును.

'వండు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే ఉన్న అనుప్రత్యయము రాగా, వండు+ఉన్న అని యుండగా 'ఉన్నశబ్దంబు పరం బగునపుడు చువర్ణకం బగు' అనుసూత్రముచే ధాతువునకు చువర్ణకము వచ్చి, సంధి జరిగి, (సంధి. 11) వండుచున్న అనుకృదంత ప్రాతిపదికము ఏర్పడును.

2. భవిష్యదర్థకము అయినశత్రర్థమునందు ధాతువునకు కలఁజి అను

ప్రత్యయము వచ్చును.

వందు ధాతువుపై ప్రస్తుతసూత్రముచే కలజీ వచ్చి, వందు+కల అని కాగా కల(జీ) జీత్తు కావున ధాతువునకు (క్రియా. 20) అత్వము వచ్చి (వండ+కల) పిదప ధాతువునకు (క్రియా. 21) నుగాగమము వచ్చి, (వండను+కల) ద్రుతకార్యములు జరుగగా, వండఁగల – అనుకృదంతప్రాతిపదికము ఏర్పడును.

3. క్తవత్ అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము క్తవదర్థము. అది భూతార్థము. క్తవత్ ప్రత్యయార్థమునందు ధాతువునకు 'న' అనుప్రత్యయము వచ్చును.

వందు అనుధాతువునకు ప్రస్తుతసూత్రముచే నవర్ణకము వచ్చి, వందు+న అని యుండగా ఇది భూతార్థము కావున 'భూతంబునం దిగాగమం బగు' అనుసూత్రముచే ధాతువునకు ఇగాగమము వచ్చి (వందు+ఇ+న) సంధి జరిగి, (సంధి. 11) వండిన అనుకృదంతప్రాతిపదిక మేర్పడును.

వండుచున్న, వండఁగల, వండిన అనుఈప్రాతిపదికలపై విభక్తివివక్షలో 'ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే తచ్ఛబ్దము చేరి, ప్రథమావిభక్తి ఏకవచనమునందు మహదర్థమున వండుచున్నవాఁడు, వండఁగలవాడు, వండినవాఁడు అని అగును. అమహదర్థము నందు వండుచున్నది, వండినది, వండఁగలదు అని అగును.

**47. వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజీ యగు.**

**వండనివాఁడు. ఎడి ప్రభృతివర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణము లని ప్రాచీనులు వ్యవహరింతురు.**

'ధాతువునకు' (క్రియ. 1) 'తృచ్' అనుప్రత్యయముయొక్క అర్థము తృవర్ణకార్థము. అనగా తద్ధర్మార్థముతో కూడినకర్త్రర్థము. వ్యతిరేకార్థముతో కూడిన తృవర్ణకార్థము నందు ధాతువునకు నిజీ అనుప్రత్యయము వచ్చును. నిజీ అనుదానిలో జీవర్ణము ఇత్తు. కావున 'ని' యనునదె నిలుచును. ఈనివర్ణము కృత్తు. కావున ఇది అంతమందు గలది కృదంత మై ప్రాతిపదిక మగును. దానిపై ప్రథమ మొద లగువిభక్తులు చేరును.

వందు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే నిజీ ప్రత్యయము వచ్చి, వందు+ని అని యుండగా 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వము వచ్చి, వండని అని అగును. కృదంత మగుఈప్రాతిపదికపై ప్రథమావిభక్తిఏకవచనవివక్షయందు తచ్ఛబ్దము చేరి, (సమాస. 9) మహదర్థము నందు 'వండనివాఁడు', అమహదర్థమునందు 'వండని(య)ది' అని అగును.

తృవర్ణకార్థకము లయిన వండెడువాఁడు, వండెడివాఁడు, వండువాఁడు అనువాని కిది వ్యతిరేక మైన అర్థము నిచ్చును.

'వ్యతిరేక' అనుటచే తృవర్ణకార్థమున (భావమున) గాదు. ప్రహరించెడువాఁడు.

'తృవర్ణకార్థంబున' అనుటచే ఇతరార్థమున రాదు. ప్రహరింపఁడు.

## 48. లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు.

**సకర్మంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు.**

**అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.**

'ధాతువునకు' (క్రియ. 1) సకర్మకము ముందు పేర్కొనబడినది కావున 'లాఁతి' అనగా ఇచట అకర్మకము. కర్మముయొక్క ఆకాంక్షను గలిగించుధాతువు సకర్మకము, చైత్రుడు అన్నమును తినెను. ఇచట తినెను అనునది 'దేనిని తినెను?' అనువిధముగా కర్మను గూర్చినఆకాంక్షను కల్గించుచున్నది. కావున 'తిను' అనుధాతువు సకర్మకము. అకర్మకము అనగా కర్మయొక్క ఆకాంక్షను కలిగింపనిధాతువు. చైత్రుడు వచ్చెను. ఇచట 'వచ్చెను' అనుచోట దేనిని వచ్చెను అనుప్రశ్న ఏర్పడదు. అనగా కర్మను గూర్చినఆకాంక్ష లేదు. కావున 'వచ్చు' అనునది అకర్మకము. లట్టు, లిట్టు మొద లగులకారములును, టవర్ణకము, ఇప్రత్యయము, కజి, ఎడి మొద లగున వన్నియును లకారాదులు.

సకర్మకము అయినధాతువునకు (క్రియచేత కర్త చెప్పబడునపుడు) కర్త్రర్థమునందును, (క్రియచేత కర్మము చెప్పబడునపుడు) కర్మార్థమునందును లకారములు మొద లగునవి వచ్చును. చైత్రుఁడు అన్నమును తినుచున్నాఁడు (కర్త్రర్థము). చైత్రునిచేత అన్నము తినఁబడుచున్నది (కర్మార్థము). ఇట తినుట (కర్త) తినఁబడుట (కర్మ) మొ.

అకర్మకము అయినధాతువునకు (కర్మ ఉండదు కావున) కర్త్రర్థమునందు (క్రియచేత కర్త చెప్పబడునపుడు) లకారము మొద లగునవి వచ్చును. చైత్రుఁడు వచ్చెను. చైత్రుఁడు వచ్చుట మొ. ఇచట రాఁబడెను, రాఁబడుట మొ. కర్మార్థక రూపము లుండవు.

## 49. పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు.

**కొట్టఁబడుచున్నాఁడు – కొట్టఁబడుచున్నది.**

**కొట్టఁబడుట – కొట్టఁబడనివాడు.**

'ధాతువునకు' (క్రియ. 1) (పడుజి) అనుబంధము అనగా ఇచట చివర చేర్చి ప్రయోగింపబడునది. పడుజిలో జివర్ణము ఇత్తు. కావున 'పడు' అనునదే

నిలుచును. కర్మార్థమునందు అనగా క్రియచేత కర్మము చెప్పబడునపుడు ధాతువు చివర 'పడు' అనుశబ్దము వచ్చిచేరును.

'వండు'. దీనిచే కర్మ బోధింపబడునపుడు ప్రస్తుతసూత్రముచే పడుజి అనునది చేరి, వండు+పడు అని యుండగా పడు (జి) జీత్తు కావున 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే అత్వము వచ్చి, వండ+పడు అని అగును. 'కలజిపడుజులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనుసూత్రముచే నుగాగమము వచ్చి (వండను+పడు). ద్రుతకార్యములు జరుగగా వండఁబడు అని అగును. దీనిపై లకారాదులు చేరి, వండఁబడుచున్నది, వండఁబడుట మొద లగురూపము లేర్పడును. అన్నము వండఁబడుచున్నది.

'కర్మంబునందు' అనుటవలన క్రియచేత కర్త చెప్పబడునపుడు పడుజి రాదు. చైత్రుఁడు వండుచున్నాఁడు.

**50. గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వర ద్విస్వరంబులయించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.**

**ఏకస్వరధాతుద్విస్వరధాతువులమీఁదియించుగ్వక్రంబుల కియుడాగ మంబు విభాష నగు. గురుమంతం బగుధాతువునకును, యాంతం బగు ధాతువునకును మీఁదియించుగ్వక్రంబుల కియుడాగమంబు రాదు. భుజ్+ ఇయ్+ఇంచు – భుజియించు, పక్షంబున భుజించు. గుణ+ఇయ్+ ఇంచు– గుణియించు, గుణించు. ఇంచుగ్వ్యవధానంబునంజేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లే వని యెఱుంగునది. యాచ్ అర్థ ఇత్యాదులు గురు మంతంబులు. వ్యయ – ఇది యాంతము. యాచించు, అర్థించు, వ్యయించు. జి+ఇంచు అనుచోట నిత్యం బగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతం బగుటంజేసి యియుడాగమంబు లే దని యెఱుంగునది. కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు. నగు+ఇయ్+ఇంచు – నగియించు, నగించు, నగు+ఇయ్+ఎను – నగియెను, నగెను, పడు+ఇయ్+ఎను – పడియెను, పడెను. ఇత్యాదు లెఱుంగునది.**

ఇఁచుక్కు ఆగమము. ఎఏఒఓలు నాలుగును వక్రములే అయినను ఇచట 'ఎ' అనువక్రము ఒక్కటి మాత్రమె పర మగుట సంభవించును. ఇయుట్+ఆగమ అనుచోట టకారము ఇత్తు. ఇయు అనుచోట ఉకారము ఉచ్చారణసౌకర్యమునకై ఉంచబడినది. టకారము ఇత్తుగా గలది కావున 'ఇయ్' టిత్తు. ఆద్యన్తౌ టకితౌ అనులక్షణము ననుసరించి ఇయ్ అనునది విధించినదానికి అనగా ఇంచుగ్ వక్రములకు ముందుగా వచ్చి చేరును.

గురు వైనఅక్షరము లేనిదియును, చివర యకారము లేనిదియును, ఒకటి లేదా రెండు మాత్రమే అచ్చులు కలిగినదియు అయినధాతువునకు పరముగా నున్న ఇంచుగాగమమునకును, 'ఎ' అనువక్రమునకును ముందుగా 'ఇయ్' అనునది వికల్పముగా ఆగమముగా వచ్చును.

భుజ్ధాతువునకు 'సంస్కృతంబున కంగలాదు కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుగాగమము వచ్చి, భుజ్+ఇంచు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ఇయ్ ఆగమ మయి, భుజ్+ఇయ్+ఇంచు-భుజియించు. అని అగును. విభాష అనుటచే ఇయుడాగమము రానిపక్షమునందు భుజ్+ఇంచు - భుజించు అని యుండును.

'గురువిరహితంబు లయి' అనుటచే గురుమంతము లయినధాతువులకు ఇయుడాగమము రాదు. యాచ్+ఇంచు-యాచించు అర్థ+ఇంచు-అర్థించు మొ.

'అయాంతంబు లయిన' అనుటచే యకారాంతము లయినధాతువులపై ఇయు డాగమము రాదు. వ్యయ+ఇంచు-వ్యయించు. జయ్+ఇంచు-జయించు మొ.

'ఏకస్వరద్విస్వరంబులకు' అనుటచే రెండింటికంటె ఎక్కువ అచ్చు లున్న ధాతువులయెడల ఇయుడాగమము లేదు. కరుణ+ఇంచు-కరుణించు. తురగల+ఇంచు-తురగలించు మొ. త్రిమ్మరియెడు, క్రుమ్మరియెడి అను ప్రయోగములు విశేషము.

'ఇంచుగ్వ్రక్రములకు' అనుటచే ఇంచుగ్వ్రక్రములకంటె వే రైనదానికి ఇయుడాగమము రాదు. నగు+ఇ+రు=నగిరి, నగు+ఇ-నగి మొ.

**51. పద్వాదులనవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు.**

**పడ్డ - పడిన. పడ్డను - పడినను. పడు - ఇడు - చెడు - తగు - అను- కొను - తిను - మను - చను. ఇవి పద్వాదులు.**

పడు మొద లగునవి పద్వాదులు. చేదర్థమునందును వృత్తం బగుభావ లక్షణమునందును వచ్చు (నను)నదియును క్త్వవదర్థమునందు వచ్చునదియును అగు'న'వర్ణకములు రెండు కలవు. పడు మొద లగువానికంటె పరముగా ఉన్న ఈ 'న'అనుప్రత్యయము మొత్తముస్థానమున హ్రస్వ మగుఅకారమును, ధాతువునందలిహల్లులలో చివరిదానికి ద్విత్వమును వికల్పముగా వచ్చును.

పడు అనుధాతువుపై 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అనుసూత్రముచే నప్రత్యయము వచ్చి, 'భూతంబునం దిగాగమం బగు' అనుసూత్రముచే ఇగాగమ మయి, 'పడినను'

అని కాగా, ప్రస్తుతసూత్రముచే అత్వద్విత్వములు వచ్చి, పడ్డి+అను అని యై, సంధి జరిగి, 'పడ్డను' అని అగును. విభాష అనుటచే ఈకార్యము జరుగనిపక్షమునందు 'పడినను' అనియె ఉండును. ఇట్లే పడ్డవాఁడు – పడినవాఁడు మొ.

'పద్వాదుల' అనుటచే పడు మొద లగువానిలో చేరనిధాతువునకు ఈకార్యము లేదు. నగినను, నగినవాఁడు. నగ్గను ఇత్యాదు లుండవు.

'నవర్ణకంబునకు' అనుటచే నవర్ణకము కానిదానికి ఈకార్యము లేదు. పడనివాఁడు మొ.

'అత్వంబును – ద్విత్వంబును' అనుచోట్ల సముచ్చయార్థకము లగునుశబ్దములచే ఈరెండు కార్యములు కలిసియె ప్రవర్తించును. రానిపక్షమున రెండును రావు. కావున 'పడ్డిన' – అనువిధముగా ద్విత్వము ఒక్కటి వచ్చిన రూపము గాని, 'పడ' అనురీతిగా అత్వము ఒక్కటి వచ్చినరూపము గాని ఉండవు.

**52. క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వను ప్రయుక్తం బగు.**

**ఇదియె యాత్మనేపదార్థ మని వ్యవహరింతురు. వండుకొనుచున్నాఁడు.**

'ధాతువునకు' (క్రియ. 1) క్రియయొక్క ఫలము, కర్తను పొందునపుడు ఆ అర్థమునందు ధాతువునకు మీద 'కొను' అనుధాతువు చేరును.

దేవదత్తుఁడు వండుకొనుచున్నాఁడు. ఇచట 'వండుట' అనుక్రియకు ఫలము అయిన 'వంట' కర్త అయినదేవదత్తునే పొందును. (వండుకొనుచున్నా డనగా తనకయి వంట చేయుచుండె ననియు, వండినపదార్థము తానే తిను ననియు అర్థము) కావున 'వండు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'కొను' అనుధాతువు చేరును. లట్టు మొద లగులకారములు కొనుధాతువుపై అగును. వండుకొనుచున్నాడు మొ. దీనినె ఆత్మనేపదార్థ మందురు.

'కర్తృగామి యగుచో' అనుటచే క్రియాఫలము కర్తను మాత్రమె పొందుట అనుఅర్థము లేనపుడు కొనుధాతువు చేరదు. దేవదత్తుఁడు వండుచున్నాఁడు. ఇచట 'వండు' అనుక్రియకు ఫల మయిన 'వంట' దేవదత్తు డొక్కడే పొందు ననుఅర్థము లేదు. కావున 'కొను' చేరలేదు. ఇట్లే రామునిచేత రావణుఁడు సంహరింపబడెను మొ.

**53. కొనుధాతువు పరం బగునపు డిగాగమంబు బహుళంబుగా నగు.**

**వండికొనియె – వండుకొనియె. బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు చేసికొనియె.**

'ధాతువునకు' (క్రియ. 1) ఇక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు. కి త్తయిన 'ఇ' వర్ణము ధాతువునకు చివర వచ్చి చేరును. కొను అనుధాతువు పరముగా ఉండగా దానికి పూర్వమునం దున్నధాతువునకు చివర 'ఇ' అనువర్ణము బహుళముగా ఆగమముగా వచ్చును.

వందు అనుధాతువుపై ఆత్మనేపదార్థమునందు, 'క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే 'కొను' అనుధాతువు చేరి, వందు+కొను అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ఇగాగమము వచ్చి, 'వందు+ఇ+కొను' అని కాగా సంధి జరిగి (సంధి. 11) వందికొను అని అగును. 'బహుళము' అనుటచే ఇగాగమము రానిపక్షమునందు 'వందుకొనియె' అని యుండును. ఇట్లె కొనుధాతువు పరం బగునపు డనుటచే ఇతరస్థలములం దీకార్యము లేదు. అగుదెంచె. బహుళంబు అనుటచే యకారాంతము అయిన ధాతువునకు ఇగాగమము నిత్యముగా వచ్చును. చేసికొను మొ. చేసుకొను ఇత్యాదు లుండవు. ఇచట ప్రవృత్తి. 'పందుకొను' ఇత్యాదులందు ఇగాగమమునకు అప్రవృత్తి. పందికొనె అనువిధ మైనరూపములు ఉండవు.

**54. ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు నకారం బగు.**

**చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసెడిని. ఇత్యాదు లెఱుంగునది.**

ఎఏఒఓలు నాలుగును వక్రము లయినను ఎను, ఎడు, ఎడి మొద లగు వానియం దుండి 'ఎ' అనున దొక్కటిమాత్రమే ధాతువునకు పరముగా ఉండుట సంభవించును. ఈసూత్రమునకు పూర్వమువరకు చెప్పబడినవానియం దున్న ఇకారమును 'ఎ' అనువక్రమును పరముగా ఉండగా వానికి పూర్వమునం దున్న ధాతువునందలిఅచ్చుతో గూడినయకారముయొక్క స్థానమున నకారము ఆదేశముగా వచ్చును.

చేయు అనుధాతువుపై క్త్వార్థమునందు 'సమానాశ్రయంబులం బూర్వ కాలంబునం దివర్ణకం బగు' అనుసూత్రముచే ఇప్రత్యయము వచ్చి, చేయు+ఇ అని యుండగా ప్రస్తుతసూత్రముచే యువర్ణముస్థానమునందు సకారపుపొల్లు ఆదేశముగా వచ్చి, చేస్+ఇ=చేసి అని అగును. చేయు+ఎడిని అనుచో వక్రము పరము కాగా సకార మయి, చేసెను. ఇట్లె చేసిరి, చేసెదును మొ.

'ఇకారవక్రంబులు' అనుటచే ఇ, ఎ, అనువానికంటె వే రయినవర్ణము పర మగునపుడు సకారము లేదు. చేయఁగలడు. చేయుట మొ.

'ఉక్తంబులందలివి' అనుటచేత సూత్రమునకు తరువాత చెప్పబోవు ఇకార (వక్ర)ము పర మయినపుడు సకారము రాదు. చేయుధాతువుపై 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుతరువాతిసూత్రముచే ఇంచుక్కు రాగా, చేయించు అని యగును. ఇచట చేసించు అనువిధముగా సకారము రాదు.

'యాకు' అనుటచే ఇతర మైనహల్లునకు సకారము లేదు. వండు+ఇ – వండి వచ్చు +ఎను – వచ్చెను మొ.

**55. చువర్ణకంబు పరం బగునపు డన్వాదుల కుత్వలోపం బేని నుస్థానంబున బిందు వేని విభాష నగు.**

**అన్చున్నాఁడు–అంచున్నాఁడు–అనుచున్నాఁడు. అన్చును–అంచును–అనుచును. అను–కను–కొను–తిను–మను–విను ఇవి యన్వాదులు.**

అను (ఆది) మొద లగునవి అన్వాదులు. అను కను మొద లగునవి 'ఆరు' ధాతువులు. ఇవి మాత్రమే అన్వాదులు. 'ఉన్న' అనుబంధము (క్రియా. 13) పరముగా నున్నపుడును 'ఉన్న' అనుప్రత్యయము పర మగునపుడును (క్రియా 46) ఒకచువర్ణకము వచ్చును. శత్రర్థమునందు ద్రుతాంత మయినచువర్ణకము ఇం కొకటి కలదు. ఈచువర్ణకములు పరముగా ఉన్నపుడు అను మొద లగు ధాతువులలోనినువర్ణమునందలిఉకారమునకు లోపము గాని, లేదా మొత్తము నువర్ణముయొక్క స్థానమునందు సున్న గాని వికల్పముగా వచ్చును.

'అను' ధాతువుపై 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' అనుసూత్రముచే 'చును' అనుప్రత్యయము వచ్చి, అను+చును అని ఉండగా ప్రస్తుతసూత్రముచే 'అను'లో ఉత్వమునకు లోపము వచ్చిన, 'అన్చును' అని అగును. కాక నువర్ణమునకు నిండుసున్న వచ్చిన 'అంచును' అని అగును. విభాష అనుటచే, ఇవి రెండును రానపుడు 'అనుచును' అని అట్లే ఉండును. 'బిందువు' అని సామాన్యముగా చెప్పుటచే అరసున్నయును రావలెను. అను మొద లగుధాతువులు ఆరింటిలోను మొదట హ్రస్వమే ఉండుటచే 'అఁ టయిఁకచుఁడు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' అనుసూత్రముచే నుడితొలిహ్రస్వముపై అరసున్న ఉండదు. కావున ఇచట నిండుసున్నయే కాని అరసున్న రాదు.

'చువర్ణకంబు' అనుటచే ప్రత్యయము కానిచువర్ణము పర మైనచో ఈకార్యము లేదు. వినుచు. ఇట ప్రేరణార్థమునందు 'చు' అనునది ఆగమముగా వచ్చినది. కావున లోపబిందువులు రావు. వినుచును – మనుచును మొ. ఇట్లె చువర్ణము కంటె ఇతర మైనప్రత్యయము పర మైనను ఈకార్యము ఉండదు. అనును మొ.

'అన్వాదులకు' అనుటచే అను మొద లగుఆరింటిలో చేరనిధాతువునకు ఈకార్యము లేదు. చనుచును. ఇచట చంచును, చన్చును అనువిధ మైనరూపము లుండవు.

**56. ఉన్నశబ్దంబు పరం బగునపు డుండుధాతువునకు లోపం బగు.**

**ప్ర : ఉన్నాఁడు-ఉన్నారు. ఉన్నది-ఉన్నవి. మ : ఉన్నావు-ఉన్నారు. ఉ: ఉన్నాను-ఉన్నాము. ఉన్నవాఁడు.**

ఉన్న అనుశబ్దము పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునందలి ఉండు అనుధాతువునకు లోపము వచ్చును. 'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు' అనుసూత్రముచే విధింపబడిన 'ఉన్న' అనుబంధమును, 'ఉన్న కలజీ నవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనుసూత్రముచే విధింపబడిన 'ఉన్న' అనుప్రత్యయమును ఇక్కడ 'ఉన్నశబ్దము' చే బోధింపబడును.

ఉండు అనుధాతువునకు లట్టునందు (క్రియా. 2) 'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు' అనుసూత్రముచే ఉన్న అనునది చేరగా (ఉండు+ఉన్న+ల్) ప్రస్తుతసూత్రముచే 'ఉండు' అనుధాతువు లోపించి, ఉన్న+ల్ అని ఉండును. లకారమునకు ప్రథమపురుషైకవచనమునందు (క్రియా. 8) డుజును (ఉన్న+డుజ్), 'ఉన్న'కు దీర్ఘమును (క్రియా. 15) వచ్చి, ఉన్నాఁడు అని అగును. ఇట్లే ఉన్నవాఁడు మొ.

'ఉన్నశబ్దంబు పరం బగునపుడు' అనుటచేత లిట్టువెుద లగుఇతరస్థలములందు ఉండుధాతువునకు లోపము లేదు. ఉండెను, ఉండఁ గలవాఁడు. ఉండక మొ.

**57. చేదాద్యర్థనాంతం బయినయుండున కున్నాదేశంబు విభాష నగు.**

**ఉన్నను - ఉండినను.**

చేదర్థమునందును వృత్తం బగుభావలక్షణమునందును వచ్చిననవర్ణకము చివర గలిగిన 'ఉండు' అనుధాతువు(పైనున్ననవర్ణకముతో గూడ)యొక్క స్థానమున ఉన్న అనునది వికల్పముగా ఆదేశముగా వచ్చును.

'ఉండు' ధాతువుపై 'చేదర్థంబునందును, వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అనుసూత్రముచే నప్రత్యయము వచ్చి, ఉండు+నను అని యుండగా 'భూతంబునం దిగాగమం బగు' అనుసూత్రముచే ఇగాగమము వచ్చి (ఉండు+ఇ+నను), సంధి జరిగి 'ఉండినను' అని యగును. 'ఉండిన' అనుభాగమునకు ప్రస్తుతసూత్రముచే 'ఉన్న' అనునది ఆదేశముగా వచ్చి, ఉన్నను

అనురూప మేర్పడును. విభాష అనుటచే ఉన్న అనుఆదేశము రానిపక్షమునందు 'ఉండినను' అని ఉండును.

**58. తిదుటలు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున సున్నయు నుండుడులోపంబును విభాష నగు.**

**అందురు–అంట. ఉందురు–ఉంట. పక్షంబున అనుదురు – అనుట. ఉండుదురు – ఉండుట. ఇత్యాది.**

అను (అది) మొద లగునవి అన్వాదులు. అను, కను, కొను, తిను, మను, విను అనునవి ఆరును అన్వాదులు. లిట్టువుఇష్ణు పర మగునపుడు తివర్ణకము వచ్చును. ఈతివర్ణమును, లాట్టులో వచ్చిన'దు'గాగమమును, భావార్థమున వచ్చు 'ట'వర్ణకమును పరముగా ఉన్నపుడు అను మొద లగువానిలోని'ను'వర్ణముయొక్క స్థానమున సున్న వికల్పముగా వచ్చును. ఉండు ధాతువునందు డువర్ణము వికల్పముగా లోపించును.

'అను' ధాతువుపై 'టవర్ణకంబు భావంబునం దగు' అనుసూత్రముచేత టవర్ణకము వచ్చి, అను+ట అని ఉండగా ప్రస్తుతసూత్రముచే నువర్ణముస్థానమున సున్న వచ్చి, అంట అని యగును. విభాష అనుటచే సున్న రానిచో 'అనుట' అని ఉండును. ఉండుట అనుచోట డువర్ణము లోపించి 'ఉంట' అని అగును. లోపము రానిపక్షమునందు 'ఉండుట' అని యుండును. ఇట్లే అనుదురు – అందురు ఉండుదురు – ఉందురు మొ.

'బిందువు' అనుటచే అరసున్నయును ప్రాప్తించును. కాని అను మొద లగు ఆరింటిలో మొదటిఅచ్చు హ్రస్వమే అగుటచేత 'అఁటయిఁకచుఁడుశబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' అనుసూత్రముచే ఇచట నువర్ణమునకు అరసున్న రాదు. 'అఁట' అనునది అనుట అనుదానినుండి యేర్పడదు.

'తిదుటలు' అనుటచే ఇతరము పర మైనపుడు సున్న వచ్చుప్రసక్తి లేదు. అనును, అనుఁడు, ఉండుము మొ.

'అన్వాదులు' అనుటచే అను మొద లగువానిలో చేరనిధాతువునందలి నువర్ణమునకు సున్న రాదు. చనితిని, చనుదువు, చనుట మొ.

**59. ఇట బిందువుమీఁదితదలకు నిత్యవైకల్పికంబు లయి టడ లగు.**

**అంటివి – అనితివి. అండుదు – అందురు. ఉంటివి – ఉండితివి. ఉండురు– ఉందురు.**

ఇట అనగా 'తిదుటలు పరంబు లగునపు డన్వాదులను స్థానంబున సున్నయు నుండు లోపంబును విభాష నగు' అనుపూర్వసూత్రముచే అన్వాదులనువర్ణమునకు వచ్చినబిందువుమీదను, ఉండులో డులోపమువలన బిందువుమీదను ఉన్న తివర్ణకమునందలి, పొల్లుతకారముస్థానమున నిత్యముగా పొల్లు టకారమును, దుగాగమమునందలిదకారపుపొల్లుస్థానమున వికల్పముగా పొల్లుడకారమును ఆదేశములుగా వచ్చును.

అనుధాతువునకు భూతార్థమున మధ్యమపురుషైకవచనమునందు అను+తివి అని ఏర్పడగా, 'తిదుటలు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున సున్నయు' అనుసూత్రముచే నువర్ణమునకు నిండుసున్న వచ్చి, అంతివి అని కాగా ప్రస్తుత సూత్రముచేత తకారమునకు టకారము వచ్చి, 'అంటివి' అని అగును. టకారము వచ్చుట నిత్యము గావున 'అంతివి' అనురూప ముండదు. ఇట్లే అంటిరి మొ.

ఉండు ధాతువునకు తద్ధర్మాదులందు ప్రథమపురుషబహువచనమునందు 'ఉండుదురు' అనురూప మగును. 'తిదుటలు పరంబు లగునపుడు' అనుసూత్రముచే దకారమునకు డకార మై, 'ఉండురు' అని అగును. వైకల్పిక మనుటచేత డకారము రానిపక్షమునందు 'ఉందురు' అని ఉండును.

'ఇట' అనుటచేత అన్వాదులలోను ఉండు ధాతువులోను మాత్రమే ఈకార్యము. కావున వంతురు, త్రుంతురు మొద లగుచోట్ల టకారము గాదు. అందుదురు పొందుదురు మొద లగుచోట్ల డకారము రాదు. ఇంకను 'ఇట' శబ్దముచే అన్వాదులకు 'ఉండు'కు గూడ పూర్వసూత్రసందర్భమునందలి తివర్ణక దుగాగములు పర మైనపుడే ఈకార్యము. కావున 'ఉంతురు' అనుచోట ఉండులో బిందువుపైని టకారము రాదు.

'బిందువుమీఁది' అనుటచే 'తిదుటలు పరంబు లగునపు డనుసూత్రముచే సున్న రాక, అనితివి ఇత్యాదిగను, 'డు' లోపింపక ఉండుదురు ఇత్యాదిగను ఉన్నపుడు తదలు బిందువు మీద లేవు గావున టడలు రావు. అనిటిరి, ఉండుదురు ఇత్యాదిగా నుండవు. అంట, ఉంట మొద లగుచోట్ల మార్పు లేదు.

'తదలకు' అనుటచే ఇతరవర్ణములకు మార్పు లేదు.

**60. ముఱు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు.**

**బహుళం బనుటచే దీనికి నొకానొకచో నతిచారం బని యెఱుంగునది.**

ముఱు అనగా 'లూణ్మధ్యనుమపురులకు ముడుఱు లగు' అనుసూత్రము ననుసరించి లూట్టు లకారమునకు వచ్చిన మధ్యమపురుషఏకబహువచనములు అయిన ము, డుఱు అనునవి. ఈ ము, డుఱు అనునవి పరముగా ఉన్నపుడు

వానికి పూర్వమునం దున్న 'కొను' అనుధాతువుయొక్క స్థానమునందు 'కో' అనునది బహుళముగా ఆదేశముగా వచ్చును.

కొను అనుధాతువు మధ్యమపురుష ఏకవచనమునందు కొనుము అని యుండగా ప్రస్తుతసూత్రముచే 'కొను' ధాతువునకు 'కో' అనునది ఆదేశ మై కో+ము అని కాగా, 'ముజు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మాముడియు నగు' అనుసూత్రముచే 'కొమ్ము' అనురూప మగును. బహుళము అనుటచే 'కొను' అనుఆదేశము రానిపక్షమునందు 'కొనుము' అని యుండును. ఇట్లె కొండు – కొనుఁడు.

'ముజు పరం బగునపుడు' అనుటచే ప్రథమపురుషఏకవచన మగు డుజు, ఉత్తమపురుషబహువచన మగు 'ము'వర్ణము మొద లగునవి పర మైనపుడు ఈ ఆదేశము లేదు. కొనఁడు, కొనము. మొ.

'కొనునకు' అనుసామాన్యనిర్దేశముచే ప్రత్యేకముగా ఉన్న కొనునకును, వేరొకదానికి అనుప్రయుక్త మైనకొనునకును ఈఆదేశము వచ్చును. కొమ్ము (కొనుము) వందుకొమ్ము (వందుకొనుము) మొ.

## 61. ముజు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మాముడియు నగు.

**కొమ్ము – కొనుము. కొండు – కొనుఁడు.**

'లూణ్మధ్యమపురులకు ముడుజు లగు' అనుసూత్రముచే లూట్టునందు మధ్యమపురుషఏకబహువచనములందు ఏర్పడు ము, డుజ్ అనువానికి ముజు అని పేరు. ఈ 'ము, డుజ్' అనుప్రత్యయములు పరముగా ఉన్నపుడు వానికి పూర్వమునం దున్నధాతువుయొక్క దీర్ఘమునకు హ్రస్వము వచ్చును. పైనున్న ముపర్ణమునకు మాముడి (్మ) కలుగును.

కొనుధాతువునకు లూట్టులో మధ్యమపురుషబహువచనమునందు 'కొను+డుజ్ అని యేర్పడగా 'ముజు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' అనుసూత్రముచే కో అనుఆదేశము వచ్చి, కో+డుజ్ అని యుండును. ప్రస్తుతసూత్రముచే దీర్ఘమునకు హ్రస్వము వచ్చి, కొ+డుజ్ అనుచో డు(జ్) జిత్తు కావున ముందు నిండుసున్న వచ్చి, కొండు అని అగును. 'అఁటయిఁకచుఁడు శబ్దంబులం దప్ప' అనుసూత్రముచే ఈసందర్భములందు అరసున్న రాదు. విభాష అనుటచే బిందువు రానిపక్షమునందు – కొనుఁడు.

'కొనుము' అనుఏకవచనములో కో+ము అని కాగా, హ్రస్వమును (కొ+ము) ముపర్ణమునకు మాముడియును వచ్చి, 'కొమ్ము' అగును. ఇట్లే రమ్ము, రండు,

తెమ్ము – తెండు మొ. విభాష అనుటచే దీర్ఘమునకు హ్రస్వము రానిపక్షమునందు మువర్ణకమునకు మాముడియును రాదు. కొనుము.

'ముఉ పరం బగునపుడు' అనుటచేత ప్రథమపురుషఏకవచన మగు డుఉ, ఉత్తమపురుషబహువచన మగు'ము'వర్ణము మొద లగునవి పరముగా ఉన్నపుడు ఈకార్యము లేదు. రాఁడు, రాము, రాక. మొ.

**62. రువర్ణకంబు పరం బగునపుడు సున్నమీఁదితదడల యుత్వంబునకు లోపంబు విభాష నగు.**

**పోషింత్రు – పోషింతురు. కొంద్రు – కొందురు. కొండ్రు – కొండురు.**

రు అనుప్రత్యయము (ప్రథమ మధ్యపురుషలలో 'రు' వర్ణము బహువచనము) పరముగా ఉండగా, దానికి పూర్వమునం దున్న సున్నకు పై నున్న తు, దు, డు అనువర్ణములయందలిఉకారమునకు వికల్పముగా లోపము వచ్చును.

పోషించు అనుధాతువునకు తద్ధర్మాదులలో ప్రథమ(మధ్యమ)పురుష బహువచనమునందు పోషింతురు. అనురూప మగును. ప్రస్తుతసూత్రముచే అచట తువర్ణమునందలి ఉకారము లోపింపగా, 'పోషింత్రు' అని అగును. విభాష అనుటచే లోపము రానపుడు 'పోషింతురు' అని యుండును. ఇట్లే ఉందురు – ఉంద్రు. కొండురు – కొండ్రు.

'సున్న' అని సామాన్యముగా చెప్పుటచే అరసున్నమీద కూడ ఉత్వలోపము వచ్చును. తలఁతురు. కలఁతురు అనుచో ఉత్వలోపముచే తలఁత్రు – ఇత్యాదులుగా కాగా 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండ బిందునకుం బూర్ణం బగు' అనుసూత్రముచే అరసున్నకు నిండుసున్న నిత్యముగా వచ్చి 'తలంత్రు' ఇత్యాదిగా నగును.

'రువర్ణకంబు పరం బగునపుడు' అనుటచేత రువర్ణకము పరముగా లేనిచో ఉత్వలోపము లేదు. పోషింతును, పోషింతువు మొ.

'సున్నమీఁది' అనుటచే సున్న లేనిచో ఈకార్యము రాదు. నిలుతురు, చనుదురు.

**63. సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు.**

**సంస్కృతధాతువుల కంగలాదుల కించు క్కగు. పచించు–వచించు–త్యజించు–భుజించు–అంగలించు. అంగల, అడక, ఆరగ, ఆవుల, ఉంక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలక, పంక, పరిక, పలన, అప్పు, ఒప్పు, ఆల, ఇత్యాదు లంగలాదులు.**

ఇంచుక్+ఆగమ అనుచోట కకారము ఇత్తు, కిత్తు అయిన 'ఇంచు' అను ఆగమము ధాతువునకు చివర చేరును. 'ధాతువునకు' అనుఅధికారసూత్రము ననుసరించి సంస్కృతధాతువులకును, అంగల మొద లగుఅచ్చతెనుగు ధాతువులకును చివర 'ఇంచు' అనునది ఆగమ మగును.

భుజ్ అనునది సంస్కృతధాతువు. తెలుగున దానికి ప్రస్తుతసూత్రముచే 'ఇంచు' అనుఆగమము వచ్చి, భుజించు అని అగును. ధాతువునకు ఆగమము అగుటచే 'ఇంచు' ధాతువునకు అవయవము అగును. ఇట్లు సంస్కృతధాతువులకు ఇంచుక్కు చేరగా, లకారాదులు వానిపై వచ్చును. భుజించుచున్నాఁడు, భుజించెను. మొ.

తెలుగునందు ప్రవేశించుసంస్కృతధాతువులు అన్నింటికి ముందుగా ఇంచు గాగమము వచ్చును. అంగల అనుఆచ్ఛికధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'ఇంచు' అనునది ఆగమ మయి, అంగల+ఇంచు అని ఉండగా, సంధి (సంధి. 11) జరిగి, అంగలించు – అంగలించుచున్నాఁడు. అంగలించెను మొ.

'సంస్కృతంబునకు' అనుటచే ఇంచుగాగమము లేకుండ సంస్కృతధాతువు తెలుగున ప్రయోగింపబడదు.

'అంగలాదులకు' అనుటచే అంగలాదులలో చేరనిఅచ్చతెలుగుధాతువులకు స్వార్థమునందు ఇంచుక్కు లేదు. వండుచున్నాఁడు. వండెను మొ. ఆచ్ఛికధాతువులలో అంగల మొద లగువానికి మాత్రమే స్వార్థమునందు ఇంచుగాగమము వచ్చును.

**64. ఇఉఋుల కించుక్కు పరం బగునపు దయుగవుగరుక్కు లగు.**

**జి – జయించు. ద్రు – ద్రవించు. ధృ – ధరించు.**

**నీ – నయించు. లూ – లవించు. తౄ – తరించు.**

అయుక్+అవుక్+అరుక్=(అయు గవు గరుక్) అనువానియందలికకారములు ఇత్తులు. మిగిలిన అయు, ఆవు, అరు అనువానియందలి చివరిఉకారము ఉచ్చారణసౌకర్యమునకు చేర్పబడినది. కిత్తు అగుటచే, 'అయ్, అవ్, అర్' అనునవి ధాతువులకు చివర వచ్చిచేరును. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుపూర్వసూత్రమునుండి 'సంస్కృతంబునకు' అనునది అనువర్తించును. ధాతువునకు అనుఅధికారసూత్రమును అనుసరించి, ధాతువునకు అనుఅర్థము సిద్ధించును.

1) ఇంచుగాగమము పర మైనపుడు సంస్కృతధాతువునకు చివర ఉన్న 'ఇ'

కారమునకు పైని 'అయ్' అనునది ఆగమముగా వచ్చును.

'జి' అనుధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అను సూత్రముచే ఇంచుగాగమము వచ్చి జి+ఇంచు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు 'అయ్' అనుఆగమము వచ్చి (జి+అయ్+ఇంచు) సంధి జరిగి జయ్+ఇంచు – జయించు అని అగును.

2. ఇంచుగాగమము పర మయినపుడు సంస్కృతధాతువు చివర ఉన్న ఉకారమునకు పైని అవ్ అనునది ఆగమముగా వచ్చును.

ద్రు అనుధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అను సూత్రముచే ఇంచుగాగమము వచ్చి ద్రు+ఇంచు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు 'అవ్' అనుఆగమము వచ్చి (ద్రు+అవ్+ఇంచు) సంధి జరిగి ద్రవ్+ఇంచు – ద్రవించు అని అగును.

3. ఇంచుగాగమము పర మయినపుడు సంస్కృతధాతువునకు చివర ఉన్న 'ఋ'కారమునకు పైని 'అర్' అనునది వచ్చును.

ధృ+ఇంచు అని ఉండగా ఈసూత్రముచే అరుగాగమము వచ్చి 'ధృ+అర్+ఇంచు' అనుచో సంధి జరిగి (సంధి. 11), ధర్+ఇంచు–ధరించు అని అగును.

'ఇఉఋులకు' అని తపరకరణము లేక నిర్దేశించుటచే దీర్ఘములకును ఈ ఆగమములు వచ్చును, నీ+ఇంచు – నయించు, తౄ+ఇంచు – తరించు. ఇఉఋ భిన్నములకు రాదు. ఈకార్యము సంస్కృతధాతువులకే. ఆచ్ఛికధాతువులకు ఈఆగమములు రావు. వండు+ఇంచు – వండించు. వండవించు అని కాదు.

'జయించు' అనుదానిపై ప్రేరణమునందు ఇంచుక్కు వచ్చి, 'జయించు+ఇంచు' అని యుండగా, జయించు అనునది ఇంచుగాగమము చేరికతో తత్సమధాతువైనది. కాని సంస్కృతధాతువు కాదు. కావున అచట అవుగాగమము రాదు. జయింపించు. ఇట్లే ఇతరములు.

'అగు' అనుటచే ఈఆగమములు నిత్యము. కావున ఆగమములు రాని రూపములు ఉండవు.

## 65. నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు.

**నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు. నిర్జించు – నుతించు – స్తుతించు. ఈజ్ఞాపకంబుచేతనె నామంబులకు ధాతుత్వవివక్షయం దించుగాగమం బగు నని యెఱుంగునది. శయనించు – పయనించు.**

నామములు అనగా నామధాతువులు. నామము అనగా ప్రాతిపదికము.

ప్రాతిపదికము ధాతువు కాదు. కాని ధాతువుగా చెప్పదలచుకొన్నపుడు నామములు ధాతువు లగును. అవి నామధాతువులు. వానికి ఇంచుగాగమము పరముగా ఉన్నపుడు 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనుసూత్రముచే సంస్కృతధాతువుల చివరి 'ఇ' కారమునకు అయుగాగమము వచ్చును. ఆఅయుగాగమము నిర్జి ('నిర్' అనుఉపసర్గ పూర్వమందు గలిగిన జి) ధాతువునకును, నామధాతువులకును చివర గల ఇకారమునకు రాదు.

నిర్జి అనుధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అను సూత్రముచే ఇంచుక్కు వచ్చి, నిర్జి+ఇంచు అని ఉండగా, 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనుసూత్రముచే ఆయుగాగమము రావలసి యుండగా ప్రస్తుతసూత్రము నిషేధించుటచే రాదు. సంధి జరిగి (సంధి. 11), 'నిర్జించు' అని అగును. ఇట్లే నుతి+ఇంచు – నుతించు.

'నిర్జి' అని నిరుపసర్గపూర్వకముగా నిర్దేశించుటచే ఆఉపసర్గ లేనపుడు ఆయుగాగమమునకు నిషేధము లేదు. జి+ఇంచు=జయించు.

'నిర్జికి' అనుటచే ఇతరముల కీనిషేధము లేదు. నిర్ణయించుచున్నాఁడు. '

'నామంబులకు' అనువిశేషవచనముచే పయనించు, శయనించు మొద లగునామములపై ధాతుత్వవివక్షలో ఇంచుక్కు.

**66. సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు.**

**అ ఏ ఓ ఈమూఁడును గుణంబులు నాఁబడు. ఋస్థానికం బగు గుణంబు రపరం బయియుండు. సంస్కృతధాతూపధలకు ఇ, ఉ, ఋ అనువానికి సొరిదిని ఏ, ఓ, అర్ అనునవి యించుక్కు పరం బగునపు డగు నని యెఱుంగునది. ఛిద్ – ఛేదించు. భిద్ – భేదించు. ఘుష్ – ఘోషించు, పుష్–పోషించు. వృష్ – వర్షించు. హృష్ – హర్షించు.**

ఉపధ అనగా తుదివర్ణమునకు ముందువర్ణము. అ–ఏ–ఓ అను మూడు వర్ణములకు గుణములు అని సంజ్ఞ. 'ఇకో గుణవృద్ధీ' అనుఆద్యపరిభాషచే గుణము విధించినచోట అది ఇఉఋులకే వచ్చును. ఇకారమునకు ఏకారమును, ఉకారమునకు ఓకారమును కాగా, ఋకారముయొక్క స్థానమున వచ్చు 'అ' అనుగుణము రేఫతో గూడి 'అర్' అని యుండును.

1) ఇంచుక్కు పరముగా ఉన్నపుడు సంస్కృతధాతువులలో చివరినుండి రెండవవర్ణ మైనహ్రస్వ మగుఇకారముయొక్క స్థానమున 'ఏ'కారము ఆదేశముగా వచ్చును. ఛిద్ అనుధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు'

అనుసూత్రముచేత ఇంచుక్కు వచ్చి, ఛిద్+ఇంచు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ఇకారమునకు ఏకారము వచ్చి, ఛేద్+ఇంచు=ఛేదించు అని అగును.

2. ఇంచుక్కు పరముగా ఉన్నపుడు సంస్కృతధాతువునందు ఉపధ అయిన హ్రస్వ మగుఉకారముయొక్క స్థానమునందు 'ఓ'కారము ఆదేశముగా వచ్చును. పుష్+ఇంచు=పోషించు.

3. ఇంచుక్కు పరముగా ఉన్నపుడు సంస్కృతధాతువునందు ఉపధ యైన ఋకారముయొక్క స్థానమున 'అర్' అనునది ఆదేశముగా వచ్చును. వృష్+ఇంచు వర్ష్+ఇంచు=వర్షించు.

'లఘు' అనుటచే గురూపధలకు రాదు. పీడ్+ఇంచు=పీడించు, ఊహ్+ఇంచు=ఊహించు. మొ.

'ఉపధలకు' అనుటచే ఉపధ గానిచో రాదు. జి+ఇంచు 'ఇఉఋల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనుసూత్రముచే, జయించు.

'సంస్కృతంబునకు, ఇంచుక్కు పరం బగునపుడు' అనుట స్పష్టతకె.

ఆచ్ఛికధాతువులు హలంతములు లేవు. కావున ఇఉఋలు ఉపధలుగా ఆచ్ఛికధాతువులం దుండవు. సంస్కృతధాతువులకు ఇంచుక్కు తప్పక వచ్చును. కావున ఇంచుక్ భిన్నము పరము గాదు. ఈగుణముచే గురుమంతము లగు ఈధాతువులకు పైని ఇంచుక్కునకు 'గురువిరహితంబు లయి' అనుసూత్రముచే ఇయుడాగమము రాదు. లిఖియించు, భుజియించు, ధరియించు అని ఐనట్లుగా ఛేదియించు, పోషియించు, వర్షియించు అని కాదు.

**67. స్పృశికి గుణంబు విభాష నగు.**

**స్పర్శించు - స్పృశించు.**

'ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే' అనులక్షణమును అనుసరించి స్పృశ్ అనుధాతువు ఇగంతముగా స్పృశి అని నిర్దేశింపబడినది. 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనుసూత్రముచే నిత్యముగా రావలసియున్నగుణము స్పృశ్ అనుధాతువునకు వికల్పముగా వచ్చును.

'స్పృశికి' అనుటచే వే రొకధాతువున ఈవిధి వర్తింపదు. వృష్+ఇంచు= వర్షించు.

స్పృశ్ అనుధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, స్పృశ్+ఇంచు అని ఉండగా 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనుసూత్రముచే

నిత్యముగా గుణము ఆదేశము కావలసియుండగా దానిని బాధించి, ప్రస్తుతసూత్రముచే వికల్పముగా వచ్చును. గుణము వచ్చిన స్పర్శ్+ఇంచు - స్పర్శించు అని అగును. విభాష అనుటచే గుణము రానిపక్షమునందు స్పృశ్+ఇంచు=స్పృశించు అనియె అగును.

**68. లిఖభుజరుచకృశంబులకు గుణంబు లేదు.**

**లిఖించు - భుజించు - రుచించు - కృశించు. కుచ ధాతువునకు గుణంబు లే దని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు.**

లిఖ్, భుజ్, రుచ్, కృశ్ అనుధాతువులయందలిఉపధలకు రావలసిన గుణఆదేశము రాదు. 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనుసూత్రముచే లిఖ్ ధాతువునందలిఇకారమునకు ఏకారమును, భుజ్, రుచ్ అనుధాతువులయందలిఉకారమునకు ఓకారమును, కృశ్ అనుధాతువులోనిఋకారమునకు 'అర్' అనునదియు రావలసియున్నది. ప్రస్తుతసూత్రము వానిని నిషేధించుచున్నది.

లిఖ్ధాతువుపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, లిఖ్+ఇంచు అని యుండగా, 'సంస్కృతంబునకు లఘూపధంబునకు' అనుసూత్రముచే రావలసినగుణము (ఏకారము) ప్రస్తుతసూత్రముచే నిషేధింప బడినది. కావున గుణము (లేఖించు) రాక, 'లిఖించు' అనియె ఉండును. ఇట్లు భుజించు మొ.

'లిఖభుజరుచకృశంబులకు' అనుటచే ఇట పేర్కొన్నవానిలో లేనిధాతువునకు ఈనిషేధము వర్తింపదు. సంకోచించు.

**69. సృజికి నిర్మితిని గుణంబు లేదు.**

**చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయంబుల విసర్జించె.**

సృజ్ అనుధాతువు ఇగంతముగా నిర్దేశింపబడినది. నిర్మాణము అనుఅర్థమునందు 'సృజ్' అనుధాతువునకు గుణము రాదు.

సృజ్ ధాతువుపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, సృజ్+ఇంచు అని ఉండగా 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనుసూత్రముచే ఋకారమునకు రావలసిన అర్ అనుగుణము ప్రస్తుతసూత్రముచే రాదు. కావున 'సృజించు' అనియె ఉండును.

'నిర్మితిని' అనుటచేత నిర్మాణము అనుదానికంటె వే రయినఅర్థమునం

దున్నపుడు గుణమునకు నిషేధము లేదు.

'విడుచు' అనుఅర్థమున వి సృజ్ అనుధాతువునకు ఇంచు చేరి, విసృజ్+ఇంచు అని ఉండగా 'సంస్కృతంబునకు లఘూపధంబునకు' అనుసూత్రముచే ఋకారమునకు 'అర్' అనునది వచ్చి, 'విసర్జించు' అని అగును.

'సృజికి' అనుటచే ఇతరమునకు ఈనిషేధము వర్తింపదు.

**70. సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు.**

**వచింపించు-వచింపించు-ఆవులింపించు-వండించు-పండించు.**

'ధాతువునకు' (క్రియ. 1) అన్ని విధము లయినధాతువులకును ప్రేరణార్థము నందు ఇంచుక్ అనుఆగమము వచ్చును. 'ఇంచుక్' అనుటచే కకారము ఇత్తు. కిత్తు అయిన 'ఇంచు' అనునది ధాతువునకు చివర ఆగమముగా వచ్చును.

వండు అనుధాతువునకు 'వండునట్లుగా చేయు' అనువిధముగా ప్రేరణార్థము నందు ప్రస్తుతసూత్రముచే 'ఇంచు' చేరి (వండు+ఇంచు) సంధి జరిగి (సంధి. 11) వండించు అని అయినది. వండు - వండెను అనగా తానై వండెను అని అర్థము. కాగా వండించెను అనగా తాను వండక ఇతరుని ప్రేరేపించెను - వండునట్లు చేసె నని అర్థము స్పష్టమె.

'సర్వంబునకు' అనుటచే సంస్కృతధాతువులకు ఆచ్ఛికధాతువులకు అన్నింటికి ప్రేరణమునందు ఇంచు వచ్చును. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రము మొదలుకొని ఇంతకు పూర్వసూత్రమువఱకు సంస్కృతధాతువులకే కార్యములు విధింపబడినవి. ఆచ్ఛికధాతువులకు గూడ ఈకార్యము వచ్చుటకు 'సర్వంబునకు' అని చెప్పబడినది.

'ప్రేరణంబునందు' అనుటచే స్వార్థమునం దీసూత్రముచే ఇంచుక్కు రాదు. వండు అనుఅర్థమున 'వండించు' అని కాదు.

**71. రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు.**

**రంజిల్లు-భాసిల్లు-వర్ధిల్లు-విలసిల్లు-రాజిల్లు, ఈయాదేశయోగంబున భిదాదు లకర్మకంబు లగు. భేదిల్లు-కంపిల్లు-సంధిల్లు.**

రంజ్ (ఆది) మొద లగునవి రంజాదులు. 'సబిందుకము' అనగా బిందువు (ఇచట నిండుసున్న)తో కూడినది. ద్విరుక్తలకారము అనగా రెండుసార్లు ఉచ్చరింపబడినలకారము. 'ల్ల్' అనునది. రంజ్ మొద లగుధాతువులకు స్వార్థమునందు పరముగా ఉన్న ఇంచుగాగమమునందు నిండుసున్నతో

కూడినచకారపుపొల్లు ('ంచ్') స్థానమున 'ల్ల్' అనునది ఆదేశముగా వచ్చును.

రంజ్ ధాతువుపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, రంజ్+ఇంచు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ఇంచులోని 'ంచ్' అనుదానికి 'ల్ల్' వచ్చి, రంజ్+ఇంచ్+ఉ = రంజ్+ఇల్ల్+ఉ = రంజిల్లు అని అగును.

'రంజాదులకు' అనుటచే రంజ్ మొద లగువానిలో చేరనిధాతువుపై ఈ కార్యము లేదు. రచించు, భుజించు మొ.

'అప్రేరణంబున' అనుటచే ప్రేరణమునందలిఇంచుక్కునకు ఈకార్యము లేదు. రంజ్+ఇంచు అనుదానిపై ప్రేరణమునందు ఇంచుక్కు వచ్చి, రంజ్+ఇంచు+ఇంచు అని యుండగా 'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' అనుసూత్రముచే స్వార్థమునం దయినఇంచుక్కు లోపించి, రంజ్+ఇంచు అని యుండును. ఇచట ఉన్న ఇంచు ప్రేరణమున వచ్చినది కావున దీనికి ద్విరుక్త లకారము లేదు. రంజించు అని ప్రేరణమునను రంజిల్లు అని స్వార్థమునను రూపము లగును.

## 72. ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు. లాదేశంబున కపవాదంబు. రంజించు - భేదించు - సంధించు.

రంజ్ మొద లగునవి రంజాదులు. రంజ్ మొద లగుధాతువులకు ప్రేరణార్థము నందు వచ్చిన ఇంచుక్కు పరముగా నుండగా అంతకు మునుపు స్వార్థమునందు ఆగమ మయి, ఉన్న (మొదటి) ఇంచుక్కునకు లోపము వచ్చును.

రంజ్ ధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, రంజ్+ఇంచు అని యుండగా ప్రేరణమున 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచు వచ్చి, రంజ్+ఇంచు+ఇంచు అని యుండగా 'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున దిరుక్తలకారం బగు' అనుసూత్రముచే స్వార్థమునందు వచ్చిన మొదటిఇంచుక్కులో 'ంచ్' కు "ల్ల్" రావలసియుండగా దానిని బాధించి ప్రస్తుతసూత్రముచే స్వార్థేంచుక్కు లోపింపగా, ఈప్రేరణమునం దయినఇంచుక్కు మిగిలి, రంజ్+ఇంచు=రంజించు అని అగును.

'ఇంచుక్కు పరం బగునపుడు' అనుటచే ప్రేరణేంచుక్కు పరముగా లేనపుడు స్వార్థేంచుక్కునకు లోపము రాదు. రంజ్+ఇంచు = రంజిల్లు.

'రంజాదు' లనుటచే రంజాదులలో చేరనివానిపైని స్వార్థేంచుక్కు లోపింపదు. భుజ్+ఇంచు+ఇంచు = భుజింపించు.

**73. చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలదరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు.**

**పూను-పూనుచు-పూనించు. తేలు-తేలుచు-తేలించు.**

**మగడు-మగుడుచు-మగిడించు. కుదురు-కుదురుచు-కుదిరించు.**

**విను - వినుచు. వక్ష్యమాణంబు పుగాగమంబు. వినిపించు.**

**బాహుళకంబుచేఁ గొన్నిటికిఁ జుగాగమంబు లేదు.**

**అను - అనిపించు. తిను - తినిపించు.**

**కను - కనిపించు. దీనియత్వంబునకు దీర్ఘంబు నగు. కానిపించు.**

'ధాతువునకు' (క్రియ. 1.) వే రొకహల్లుతో కూడని న, ల, డ, ర అనునవి చివర కలిగినఆచ్ఛికము అయినధాతువునకు ప్రేరణమునందు చుక్ అను ఆగమము బహుళముగా వచ్చును. 'చుక్' అనుచోట కకారము ఇత్తు. కిత్తు అయిన 'చు'వర్ణము ధాతువునకు చివర వచ్చి చేరును.

పూను అనుధాతువునకు ప్రేరణార్థమునందు ప్రస్తుతసూత్రముచే చుగాగమము వచ్చి 'పూనుచు' అని అగును. లడాదులు దీనిపై వచ్చును. పూనుచున్నాఁడు. పూనిచెను మొ. బహుళము అనుటచే చుగాగమము రానిపక్షమునందు 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, సంధి జరిగి, పూనించు అని అగును. పూనించుచున్నాఁడు మొ.

సంస్కృతధాతువుల కన్నింటికి స్వార్థమునందు ఇంచుక్కు వచ్చును. కావున నలడరాంత మగుసంస్కృతధాతువు ఉండదు.

'అసంయుక్త' అనుదళముచే సంయుక్తము లైననలడరాంతములకు ఈకార్యము లేదు. తన్ను - తన్నించు మొ.

'నలడరాంతంబునకు' అనుటచే చివర నలడరలు లేనిధాతువునకు చుగాగమము రాదు. చదువు-చదివించు. కలుగు-కలిగించు. మొ.

'ప్రేరణంబున' అనుటచే స్వార్థమునందు చుగాగమము లేదు. పూనుచున్నాడు, కుదిరెను మొ. 'బహుళము' అనుటచే కొన్ని ధాతువులకు చుగాగమము రాదు. అను-అనిపించు, పొరలు-పొరలించు మొ.

**74. అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు.**

**మాను - మానుపు, మానుచు.**

**మను - మనుపు, మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.**

మాను (ఆది) మొద లగునవి మాన్వాదులు. 'అట్లు' అనగా 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనుపూర్వసూత్రము ననుసరించి 'ప్రేరణంబునందు బహుళముగా' అని అర్థము. మాను మొద లగుధాతువులకు ప్రేరణమునందు పుక్ అనుఆగమము కూడ బహుళముగా వచ్చును. పుక్ అనుచోట కకారము ఇత్తు. కిత్తు అయిన పువర్ణము మాను మొద లగువానికి చివర చేరును.

మాను అనుధాతువునకు ప్రేరణమునందు ప్రస్తుతసూత్రముచేత పుగాగమము వచ్చి 'మానుపు' అని అగును. మానుపుచున్నాఁడు మొ. పుగాగమము రానిపక్షమునందు 'చుగాగమం బాచ్ఛికంబునకు' అనుసూత్రముచే చుగాగమము వచ్చి 'మానుచు' అని అగును. మానుచున్నాఁడు మొ. చుక్కు రానిపక్షమునందు 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి (మానిపించు) మానించు' అని అగును. మానించుచున్నాఁడు మొ.

'పుగాగమంబును' అనుచోటి సముచ్చయార్థక మైన'ను'శబ్దముచే మాను మొద లగువానికి చుగాగమమును వచ్చును. 'మాన్వాదులకు' అనుటచే మాను మొద లగువానిలో చేరనిధాతువునకు పుగాగమము రాదు. పూనుచు-పూనించు మొ.

**75. చుక్పువర్ణంబులు పరంబు లగునపు డిత్వంబున కుత్వం బగు.**

చుగాగమమును, 'పు' అనువర్ణమును పరముగా ఉన్నపుడు దానికి పూర్వమునం దున్నధాతువు చివరిఇకారముయొక్క స్థానమున హ్రస్వ మగుఉకారము ఆదేశముగా వచ్చును.

'బిగియు' అనుధాతువునకు ప్రేరణమునందు చుగాగమము వచ్చి, చివరి అక్షరము లోపింపగా (క్రియా. 76) బిగి+చు అని ఉండును. ప్రస్తుతసూత్రముచే ధాతువుచివరిఇత్వమునకు ఉత్వము వచ్చి, 'బిగుచు' అని అగును. ఇట్లె పుగాగమము పర మైనపుడు తనియు+పు - తని+పు (క్రియా. 76) ప్రస్తుతసూత్రముచే ఉత్వ మయి, తనుపు (తనుపుచున్నాఁడు) మొ.

'చుక్పుర్ణంబులు' అనుచో చుక్కువలె 'పు' వర్ణమును కిత్తుగా నిర్దేశింపక పోవుటచే కిత్తు కానిపువర్ణము పర మైనపుడును ఇత్వమునకు ఉత్వము వచ్చును. తనియు ధాతువుపై 'పువర్ణంబు మాయ్వాదుల కగు' అనుసూత్రముచే 'పు' అను

కృత్ ప్రత్యయము రాగా (తనియు+పు) యువర్ణము లోపించి (కృ. 2), తని+పు అనుచో ప్రస్తుతసూత్రముచే ఉత్వము వచ్చి, తనుపు అని యగును. 'ఇత్వంబునకు' అనుటచే మాయు-మాపు ఇత్యాదులలో ఇత్తుకంటె భిన్న మైనఅచ్చునకు ఉత్వము లేదు.

**76. అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్వాదుల కగు నగుచో వానికడవ్రాలు లోపించు.**

**అడఁగు - అడఁచు, అడఁగించు, మాయు - మాపు, మాయించు.**

**అడఁగు కరఁగు కలఁగు నలఁగు బిగియు ఇత్యాదు లడంగ్వాదులు.**

**ఉడుగు కడచు కుడుచు ఇత్యాదులు మాయ్వాదులు.**

**అఁగు ప్రభృతు లుభయగణంబులు.**

**బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్చుక్పుగాగమంబులు మూఁడును,**

**గొన్నింటి కందు యథాసంభవంబుగా రెండును,**

**గొన్నింటి కొక్కటియు నగు నని యెఱుంగునది.**

**అఁగు-ఆఁచు, ఆఁపు, ఆఁగించు. రేఁగు - రేఁచు, రేపు, రేఁగించు.**

**పాయు - పాచు, పాపు. విఱుగు - విఱుచు.**

**చూచు-చూపు. నేరుచు-నేరుపు. మేయు-మేపు. లేచు-లేపు. కలియు-కలుపు. తడియు-తడుపు. తెలియు-తెలుపు ఇత్యాదు లెఱుంగునది.**

అడంగు (అది) మొద లగునవి అడంగ్వాదులు, మాయు (ఆది) మొద లగునవి మాయ్వాదులు. చుక్, పుక్, అనుచో కకారములు ఇత్తులు. కిత్తులు అయిన చు, పు, వర్ణములు ధాతువులకు చివర చేరును. 'అట్లు' అనగా 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనుసూత్రము ననుసరించి 'ప్రేరణమున బహుళముగా' అని అర్థము సిద్ధించును. వ్రాయి అనగా వర్ణము. ప్రేరణమునందు అడఁగు మొద లగు ధాతువులకు చివర 'చు' అనువర్ణము బహుళముగా ఆగమముగా వచ్చును. అపుడు అడఁగు మొద లగువానిలో చివరియక్షరము లోపించును.

అడఁగు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే ప్రేరణమునందు చువర్ణము వచ్చి (అడఁగు+చు), చివరి దగు 'గు'వర్ణము లోపింపగా, అడఁచు అని యగును. అడఁచుచున్నాఁడు. బహుళముగా గావున చుగాగమము రానిపక్షమునందు 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి 'అడఁగించు' అని అగును.

2. ప్రేరణమునందు మాయు మొద లగుధాతువులకు చివర 'పు' అను వర్ణము బహుళముగా చేరును. పువర్ణము వచ్చినపుడు మాయు మొద లగువానిలో చివరిఅక్షరము లోపించును.

మాయు అనుధాతువుపై ప్రేరణమున ప్రస్తుతసూత్రముచే పువర్ణము చేరి (మాయు+పు), చివరి దగుఉవర్ణము లోపింపగా, 'మాపు' అని అగును. మాపు చున్నాఁడు. బహుళము కావున పుగాగమము రానపుడు 'సర్వంబునకుం బ్రేరణంబునందు' అని ఇంచుగాగమము వచ్చి 'మాయించు' అని అగును.

1. బహుళము అనుటవలన ఆఁగు మొద లగువానిలో కొన్నింటికి, చుక్, పుక్, ఇంచుక్ అనునవి మూఁడును వచ్చును. ఆఁగు=ఆఁచు, ఆఁపు, ఆఁగించు

2. ఆఁగు మొద లగువానిలో కొన్నింటికి, చుక్, పుక్, ఇంచుక్ అనుమూఁడిటిలో రెండు మాత్రమె వచ్చును. పాయు ధాతువునకు చుక్, పుక్ అనునవి రెండే వచ్చును. పాచు, పాపు.

3. ఆఁగు మొద లగువానిలో కొన్నింటికి ఒక్కఆగమము మాత్రమె వచ్చును. విఱుగునకు చుగాగమ మొక్కటె. విఱుచు. చూచునకు – పుగాగమము ఒక్కటె. చూపు. మొ.

'అడంగ్వాది' అనుటచే అడంగ్వాదులలో లేనిధాతువునకు చుగాగమము లేదు. వండు – వండించు. మొ.

'మాయ్వాదులకు' అనుటచే మాయ్వాదులలో చేరనిధాతువునకు పుగాగమము లేదు. వండు–వండించు. మొ.

'అగుచో' అనుటచే చుక్పుక్కులు పర మైనపుడే తుదిఅక్షరము లోపించును. ఇంచుక్కు పర మైనచో లోపము లేదు. అడఁగించు, మాయించు మొ.

**77. ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశ లోపంబులు పెక్కుతెఱంగులం గానంబడియెడి.**

**అగు–కావించు; వచ్చు–రావించు, రప్పించు; విన్నపము–విన్నవించు; మోఁకాలు–మోఁకరించు; కేక–కేకరించు; పలవ–పలవరించు, పలవించు; ఆల– ఆలకించు, ఆలించు; ప్రక్క– ప్రక్కలించు; నొచ్చు– నొంచు, నొప్పించు, ఉండు– ఉనుచు, ఉంచు; డిగు– డించు, డిగించు; పెరుఁగు – పెనుచు, పెంచు, తునుగు– త్రుంచు, మునుఁగు– ముంచు, మునుచు; మొగుడు– మొగుడుచు, మొగుచు, మోడుచు, మొగిడించు; చొచ్చు– చొనుపు, చొప్పించు; చినుఁగు– చించు, చింపు; తెగు–త్రెంచు, త్రెంపు;**

**తిరుగు-త్రిప్పు; చచ్చు-చంపు; నిలుచు-నిలువరించు, నిలుపు; కొను-కొలుపు; పోవు-పుచ్చు, పనుచు, పంచు, పనుపు, పంపు, అనుచు, అంచు, అనుపు, అంపు; అనుప్రయుక్తం బగుపోవునకుఁ బుచ్చుమాత్రం బగు. మోసపోవు- మోసపుచ్చు ఇత్యాదు లెఱుంగునది.**

'ధాతువునకు' (క్రియ. 1) స్వార్థమునందును, ప్రేరణార్థమునందును వచ్చునట్టి ఇంచుగాగమము పర మయినపుడును, ప్రేరణార్థమునందు వచ్చుచుగాగమము, పుగాగమము పర మగునపుడును, పూర్వమునందలిఆచ్ఛికధాతువునకు ఆయావర్ణములు ఆగమముగా వచ్చుటయు, ఆదేశముగా వచ్చుటయు, లోపించుటయు, అనుమార్పులు అనేకవిధములుగా కనబడుచున్నవి. చుక్పుగాగమములసాహచర్యముచే ఇంచుక్కు పర మైనపుడు సైతము ఈకార్యము ఆచ్ఛికధాతువులందే అగును.

ఆల-ఆలకించు, ఆలించు. అంగలాదులలోని దయిన 'ఆల' అనుధాతువునకు స్వార్థమునం దయిన (క్రియా. 63) ఇంచుక్కు పరముగా ఉండగా, కకారము వికల్పముగా ఆగమ మగును. ఆలకించు - ఆలించు. ప్రేరణమునందు వచ్చిన (క్రియా. 76) ఇంచుక్కు పరముగా ఉండగా అనుధాతువు మొత్తమునకు 'కావ్' అనునది ఆదేశ మయి, కావించు అని అగును. వచ్చునకు రావ్, రప్ప్ అనునవి వచ్చి, రావించు, రప్పించు అని అగును. మొగుడు ధాతువునకు ప్రేరణమున చుగాగమము వచ్చి (క్రియా. 73) డువర్ణము లోపించి, మొగుచు అని అగును. గువర్ణము లోపించి మొదట దీర్ఘ మై, మోడుచు అని అగును. మొగుడుచు, మొగిడించు అనునవి సాధారణముగా ఏర్పడును. పొవునకు చుక్పుక్కులు చేరగా పుచ్చు పనుచు మొదలుగా అనేకరూపముల లేర్పడుచున్నవి.

'కానంబడియెడి' అనుటచే ఇట్టిఆగమాదేశలోపములను కవిప్రయోగముల నుండి గ్రహింపవలయును.

**78. అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు మానునకు విభాష నగు.**

**అనిపించు. అను, కను, తిను, విను. మానిపించు - మానించు.**

అను (ఆది) మొద లగునవి అన్వాదులు. అను, విను, కను, మొద లగునవి. వీనికి ప్రేరణమునందు మాత్రమే ఇంచుక్కు వచ్చును. 'పుక్+ఆగమ' అనుచోట కకారము ఇత్తు. పువర్ణములో ఉకారము ఉచ్చారణసౌకర్యమునకై చేర్పబడినది. కావున పకారపుపొల్లు ఆగమ మగును. అది కి త్తయినది. కావున ధాతువునకు చివర చేరును. ప్రేరణార్థమునందు వచ్చు 'ఇంచు' పరముగా ఉండగా అను

మొద లగుధాతువులకు చివర పకారపుపొల్లు ఆగమముగా వచ్చును. మాను అనుధాతువునకు చివరపకారపుపొల్లు వికల్పముగా వచ్చును.

అనుధాతువుపై 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, అను+ఇంచు అని యుండగా ప్రస్తుతసూత్రముచే ధాతువునకు చివర పకారము చేరి అనుప్+ఇంచు. అనుపించు అని అగును. పిదప ధాతువునకు ఇత్వము వచ్చి (క్రియా. 85) అనిపించు అని అగును. అన్వాదులకు పుగాగమము నిత్యము. కావున పుగాగమము రాని 'అనించు' అనువిధ మైనరూపము లుండవు.

మాను అనుధాతువునకు పుగాగమము వికల్పము. కావున పకారము వచ్చిన పక్షమునందు 'మానిపించు' అనియు, రానిచో 'మానించు' అనియు అగును.

'అన్వాదులు' అనుటచే ఇచటి అనుమొద లగువానిలో చేరనిధాతువునకు అనుటచే అది పరము గానపుడు ఈకార్యము లేదు. అనుచున్నాడు.

**79. అడ్డాదుల కించుక్కు పరం బగునపుడు గుగాగమం బగు నప్పాదులకు విభాష నగు.**

**అడ్డము - అడ్డగించు. అడ్డము-ఓర-చిత్తము-పంతము-పెల్ల-బోర-మట్టము-మేళము ఇత్యాదు లడ్డాదులు.**

**అప్ప-అప్పగించు,అప్పించు. అప్ప-ఒప్ప-పల్లము-కోపము. ఇవి యప్పాదులు.**

అడ్డ (ఆది) మొద లగునవి అడ్డాదులు. అడ్డము ఓర మొద లగునవి. అప్ప (అది) మొద లగునవి అప్పాదులు. అప్ప ఒప్ప పల్లము కోపము అనునాల్గును అప్పాదులు. 'గుక్+ఆగమ' అనుచోట కకారము ఇత్తు. గువర్ణమునందలిఉకారము ఉచ్చారణసౌకర్యమునకయి చేర్పబడినది. పొల్లుగకారము మాత్రమె ఆగమ మగును. ఇది కిత్తు. కావున ధాతువునకు చివర చేరును. అడ్డాదులును, అప్పాదులును ఆచ్ఛికధాతువులు, నామధాతువులును. వీనికి స్వార్థమునందు ఇంచుక్కు ముందుగా వచ్చును. ఇట్లు స్వార్థమునం దయినఇంచుక్కు పరముగా ఉండగా అడ్డ మొద లగుధాతువులకు చివర గకారము నిత్యముగా వచ్చి చేరును. అప్ప మొద లగువానికి చివర గకారము వికల్పముగా ఆగమ మగును.

అడ్డ(ము) అను(నామ) ధాతువుపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే 'ఇంచు' ఆగమ మై, అడ్డ+ఇంచు అని యుండగా ప్రస్తుత సూత్రముచేత గుగాగమము వచ్చి 'అడ్డగించు' అని అగును. అడ్డగించుచున్నాఁ

డు. మొ. అడ్డాదులకు గుగాగమము నిత్యము. కావున అడ్డించు అనువిధముగా గుగాగమము లేనిరూపము లుండవు.

అప్ప మొద లగువానికి గుగాగమము వికల్పము. గుగాగమము వచ్చిన పక్షమునందు – అప్పగించు. రానియెడల – అప్పించు.

'అడ్డాదులు' అనుటచే అడ్డ మొద లగువానిలో (ఇట్లె అప్పాదులలో) చేరని ధాతువునకు గుగాగమము రాదు. అంగలించు మొ.

'ఇంచుక్కు పరం బగునపు' డనుటచే అది పరము గానపు డీకార్యము లేదు. అడ్డము.

**80. ఆడోడుకూడుల డకారంబునకుం జుక్కు పరం బగునపుడు రేఫం బగు.**

**ఆడు – ఆరుచు, ఆడించు. ఓడు – ఓరుచు, ఓడించు.**

**కూడు – కూరుచు, కూడించు.**

ఆడోడుకూడులు అనగా ఆడు, ఓడు, కూడు అనుధాతువులు. వీనికి ప్రేరణమునందు 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనుసూత్రముచే చుగాగమము వచ్చును. ఈచుగాగమము పరముగా ఉండగా ఆడు, ఓడు, కూడు అనుధాతువులయందలి డకారపుపొల్లుస్థానమున రేఫము (ర్) ఆదేశముగా వచ్చును.

'ఆడు' అనుధాతువునకు ప్రేరణార్థమున 'చుగాగమం బాచ్ఛికంబునకు' అను సూత్రముచే చుగాగము వచ్చి, ఆడు+చు అని ఉండగా ప్రస్తుతసూత్రముచే డకారమునకు రేఫ మ్మై, 'ఆరుచు' అని అగును.

'ఆడోడుకూడులకు' అనుటచే వే రొకధాతువునకు ఈకార్యము లేదు. పూడు – పూడుచు మొ.

'చుక్కు పరం బగునపుడు' అనుటచే ఇతరము పర మైనపుడు రేఫము లేదు. చుగాగమము రానిపక్షమునందు 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చిన ఆడించు, ఓడించు, కూడించు అని అగును. ఇచట ఆరించు ఇత్యాదిగా రేఫముతో రూపము ఉండదు.

'చుక్కు' అనుచో కిత్తుగా నిర్దేశించుటచే కిత్తు కాని చువర్ణము పర మైనపుడు రేపము రాదు. ఆడుచున్, ఓడుచున్, కూడుచున్ మొ. ఇచట శత్రర్థక మైనచువర్ణకము పరముగా నున్నపుడు రేఫము రాలేదు.

## 81. చెడునకు జుక్పుగాగమంబులును డా కలఘురేఫంబు నగు.

**చెఱుచు - చెఱుపు**

అలఘురేఫము అనగా శకటరేఫము (బండి ర) చుక్, పుక్+ఆగమ- అనుచో కకారములు ఇత్తులు. కిత్తులైన - చు, పువర్ణములు 'చెడు'నకు చివర చేరును.

చెడు అనుధాతువునకు ప్రేరణార్థమునందు చుగాగమమును, పుగాగమమును వచ్చును. ధాతువునందలిడకారపుపొల్లుయొక్క స్థానమునందు శకటరేఫము ఆదేశముగా వచ్చును.

'చెడు' అనుధాతువునకు ఈసూత్రముచేత చుగాగమము వచ్చి, డకారము స్థానమున 'ఱ' కారము వచ్చి, చెఱుచు అని అగును. పుగాగమము వచ్చిన పక్షమునందు- డకారపుపొల్లునకు శకటరేఫము వచ్చి, చెఱుపు అని అగును. చెఱుచుచున్నాఁడు, చెఱిచెను మొ.

'చెడునకు' అనుటచే ఇతరధాతువునకు ఈకార్యము లేదు. మగుడుచు.

'చుక్పుగాగమంబులు' అని ప్రత్యేకముగా చెప్పుట ననుసరించి 'చెడు' ధాతువునకు ఇంచుగాగమము లేదు. చెడించు అని ఉండదు.

'చుక్పుగాగమంబులును, అలఘురేఫంబును' అనుచోటిసముచ్చయార్థక నుశబ్దములచే రెండును కలిసియె వచ్చును. కావున చుక్పుక్కులు వచ్చి అలఘురేఫము రాకుండుట గాని (చెడుచు, చెడుపు), అలఘురేఫము వచ్చి చుక్పుక్కులు రాకుండుట గాని (చెఱు) జరుగదు.

## 82. పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు.

**పఱచు.**

అలఘురేఫము అనగా శకటరేఫము (ఱ) 'చుంకుక్' అనుదానియందలి'క'కారము ఇత్తు. కిత్తు అయిన 'చు'వర్ణము 'పడు'నకు చివర వచ్చిచేరును. 'పడు' అను ధాతువునకు ప్రేరణార్థమునందు చు(క్) అనుఆగమము వచ్చును. అపుడు పడు ధాతువులోనిడకారముపొల్లు స్థానమున ఱకారము నిల్చును.

పడు ధాతువుపై ప్రేరణమున ఈసూత్రముచే చుగాగమ మయి, డకారమునకు శకటరేఫ మై, పఱుచు - పఱచెను మొ.

'చుక్కును' అని చుగాగమమును ప్రత్యేకముగా చెప్పుటచే దీనికి ప్రేరణమున ఇతరాగమములు రావు. పడించు, లేదా పడుపు ఇత్యాదిగా రూపము లుండవు.

'చుక్కను, అలఘురేఫంబును' అనుచోట్ల నున్నసముచ్చయార్థకశబ్దములచే ఇట చెప్పబడిన రెండు కార్యములు (చుగాగమము, డకారమునకు ఱకారము) కలిసియే వచ్చును. ఒకకార్య మయి వేరొకటి రాకుండుట యుండదు. పడుచు, పఱు, అనురీతిరూపము లుండవు.

**83. శబ్దపల్లవం బగుపడున కించుక్కు విభాష నగు నగుచో డాకు లఘురేఫం బగు.**

**వెలువడు - వెలువరించు, వెలువఱుచు.**

**చొప్పడు - చొప్పరించు, చొప్పఱుచు.**

ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునీయవి శబ్దపల్లవంబులు నాఁబడును. ఇట్టిశబ్దపల్లవములయందు చివర ఉన్న 'పడు' ధాతువునకు ప్రేరణార్థమునందు ఇంచుక్ అనుఆగమము వికల్పముగా వచ్చును. ఆఇంచుగాగమము పరముగా ఉండగా పడు ధాతువులోనిడకారపు పొల్లుస్థానమున లఘురేఫము ('ర్') ఆదేశముగా వచ్చును.

పడు ధాతువునకు 'చుగాగమం బాచ్ఛికంబునకు' (క్రియ. 73) అనుసూత్రముచే ప్రాప్పించుచున్న బాహుళకచుగాగమమును బాధించి, 'పడునకుం జుక్కును' (క్రియ. 82) అనుసూత్రముచే నిత్యముగా చుగాగమము వచ్చును. (కావున ఇంచుక్కు రాదు.) పడు ధాతువు శబ్దపల్లవము అయినపుడు మాత్రము ప్రస్తుతవిశేష విధి (క్రియ. 83) పూర్వసూత్రమును బాధించి వికల్పముగా ఇంచుగాగమమును సాధించును. వైకల్పిక మగుటచే ఇంచుగాగమము రానిపక్షమునందు బాధ లేదు కావున పూర్వ (క్రియ. 82)సూత్రముచే చుగాగమము (అలఘురేఫమును) వచ్చును.

వెలువడు అనుధాతువుపై ప్రేరణమునందు ప్రస్తుత(క్రియ. 83) సూత్రముచే ఇంచుగాగమమును, (వెలువడు+ఇంచు). డకారమునకు రేఫమును (వెలువరు+ ఇంచు) వచ్చి. 'వెలువరించు' అని అగును. విభాష కావున ఇంచుక్కు రాని పక్షమునందు 'పడునకుం జుక్కును, డా కలఘురేఫంబు నగు' అనుపూర్వసూత్రము చే చుగాగమమును (వెలువడు+చు), డకారమునకు అలఘురేఫమును వచ్చి, 'వెలువఱుచు' అని అగును.

'శబ్దపల్లవంబు' అనుటచే ప్రత్యేకముగా ఉన్నపడుధాతువునకు ఈకార్యము లేదు. 'పడునకుం జుక్కును' అను(క్రియ. 82)సూత్రముచే చుక్కు (డకారమునకు ఱకారమును) వచ్చును. పఱుచు. ఇంచుక్కు రాదు.

'పడునకు' అనుటచే తదితరమునకు ఈకార్యము లేదు. కూరుచుండఁ

జేసెను. పరుండఁబెట్టెను. మొ.

**84. ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేదు.**

**ఇ ట్లనుటంజేసి ప్రేరణార్థం బయినయితరాగమంబు మీఁదం బ్రేరణార్థేంచుగాగమం బగు నని యెఱుంగునది.**

**నొచ్చు - నొంచు, నొంపించు. చచ్చు - చంపు, చంపించు.**

ప్రేరణార్థమునందు వచ్చినఇంచుగాగమమునకు మీద మఱల ఇంచుగాగమము రాదు.

వండు అనుధాతువుపై 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అను సూత్రముచే ప్రేరణమునందు ఇంచుక్కు రాగా, దానిపై మరల (ప్రేరణార్థమును వివక్షింపగా,) ఇంచుక్కు రాదు. కావున వండింపించు, పండింపింపించు అనువిధ మైనరూపములు ఉండవు.

'ప్రేరణమునందు' అనుటచే స్వార్థమునందు వచ్చినఇంచుక్కుమీద ప్రేరణార్థమునందు ఇంచుక్కు వచ్చుటకు నిషేధము లేదు. భుజించు+ఇంచు- భుజింపించు మొ.

'ఇంచుక్కుమీద' అనుటచే ఇంచుక్కుకంటె భిన్న మయిన 'చుక్, పుక్' అను ఆగమములమీద ప్రేరణార్థమునందు ఇంచుగాగమము వచ్చుటకు బాధ లేదు. నొచ్చు+చు=నొంచు - నొంపించు, చచ్చు+పు-చంపు - చంపించు మొ.

**85. ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయిన యుత్వంబున కిత్వం బగు.**

**నిగుడు - నిగిడి, నిగిడె. మగుడు - మగిడి, మగిడె.**

**ఉడుగు - ఉడిగి-ఉడిగె. - మునుఁగు - మునిఁగి-మునిఁగె.**

ఆద్యము అనగా మొదటిది. న+అద్య - అనాద్యముగా మొదటిది కానిది. ఇత్వము లేదా ఎత్వముతో గూడినవర్ణము తరువాతగా ఉన్నపుడు ధాతువునందు మొదటిది కాని హ్రస్వ మగుఉకారముయొక్క స్థానమున హ్రస్వ మగుఇకారము ఆదేశముగా వచ్చును.

నిగుడు అనుధాతువుపై క్త్వార్థమునందు 'ఇ' ప్రత్యయము వచ్చి, నిగుడి అని కాగా, ప్రస్తుతసూత్రముచే నడుమ నున్నఉత్వమున కిత్వము వచ్చి, నిగిడి అని అగును. ఇట్లే లాట్టులో నిగుడు+ఎడును - నిగుడెడును అని కాగా, ఇత్వము వచ్చి నిగిడెడును అని అగును. నిగిడెడువాఁడు మొ.

'ఇత్వంబు గాని యెత్వంబు గాని' అనుటచే ఇతరస్థలమున రాదు. నిగుడును నిగుడదు మొ.

'అనాద్యం బయిన' అనుటచే మొదటి దైనఉత్వమునకు ఇత్వము రాదు. ముదురు – ముదిరి, కుదురు – కుదిరెడిని మొ.

'ఉత్వంబునకు' అనుటచే ఇతరస్వరమునకు రాదు. విసరు – విసరి, విసరెదు.

పగుల్చి, నిగుడ్చి, ఆవులించి మొద లగుచోట్ల ఈసూత్రముచే రావలసినఇత్వము రాకుండుటయు కలదు.

## 86. ముజ్జీత్తులు ముత్తు నాఁబడు.

'మధ్యమముడుజులు ముజు నాఁబడు' అనుసూత్రము ననుసరించి 'లూణ్మధ్యమవురులకు ముడుజు లగు' అనుసూత్రముచే లూట్టునందు మధ్యమ పురుషలో ఏకవచనబహువచనము లగు ము, డుజు, అనువానికి 'ముజు' అని పేరు. జి అనునది ఇత్తుగా కలిగినది జీత్తు. లజి, కజి, నిజి మొద లగునవి. మధ్యమ'ముడుజు'లకును, జివర్ణము ఇత్తుగా గలవానికిని కలిపి 'ముత్తు' అని సంజ్ఞ. ముజు – చదువుము, చదువుఁడు, జీత్తు – చదువఁడు (లజి), చదువక. (కజి) మొ.

## 87. ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు.

**పచించు – పచింపించు. వచించు – వచింపించు. పిలుచు – పిలిపించు. వలచు – వలపించు. పత్వంబు హెచ్చునకుం గలుగదు. మెచ్చునకు విభాష నగు. హెచ్చించు. మెప్పించు – మెచ్చించు.**

ప్రేరణార్థమునందు వచ్చిన ఇంచుగాగమము పరముగా ఉండగా దానికి పూర్వమున ఉన్న ధాతువు చివరిచకారపుపొల్లుయొక్క స్థానమున 'పకారపుపొల్లు' ఆదేశముగా వచ్చును.

పచధాతువునకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనుసూత్రముచే ఇంచుక్కు వచ్చి, పచించు అని అగును. దానిపై 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనుసూత్రముచేత ప్రేరణార్థమునందు ఇంచుగాగమము రాగా పచించు+ఇంచు అని యుండగా ప్రస్తుతసూత్రముచే మొదటిఇంచుక్కునందలి 'చ'కారముస్థానమున పకారము ఆదేశముగా వచ్చి, – పచింపించు అని అగును.

'ప్రేరణేంచుక్కు' అనుటచే స్వార్థమునం దయినఇంచుక్కు పరముగా ఉన్నపుడు చకారమునకు పకారము రాదు. పచ్+ఇంచు–పచించు. వచ్+ఇంచు–వచించు.

'చకారంబునకు' అని సామాన్యముగా చెప్పుటచే ధాతువునందు సహజముగా

నున్నను, కృతక మైనను చకారమునకు పకారము వచ్చును. వలచు+ఇంచు – వలపించు. వచించు+ఇంచు – వచింపించు. ద్విరుక్త మయినచకారమునకు ద్విరుక్త మయినపకారము వచ్చును. 'తెచ్చు+ఇంచు=తెప్పించు, ఇచ్చు+ఇంచు= ఇప్పించు.

హెచ్చు ధాతువున చకారమునకు పకారము రాదు. హెచ్చించు.

మెచ్చుధాతువులో చకారమునకు పకారము వికల్పముగా వచ్చును. మెప్పించు, మెప్పించు.

**88. ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు.**

**ఆగమంబు. పచింపఁడు – పచింపుము. ఆడఁపఁడు – అడఁపుము.**

**అన్యము. పిలువఁడు – పిలువుము.**

మధ్యమపురుష ఏకవచనమును. బహువచనమును అయిన ము, డుజు అనునవియు, జివర్ణము ఇత్తుగా కలిగిన(లజి, కజి మొ.)వియును 'ముత్తు' అనబడును. అన్య చకార మనగా ఆగమము కానిది. ధాతువులో సహజముగా నున్నది. యథాసంఖ్యముగా అన్వయము.

1. ముత్తు పరముగా ఉన్నపుడు ధాతువు చివర నున్న ఆగమము అయిన చకారపుపొల్లుస్థానమున పకారము ఆదేశముగా వచ్చును.

వచధాతువునకు ఇంచుక్కు వచ్చి (క్రియా. 63 – వచించు) వ్యతిరేకమునందు లజి (క్రియా. 7) వచ్చి, ధాతువునకు అత్వము వచ్చి, (క్రియా. 20. వచించ+ల్) లకారమునకు ప్రథమపురుషైకవచనమునందు డుజు వచ్చి (క్రియా. 8) పచించ+డుజ్ అని కాగా, ప్రస్తుతసూత్రముచే చకారమునకు పకారము ఆదేశ మై 'వచింపఁడు' అని అగును.

2. ముత్తు పరముగా ఉన్నపుడు ధాతువు చివర సహజముగా ఉన్నచకారపు పొల్లుయొక్క స్థానమున వకారపుపొల్లు ఆదేశము వచ్చును.

పిలుచు ధాతువునకు లూట్టునందు (క్రియా. 6. పిలుచు+ల్) మధ్యమపురుషైక వచనమున వువర్ణమును (క్రియా. 8. పిలుచు+వు) వువర్ణమునకు మువర్ణమును (క్రియా. 29) వచ్చి, పిలుచు+ము అని యుండగా ప్రస్తుతసూత్రముచే చకారమునకు వకారము వచ్చి 'పిలువుము' అని అగును.

'ఆగమాన్య' అనుచోటిక్రమముచే ఆగమచకారమునకు వకారము గాని, అన్యచకారమునకు పకారము కాని రాదు. పచింపుము, పిలువుము మొ.

'చకారంబులకు' అనుటచే ఇతరవర్ణములకు ఈకార్యము లేదు. వండుము, తినక మొ.

'అద్విరుక్తంబులకు' అనుటచే ద్విరుక్త మైనచకారమునకు ఈకార్యము లేదు. పుచ్చుక, మెచ్చుఁడు మొ.

'ముత్తు పరం బగునపుడు' అనుటచే ముత్తు గానిది పర మైనపుడు ఈకార్యము లేదు. వచించెను, పిలుచుచున్నవాఁడు మొ.

**89. ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు.**

**తలఁపక-త్రేఁపక-తోఁపక. ఏఁచునకు వైభాషికంబు. ఏపఁక-ఏఁచక. నోఁచునకుం గలుగదు. నోఁచక.**

సిద్ధచకారము అనగా సహజముగా ఉన్నచకారము. మధ్యమముదుజులును, జీత్తులును ముత్తు అనబడును. ముత్తు పరముగా ఉన్నపుడు అరసున్నకు పై నున్న ధాతువునందలి సహజ మైనచకారపుపొల్లుస్థానమున పకారపుపొల్లు తఱుచుగా వచ్చును.

తలఁచు అనుధాతువునకు 'కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనుసూత్రము చేత, కజీ ప్రత్యయము రాగా, 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే అత్వము వచ్చి, తలఁచ+క అని యుండగా ప్రస్తుతసూత్రముచేత చకారమునకు పకారము వచ్చి, 'తలఁపక' అని అగును.

'ఖండబిందువుమీఁది' అనుటచే నిండుసున్నమీద నున్నచకారమునకు పకారము రాదు. కాంచు - కాంచక. అసలు బిందువు లేకున్న వకారము (క్రియ. 88) వచ్చును. పిలుచు - పిలువడు.

'సిద్ధచకారము' అనుటచే సాధ్యము అనగా ఆగమ మైనచకారమునకు పకారము ఈసూత్రముచే రాదు. ఇంక 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు' అనుసూత్రముచే నిత్యముగా పకారము వచ్చును. అడఁచు - అడఁపక మొ.

'ముత్తు పరం బగునపుడు' అనుటచే ముత్తు గానిది పర మయినపుడు వకారము రాదు. తలఁచుచున్నాఁడు మొ.

'ప్రాయికము' అనుటచే ఏఁచు అనుధాతువునందు పత్వము వికల్పముగా వచ్చును. ఏఁపక - ఏఁచక. నోఁచునకు పత్వము అసలు లేదు. నోఁచక.

**90. ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు.**

**ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు. పత్వంబు రానిపక్షమున వక్ష్యమాణతాదేశంబు. ఆకర్ణింతురు - దంతురు - చింతురు.**

లాట్టులోను (22.సూ) ఉభయప్రార్థనమున లూట్టులోను (30.సూ) ధాతువునకు దుగాగమము వచ్చును.

దుగాగమము పరముగా ఉన్నపుడు నిండుసున్నకు పైనున్నదియును ఆగమము అయినదియును అయిన చకారపుపొల్లుయొక్క స్థానమున, వికల్పముగా పకారపుపొల్లు ఆదేశముగా వచ్చును.

'ఆకర్ణించుదురు' అని ఉండగా ప్రస్తుతసూత్రముచే చకారమునకు పకారము వచ్చి 'ఆకర్ణింపుదురు' అని అగును. విభాష అనుటచే పకారము రానపుడు 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు' అనుసూత్రముచే 'చుద్' అను భాగమునకు తకారము వచ్చి, 'ఆకర్ణింతురు' అని అగును.

'ఆగమచకారంబునకు' అనుటచే సహజముగా నున్నచకారమునకు పత్వము రాదు. తలంచుదురు. కాంచుదురు. తలంపుదురు, కాంపుదురు అని కాదు. తలంతురు, కాంతురు అనియె అగును.

'నెఱ'సున్నమీఁదిదానికి అనుటచే అరసున్నమీదిదానికి పత్వము రాదు. తలఁచుదురు, అడఁచుదురు అనుచోట్ల తలఁపుదురు, అడఁపుదురు అని కాదు. తలఁతురు, అడఁతురు అనియె అగును.

'సున్నమీద' అనుటచే సున్న లేకున్న ఈకార్యము లేదు. నిలువుము మొ.

'దుక్కు పరం బగునపుడు' అనుటచే దుక్కు పరముగా లేనిచే పత్వము రాదు. ఆకర్ణించును, ఆకర్ణించుచున్నాఁడు మొ.

**91. అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు కా రా చొరు చూడు లగు.**

**అగు - కాఁడు. కమ్ము వచ్చు - రాఁడు - రమ్ము.**

**చొచ్చు - చొరఁడు - చొరుము. చూచు - చూడఁడు - చూడుము.**

మధ్యమపురుష ఏకబహువచనము లగు ము, డుజు అనునవియును, జివర్ణము ఇత్తుగా కలవియును ముత్తు అనబడును. ఆయాధాతువులకు ఆయాఆదేశములు యథాసంఖ్యముగా వచ్చును.

ముత్తు పరముగా ఉన్నపుడు అగు అనుధాతువు స్థానమున 'కా' అనునదియు, 'వచ్చు' అనుధాతువుయొక్క స్థానమున 'రా' అనునదియు, చొచ్చు అనుదానియొక్క స్థానమునందు 'చొరు' అనునదియు, చూచు అనుధాతువుయొక్క స్థానమున 'చూడు' అనునదియు క్రమముగా ఆదేశములుగా వచ్చును. కా, రా, చొరు, చూడు అనునవి అనేకాల్లులు (ఒకటికంటె ఎక్కువ వర్ణములు. క్+ఆ మొ.) కావున ధాతువునకు మొత్తమునకు (అనేకాల్ శిత్ సర్వస్య) ఆదేశముగా వచ్చును.

అగు అనుధాతువుపై వ్యతిరేకార్థమునందు లజీ (క్రియా. 7) వచ్చి. అగు+ల్ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే అగునకు 'కా' అనునది ఆదేశ మై, కా+ల్ అని కాగా, లకారమునకు ప్రథమపురుషైకవచనమున డుజు వచ్చి (క్రియా. 8) 'కాఁడు' అని అగును. ఇట్లె వచ్చు – రాఁడు మొ. చొచ్చు, చూచు అనుధాతువులకు ఆదేశముగా వచ్చిన చొరు, చూడు అనుశబ్దములలో ఉత్వము కలదు. కావున జీత్తు పర మయినపుడు దానికి అత్వము వచ్చును. (క్రియా. 20) చొరు+డు – చొరఁడు. చూచు+డు – చూడఁడు.

ఇట్లె అగుము – కమ్ము. వచ్చు+డు – రండు అనువిధముగా ముజు పర మైనపుడు ఈఆదేశము లగును.

'అగువచ్చుచొచ్చుచూచులకు' అనుటచే ఇతరధాతువులకు ఈకార్యము లేదు. వండక, తినక మొ.

'ముత్తు పరం బగునపుడు' అనుటచే ముత్తు పరముగా లేనపుడు ఈఆదేశములు రావు. అగును. వచ్చుదురు, చొచ్చుదుము, చూచును మొ.

**92. ఇచ్చునకు సర్వంబున కీ యగు.**

**ఇచ్చు – ఈఁడు – ఇమ్ము. ఈయ యనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి. బలిమి నీయనిభూమివలయపతుల.**

'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు' అనుపూర్వసూత్రము నుండి 'ముత్తు పరం బగునపుడు' అనునది అనువర్తించును. మధ్యమపురుష ఏకబహువచనము లగు, 'ము, డుజు' అనునవియు, జివర్ణము ఇత్తుగా కలవియును (ముత్తు) పరముగా ఉన్నపుడు 'ఇచ్చు' అనుధాతువు మొత్తము స్థానమున 'ఈ' అనునది ఆదేశముగా వచ్చును.

ఇచ్చు ధాతువుపై 'వ్యతిరేకంబున లజీ యగు' అనుసూత్రముచే లజీ వచ్చి ఇచ్చు+ల్ అని యుండగా జీత్తు పర మైనది కావున ప్రస్తుతసూత్రముచే 'ఇచ్చు' అనుదానిస్థానమున 'ఈ' అనునది ఆదేశ మై, ఈ+ల్ అని అగును. లకారమునకు ప్రథమపురుషఏకవచనమునందు డుజు వచ్చి (క్రియా. 8), 'ఈఁడు' అని అగును.

'ఇచ్చునకు' అనుటచే ఇతరధాతువునకు ఈఆదేశము రాదు. ఒసఁగడు మొ.

'ఈ' ఆదేశము ముత్తు పరముగా నున్నపుడే. కావున ముత్తు పరముగా లేనపుడు రాదు. ఇచ్చుచున్నాఁడు, ఇచ్చెను మొ.

'సర్వంబునకు' అనుటచే చివరివర్ణముస్థానమున ఆదేశము గాదు. కావున ఇచ్చు – ఇచ్చీ అనువిధముగా కాదు.

ఇచ్చట విధింపబడిన 'ఈ' అనునది ఏకాల్లు (ఒకేవర్ణము) కావున 'అలో కన్త్యస్య' అనుపరిభాష ననుసరించి విధించినదానిలో చివరివర్ణమునకు అనగా ఇచ్చట 'ఇచ్చు' ధాతువులోని 'ఉ'కారమునకు మాత్రమే ఆదేశము (ఇచ్చీ) కావలసియున్నది. అట్లు కాక 'ఇచ్చు' అనుదానికి మొత్తమునకు ఆదేశ మగుటకై 'సర్వంబునకు' అనుదళము ప్రత్యేకముగా సూత్రమునందు చేర్పబడినది.

ఇచ్చునకు ఈయ అనుఆదేశమును వచ్చుట గలదు ఇచ్చు+నిజీ – ఈయని...

'అగు' అనుటచే ఈఆదేశము నిత్యము కావున ఇచ్చడు, ఇచ్చక అనురీతిగా ఆదేశము రానిరూపము ఉండదు.

**93. తేతేరులు తెచ్చున కగు.**

**తెచ్చు – తేఁడు – తేరఁడు. తెమ్ము – తేరుము.**

'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు' అనుసూత్రమునుండి 'ముత్తు పరం బగునపుడు' అనునది అనువర్తించును. మధ్యమపురుష ఏకబహు వచనములు అయిన 'ము, డుజు'లును, జీవర్ణము ఇత్తుగా గలవియును (ముత్తులు) పరముగా ఉన్నపుడు తెచ్చు అనుధాతువునకు ఒకపర్యాయము 'తే' అనునదియు, మరొకపర్యాయము 'తేరు' అనునదియు, ఆదేశముగా వచ్చును. తే, తేరు, అనునవి అనేకాల్లులు (అనేకవర్ణములు) కావున (అనేకాల్ శిత్ సర్వస్య) 'తెచ్చు' అనుదానికి మొత్తమునకు ఆదేశ మగును.

'తెచ్చు' అనుధాతువుపై 'వ్యతిరేకంబున లజీ యగు' అనుసూత్రముచే లజీ వచ్చి, తెచ్చు+ల్ అని ఉండగా, 'లజీ' జీత్తు కావున ప్రస్తుతసూత్రముచే 'తెచ్చు'నకు 'తే' అనునది ఆదేశ మై, తే+ల్ అని కాగా, లకారమునకు ప్రథమపురుషఏక వచనమునందు డుజు వచ్చి (క్రియా–8), తేఁడు అని అగును. తెచ్చు+ల్ అనుచో ప్రస్తుతసూత్రముచే తే అనునది కాక, 'తేరు' అనునది ఆదేశ మైనచో తేరు+ల్. 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అని అత్వము వచ్చి, ప్రథమపురుష ఏకవచనమున డుజ్ రాగా, 'తేరఁడు' అని అగును. ఇట్లే తెచ్చు+(లూట్)ల్ –

తెచ్చు+వు– తెచ్చు+ము – తే+ము – తెమ్ము – తేరు+ము–తేరుము మొ.

ఈఆదేశములు ముత్తు పర మగునపుడే కావున ముత్తు కానిది పర మైనపుడు రావు. తెచ్చుచున్నాఁడు, తెచ్చెను మొ.

'తెచ్చునకు' అనుటచే ఇతరధాతువునకు ఈఆదేశములు రావు. మెచ్చుఁడు, హెచ్చుదు. మొ.

'అగు' అనుటచే ఈకార్యము నిత్యము. కావున ఆదేశములు రాని తెచ్చుఁడు, తెచ్చుక అనురీతిరూపములు ఉండవు.

## 94. చావునోవులు చచ్చునొచ్చుల కగు.

**చచ్చు – చావఁడు – చావుము. నొచ్చు – నోవఁడు – నోవుము. వక్ష్యమాణంబు ద్విత్వంబు. నొవ్వఁడు.**

'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు' అనుసూత్రమునుండి 'ముత్తు పరం బగునపుడు' అనునది అనువర్తించును. మధ్యమపురుష ప్రత్యయములు అయిన ము, డుజు, అనునవియు, జివర్ణము ఇత్తుగా కలిగినవియు (ముత్తు) పరముగా ఉన్నపుడు 'చచ్చు' అనుధాతువునకు 'చావు' అనునదియు, నొచ్చు అనుధాతువునకు 'నోవు' అనునదియు ఆదేశముగా వచ్చును. చావు, నోవు అను ఈఆదేశములు అనేకాల్లులు (అనేకవర్ణములు) కావున ధాతువునకు మొత్తమునకు ఆదేశముగా వచ్చును.

చచ్చు అనుధాతువునకు 'వ్యతిరేకంబున లజి యగు' అనుసూత్రముచే లజి వచ్చి, చచ్చు+ల్ అని ఉండగా లజి జీత్తు కావున ప్రస్తుతసూత్రముచే 'చచ్చు' అను దానికి 'చావు' అనునది ఆదేశ మై, చావు+ల్ అని కాగా, చావునకు అత్వము వచ్చి (క్రియా. 20.– చావ+ల్) ప్రథమపురుషైకవచనమునందు లకారమునకు డుజు వచ్చి, చావఁడు అని అగును. ఇట్లె నొచ్చునకు నోవు రాగా నోవఁడు అని అగును. 'ఊయేలాదుల'అను(ప్రకీ. 6) సూత్రముచే ద్విత్వము వచ్చిన 'నొవ్వఁడు' అనియు అగును.

ఈఆదేశములు ముత్తు పర మగునపుడె. కావున ముత్తు కానిది పర మైనపుడు రావు. చచ్చుచున్నాఁడు. నొచ్చెను మొ.

'చచ్చునొచ్చులకు' అనుటచే ఇతరముల కీఆదేశములు లేవు. మెచ్చుఁడు, హెచ్చుక మొ.

'అగు' అనుటచే ఈఆదేశములు నిత్యము. కావున ఆదేశములు రాని చచ్చుఁడు, నొచ్చుక అనురీతిరూపములు ఉండవు.

**95. జీత్తు పరం బగునపుడు వానివువర్ణంబు విభాషను లోపించు.**

**చాక - చావక. చాకుము - చావకుము.**

**నోక - నోవక. నోకుము - నోవకుము.**

జివర్ణము ఇత్తుగా కలిగినది జీత్తు. 'వాని వువర్ణంబు' అనగా 'చావునోవులు చచ్చునొచ్చుల కగు' అనుపూర్వసూత్రముచే చచ్చునొచ్చులకు చెప్పిన చావు, నోవు అనువానియందలి'వు'వర్ణము. జివర్ణము ఇత్తుగా గలిగినది పరముగా నున్నపుడు ఆదేశముగావచ్చిన చావు, నోవు అనువానియందలి వువర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును.

చచ్చుధాతువుపై 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనుసూత్రముచే కజి వచ్చి చచ్చు+క అని ఉండగా, కజి జీత్తు కావున (ముత్తు అగుటచే) 'చావునోవులు చచ్చునొచ్చుల కగు' అనుసూత్రముచే 'చచ్చునకు' 'చావు' అనునది ఆదేశ మై చావు+క అని ఉండగా ప్రస్తుతసూత్రముచే వువర్ణము లోపించి, చాక అని అగును. విభాష అనుటచే వువర్ణము లోపింపనిపక్షమునందు 'జీత్తు పరం బగునపుడు' అను(క్రియా. 20)సూత్రముచే అత్వము వచ్చి, చావక అని అగును. ఇట్లె నొచ్చు+క నోవు+క - నోక, నోవక.

'జీత్తు పరం బగునపుడు' అనుటచే ముడుజులు పర మైనపుడు వువర్ణమునకు లోపము లేదు. చావుము, నోవుఁడు. చమ్ము నొండు అనురీతిరూపములు కావు.

'వానివువర్ణంబు' అనుటచే చావునోవులకంటె వే రైనదానిలోనివువర్ణమునకు లోపము లేదు. త్రావుము మొ.

**96. అగున కనుకనులకు ముజీత్తులు పరంబు లగునపుడు కా నా కానలు విభాష నగు.**

**అపదాద్యసూత్రముచే గాకు వకారంబు. వక్ష్యమాణం బౌత్వంబు. కమ్ము-అగుము-అవుము-ఔము. కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు. నాఁడు-అనఁడు. కానఁడు-కనఁడు.**

ముజును, జీత్తులును ముజీత్తులు. యథాసంఖ్యముగా అన్వయము. మధ్యమ పురుషప్రత్యయము లగు ము,డుజు అనునవి పరముగా ఉన్నపుడు, అగు అనుధాతువునకు 'కా' అనుఆదేశము వికల్పముగా వచ్చును. జివర్ణము ఇత్తుగా గలది పర మైనపుడు, 'అను' అనుధాతువునకు 'నా' అనునదియును, కను, అనుధాతువునకు 'కాన' అనునదియును వికల్పముగా ఆదేశముగా వచ్చును. కా, నా, కాన అనునవి అనేకాల్లులు (అనేకవర్ణములు) కావున ధాతువునకు

మొత్తమునకు ఆదేశముగా వచ్చును.

'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు కారాచొరుచూడు లగు' అనుసూత్రముచే అగుధాతువునకు జీత్తు పర మగునప్పటివలె ముఙు పర మైనపుడు కూడ 'కా' అనుఆదేశము నిత్యముగా ప్రాప్తించుచుండగా, ప్రస్తుత సూత్రము వికల్ప మని చెప్పుచున్నది.

లూట్టులో మధ్యమపురుష ఏకవచనమునందు అగు+ము అనుచోట 'కా' ఆదేశ మయి, కా+ము అని ఉండగా, 'ముఙు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియు నగు' అనుసూత్రమును అనుసరించి 'కమ్ము' అని అగును. విభాష అనుటచే 'కా' అనుఆదేశము రానపుడు 'అగుము' అనియె ఉండును.

'అను' ధాతువునకు వ్యతిరేకార్థమునందు లజీ వచ్చి, అను+ల్ అని ఉండగా లజీ జీత్తు గావున ప్రస్తుతసూత్రముచే 'నా' అనుఆదేశము వచ్చి, ప్రథమైక వచనమునందు డుఙు (క్రియ. 8) వచ్చి, 'నాఁడు' అని అగును. విభాష అనుటచే 'నా' అనుఆదేశము రానపుడు 'అనఁడు' అని యుండును. ఇట్లు కనుధాతువునకు 'కాన' వచ్చిన 'కానఁడు' అనియు, రాకున్న 'కనఁడు' అనియు అగును.

'అగున కనుకనులకు' అనుటచే ఇతరధాతువులకు ఈకార్యము లేదు. తినుము, చనక మొ.

'అగునకు ముఙు పరం బగునపుడు విభాష' కావున జీత్తు పర మగునపుడు 'అగువచ్చుచూచులకు' అనుసూత్రముచే 'కా' అనుఆదేశము నిత్యముగా వచ్చును. కాఁడు – కాక మొ. అవక అనురీతిరూపము లుండవు.

అనుకనులకు జీత్తు పర మగునపుడె ఆదేశములు. కావున జీత్తు కానిది పర మైనచో ఈఆదేశములు రావు. ముఙు పర మైనపుడు అనుము, కనుఁడు మొ. ఇతరస్థలములలో అగును, కనుదురు మొ.

**97. నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరంబు లగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగా నగు.**

**నేచెను – నేరిచెను. నేచును – నేరుచును. నేరఁడు – నేరువఁడు.**

భూతమున లిట్టును, తద్ధర్మాదులందు లాట్టును వచ్చును. మధ్యమముడుఙు లును జీత్తులును ముత్తు అనబడును.

1. లిట్టు గాని, లాట్టు గాని పరముగా ఉన్నపుడు 'నేరుచు' అనుధాతువులోని రువర్ణమునకు బహుళముగా లోపము వచ్చును.

నేరుచు అనుధాతువునకు లిట్టు (క్రియా. 3) వచ్చి, నేరుచ్+ల్ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే రువర్ణము లోపించి, నేచు+ల్ అనునది ప్రథమపురుష ఏకవచనమునందు (నేచు+డుజ్–నేచు+ఎను) నేచెను అని అగును. బహుళము కావున రువర్ణము లోపింపనిచో 'నేరిచెను' అని అగును. అట్లే తద్ధర్మాదులందు నేచును, నేరుచును అని అగును.

2. మధ్యమముడుజులును, జివర్ణము ఇత్తుగా కలవియును పర మయినపుడు 'నేరుచు' అనుధాతువులోని 'చువర్ణమునకు' బహుళముగా లోపము వచ్చును.

నేరుచుధాతువునకు వ్యతిరేకార్థమునందు లజి రాగా, నేరుచు+ల్ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే 'చు' వర్ణము లోపించి, 'నేరు+ల్' అని కాగా, ధాతువునకు అత్వము వచ్చి (క్రియా. 20) లకారమునకు ప్రథమపురుషైకవచనమునందు డుజు వచ్చి, నేరఁడు అని అగును. బహుళము అనుటచే చువర్ణము లోపింపనిపక్షము నందు 'నేరువఁడు' అని అగును.

'లిడ్లొట్టులు' అనుసామాన్యనిర్దేశముచే లిట్టులోను లాట్టులోను అన్ని పురుషలలో అన్నివచనములందు రువర్ణము లోపించును. నేచిరి నేతుము మొ. ఇతర లకారములయందు లోపము రాదు. నేరుచుచున్నాఁడు నేరుపఁగలడు. మొ.

'ముత్తు పరం బగునపుడు' అనుటచే ముత్తు కానిది పర మైనపుడు చులోపము లేదు. నేరుచుట, నేరువఁగలడు మొ.

'బహుళము' అనుటచే నేచినవాఁడు మొద లగుచోట్ల ఇతరస్థలములందును ఈకార్యము కనిపించుట సంగ్రహింపఁబడును.

**98. పోవునకు దుజ్ముత్తులు ముజుం బరంబు లగునపుడు వులోపంబుం బొదపదలును విభాష నగు.**

**పోదురు – పోవుదురు. పోఁడు – పోవఁడు.**

**పోవుము – పొదము – పదము – పొమ్ము.**

మధ్యమముడుజులకు ముజు అని పేరు. ముజును జీత్తులును ముత్తు.

1. దుగాగమమును, ముత్తును పరముగా ఉన్నపుడును 'పోవు' అనుధాతువులో 'వు' వర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును.

'పోవు' ధాతువునకు లాట్టులో (క్రియా. 5) ప్రథమపురుషబహువచనమందు రువర్ణమును, (క్రియా. 8–పోవు+రు) ధాతువునకు దుగాగమమును వచ్చి (క్రియా. 22–పోవు+దురు) అని ఉండగా ప్రస్తుతసూత్రముచే వువర్ణము లోపించి,

'పోదురు' అని అగును. విభాష అనుటచే వువర్ణము లోపింపనిపక్షమునందు 'పోవుదురు' అని యుండును.

2. మధ్యమపురుషఏకబహువచనము లగు – ముదుజులు పరము లగునపుడు 'పోవు' అనుధాతువునకు పొద, పద అనునవి వికల్పముగా ఆదేశ మగును. పొద, పద అనునవి అనేకాల్లులు కావున 'పోవు' అనుదానికి మొత్తమునకు ఆదేశముగా వచ్చును.

పోవుము అని యుండగా ప్రస్తుతసూత్రముచే 'పొద' ఆదేశ మైనచో పొదము ఇట్లె పదము. (పొదము, పదము అనువాని కర్థమున విశేషము గలదు) విభాష అనుటచే ఆదేశములు లేకున్న పోవుము. ముజునకు ముత్తు అనియు పేరు. కావున ఈసూత్రమున మొదటిఅంశముచే వులోపము వచ్చిన (పోవుము) పో+ము – (క్రియా. 61) 'పొమ్ము' అనియు అగును.

'పోవునకు' అనుటచే ఇతరధాతువునకు ఈకార్యము లేదు. త్రావుదురు, త్రావక. మొ. 'దుజ్ముత్తులు' అనుటచే ఇతరము పర మైనపుడు వులోపము లేదు. పోవుచున్నాఁడు.

'ముజు పరం బగునపుడు' అనుటచే ఇతరము పర మైన పొద, పద అనుఆదేశములు రావు. పోక, పోవక మొ.

**99. అగుపోవులకడప్రాల కిద్వక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు.**

**వక్ష్యమాణం బైత్వంబు. అయి – ఐ. అయిరి – ఐరి. పోయి – పోయిరి పోయెను – పోయెను.**

కడప్రాలు అనగా చివరిఅక్షరములు. ఎఏఒఓలు నాలుగును వక్రము లైనను ఎను, ఎడు, ఎడి మొద లగువానిలోనుండి ఇచట 'ఎ' అనున దొక్కటె పర మగుట సంభవించును. ఇ, ఎ అనునవి పరముగా ఉన్నపుడు అగు, పోవు అనుధాతువులందలిచివరిఅక్షరము లగు 'గు – వు' అనువానికి యకారపుపొల్లు ఆదేశ మగును. యకారము ఏకాల్లు (ఒకేవర్ణము) కావున చివరిఅక్షరము లగు గు,వులలో చివరిఉకారమునకు మాత్రమే ఆదేశము కావలెను. కాని అగుపోవులకు అని చెప్పినను అట్లే అగుచుండగా 'కడప్రాలకు' అని ప్రత్యేకముగా చెప్పుటనుబట్టి గు, వు అనుఅక్షరముమొత్తమునకు పొల్లుయకారము ఆదేశ మగును.

అగు ధాతువునకు 'సమానాశ్రయంబులం బూర్వకాంబునం దివర్ణకం బగు' అనుసూత్రముచే ఇప్రత్యయము వచ్చి, అగు+ఇ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే 'గు' స్థానమున యకారపుపొల్లు వచ్చి, అయ్+ఇ–అయి అని అగును.

'ఆచ్ఛికంబులం దయియవులకు' అనుసూత్రముచే ఐకారము ఆదేశ మయినచో ఐ. ఇట్లే అయిరి, ఐరి మొ. ఇట్లే పోవు+ఎను – పోయ్+ఎను – పోయెను మొ.

'అగుపోవుల' అనుటచే ఇతరధాతువుల కీకార్యము గలుగదు. నగి, తెగెను.

'ఇద్వక్రములు' అనుటచే ఇతరవర్ణములు పర మైనచో ఈకార్యము లేదు. అగును, పోవుదురు మొ.

**100. అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు.**

**వక్ష్యమాణంబు ద్విత్వంబు. ఆయెను – అయ్యెను. ఆయెదు – అయ్యెదు.**

వక్రము(ఎ)తో కూడినవర్ణము పరముగా ఉండగా అగు అనుధాతువునందలి అచ్చు అకారమునకు దీర్ఘము నిత్యముగా వచ్చును.

('అచ శ్చ' అనుఆద్య పరిభాషచే 'దీర్ఘము'గా విధింపబడినఈకార్యము అచ్చునకె అగును. అగు–అయ్+ఎను అనుచో వక్రము పరముగా ఉండగా అచ్చు 'అ'కారము ఒక్కటె. కావున దీర్ఘము అకారమునకే వచ్చును)

అగు ధాతువునకు లిట్టునందు (క్రియా. 3) డుజును (క్రియా. 8) డుజునకు ఎను వర్ణమును (క్రియా. 16) అగు+ఎను అని యుండగా 'అగుపోవుల కడవ్రాల కిద్వక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు' అనుసూత్రముచే యకారము వచ్చి, అయ్+ఎను 'అయెను' అని అగును. ప్రస్తుతసూత్రముచే అకారమునకు దీర్ఘము వచ్చి, 'ఆయెను' అగును. ఇట్లె ఆయెదును మొ. ప్రకీ. 6. సూ. చే ద్విత్వము వచ్చినపక్షమున సమా. 13. చే హ్రస్వ మై, అయ్యెను.

'అగునకు' అనుటచే ఇతరధాతువునకు ఈకార్యము లేదు. నగెను, నగియెను.

'వక్రంబు గూడుచో' అనుటచే అయి, అయిరి అనువిధముగా ఇత్వముతో కూడినది పర మైనపుడు దీర్ఘము లేదు. అయి 'ఆయి' అని కాదు.

'అగు' అనుటచే నిత్యము. కావున 'అయెను' అనువిధముగా దీర్ఘము రానిరూపము లుండవు.

**101. పిలుచు మొద లగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు.**

**పిలఁడు – పిలువఁడు. పిలుము – పిలువుము.**

**లేచునకు ముజు పరంబ గునపుడు చులోపం బగు. లెమ్ము – లెండు. పిలుచు – నిలుచు – తలఁగు ఇత్యాదులు.**

మధ్యమపురుషఏకబహువచనము లగు ము, డుజులును, జి వర్ణము ఇత్తుగా గలవియును (ముత్తు) పరముగా ఉన్నపుడు పిలుచు మొద లగుధాతువుల

యందలిచివరిఅక్షరమునకు బహుళముగా లోపము వచ్చును.

'పిలుచు' ధాతువునకు 'వ్యతిరేకంబున లజి యగు' అనుసూత్రముచే లజి రాగా, పిలుచు+ల్ అనుచో లజి జీత్తు కావున (ముత్తు) ప్రస్తుతసూత్రముచే చువర్ణము లోపించి, పిలు+ల్ అని ఉండగా జీత్త్వముచే (క్రియా. 29) అత్వము వచ్చును. లకారమునకు ప్రథమపురుషైకవచనమునందు (క్రియా. 8) డుజు రాగా 'పిలఁడు' అని అగును. బహుళము అనుటచే చువర్ణము లోపింపని పక్షమునందు పిలుచు+డుజ్. పిలుచ+డుజ్. 'ఆగమాన్యచకారంబులకు' అను(క్రియ. 88) సూత్రముచే చకారమునకు వకారము వచ్చి, 'పిలువఁడు' అని అగును. ఇట్లె పిలక, పిలువక మొ.

పిలుచు మొద లగువానిలో చేరనిధాతువునకు లోపము లేదు. తలఁచు-తలఁపఁడు మొ.

'ముత్తు పరం బగునపుడు' అనుటచే ముత్తు పరముగా లేనపుడు లోపము లేదు. పిలుచుచున్నాఁడు, పిలువఁగలడు మొ.

'కడ(వ్రాయి' అనుటచే ఇతరవర్ణములు అట్లే ఉండును.

'బహుళము' అనుటచే లేచు ధాతువునకు ముజు పర మగునపుడు మాత్రమే చివరిఅక్షరము లోపించును. అనగా జీత్తు పర మగునపుడు లోపము లేదు. లేవక, లేవఁడు మొ. ఇచట లేక, లేఁడు అనురీతిరూపములు ఉండవు. ఇచట అప్రవృత్తి.

### 102. లాఁతిచో నహితము కాదేశాదులు కానంబడియెడి.

**కావుతను-కాతను. అగుట-కావుట. అగుదును-కావుదును. కానను-కావునను. అనుదును-అనవుదును-నావుదును. ఇత్యాదు లెఱుంగునది.**

ముత్తు పరముగా ఉన్నపుడు అగు మొద లగుధాతువులకు చెప్పిన 'కా' మున్నగుఆదేశములు మొద లగునవి ఇతరస్థలములలో అనగా ముత్తు కానిది పర మైనపుడును కనబడుచున్నవి.

అగు ధాతువుపై లూట్టులో (క్రియా. 6) 'తను' ప్రత్యయము రాగా (క్రియా. 26) అగు+తను అని అగును. 'తను' అనునది ముత్తు కాదు. కావున 'అగువచ్చుచొచ్చు చూచులకు ముత్తు పరం బగునపుడు కారాచొరుచూడు లగు' అనుసూత్రముచే 'కా' అనుఆదేశము వచ్చుటకు వీలు లేదు. ప్రస్తుతసూత్రముచే అనునకు 'కా' ఆదేశ మయి, 'కాతను' అని యైనది.

పూర్వమునందు చెప్పినవే కాక ఇతరము లైనఆదేశములును ఈలక్షణము

నందలిఆదిశబ్దముచే అగును. అగు+తను అని ఉండగా 'అగు'నకు 'కావు' అనునది ఆదేశ మయి 'కావుతను' అని అగును. 'కావు' అనుఆదేశము ఇంతకు ముందు చెప్పబడలేదు. ఇట్లె అను+దును-అనవుదును (అనవు ఆదేశము) మొ.

'కానంబడియెడి' అనుటచే ముత్తు గానిది పర మగునపుడు కాదేశాదులు వచ్చుటను ప్రయోగములనుండియె గ్రహింపవలయును స్వతంత్రించి యథేష్టముగా ఆదేశములు చేయరాదు.

**103. ఆచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.**

**అయిదు-ఐదు. అయిరేని-ఐరేని. అవుడు-ఔడు. గవుసెన-గౌసెన.**

ఐ ఔ అనువానికి వక్రతమములు అని పేరు. ఆచ్ఛికము అనగా సంస్కృత సమము కానితెలుగు. అచ్చతెలుగుశబ్దమునందలి 'అయి' అనుభాగమునకు 'ఐ' అనునదియు, 'అవు' అనుభాగమునకు 'ఔ' అనునదియు బహుళముగా ఆదేశముగా వచ్చును. అయి, ఆవు అనువానికి మొత్తమునకే ఐ, ఔ ఆదేశము లగును.

'అయిదు' అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే 'అయి' అనుదానికి 'ఐ' ఆదేశము కాగా, 'ఐదు' అని అగును. బహుళము అనుటచే 'ఐ' ఆదేశము రానిపక్షమునందు 'అయిదు' అని యుండును. ఇట్లె అవును - ఔను మొ.

'ఆచ్ఛికంబులందు' అనుటచే సంస్కృతసమములలో అయి, అవులకు ఐఔలు రావు. జయించు, కవులు మొ.

'అయి అవులకు' అనుటచే వేరువిధముగా ఉన్నచోట్ల ఈకార్యము లేదు. చెయిదము, నివురు మొ.

'బహుళ' శబ్దముచేత వెలయించెను, నవుచున్నాఁడు. మొద లగుచోట్ల అప్రవృత్తి. కావున వెలైంచెను నౌచున్నాఁడు అనువిధ మైనరూపములు ఉండవు.

**104. కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరం బగునపుడు కల యగు.**

**ప్ర. కలఁడు-కలరు. కలదు-కలవు. మ. కలవు-కలరు. ఉ. కలను-కలము.**

అస్తి+అర్థ(ము) అనగా అసధాతువుయొక్క అర్థము. లట్టు పరముగా ఉన్నపుడు ఉన్న అనుఅర్థమునం దున్న కలుగు అనుధాతువుయొక్క స్థానమున 'కల' అనునది ఆదేశముగా వచ్చును. 'కల' అనేకాల్లు కావున 'కలుగు' మొత్తమునకు ఆదేశ మగును.

కలుగు అనుధాతువుపై 'వర్తమానంబునందు ల ట్టగు' అనుసూత్రముచే

లట్టు వచ్చి, 'కలుగు+ల్' అని ఉండగా ప్రస్తుతసూత్రముచే 'కలుగు'నకు 'కల' ఆదేశము కాగా, 'కల+ల్' అని అగును. ప్రథమపురుషైకవచనమునందు డుజు వచ్చి (క్రియా. 8) కలఁడు అని అగును.

'కలుగునకు' అనుటవలన ఇతరధాతువున కీకార్యము లేదు. ఉన్నాఁడు, ఉన్నది మొ.

'అస్త్యర్థంబునందు' అనుటచే పుట్టు మొద లగుఇతర మైనఅర్థములందు 'కలుగు' ధాతువునకు ఈకార్యము లేదు. వెఱ కలుగుచున్నది. మొ.

'లట్టు పరం బగునపుడు' అనుటచే లిట్టు మొద లైనవి పర మైనపుడు ఈ కార్యము లేదు. కలిగెను, కలుగును మొ. లట్టు అనుసామాన్యనిర్దేశముచే లట్టునందు మాత్ర మన్నిపురుషలయందు అన్నివచనములందును ఈకార్యము అగును. కలవు, కలము మొ.

### 105. త్రర్థంబునం గలాదేశంబు విభాష నగు. ఎడియెడులకు లోపం బిట నిత్యంబు. కలవాఁడు – కలుగువాఁడు.

'కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరం బగునపుడు కల యగు' అనుపూర్వ సూత్రమునుండి 'కలుగునకు అస్త్యర్థమునందు' అనుపదములు ఇందు అనువర్తించును. 'తృచ్' అనుసంస్కృతప్రత్యయముయొక్క అర్థము (తృ+అర్థ) త్రర్థము. తృవర్ణకముయొక్క అర్థమునందు, 'ఉన్న' అనుఅర్థమునం దున్న 'కలుగు' అనుధాతువుయొక్క స్థానమున 'కల' అనునది వికల్పముగా ఆదేశముగా వచ్చును. 'కల' అనునది అనేకాల్లు కావున 'కలుగు' అనుమొత్తమునకు ఆదేశ మగును.

కలుగు అనుధాతువునకు 'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు' అను సూత్రముచే ఎడి, లేదా ఎడు ప్రత్యయము రాగా, ప్రస్తుతసూత్రముచే కలుగునకు 'కల' ఆదేశ మై, కల+ఎడి, కల+ఎడు అని ఉండగా 'వానికి లోపంబు బహుళంబుగా నగు' అనుసూత్రమునందలిబహుళశబ్దముచే ఎడిఎడులు నిత్యముగా లోపించి కలవాఁడు. (సమా. 9) అని అగును. విభాష అనుటచే 'కల' అనుఆదేశము రాని పక్షమునందు – కలుగువాఁడు.

'కలుగునకు' మాత్రమే కావున ఈఆదేశము ఇతరధాతువులకు గలుగదు.

'అస్త్యర్థమునందు' కావున పుట్టు మొద లగుఇతరార్థములలో ఈఆదేశము లేదు. కలిగెడిభయము, కలిగెడుభయము అని 'కలుగు' అనియె ఉండును.

'త్రర్థంబున' అనుటచే ఇతరార్థములలో అస్త్యర్థకకలుగుధాతువునకును కలాదేశము లేదు. కలిగినవాఁడు. ఇచట కలినవా డని ఉండదు.

**106. అస్త్యర్థంబునకు లజీ మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు.**

**ప్ర. లేఁడు – లేరు. లేదు – లేవు. మ. లేవు – లేరు. ఉ. లేను – లేము. లేమి – లేక – లేని – లేవడి.**

అస్తి+అర్థ= అసధాతువుయొక్క అర్థము. అసధాతువు ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే' శ్తిబంతముగా అస్తి అని నిర్దేశింపబడినది. ఉన్న అనుఅర్థము. 'వ్యతిరేకంబున లజీ యగు' అనుసూత్రముచే వచ్చు లజీ లకారమును, 'వ్యతిరేకభావంబున మిజీ యగు' అని వచ్చు 'మి' అనుప్రత్యయమును, 'కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనుసూత్రముచే వచ్చు 'కజీ' ప్రత్యయమును, 'వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజీ యగు' అనుసూత్రముచే వచ్చు 'నిజీ' ప్రత్యయమును, 'వడిప్రభృతు లి ట్లెఱుంగునది' అనుసూత్రముచే అగు 'వడి' అనుప్రత్యయమును పరముగా ఉన్నపుడు 'ఉన్న' అనుఅర్థమునం దున్న 'కలుగు' అనుదానికి మొత్తమునకు 'లే' అనునది ఆదేశ మగును.

(అస్త్యర్థమున నున్న) కలుగు ధాతువునకు 'వ్యతిరేక భావంబున మిజీ యగు' అనుసూత్రముచే 'మిజీ' ప్రత్యయము వచ్చి, కలుగు+మి అని ఉండగా ప్రస్తుత సూత్రముచే 'కలుగు' అనుదానిస్థానమున 'లే' అనునది ఆదేశ మయి, 'లేమి' అని అగును. ఇట్లే కలుగు+కజీ–లేక, కలుగు+ని–లేని, కలుగు+వడి–లేవడి, కలుగు+లజీ, లేఁడు, లేవు. మొ.

'అస్త్యర్థంబున' అనుటచే పుట్టు మొద లగుఇతర మైనఅర్థములందు కలుగు ధాతువున కీకార్యము లేదు. కలుగదు, కలుగమి, కలుగక మొ.

'లజీ' అనునిర్దేశముచే లజీ లకారమునం దన్నిపురుషవచనములందును ఈకార్యము కలుగును. లేఁడు – లేము మొ.

'లజీ మి క ని వడి' అనువానికంటె ఇతర మైనది పర మైనపుడు ఈ కార్యము లేదు. కలిగెను, కలుగుట మొ.

**107. వ్యతిరేకమునందు వలచున కొల్ల విభాష నగు.**

**ప్ర. ఒల్లఁడు – ఒల్లరు. ఒల్లదు – ఒల్లవు. మ. ఒల్లవు – ఒల్లరు. ఉ. ఒల్లను – ఒల్లము. ఒల్లమి. ఒల్లక. ఒల్లని. పక్షంబున వలవఁ డిత్యాది. ఒల్లమి కొల్లఁబా టని ప్రయోగంబులం గానంబడియెడి.**

వ్యతిరేకార్థమునందు వలచు అనుధాతువుయొక్క స్థానమునందు 'ఒల్ల' అనునది వికల్పముగా ఆదేశముగా వచ్చును. 'ఒల్ల' అనునది అనేకాల్లు (అనేక

వర్ణములు కలది) కావున 'వలచు' అనుదాని మొత్తముస్థానమున ఆదేశముగా వచ్చును.

వలచు ధాతువునకు 'వ్యతిరేకంబున లజి యగు' అనుసూత్రముచే లజి వచ్చి, వలచు+ల్ అని ఉండగా ప్రస్తుతసూత్రముచే వలచునకు 'ఒల్ల' ఆదేశ మై ఒల్ల+ల్ అని యగును. ప్రథమపురుషైకవచనవివక్షలో డుఞు వచ్చి, ఒల్లఁడు అని అగును. విభాష అనుటచే 'ఒల్ల' అనుఆదేశము రానిపక్షమునందు 'వలవఁ డు' అని అగును.

'వ్యతిరేకమునందు' అని సామాన్యముగా చెప్పుటచే వ్యతిరేకభావార్థము వ్యతిరేకక్త్వార్థము మొద లగు అన్నివిధము లైనవ్యతిరేకార్థములందును 'ఒల్ల' అనుఆదేశము వికల్పముగా వచ్చును. ఒల్లక - వలవక. ఒల్లనివాఁడు - వలవని వాఁడు మొ.

వ్యతిరేకభావమునందు వలచు+మి అనుచో ఒల్ల ఆదేశ మయి ఒల్లమి. ఈఅర్థమునందు ఒల్లఁబాటు అనురూపమును గలదు. వలచు+మి అనుచో మొత్తమునకు ఒల్లఁబాటు అనునది ఆదేశ మయినట్లు గ్రహింపవలెను.

**108. చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు.**

**నిలుతురు-పిలుతురు. అడఁతురు- కడఁతురు. చింతురు-పెంతురు. పచింతురు-వచింతురు. చేతురు కోతు రిత్యాదు లసాధువు లని యెఱుంగునది.**

దుగాగమమునందలిదకారము దుగ్దకారము. లాట్టునందు (ఉభయ ప్రార్థనమున లూట్టులోను) ధాతువునకు దుగాగమము చెప్పబడినది. ధాతువున సహజముగా గాని, లేక ఆగమముగా వచ్చి కాని, ఉన్న చువర్ణము మరియు దానికి పర మైయున్నదుగాగమమునందలిదకారముయొక్క (చుద్ అనుదానియొక్క) స్థానమున పొల్లుతకారము ఆదేశముగా వచ్చును.

లాట్టులో ప్రథమపురుషబహువచనమునందు నిలుచుదురు అని కాగా, ప్రస్తుతసూత్రముచే ఇందలి 'చుద్' అనుదానిస్థానమున (నిలు+చుద్+ఉరు) 'తకారపుపొల్లు' వచ్చి నిలుత్+ఉరు - నిలుతురు అని అగును. అట్లే వసించుదురు- వచింతురు మొ. ధాతువుయొక్క చువర్ణమునందలి చకారము ద్విరుక్తము అయినచో ('చ్చుద్' అనుదానికి) తకారము ద్విరుక్త మయి ఆదేశ మగును. వచ్చుదురు - వత్తురు. మెచ్చుదురు - మెత్తురు.

'చువర్ణంబుతోడ' అనుటచే ధాతువు చివరివర్ణము 'చు' అనుదానికంటె వే

రైనచో ఈకార్యము రాదు. పొగడుదురు – పొగతురు, చేయుదురు – చేతురు అనురీతిగా కాదు.

'దుగ్దకారంబు' అనుటచే దుగాగమము లేనిచో ఈకార్యము లేదు. నిలుచును, పచించును మొ.

'అగు' అనుటచే నిత్యము. కావున 'చుద్' అనుదానికి తకారము రాకుండ 'నిలుచుదురు' అనువిధ మైనరూపము లుండుటకు అవకాశము లేదు.

**109. పడుజికొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు.**

**చొచ్చు – చొరఁబడు. నిలుచు – నిలువఁబడు. కూడు – కూడఁబడు. పండు – పండుకొను.**

'పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు' అనుసూత్రము 'పడుజి' అనుదానిని కర్మార్థమునందు విధించినది. 'క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయక్తం బగు' అనుసూత్రము ననుసరించి 'కొను' అనునది ఆత్మనేపదార్థము నందు అనుప్రయుక్త మగును. ఇచట 'స్వార్థంబు' అనగా ధాతువుయొక్క అర్థము. పడుజి అనునదియు, కొను అనునదియు, అరుదుగా కొన్నిధాతువులకు ఆధాతువులఅర్థమునందే ఆధాతువులపైని వచ్చిచేరును.

నిలుచు అనుధాతువు పయిని అదే అర్థమునం దీసూత్రముచే పడుజి చేరి నిలుచు+పడు అని యుండగా పడుజి జీత్తు కావున 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' నని, చకారమునకు వకారమును, (నిలువు+పడు) 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ఉత్వమునకు అత్వమును వచ్చి, నిలువ+పడు అని యుండగా 'కలజిపడుజులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనుసూత్రముచే నుగాగమము వచ్చి (నిలువను+పడు), ద్రుతకార్యములు జరిగి, నిలువఁబడు అని అగును. నిలువఁబడుచున్నాడు=నిలుచుచున్నాడు.

పండు అనుధాతువునకు అదే అర్థములో ఈసూత్రముచే 'కొను' అనునది అనుప్రయుక్త మయి, 'పండుకొను' అని అగును. పండుకొనెను = పండెను.

'ఒకానొకచో' అనుటచే పడుజికొనులు స్వార్థమునం దెల్ల ధాతువులకు చేరవు. వండు – వండెను. తిను – తినుట మొ.

'స్వార్థంబునందు' అనుటచే పడుజి, కొను అనునవి వచ్చి చేరుటవలన ముందరిధాతువుయొక్క అర్థములో ఎట్టిమార్పును కలుగదు. నిలువఁబడు=నిలుచు.

**110. తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు నగుచో నుత్వంబు పయిని దానితకారంబు దకారం బగు.**

**అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు. అగు-నెగయు-పోవు చొచ్చు-పుచ్చు-తోఁచు-నడచు-పఱచు-మొలుచు-వేచు ఇత్యాదులు.**

అగు (ఆది) మొద లగునవి అగ్వాదులు. 'పడుజికొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు' అనుసూత్రమునుండి 'ఒకానొకచో స్వార్థంబునందు' అనుపదములు ఈసూత్రములోని కనువర్తించును. కొన్నియెడల అగు మొద లగుధాతువులకు అదే అర్థములో చివర 'తెంచు' అనుధాతువు వచ్చి చేరును. అట్లు వచ్చిన 'తెంచు' ధాతువు ఉత్వము పయి నున్నచో తెంచులోని తకారపుపొల్లుస్థానమున దకారపుపొల్లు వచ్చును.

'అగు' అనుధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'తెంచు' అనుప్రయుక్త మయి అగు+తెంచు అని కాగా, ఉత్వము మీద నున్నది కావున తెంచులో తకారమునకు దకారము వచ్చి, 'అగుదెంచు' అని అయినది. అగుదెంచు=అగు.

'అగ్వాదులకు' అనుటచే అగు మొద లగువానిలో చేరనిధాతువునకు ఈ కార్యము లేదు. వండు తిను మొ.

'ఉత్వంబుపయిని' అనుటచే నడ(చు) తెంచు తోఁ(చు) తెంచు మొద లగుఇతరస్వరముపై నున్నపుడు తెంచు తకారమునకు దకారము రాదు. తెంచు ధాతువు అనుప్రయుక్తము కానిచో అగు, పోవు ఇత్యాదిగ ఇవి అట్లే యుండును. పోవుదెంచెను-పోయెను మొ.

**111. అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తం బగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు.**

**అరుదెంచు - అరుగుదెంచు. ఏతెంచు - ఏఁగుదెంచు. చనుదెంచు.**

అభ్యాగతి (అభిఆగతి) 'ఎదురు వచ్చుట' అని అర్థము. అరుగు (ఆది) మొద లగునవి అరుగ్వాదులు. ఏగు, చను మొ. 'అయ్యది' అనగా 'తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు' అనుపూర్వసూత్రము ననుసరించి 'తెంచు' అనుధాతువు. వచ్చుట అనుఅర్థమునందు (పోవుట అనుఅర్థము కలిగిన) అరుగు మొద లగుధాతువులకు చివర 'తెంచు' అనుధాతువు వచ్చి చేరును. ఇట్లు 'తెంచు' చేరినపుడు ముం దున్న అరుగు మొద లగువానిలోని గువర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును.

అరుగు అనుధాతువుపై వచ్చు అనుఅర్థమునందు ప్రస్తుతసూత్రముచే 'తెంచు'

అనుధాతువు చేరి, అరుగు+తెంచు అని యుండగా ఈసూత్రముచేతనె గువర్ణము లోపించి, అరు+తెంచు అని కాగా, 'ఉత్వంబుపయిని దానితకారంబు దకారం బగు' అనుపూర్వసూత్రార్థముచేత తెంచులోనితకారమునకు దకారము వచ్చి, అరు దెంచు అని అగును. విభాష అనుటచే గువర్ణము లోపింపనిపక్షమునందు 'అరుగు దెంచు' అని అగును.

'అభ్యాగతిన్' అనుటచే అరుగు అనుఅర్థమున అరుగుదెంచు అని ఉండదు. అనగా ఇట స్వార్థమునందు 'తెంచు' చేరదు.

'అరుగ్వాదులకు' అనుటచే అరుగు మొద లగువానిలో చేరనిదాని కీకార్యము లేదు. 'పోవు' అరుగ్వాదులలోనిది కాదు. పోవుదెంచు - పోవు. కాగా వచ్చు అనుఅర్థమునందు 'పోవుదెంచు' అనురూప ముండదు.

'గువర్ణంబు' లోపించు ననుటచే ఇతరవర్ణము లోపింపదు. 'చనుదెంచు'.

**112. అయ్యది పరం బగునపుడు చువర్ణంబు లోపించు.**

**చొచ్చు - చొత్తెంచు. పుచ్చు - పుత్తెంచు. తోఁచు - తోతెంచు.**

'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు' అనుసూత్రము ననుసరించి అనుప్రయుక్త మయి వచ్చిన తెంచు అనుధాతువు పరముగా ఉన్నపుడు దానికి పూర్వమందలిధాతువుచివరివర్ణమునకు లోపము వచ్చును.

'తోఁచు' అనుధాతువుపై 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు' అనుసూత్రముచే 'తెంచు' అనునది చేరగా, తోఁచు+తెంచు అని ఉండగా ప్రస్తుత సూత్రముచే 'తోఁచు'లో చువర్ణము లోపించి, 'తోఁతెంచు' అని అగును.

'అయ్యది పరం బగునపుడు' అనుటచే తెంచుధాతువు అనుప్రయుక్తము కానిచో 'చు' లోపము లేదు. తోఁచెను.

'లోపించు' అనుటచే లోపము నిత్యము. కావున 'తోఁచుదెంచు' అనువిధముగా లోపము రానిరూపము లుండవు.

'చొచ్చు+తెంచు–చొత్తెంచు, పుచ్చు+తెంచు–పుత్తెంచు మొద లగుచోట్ల 'చు' వర్ణము లోపించినపిదప తెంచుతకారమునకు ద్విత్వము వచ్చుట విశేషము.

**113. అద్దానికి ముత్తు పరం బగునపుడు తే తేరు లగు.**

**అగుదేఁడు - అగుదేరఁడు. అగుదెమ్ము - అగుదేరుము.**

'అద్దానికి' అనగా 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు, అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తం బగు' అనుసూత్రముల ననుసరించి స్వార్థమునందును, అభ్యాగతియందును అనుప్రయుక్త మైన తెంచుధాతువునకు

అని అర్థము. అనుప్రయుక్త మైయున్న తెంచు ధాతువునకు మధ్యమముదుజులు, జివర్ణము ఇత్తుగా కలిగినవియును (ముత్తు) పరముగా ఉన్నపుడు, పర్యాయముగా తే అనునదియు, తేరు అనునదియు ఆదేశముగా వచ్చును. 'తే, తేరు అనునవి అనేకాల్లులు. కావున 'తెంచు' అనుమొత్తమునకు ఆదేశ మగును.

అగు ధాతువునకు 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు' అను సూత్రముచే 'తెంచు' చేరి, అగు+తెంచు అని ఉండగా 'వ్యతిరేకంబున లజి యగు' అని లజి చేయగా, అగు+తెంచు+ల్ అని ఉండును. ప్రస్తుతసూత్రముచే 'తెంచునకు 'తే' అన్నది ఆదేశ మై, అగు+తే+ల్ అని ఉండగా 'ఉత్వంబుపయిని దానితకారంబు దకారం బగు' అని దకార మై, అగుదే+ల్ అని కాగా, ప్రథమ పురుష ఏకవచనమునందు డుజు వచ్చి, అగుదేఁడు అని అగును. 'తేరు' అనునది ఆదేశ మైనపక్షమున (క్రియ. 20) అగుదేరఁడు అని అగును. ఇట్లే అరుదెమ్ము, అరుగుదెమ్ము మొ.

'అద్దానికి' అనుటచే అనుప్రయుక్తము కాని'తెంచు'ధాతువునకు ఈకార్యము లేదు. (తెగు) తెంపఁడు తెంపుము మొ. (త్రెంపునకు పర్యాయముగా ఇది అరుదుగ కనబడును.)

'ముత్తు పరం బగునపు' డనుటచేత ముత్తు పరముగా లేనపుడు ఈకార్యము లేదు. అగుదెంచుచున్నది. అరుదెంచెను మొ.

**114. భూతంబున లజికి లిడంతం బగునగుధాతు వనుప్రయుక్తం బగు.**

**వాఁడు రాఁడయ్యెను. వారు రారయిరి.**

**అది రాదయ్యెను. అవి రావయ్యెను.**

**నీవు రా వయితివి. మీరు రా రయితిరి.**

**నేను రా నయితిని. మేము రా మయితిమి.**

భూతార్థమునందు లజి చివర గలిగిన(వ్యతిరేకార్థక మయిన) క్రియా పదములకు చివర (భూతార్థమున వచ్చు) 'లిట్' చివర గలిగినఅగుధాతువు యొక్క రూపములు వచ్చిచేరును.

వాఁడు రాఁడు. ఇందు 'రాఁడు' అనునది లజ్యంత మైనక్రియాపదము. పోవుటలో భూతార్థమును వివక్షించినపుడు రాఁడు అనులజ్యంతక్రియాపదముపై లిడంత మగు అగుధాతువురూపము 'అయ్యెను' అనునది చేరి, 'రాఁ డయ్యెను' అని అగును. 'వచ్చినవాఁడు కాదు' అని ఇట భూతార్థము గుర్తింపవచ్చును.

లజ్యంతము ఏపురుషలో ఏవచనమునం దుండునో లిట్టునందు ఆపురుషలో

అవచనమునం దున్న అగుధాతువురూపము వచ్చి చేరును. నీవు రావు. మధ్యమ పురుషైకవచనము. కావున లిట్టులో మధ్యమపురుషైకవచనాంత మగు అగు ధాతువు రూపము 'అయితివి' చేరును. నీవు రావయితివి. మేము రాము, ఉత్తమపురుష బహువచనము. 'అయితిమి' అనుఉత్తమపురుషబహువచనాంతము చేరి, మేము రామయితిమి.

ఇది తద్ధర్మాదుల(లాట్టు)కును ఉపలక్షణము. అనగా తద్ధర్మాద్యర్థములందు లజికి, తద్ధర్మాద్యర్థములం దయినలాట్టు అంతమందు గలిగిన అగు ధాతువు రూపము వచ్చును. నీవు రా వయ్యెదవు. నమ్మనేర నయ్యెదను మొ.

'భూతంబున' అనుటచే భూతార్థమును వివక్షింపనిచో లిడంత మగునగు ధాతువు చేరదు. నీవు రావు.

ఈకార్యము నిత్యము కాదు. నలుఁ గాన మివ్వనంబున. ఇచట 'కానము–కనినవారము కాము' అని భూతార్థ మున్నను 'కాన మైతిమి' అనురీతిగా ఈకార్యము లేదు. ఇట్లే ఔక్కలు రావు (రావయ్యెను) వచ్చినవి కావు. (ప్రౌఢ. క్రియ. 8)

'లజికి' అనుటచే ఇతరక్రియపై ఈకార్యము లేదు. వచ్చుచున్నాఁడు.

**115. నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కను ప్రయుక్తం బగు నుజికి విభాష నగు.**

**కాను అనునది నుజ్యంతం బగునగుధాతువురూపంబు.**

నుజి (అంత) చివర గలిగినది నుజ్యంతము. అగుధాతువునకు చివర నుజి చేసినచో (అగు+ను). నుజి జిత్తు (ముత్తు) కావున 'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు కారాచొరుచూడు లగు' అనుసూత్రముచే 'అగు' అనుదానికి 'కా' అనునది ఆదేశ మై, 'కాను' అని యేర్పడును. కావున నుజ్యంత మగునగుధాతువు అనగా 'కాను' అనురూపము. క్రియయందలివిశేషమును తెలుపునది క్రియా విశేషణము. నుజి అనగా నుజ్యంతము. నుజి చివర గలిగినధాతువు అని అర్థము.

క్రియావిశేషణ మయినశబ్దములకు చివర 'కాను' అనుశబ్దము చేరును. క్రియకు విశేషణ మయినశబ్దము నుజి చివర గలిగినధాతువు అయినచో దానికి 'కాను' అనునది వికల్పముగా చేరును.

లెస్సగా పలికెను. ఇచట పలుకుట అనుక్రియకు విశేషణము కావున 'లెస్స' అనునది క్రియావిశేషణము. దానికి ప్రస్తుతసూత్రముచేత 'కాను' అనునది చేరి

'లెస్స+కాను' అని యుండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనుసూత్రముచే గకారము నిత్యముగా వచ్చి, లెస్సగాను (పలికెను) అని అగును.

'నుజ్యంతమునకు వికల్పముగా వచ్చును. చూడన్ నుజ్యంతము. కాను చేరినచో చూడఁగా (వచ్చెను). విభాష కావున రానిపక్షమునందు చూడను (వచ్చెను) మొ.

'క్రియావిశేషణంబులకు' అనుటచే ఇతరము లగువిశేషణములకు చేరదు. నల్లని ఆవు, నల్లగా ఆవు ఇత్యాదిగా 'కాను' చేరదు.

'అనుప్రయుక్తము' అనుటచే ఈ 'కాను' అనునది ప్రత్యేకముగా అర్థము నీయదు. విశేషణముయొక్క అర్థమునందె ఉండును. లెస్సగా పలికెను=లెస్స పలికెను.

**116. దానికి హ్రస్వంబు విభాష నగు.**

**లెస్సగాను - లెస్సగను. న్యాయ్యముగాను - న్యాయ్యముగను. ఇట సరళంబు నిత్యంబు. చూడఁగాను - చూడఁగను - చూడను. ఇట స్వత్వంబు లేదు.**

దానికి అనగా 'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కను ప్రయుక్తం బగు నుజికి విభాష నగు' అనుపూర్వసూత్రముచే అనుప్రయుక్త మయి వచ్చిన 'కాను' అనుశబ్దమునకు. హ్రస్వమును విధించుటచే అది దీర్ఘమునకే కావలెను. 'కాను' అనుదానిలో దీర్ఘము మొదటిది ఒక్కటె. కావున అనుప్రయుక్త మయిన 'కాను' అనుదానిలో మొదటి దైనదీర్ఘమునకు వికల్పముగా హ్రస్వము వచ్చును.

'న్యాయ్యము' అనుశబ్దముపై 'నుజ్యంతం బగునగుధాతువు' అనుసూత్రముచే 'కాను' చేరగా (న్యాయ్యము+కాను) ప్రస్తుతసూత్రముచేత హ్రస్వము వచ్చి, న్యాయ్యము+కను. 'ప్రథమమీఁదిపరుషములకు' (సంధి.13) అనుసూత్రమునందలి బహుళశబ్దముచే ఇచట గకారము నిత్యముగా వచ్చి, 'న్యాయ్యముగను' అని అగును. విభాష అనుటచే హ్రస్వము రాకున్నపక్షమున 'న్యాయ్యముగాను' అని దీర్ఘమె ఉండును. ఇట్లే చూడఁగను చూడఁగాను మొ.

'దానికి' అనుటచే అనుప్రయుక్త మైన 'కాను'నకే హ్రస్వము. కావున అనుప్రయుక్తము కాని 'కాను'నకు హ్రస్వము లేదు. కావలయును, కాఁబోలుమొ.

**117. ఉన్నకలనవర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు.**

**బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు. వండుచున్నవాఁడు-వండుచున్నాఁడు. వండుచున్నవారు-వండుచున్నారు. వండుచున్నవాఁడవు-వండుచున్నాఁడవు-వండుచున్నవారరు-వండుచున్నారరు. వండుచున్నవాఁడను-వండుచున్నాఁడను. వండుచున్నవారము-వండుచున్నారము. ఇట్లు వండఁగలవాఁడు-వండఁగలాఁడు. వండినవాఁడు-వండినాఁ డిత్యాదు లెఱుంగునది.**

'ఉన్నకలజినవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనుసూత్రముచే ఉన్న, కల, న అనుప్రత్యయములు విధింపబడినవి. ఈప్రత్యయములకు పరముగా ఉన్న తత్ అనుశబ్దముయొక్క అర్థము కలిగిన 'వాఁడు' మొద లగువానిలోని పొల్లువకారమునకు వికల్పముగా లోపము వచ్చును.

'ఉన్న' అనుప్రత్యయము అంతమందు కలిగిన 'వండుచున్న' అనుధాతుజ విశేషణముపై ప్రథమావిభక్తి ఏకవచనమును వివక్షింపగా 'ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అనుసూత్రము ననుసరించి తచ్ఛబ్దము చేరి, మహదర్థమున ప్రథమైకవచనమునందు వండుచున్నవాఁడు అని యగును. ఇపుడు ప్రస్తుతసూత్రముచే 'వాఁడు' లో వకారపుపొల్లు లోపింపగా, వండుచున్న+ఆఁడు అనుచో 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనుసూత్రము నందలిబహుళపదముచే సంధి నిత్యముగా జరిగి, 'వండుచున్నాఁడు' అని అగును. విభాష అనుటచే వకారము లోపింపనిపక్షమునందు 'వండుచున్నాఁడు' అని యుండును. ఇట్లే వండఁగలవాడు-వండఁగలాడు. వండినవాఁడు-వండినాఁడు.

'ఉన్నకలనవర్ణకంబుల మీఁది' అనుటచే ఇతరవర్ణకంబులమీద ఈలోపము లేదు. వండెడువాఁడు, వండనివాఁడు మొ.

'తచ్ఛబ్ద' అనుటచే తదర్థకము కానిశబ్దములోనివకారమునకు లోపము లేదు. 'పోరుచున్నవీరుఁడ' మొ.

'వకారంబునకు' అనుటచే ఇతరవర్ణమునకు లోపము లేదు. వచ్చిన యతఁడు, వచ్చినయామె, మొ.

**118. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునీయవి శబ్దపల్లవంబులు నాఁబడు.**

**కూరుచుండు-నిలుచుండు-పరుండు,పన్నుండు-ఆఁకొను-ఈకొను, ఈయకొను-ఇయ్యకొను. రక్కొను-త్రెక్కొను-మేకొను-మయికొను-మేలుకొను-మేలుకను-మేలుకాంచు-అలవడు-ఏరుపడు-చొప్పడు-వెలువడు-తలపోయు-వాపోవు-కొంపోవు-కొనిపోవు-విజయంచేయు-కయివ్రాలు-తూపొడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.**

ధాతువు మొద లగుశబ్దములకు చివర ధాతువులు చేరి, అందలిశబ్దములకంటె భిన్న మైన (విలక్షణ మైన) వేఱొకఅర్థమును బోధించుశబ్దములకు శబ్దపల్లవములు అని పేరు. దీనినిబట్టి 1.శబ్దపల్లవములలో రెండు అవయవము లుండును,2.అందు మొదటిశబ్దము ధాతువు కాని, వే ఱొకటి కాని కావచ్చును, 3.శబ్దపల్లవములో రెండవఅవయవము తప్పనిసరిగా ధాతువే అగును, 4. ఆమొత్తము శబ్దము, అం దున్న రెండుఅవయవశబ్దములఅర్థముకంటె వే రయినఅర్థమును ఇచ్చును. ఈలక్షణములు కలిగినవి శబ్దపల్లవములు అయిన ధాతువులు.

కూరుచుండు. ఇందు కూరుచు అనుధాతువునకు ఉండు అనుధాతువు అనుప్రయుక్త మై, ఆసీన మగు అనువిలక్షణ మైనఅర్థము నిచ్చుచున్నది. కావున ఇది శబ్దపల్లవము. 'విజయంచేయు' ఇందు విజయము అనుప్రథమాంత మగు పదమునకు చేయు ధాతువు అనుప్రయుక్త మైనది. విలక్షణ మైన 'వచ్చు' అను అర్థము వచ్చుచున్నది.

ఇట్లు భాషయందు ధాతువులు, నామములు, ప్రథమాద్యంతములు మొద లగుఆయాశబ్దములపై ఆయాధాతువులు చేరి, శబ్దపల్లవములుగా ఏర్పడుట కవిప్రయోగములను అనుసరించి గ్రహింపవలెను. ఇందు వర్ణవికారములకు లక్షణము చేయబడలేదు. కావున శబ్దపల్లవములలో జరుగుమార్పులను కవిప్రయోగములను ఆధారముగా చేసికొని గుర్తింపవలసియున్నది. ఆఁకలి+కొను = ఆఁకొను. ఇచ్చు+కొను = ఈకొను, ఈయకొను. కొని+పోవు, కొనిపోవు= కొంపోవు. మొద లగునవి శబ్దపల్లవములు.

**119. చేదర్థయోగంబున లృట్టునకు లి ట్టగు.**

**ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్**
**వాఁడు ఱేపు వచ్చె నేని నీవు కార్యంబు దొరఁకొనుము.**

చేత్ అనుశబ్దముయొక్క అర్థముతో అన్వయము కలిగినపుడు భవిష్యదర్థమునం దుండుధాతువునకు లృట్టునకు బదులుగా 'లిట్టు' వచ్చును. తెలుగున ఏని, ఆ మొద లగునవి చేదర్థమునం దున్నవి.

ఱేపు వచ్చె నేని – 'ఏని' అను చేదర్థకశబ్దముతో అన్వయము కలిగియున్న వచ్చు క్రియ ఱేపు అనుదానినిబట్టి భవిష్యదర్థమున నుండుట స్పష్టము. కావున 'భావిని లృ ట్టగు' అనుసూత్రముచే ఇచ్చటి 'వచ్చు' ధాతువునకు లృట్టు రాగా ప్రస్తుతసూత్రముచే ఆలృట్టుస్థానమునందు లిట్టు వచ్చి, ప్రథమపురుషైకవచనము నందు 'వచ్చెను' అని అయి, 'వచ్చె నేని' అని అగును.

'చేదర్థయోగంబున' అనుటచే చేదర్థముతో అన్వయ మున్నపుడే లృట్టునకు లిట్టు వచ్చును. లేనిచో 'వాఁడు ఱేపు రాఁగలడు అపుడు నీవు కార్యంబు దొరకొనుము. అని లృట్టు అట్లే ఉండును.

'లృట్టునకు' అనుటచే (చేదర్థయోగమునందు) భవిష్యదర్థమున లృట్టు గాక లాట్టు చేసినచో అది అట్లె ఉండును. వాఁడు ఱేపు వచ్చు నేని నీవు కార్యంబు దొరకొనుము.

'అగు' అనుటచే లిట్టు నిత్యము గావున 'ఆఋషీశ్వరుండు రాఁగలఁడా ఫలించుఁ గార్యముల్' అనురీతిగా లృట్టుతోడిరూప ముండదు.

**120. ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు.**

**రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుం డయి సాకేతంబున కేతెంచె.**

ఆత్మార్థము అనగా 'తాను' అనుశబ్దము. 'తాను' అనునది క్రియచేత చెప్పబడునపుడు, ఆవాక్యమునందలిధాతువునకును, విశేషణములకును 'తాను' అనుదానికి సంబంధించినశబ్దముయొక్క లింగమును, వచనమును వచ్చును.

రాముఁడు సీతయు తాను సౌమిత్రిసహితముగ పుష్పకారూఢుఁ డయి వచ్చెను. ఇచట 'తాను' అనుఆత్మార్థకశబ్దము ప్రయోగింపబడినది. (క్రియచేత చెప్పబడు చున్నది) తాను అనుశబ్దముచే బోధింపబడునది 'రాముఁడు'. రాముఁడు పుంలింగము (మహత్తు). (ప్రథమా) ఏకవచనమునం దున్నది. కావున ఇందలి విశేషణము అయిన 'పుష్పకారూఢ' శబ్దమునకును, 'వచ్చు' అనుధాతువునకును పుంలింగ మహత్ ఏకవచనములే అయినవి. రామునితోపాటు, సీతయు, సౌమిత్రియు పుష్పకారూఢు లైరి. అయినను 'పుష్పకారూఢుఁడు' అని ఏకవచనమె అయినది. ఇట్లె క్రియయును సీత, సౌమిత్రి, రాముఁడు అనుముగ్గురుకర్తలతో బహువచనాంతము కావలసియున్నను 'తాను' శబ్దమును అభిహితము చేయుట ననుసరించి రాముడు అనుదానిని అనుసరించి 'ఏతెంచెను' అని ఏకవచనమునం దున్నది.

సీత, లవకుశలును, దాను వేదికారూఢ యయి దర్శనం బిచ్చెను. అనుచో 'సీత'ను అనుసరించి విశేషణము స్త్రీలింగమునందు ఏకవచనాంత మయినది.

'ఆత్మార్థం బభిహితం బగుచో' అనుటచే ఆత్మార్థము అభిహితము కానపుడు విశేషణములును, క్రియలును బహువచనాంతములె అగును. రావణుం బరిమార్చి రాముఁడు సీత, సౌమిత్రియును పుష్పకారూఢు లయి సాకేతంబున కేతెంచిరి.

**121. అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు.**

**భూ, నృ, కృ, రేకృ, లోకృ, లోచ, పచి, లప ఇత్యాదులకు గతివిరహితంబు లగుధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు. ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప, ఊరీప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞాకంబులు. ప్రాదు లిరువది రెం డుసర్గంబులు నాఁబడు.**

**ప్రభవించు, ఆవిర్భవించు, ప్రసరించు, సంస్కరించు, భస్మీకరించు, సాక్షాత్కరించు, అతిరేకించు, ఆలోకించు, ఆలోచించు, ప్రవచించు, ప్రలపించు ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది.**

ప్ర, మొద లగు ఉపసర్గలకును, ఊరీ మొద లగువానికిని, సాక్షాత్ – మొద లగువానికిని 'గతి' అని సంజ్ఞ. గతిసంజ్ఞ కలిగిన వీనితో కూడనివి అగతికములు. భూ (ఆది) మొద లగునవి భ్వాదులు. గతిసంజ్ఞ కలిగిన వగు ప్ర, పరా మొద లగువానితో కూడియుండనప్పుడు 'భూ' మొద లగుసంస్కృతధాతువులకు తెలుగు భాషలో ప్రయోగము లేదు.

'భూ' అనుధాతువు తెలుగులోనికి వచ్చిన, ఇంచుగాగమ మయి అవు గాగమముతో 'భవించు' అని కావలెను. సృ–సరించు, కృ–కరించు మొ. కాని యీధాతువులు కేవలముగా తెలుగులో ప్రయోగింపబడవు. కావున 'భవించు చున్నాఁడు' అనురీతిరూపము లుండవు.

'అగతికంబులు' అనుటచే గతిసంజ్ఞ కలిగిన 'ప్ర' మొద లగువానితో కలిసి యున్నపుడు భూ మొద లగునవి తెలుగున ప్రయోగింపబడును. ప్రభూ – ప్రభవించు. అనుసృ – అనుసరించు. అనుకృ – అనుకరించు. ప్రభవించుచున్నది, అనుసరించెను, అనుకరించుట మొ.

'భ్వాదులకు' అనుటచే భూ మొద లగువానిలో చేరనిసంస్కృతధాతువులు అగతికము లయినను తెలుగున ప్రయోగింపబడును. జి – జయించు. సృజ్ – సృజించు మొ. ఇవి గతిసంజ్ఞకములతో కూడియున్నపుడు తెలుగున ప్రయోగింపబడుటలో విశేషము లేదు. నిర్జి–నిర్జించు. విసృజ్–విసర్జించు మొ.

**122. వలయ్యాదిక్రియలకుం గర్త యగుభావంబునందు నుజీ యగు.**

**వలయ్యాదిక్రియలకుం గర్తృభూతక్రియావృత్తి యగుధాతువునకు నుజీ వర్ణకం బగు. వాఁడు చూడవలయు, వారలు చూడఁగా వలయు; నీవు చూడవలయు, మీరు చూడవలయు, నేను జూడవలయు, మేము చూడ వలయు, మనము చూడవలయు. వలయును-వలదు-కూడును- కూడదు- చెల్లును-చెల్లదు-తగును-తగదు ఇత్యాదులు వలయ్యాదులు.**

వలయు (ఆది) మొద లగునవి వలయ్యాదులు. భావము అనగా ధాత్వర్థము (వ్యాపారము). వలయు మొద లగుక్రియలకు కర్త అయినవ్యాపారమునందు వర్తించుధాతువునకు 'నుజీ' అనుప్రత్యయము వచ్చును. నుజీలో జీవర్ణము ఇత్తు. కావున నువర్ణమె నిలుచును.

వాఁడు చూడవలయు. వాడు చూచుట వలయును అని అర్థము. 'వలయుట' అనుక్రియకు కర్త 'చూచుట' అనునది. అంతే కాని 'వాడు' కాదు. (అందువలననే నీవు చూడవలయును మేము చూడవలయును అనుచోట్ల గూడ 'వలయు' అనుదానిలో మార్పు లేదు). కావున వలయును అనుదానికి కర్త అయిన 'చూచుట' అను(భావార్థక)వ్యాపారమును బోధించు 'చూచు' అనుధాతువునకు ప్రస్తుత సూత్రముచే నుజీ అయినది. చూచు+ను అని యుండగా ను(జి) జీత్తు (ముత్తు) కావున 'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు కారాచొరుచూడు లగు' అనుసూత్రముచే 'చూడు' అనునది ఆదేశ మై, చూడు+ను అని ఉండగా 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే అత్వము వచ్చి (చూడనువలయు) స్థిరపరకద్రుతలోపముచే 'చూడవలయు' అని యైనది.

ఇట్లె నీవు చూడఁగూడదు. మేము చూడఁదగును మొ.

**సకర్మకంబునకు స్వార్థప్రేరణార్థంబులు రెండును గొనుపద్వనుబంధంబు లం దొక్కొక్కటితోడం గూడుచో నగునవి యాఱుం గూడ రూపంబు లెనిమి దయ్యె. వాని సొరిది నుదాహరించెద.**

| | | |
|---|---|---|
| **కర్త్రర్థకము** | **-** | **మైత్రుండు వంటకమును వండెను.** |
| **ఆత్మనేపదకర్త్రర్థకము** | **-** | **మైత్రుఁడు వంటకము వండుకొనియెను.** |
| **కర్మార్థకము** | **-** | **మైత్రునిచే వంటకము వండఁబడియెను** |
| **ఆత్మనేపదకర్మార్థకము** | **-** | **మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను.** |
| **ప్రేరణకర్త్రర్థకము** | **-** | **చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను.** |

**ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము– చైత్రుడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను.**

**ప్రేరణకర్మార్థము – చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపఁబడియెను.**

**ప్రేరణాత్మనేపదకర్మార్థకము–చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను.**

కర్మను గూర్చినఆకాంక్ష కలిగినధాతువు సకర్మకము. వండు మొద లగునవి. సకర్మకము లైనధాతువులకు, కర్త్రర్థము, కర్మార్థము, ఆత్మనేపదార్థము, ప్రేరణార్థములలో మొత్తము ఎనిమిదివిధము లైనరూపములు ఏర్పడును.

1. కర్త్రర్థమునందు అనగా కర్తను బోధించునపు డొక్కటి. **వండెను.**

2. ప్రేరణార్థమునందు, కర్తను బోధించుచు ఇంచుక్ మొద లగు ఆగమములతో ఒకరూపము కలుగును. **వండించెను.**

3, 4. పయివి రెండును ఆత్మనేపదార్థమునందు కర్తను బోధించునపుడు కొను ధాతువు చేరి రెండురూపములను పొందును. **వండుకొనెను, వండించుకొనెను.**

5, 6. స్వార్థమునందును ప్రేరణార్థమునందును ఉన్న (వండు, వండించు) ధాతువు కర్మను బోధించునపుడు 'పడు' అనుఅనుబంధముతో రెండు రూపములందును. **వండఁబడెను, వండింపఁబడెను.**

7, 8. స్వార్థమునందును, ప్రేరణార్థమందును ఉన్నధాతువులు (వండు – వండించు) కర్మను తెలుపుచు ఆత్మనేపదార్థకము లైనపుడు కొనుధాతువు చేరుటతో రెండు రూపము లగును. **వండుకొనఁబడెను. వండించుకొనఁబడెను.**

**123. గతి బుద్ధి ప్రత్యవసానార్థక శబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు.**

**పొందు మొద లగునవి గత్యర్థకంబులు. తెలియు మొద లగునవి బుద్ధ్యర్థకంబులు. తిను మొద లయినవి ప్రత్యవసానార్థకంబులు. విను, చెప్పు, చదువు మొద లయినవి శబ్దకర్మంబులు. అకర్మంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొందెను. చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను. లాఁతిచో సహిత మిక్కార్యంబు కానంబడియెడి. మైత్రుండు పుడమి నేలెను. చైత్రుండు మైత్రుని బుడమి నేలించెను.**

గత్యర్థకములు, బుద్ధ్యర్థకములు, ప్రత్యవసానార్థకములు, శబ్దకర్మములు, అకర్మకములు అయినక్రియలకు స్వార్థమునందు కర్త యైనది ప్రేరణార్థమునందు కర్మము అగును.

1. గత్యర్థకములు : గమనమును బోధించునవి గత్యర్థకములు. పొందు, చేరు, మొద లగునవి. **మైత్రుఁడు** గ్రామమును **పొందెను**. అనుచో స్వార్థమునందు కర్త మైత్రుఁడు. క్రియ ప్రేరణార్థమునందు 'పొందించు' అని అయినపుడు కర్త అయిన మైత్రశబ్దము కర్మ అగును. 'చైత్రుడు **మైత్రుని** గ్రామంబుం **బొందించెను**.' ఇచట మైత్రశబ్దము కర్మ అగుటచే 'కర్మంబున ద్వితీయ యగు' అనుసూత్రముచే ద్వితీయావిభక్తి యైనది.

2. బుద్ధ్యర్థకములు : బోధ (జ్ఞానము)ను తెలుపునవి బుద్ధ్యర్థకములు. తెలియు ఎఱుగు మొద లగునవి. **మైత్రుఁడు ఎఱిఁగెను**. (స్వార్థము) మైత్రుండు కర్త. చైత్రుఁడు **మైత్రుని ఎఱింగించెను** (ప్రేరణము) 'మైత్రుని' కర్మ.

3. ప్రత్యవసానార్థకములు : ప్రత్యవసానము (తినుట)ను బోధించునవి ప్రత్యవసానార్థకములు. తిను, భుజించు మొద లగునవి. **మైత్రుఁడు తినెను.** (స్వార్థము). 'మైత్రుడు' కర్త. చైత్రుఁడు **మైత్రుని తినిపించెను**. (ప్రేరణము) 'మైత్రుని' కర్మ.

4. శబ్దకర్మము : శబ్దము కర్మగా కలిగినవి శబ్దకర్మములు. విను, చదువు మొద లయినవి. **మైత్రుఁడు చదివెను**. (స్వార్థము). మైత్రుఁడు కర్త. చైత్రుడు **మైత్రుని చదివించెను.** (ప్రేరణము) 'మైత్రుని' కర్మ.

5. అకర్మకము : కర్మను గూర్చినఆకాంక్ష లేనిది అకర్మకము. **సంతోషము కలిగెను.** (స్వార్థము). సంతోషము కర్త. రాముఁడు **సంతోషమును కలిగించెను.** (ప్రేరణము) 'సంతోషమును' కర్మ.

'గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మంబులు' కానిధాతువులకు స్వార్థమున కర్త యైనది. ప్రేరణార్థమునందు కూడ కర్తయే యగును గాని కర్మము కాదు. మైత్రుఁడు వండెను. (స్వార్థము) మైత్రుఁడు కర్త. చైత్రుఁడు మైత్రునిచేత వండించెను. ఇచట ప్రేరణార్థమునందును కర్త మైత్రుఁడె. అందుకే 'చేత వర్ణకంబు కర్త కగు' అనుసూత్రముచే కర్తను తెలుపు 'మైత్ర' శబ్దమునకు 'చేత' ప్రత్యయము వచ్చినది.

### 124. అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు.

**రాముఁడు మిథిలం గనియె. రామునకు మిథిల గనంబడియె. రామునిచే మిథిలఁ గనంబడియె. మైత్రుండు తత్త్వంబు దెలిసెను. చైత్రుఁడు మైత్రునకుం**

**దత్త్వంబు దెలిపెను. కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా నగు. విశ్వామిత్త్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుఁ డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.**

అభిహితము అనగా క్రియచేత చెప్పబడినది. అనభిహిత మనగా చెప్పబడనిది. క్రియచేత చెప్పబడనికర్తకు 'చేతవర్ణకంబు కర్త కగు' అనుసూత్రముచే చేత అనుప్రత్యయము వచ్చును. రామునిచేత రావణుఁడు సంహరింపబడియె. ఇట్టి, క్రియచేత చెప్పబడనికర్తకు కొన్నియెడల బహుళముగా షష్ఠీవిభక్తి వచ్చును.

రామునకు మిథిల కనంబడియె – ఇచట 'కనఁబడియె' అనుక్రియాపదము కర్మ అయిన మిథిలను బోధించుచున్నది. క్రియచేత కర్త అభిహితము కాలేదు (చెప్పబడలేదు) కావున అనభిహిత మైన ఈకర్తకు ప్రస్తుతసూత్రముచే షష్ఠి వచ్చి రామునకు (మిథిల) గనంబడియె అని యైనది. 'బహుళము' అనుటచేత షష్ఠీ విభక్తి రానపుడు 'చేతవర్ణకంబు కర్త కగు' అనుసూత్రముచే చేత ప్రత్యయము వచ్చి, 'రామునిచేత మిథిల గనంబడియె' అని యుండును. ఇట్టిచోట్ల విభాష.

'అనభిహితకర్తకు' అనుటవలన క్రియచేత అభిహిత మైన (చెప్పబడిన) కర్తకు షష్ఠి రాదు. 'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనుసూత్రముచే ఉక్తార్థమునందు ప్రథమ వచ్చును. రాముడు మిథిలం గనియె.

'ఒకానొకచో' అనుటచే అనభిహిత మైనచోట్లను కర్తకు షష్ఠి వచ్చుట అరుదు. 'రామునిచేత రావణుఁడు సంహరింపఁబడియె' అనువిధముగా చేతవర్ణకమె వచ్చును. రామునకు రావణుఁడు సంహరింపబడియె అనురీతిగా షష్ఠి రాదు.

'బహుళము' అనుటచేత విశ్వామిత్రుడు 'రామునకు మిథిలం గానిపించెను' మొద లగుచోట్ల షష్ఠీవిభక్తి నిత్యముగా వచ్చును. ఇచట ప్రవృత్తి.

**అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమింజేసి రూపభేదంబు లయి దని యెఱుంగునది.**

కర్త్రర్థకము – చైత్రుండు మనియెను
ప్రేరణకర్త్రర్థకము – చైత్రుండు మైత్రుని మనిచెను
ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము – చైత్రుండు మైత్రుని మనుచుకొనియె
ప్రేరణకర్మార్థకము – చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె
ప్రేరణాత్మనేపదకర్మార్థకము – చైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె.

అకర్మకంబునకు : కర్మను గూర్చినఆకాంక్ష లేనిది అకర్మకము. దీనికి స్వార్థమునందు ఆత్మనేపదార్థమును, కర్మార్థమును ఉండవు. కావున అయిదు విధములుగనె రూపములు ఏర్పడును.

1. (స్వార్థ) కర్త్రర్థమునందు అనగా కర్తను బోధించునపుడు ఒక్కటి. **మనియెను.**

2. ప్రేరణార్థమునందు కర్త్రర్థమున ఒకరూపము. **మనిచెను.**

3. స్వార్థమునందు, పడు,కొనులు రావు. కావున ప్రేరణార్థమునం దున్న ధాతువునకు ఆత్మనేపదార్థమునందు కర్తను బోధించునపుడు 'కొను' చేరి ఒకరూపము. **మనుచుకొనియె.**

4. ప్రేరణార్థమునం దున్నధాతువు కర్మను బోధించునపుడు 'పడు' అను అనుబంధముతో ఒకరూపము. **మనుపఁబడెను.**

5. ప్రేరణార్థమునం దున్నధాతువు ఆత్మనేపదార్థమునం దుండి కర్మను తెలుపుచో 'పడు' అనుబంధముపై కొనుధాతువు అనుప్రయుక్త మయి, ఒకరూపము. మనుచుకొనఁబడెను.

ఇట్లు 1. స్వార్థము (మనెను), 2. ప్రేరణార్థకమైన చుక్ మొద లగుఆగమముతో ఒకటి (మనుచు), 3. ప్రేరణార్థక మైనఆగమముపై 'కొను' ధాతువు అనుప్రయుక్త మయి ఒకటి, (మనుచుకొను), 4. పడు అనుబంధ మయి ఒకటి, (మనుపఁబడు), 5. కొను, పడులు రెండును చేరి ఒకటి, (మనుచుకొనఁబడు) అని మొత్తము అయిదు రూపములు సాధారణముగా ఏర్పడును.

**వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు కలిగినచో సకర్మకంబు నకుం బంద్రెండును సకర్మంబునకుం దొమ్మిదియు భేదంబు లని యూహించునది.**

'ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు' అనుసూత్రము ననుసరించి ప్రేరణార్థమునందు వచ్చిన, 'చుక్, పుక్,' అను ఆగమములమీద మరల ప్రేరణార్థమునందు ఇంచుక్ అనుఆగమము వచ్చును. ప్రేరణార్థమునందు ఒకఆగమము వచ్చునపుడు సకర్మక మైనధాతువునకు 8 విధములుగను అకర్మకము అగుధాతువునకు 5 విధములుగను రూపములు ఏర్పడును. ప్రేరణార్థములలో రెండు ఆగమములు కలిగినపుడు సకర్మక మైనధాతువునకు

– 12 రూపములు. అకర్మకమునకు 9 విధము లయినరూపములును ఏర్పడును. ఈఆగమములు ఆచ్ఛికములకే అవును గావున ఈరూపబేధములు ఆచ్ఛికధాతువులకే కలుగును.

**సకర్మకము - మాను**

1. స్వరూపము - మానెను
2. ప్రేరణమునందు చుగాగమముతో - మానిచెను
3. మరల ప్రేరణమున చుగాగమముపై ఇంచుగాగమముతో - మానిపించెను

(పయి మూడింటిపై ఆత్మనేపదార్థములో కొను అనుప్రయుక్త మగును)

4. స్వరూపముపై కొను - మానుకొనెను
5. చుగాగమముపై కొను - మానుచుకొనెను
6. (చుక్) ఇంచుక్కుపై కొను - మానిపించుకొనెను

(మొదటి మూడింటిపై కర్మార్థమున పడుచేరును)

7. స్వరూపముపై పడు - మానఁబడెను
8. చుక్కుపై పడు - మానుపఁబడెను
9. (చుక్) ఇంచుక్కుపై పడు - మానిపింపఁబడెను

(మొదటిమూడింటిపై (ఆత్మనేపదకర్మార్థమున) కొను, పడు అనునవి రెండును చేరును. (అనగా పైనున్న4,5,6 స్థలములయందలిధాతువుపై 'పడు' చేరినవి)

10. స్వరూపముపై కొను+పడు - మానుకొనఁబడెను
11. చుక్కుపై కొను+పడు - మానుచుకొనఁబడెను
12. (చుక్కు) ఇంచుక్కుపై కొను+పడు - మానిపించుకొనఁబడెను

**అకర్మకము - మను**

1. స్వరూపము - మనియెను
2. ప్రేరణమునందు - మనిచెను
3. మరల ప్రేరణమునందు చుక్కుపై ఇంచుక్కుతో - మనిపించెను

(ప్రేరణార్థకము లగుఆగమములపై ఆత్మనేపదార్థమున 'కొను' చేరును).

4. చుక్కుపయి 'కొను' చేరి - మనుచుకొనెను
5. (చుక్కు) ఇంచుక్కు పయి 'కొను' చేరి - మనిపించుకొనెను

(ప్రేరణార్థకము లగు ఆగమములపై కర్మార్థమున పడు చేరును)

6. చుక్కుపై 'పడు' చేరి - మనుపఁబడెను

7. (చుక్కు) ఇంచుక్కుపై 'పడు' చేరి - మనిపింపఁబడెను

(ప్రేరణార్థకము లగు ఆగమములపై ఆత్మనేపదకర్మార్థమున కొను, పడు లు రెండును చేరును)

8. చుక్కుపయి కొను+పడు - మనుచుకొనఁబడెను

9. (చుక్కు) ఇంచుక్కుపయి కొను+పడు - మనిపించుకొనఁబడెను.

**ఇది క్రియాపరిచ్ఛేదము**

# కృదంతపరిచ్ఛేదము

## 1. కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.

**ధాతువునకు విహితం బయినడుఙ్భిన్నప్రత్యయంబు కృత్తు నాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ఆఁక=బంధనము, మొలక=నవోద్భిదము, ఏలిక=పాలకుఁడు, కోరిక=వాంఛయు, వాంఛితంబును, మూఁక=సంఘము, ఆడిక=నింద, పూడిక=స్రోతస్సు.**

ధాతువుపైని విధింపబడిన 'డుఙ్' అనుదానికంటె భిన్న మయిన ప్రత్యయమునకు కృత్తు అని పేరు. డుఙ్ అనగా లకారంబునకు 'డుద్రు వురు నుము ఙ్గు' అనుసూత్రముచే విధింపబడిన 'డుఙ్రు, వురు, నుము' అనునవి. వీనిస్థానమున విధింపబడిన వగుటచే, ది, వి, దు, వు, ము, డుఙు, ఎడు, త, మొద లగునవి కూడ 'డుఙ్లు' అనుదానిచే సంగ్రహింపబడును. కావున ఆ ప్రత్యయములు కాక ధాతువుమీద విధింపబడినమిగిలినప్రత్యయములు కృత్తులు. 'టవర్ణకంబు భావంబునం దగు' అని చెప్పిన 'ట' వర్ణకము మొద లగునవి కృత్తులు. డుఙ్లుభిన్న మగుప్రత్యయమె కృత్తు. కావున ధాతువున కాగమములుగా చెప్పిన ఇంచుక్, మొద లగుఆగమములకు కృత్తు అనుపేరు లేదు. కృ త్తయిన ప్రత్యయము చివర గలిగినది కృదంతము. 'కృత్తద్ధితసమాసా శ్చ' అనులక్షణముచే కృదంతము ప్రాతిపదికసంజ్ఞను పొందును. కావున దానిపై ప్రథమ మొద లగు విభక్తులు చేరును. వండుట, వండుటయందు మొ.

ఆచ్ఛికము లైనధాతువులమీద మాత్రమే వచ్చు 'కృత్తులు' కృదంతపరిచ్ఛేదమున చెప్పబడినవి. ఈకృత్ప్రత్యయములు ఏవి ఏఅర్థమునందు వచ్చును? అనువిషయము ఇచట విధింపబడుట లేదు. ఆయాకృత్ప్రత్యయములయొక్క అర్థము (భావార్థము, కర్త్రర్థము, కర్మార్థము మొద లగువానిని) మహాజనులయొక్క వ్యవహారమును అనుసరించి గ్రహింపవలయును.

ఆఁక అనుచో ఆఁగు అనుధాతువుపై 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అను సూత్రముచే 'క' అనుకృత్ప్రత్యయము భావార్థమునందు వచ్చినది. బంధనము అని అర్థము. అదే సూత్రముచే వచ్చిన 'క' ప్రత్యయము (మొలచు+క) 'మొలక' అనుచోట (మొలచినది) కర్త్రర్థమునం దయినది. కోరుధాతువుపై 'ఇకవర్ణకం బంజ్వాదుల కగు' అనుసూత్రముచే భావార్థమునను, (కోరిక=వాంఛ) కర్మార్థమునను (కోరిక–కోరఁబడినది) వచ్చినది. ఇట్లు వచ్చు ఆయాకృత్ప్రత్యయ

ములయొక్క అర్థమును గూడ లక్షణబద్ధము చేయుటలో గౌరవ మధిక మగు నని కృత్తుల యర్థములు వ్యవహారమును అనుసరించి గ్రహింపవలె నని చెప్పబడినది.

**2. ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు.**

**కృత్సంబంధు లగుకాదులు పరంబు లగునపుడు ధాతువునంతంబు లగు క, గ, చ, య, వ, లకు లోపం బగు. మీఁదిలక్ష్యంబులం జూడంబడు.**

(ఇట)ఈకృదంతపరిచ్ఛేదమునందు (కృత్ క గ త ప వ ఇమి – లు) చెప్పబడిన కృత్ప్రత్యయములందలి, కకారము, గకారము, తకారము, పకారము, వకారములును, 'ఇమి' అనుప్రత్యయమును పరముగా నున్నపుడు ధాతువు చివర నున్న 'కగచయవ' అను హల్లులు వానిపై నున్నఅచ్చులతో కూడి లోపించును. కగతపవేములలో ఏది పర మైనను కగచయవలలో ఏది యైనను లోపించును.

'పోవు' అనుధాతువుపై 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనుసూత్రముచే 'క' అనుప్రత్యయము చేరి, పోవు+క అని అగును. కప్రత్యయమునందలి కకారము పరముగా ఉన్నది కావున పోవుధాతువు చివరి వకారము అచ్చుతో గూడ అనగా 'వు' అనువర్ణము మొత్తము ప్రస్తుతసూత్రముచే లోపించి, 'పోక' అనుకృదంత ప్రాతిపదికరూప మేర్పడును.

ఇట్లే 1. బ్రదుకు+ఇమి=బ్రదిమి, 2. తిరుగు+గడ=తిరుగడ, 3. ఆవులించు+త=ఆవులింత, 4. తిరియు+ప=తిరిపము, 5. నిలుచు+వు=నిలువు. మొ.

'ఇట' అనుటచే కృదంతపరిచ్ఛేదమునందలికృత్తులకగతపవేములు పర మయినపుడే కగచయవలకు లోపము వచ్చును. కావున క్రియాపరిచ్ఛేదమున చెప్పినకృత్తులు పర మయినపు డీకార్యము లేదు. తీయుధాతువునకు 'కజి వ్యతిరేక క్త్వార్థంబునం దగు' అనుసూత్రముచే 'కజి' రాగా, తీయు+క–తీయక అని అగును.

'కగతపవేములు' అనుటచే కృత్తులందలిఇతరవర్ణము పర మైనపుడు ఈకార్యము లేదు. అరయు+ఇక=అరయిక.

'కగచయవలకు' అనుటచే ఇతరము లైనఅక్షరములకు లోపము లేదు. తాలు+ఇమి=తాలిమి, మను+వు=మనువు. 'కగతపవ' అనుసామాన్యనిర్దేశముచే కృత్తులందలిఈహల్లులు ఏఅచ్చుతో కూడియున్నవి పర మైనను లోపము వచ్చును, అలుగు+క=అలుక. అడఁగు+కువ అడఁకువ.

**3. కవర్ణకం బలుగ్వాదుల కగు.**

**అలుగు-అలుక, ఆఁగు-ఆఁక, ఎఱుఁగు-ఎఱుక, ఇట బిందు లోపంబు. ఇట్లు గొన్నింట గ్రహించునది. కడఁగు-కడఁక. కలఁగు- కలఁ క, కాఁగు-కాఁక, తునుఁగు-తునుక, నడచు నడక, నలఁగు-నలఁక, పోవు-పోక, మడఁగు-మడక, మలఁగు-మలఁక, మునుఁగు- మునుక. మూఁగు-మూక, మొలచు- మొలక, వచ్చునకు రా - రాక. వంగు-వంక, వీఁగు-వీఁక. ఇక క పులు పరంబు లగునపుడు కనునకు దీర్ఘం బగు. కానుక. కినియు, ముదియుల కిత్వంబు నగు. కినియు-కినుక. ముదియు-ముదుక. ఇత్యాదు లలుగ్వాదులు.**

అలుగు (ఆది) మొద లగునవి అలుగ్వాదులు. అలుగు మొద లగు ధాతువులకు 'క' అనుప్రత్యయము వచ్చును. 'క' అను ఈకృత్ప్రత్యయము చివర గలిగిన కృదంతప్రాతిపదికము 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రమును అనుసరించి స్త్రీసమము అగును.

అలుగు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే కప్రత్యయము వచ్చి, అలుగు+క అని ఉండగా 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే గువర్ణము లోపించి, 'అలుక' అని అగును. ఈ ప్రాతిపదికము స్త్రీసమము కావున ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును. అలుక.

'అలుగ్వాదులకు' అనుటచే అలుగు మొద లగువానిలో చేరనిధాతువునకు కప్రత్యయము రాదు. వండు-వండుట మొ.

**4. ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు.**

**కలుగు-కలిమి. ఓరుచు-ఓరిమి. కూరుచు-కూరిమి. నేరుచు-నేరిమి వ్రేలుచు-వ్రేలిమి. బడియు-బడిమి. బ్రతుకు-బ్రదిమి. ఒడ్డు-ఒడ్డిమి తాలు-తాలిమి.**

కలుగు (ఆది) మొద లగునవి కలుగ్వాదులు. కలుగు మొద లగుధాతువులకు పరముగా 'ఇమి' అనుప్రత్యయము వచ్చును.

'కలుగు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'ఇమి' అనుప్రత్యయము వచ్చి కలుగు+ఇమి అని యుండగా, 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే 'గు' వర్ణము లోపించి, 'కలు+ఇమి' అని కాగా, 'అంద్వవగామంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, 'కలిమి' అనుకృదంతప్రాతిపదికరూప మేర్పడును.

'కలుగ్వాదులు' అనుటచే కలుగు మొద లగువానిలో చేరనిధాతువునకు 'ఇమి'

ప్రత్యయము రాదు. పెరుగుట, తిరుగుట మొ.

**5. తజ్వర్ణకంబు చేయ్యాదుల కగు.**

**చేయు-చేఁత అలయు-అలఁత కూయు-కూఁత కోయు-కోఁత. గీయు- గీఁత. నేయు-నేఁత, పూయు-పూఁత,పోయు-పోఁత, మూయు-మూఁత. మేయు-మేఁత, మ్రోయు-మ్రోఁత, రోయు-రోఁత వ్రాయు-వ్రాఁత, వ్రేయు-వ్రేఁత.**

చేయు (ఆది) మొద లగునవి చేయ్యాదులు. చేయు మొద లగుధాతువులకు 'తజ్' అనుప్రత్యయము వచ్చును. 'తజ్' అనుచోట జకారము ఇత్తు. జకారము ఇత్తుగా కల్గినది కావున 'త'వర్ణము జిత్తు. కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అను సూత్రముచే తవర్ణకమునకు పూర్వమునందు బిందువు వచ్చును. 'తజ్' అను కృత్ ప్రత్యయము చివర గలిగి కృదంత మగుటచే ప్రాతిపదిక లయినయీశబ్దములు స్త్రీసమములు.

'చేయు' ధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'తజ్' అనుప్రత్యయము రాగా (చేయు+త) 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే 'యు'వర్ణము లోపించి, చే+త అని అగును. త(జ్) జిత్తు కావున 'జిత్తు బిందుపూర్వం బగు' అనుసూత్రముచే ముందు అరసున్న వచ్చి చేఁత అని అగును. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనుసూత్రము ననుసరించి నిండుసున్న రాదు. కావున 'చేంత' అని యుండదు.

'చేయ్యాదులు' అనుటచే చేయు మొద లగువానిలో చేరనిధాతువుకు తజ్ ప్రత్యయము రాదు. పాయు, కాయు మొ.

**6. కువవర్ణకం బడంగ్వాదుల కగు.**

**అడఁగు-అడఁకువ. ఎఱుఁగు-ఎఱుఁకువ. కలఁగు-కలఁకువ. నలఁగు-నలకుఁవ, పెనఁగు-పెనఁకువ. పొలయు-పొలకువ, మఱచు-మఱకువ. మెలఁగు-మెలకువ, లోఁగు-లోఁకువ, వేఁగు-వేకువ**

అడంగు (ఆది) మొద లగునవి అడంగ్వాదులు. అడఁగు మొద లగు ధాతువులకు పరముగా 'కువ' అనుప్రత్యయము వచ్చును. 'కువ' అనుకృత్ ప్రత్య యము చివర కలిగి కృదంతము లగుటచే ప్రాతిపదిక లైనఈశబ్దములు 'ఆచ్ఛిక శబ్దము లెల్లం దఱుచుగ స్త్రీసమంబులు' అనుసూత్రముచే స్త్రీసమములు అగును.

అడఁగుధాతువునకు ప్రస్తుతసూత్రముచే 'కువ' అనుప్రత్యయము వచ్చి, 'అడఁ

గు+కువ' అని యుండగా 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే గువర్ణము లోపించి, 'అడఁకువ' అనుకృదంతప్రాతిపదికరూప మేర్పడును.

'అడంగ్వాదులు' అనుటచే అడఁగు మొద లగువానిలో చేరనిధాతువునకు 'కువ' ప్రత్యయము రాదు. తొలఁగు, ఒఱఁగు మొ.

**7. టవర్ణకం బాద్వాదుల కగు నగుచో నంతలోపం బగు.**

**ఆడు–ఆట, ఊరు–ఊట, ఊఱడు–ఊఱట. ఏఁకరు–ఏఁకట, ఓడు–ఓట, తివురు–తివుట, తేరు–తేట, త్రిమ్మరు–త్రిమ్మట పండు–పంట, పాడు–పాట, మండు–మంట, వండు–వంట, వేసఱు–వేసట.**

**అనుప్రయుక్తం బయినయాటశబ్దము ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు.**

ఆడు (ఆది) మొద లగునవి ఆద్వాదులు. ఆడు మొద లగుధాతువులకు పరముగా 'ట' అనుప్రత్యయము వచ్చును. అది పరముగా నుండగా పూర్వము నందలిధాతువుయొక్క చివరిఅక్షరము లోపించును. 'ట' అనుఈ కృత్ప్రత్యయము చివర కలిగి కృదంత మగుటచే ప్రాతిపదిక లయినఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రముచే స్త్రీసమము లగును. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు' అనుసూత్రముచే ధాతువుతుది అక్షరమునకు లోపము వచ్చుటకు అవకాశము లేకపోవుటచే 'అంతలోపము' ప్రత్యేకముగా విధింపబడినది.

'ఆడు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే టప్రత్యయము వచ్చి (ఆడు+ట). డువర్ణము లోపింపగా 'ఆట' అనుకృదంతప్రాతిపదికము ఏర్పడును. ఇది స్త్రీసమము. కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించును. ఆట.

'ఆద్వాదులకు' అనుటచే ఆడు మొద లగువానిలో చేరనిధాతువునకు ఈ కార్యము లేదు. కుదురు, చెదరు మొ.

**8. టువర్ణకంబు పద్వాదుల కగు నగుచో నివి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు.**

**పడు–పాటు. చెడు–చేటు. అడుచు–ఆటు. కఱచు–కాటు. పొడుచు–పోటు. వయిచు–వాటు. ఏయు–ఏటు. ఓడు–ఓటు. వ్రేయు –వ్రేటు.**

పడు (ఆది) మొద లగునవి పద్వాదులు. ఆద్యక్షరశేషము అనగా మొదటి

అక్షరము మాత్రము మిగిలినది. పడు మొద లగుధాతువులకు పరముగా 'టు' అనుప్రత్యయము వచ్చును. అప్పుడు ముందరిధాతువు మొదటిఅక్షరము మాత్రము మిగిలినది అయి (అనగా మొదటిఅచ్చునకు పైనున్న అక్షరములు అన్నియు లోపించి) ఆమిగిలిన మొదటిఅక్షరమునందలిఅచ్చునకు దీర్ఘము వచ్చును. 'టు' అనుకృత్ప్రత్యయము చివర గలిగినఈకృదంతప్రాతిపదికలు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రమును అనుసరించి స్త్రీసమములు అగును. స్త్రీసమత్వఅతిదేశముయొక్క సామర్థ్యముచేత ఉదంతము లయినను వీనిపైని ప్రథమావిభక్తిఏకవచనమునకు లోపము వచ్చును.

పడు అనుధాతువుపై ఈసూత్రముచే 'టు' అనుప్రత్యయము వచ్చి (పడు+టు) ధాతువులో మొదటిఅచ్చునకు పై నున్నవర్ణములు అన్నియు లోపించి (ప+టు). ఆమొదటిఅచ్చునకు దీర్ఘము రాగా, 'పాటు' అనుకృదంతప్రాతిపదికము ఏర్పడును.

'పద్వాదులకు' అనుటచే పడు మొద లగువానిలో చేరనిధాతువునకు ఈ కార్యము లేదు. వండు, ఇడు మొ.

'ఆద్యక్షరశేషంబు' అనుటచే కఱచు – కాటు, పొడుచు – పోటు అనుచో తొలియచ్చునకు పైనున్నవర్ణములు అన్నియు (పెక్కులు) లోపించుచున్నవి.

**9. పవర్ణకంబు తిరియ్వాదుల కగు.**

**తిరియు – తిరిపము. కలియున కత్వంబు నగు. కలపము. పొలయు – పొలపము. మురియు – మురిపము. వలియు – వలిపము.**

తిరియు (ఆది) మొద లగునవి తిరియ్వాదులు. తిరియు మొద లగు ధాతువులకు పరముగా 'ప' అనుప్రత్యయము వచ్చును. 'ప' అనుకృత్ప్రత్యయము చివర కలిగిన ఈకృదంతప్రాతిపదికములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనుసూత్రమును అనుసరించి క్లీబసమములు అగును. క్లీబసమత్వముచే మువర్ణకము మొద లగునవి అగును.

తిరియు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'ప' ప్రత్యయము వచ్చి, తిరియు+ప అని యుండగా 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే 'యు'వర్ణము లోపించి, 'తిరిప' అనుకృదంత ప్రాతిపదిక మేర్పడును. ఇది క్లీబసమము. కావున ప్రథమైకవచనమునందు 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, 'తిరిపము' అని అగును.

'తిరియ్వాదులకు' అనుటచే తిరియు మొద లగువానిలో చేరనిధాతువునకు

పవర్ణకము రాదు. మెఱయు, కురియు మొ.

**10. తవర్ణకం బావులించు లోనగువాని కగు.**

**ఆవులించు-ఆవులింత, ఇగిలించు-ఇగిలింత, ఓకిలించు-ఓకిలింత, కుళ్ళగించు-కుళ్ళగింత, కుసిలించు-కుసిలింత, కొక్కరించు-కొక్కరింత, కొప్పరించు-కొప్పరింత, గిలిగించు-గిలిగింత. ఇత్యాదు లెఱుంగునది.**

ఆవులించు మొద లగుధాతువులకు పరముగా 'త' అనుప్రత్యయము వచ్చును. 'ఆవులించు లోనగునవి' అని సూత్రమునందు నిర్దేశించుటనుబట్టి ఇంచు గాగమముతో కూడినవానిపైనె ఈ 'త'ప్రత్యయము వచ్చు నని గుర్తింపవలెను. తవర్ణకము చివర కలిగి కృదంతము లగుఈప్రాతిపదికలు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులు' అనుసూత్రమును అనుసరించి స్త్రీసమములు అగును. కావున ప్రథమైకవచనలోపము కలుగును.

'ఆవులించు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'త' ప్రత్యయము వచ్చి, ఆవులించు+త అని యుండగా 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే 'చు' వర్ణము లోపించి, ఆవులింత అనుకృదంతప్రాతిపదికరూప మేర్పడును. ఇది స్త్రీసమము కావున దీనిపైని ప్రథమైకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. ఆవులింత.

'ఆవులించు లోనగువానికి' అనుటచే ఆవులించు మొద లగువానిలో చేరని ధాతువునకు ఈకార్యము లేదు. అంగలించు మొ.

**11. పువర్ణకంబు మాయ్యాదుల కగు.**

**మాయు-మాపు, మేయు-మేపు, అడుచు-అడుపు, ఇంచు-ఇంపు, ఏఁచు-ఏఁపు, ఏచు-ఏపు, కను-కానుపు, కాచు-కాపు, చూచు-చూపు, తలఁచు-తలఁపు, తోఁచు-తోఁపు, త్రేఁచు-త్రేఁపు, త్రోచు-త్రోపు, పూఁచు-పూఁపు, పెనుచు-పెనుపు, పొలుచు-పొలుపు, మెచ్చు-మెప్పు, మోచు-మోపు, వలచు-వలపు, వాచు-వాపు. ఇత్యాదులు మాయ్యాదులు.**

మాయు (ఆది) మొద లగునవి మాయ్యాదులు. మాయు మొద లగు ధాతువులకు పరముగా 'పు' అనుప్రత్యయము వచ్చును. 'పు' అనుకృత్ప్రత్యయము చివర గలిగి కృదంతము లగుఈప్రాతిపదికలు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులు' అనుసూత్రమును అనుసరించి స్త్రీసమము లగును. స్త్రీసమత్వమును అతిదేశించిన సామర్థ్యముచే ఉదంతము లయినను వీనిపైని ప్రథమైకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అనుసూత్రముచే లోపము వచ్చును.

'మాయు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'పు' అనుప్రత్యయము వచ్చి,

మాయు+పు. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనుసూత్రముచే యువర్ణము లోపించి, 'మాపు' అనుకృదంత ప్రాతిపదిక మేర్పడును. ఇది స్త్రీసమము కాన 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు' అనుసూత్రముచే దీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును. మాపు.

'మాయ్వాదులకు' అనుటచే మాయు మొద లగువానిలో చేరనిధాతువునకు 'పు' ప్రత్యయము లేదు. వ్రాయు, వ్రేయు మొ.

**12. ఇక వర్ణకం బంజ్వాదుల కగు.**

**అంజు – అంజిక, అమరు – అమరిక, అరయు – అరయిక, అలయు– అలయిక, ఆడు – ఆడిక, ఓడు – ఓడిక. ఓపు – ఓపిక. కను – కానిక. కూడు – కూడిక. కోరు – కోరిక. పొందు – పొందిక. పోలు – పోలిక. తూను తూఁగున కగు. తూనిక. ఇత్యాదు లంజ్వాదులు.**

అంజు (ఆది) మొద లగునవి అంజ్వాదులు. అంజు మొద లగుధాతువులకు పరముగా ఇక అనుప్రత్యయము వచ్చును. 'ఇక' అనుకృత్ప్రత్యయము చివర కలిగి కృదంతము లగుటచే ప్రాతిపదిక లయినఈశబ్దములు 'అచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రము ననుసరించి స్త్రీసమము లగును. కావున దీనిపై ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును.

అంజు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'ఇక' అనుప్రత్యయము వచ్చి అంజు+ఇక అని యుండగా 'అంద్వగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, 'అంజిక' అను కృదంతప్రాతిపదికరూప మేర్పడును. ఇది స్త్రీసమము కావున దీనిపైని ప్రథమా విభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. అంజిక.

'అంజ్వాదులకు' అనుటచే అంజు మొద లగువానిలో లేనిధాతువునకు ఈకార్యము లేదు. గుంజు మొ.

**13. అప్పాదులకు నజి యగు.**

**అప్ప–అప్పన, ఒజ్జ–ఒజ్జన, ఒప్ప–ఒప్పన, గట్ట–గట్టన, గడ–గడన, దట్ట–దట్టన, దీవ–దీవన, పాట–పాటన, మన్న–మన్నన, వీచు–వీవన.**

అప్ప (ఆది) మొద లగునవి అప్పాదులు. అప్ప మొద లగుధాతువులకు పరముగా 'నజి' అనుప్రత్యయము వచ్చును. నజిలో జివర్ణము ఇత్తు. కావున లోపించును. న వర్ణమె నిలుచును. 'తవర్ణకం బావులించు లోనగువాని కగు'

అనుసూత్రమున 'ఆవుల' అనుదానిని ఇంచుక్కుతో నిర్దేశించి, ఇచట 'అప్పాదులు' అని ఇంచుక్కు లేకయె నిర్దేశించుటనుబట్టి అప్ప మొద లగు ఆచ్ఛికధాతువులకు ఇంచుక్కు చేరకుండగనె వానిపయి 'నజీ'ప్రత్యయము వచ్చు నని గ్రహింపవలయును. నజివర్ణకము చివర కలిగి కృదంతము లగుటచే ప్రాతిపదిక లయిన ఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ' అనుసూత్రముచే స్త్రీసమములు అగును. కావున ప్రథమైకవచనము లోపించును.

'అప్ప' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే నజీ ప్రత్యయము వచ్చి, అప్పన అని అగును. ఇది స్త్రీసమము కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును.

'అప్పాదులు' అనుటచే అప్ప మొద లగువానిలో చేరనిధాతువునకు 'నజి' ప్రత్యయము రాదు. అంగల, తిలక మొ.

'నజి' అని జీత్తుగా నిర్దేశించుటచేత వీచు ధాతువుపై ఈప్రత్యయ మయినపుడు 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనుసూత్రముచే ధాతువునకు అత్వమును (వీచ+న) 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అనుసూత్రముచే చకారమునకు వకారమును అగుట ప్రయోజనములు. వీవన.

**14. బడి యేల్వాదుల కగు.**

**ఏలుబడి–కట్టుబడి–కనుబడి–కొనుబడి–గిట్టుబడి–చెల్లుబడి–చేరుబడి తగులుబడి–తీరుబడి–పెట్టుబడి–పోబడి–మ్రొక్కుబడి–వచ్చుబడి–సాగుబడి.**

ఏలు (ఆది) మొద లగునవి ఏల్వాదులు. ఏలు మొద లగుధాతువులకు పరముగా 'బడి' అనుప్రత్యయము వచ్చును. బడి అనుకృత్ప్రత్యయము చివర గలుగుటచే కృదంతము లయి ప్రాతిపదిక లయినఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రముచే స్త్రీసమములు అగును. కావున వీనిపై ప్రథమైకవచనము లోపించును.

ఏలు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'బడి' అనుప్రత్యయము వచ్చి 'ఏలుబడి' అనుకృదంతప్రాతిపదికరూపము ఏర్పడును. ఇది ఇకారాంత మై యున్నది. కావున 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించును. ఏలుబడి.

'ఏల్వాదులు' అనుటచే ఏలు మొద లగువానిలో చేరనిధాతువునకు బడి ప్రత్యయము లేదు. అరుగు కరుగు మొ.

**15. గడ చేర్వాదుల కగు.**

**చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేఱుగడ - త్రేగడ - మనుగడ - విడుగడ - వీడుగడ.**

చేరు (ఆది) మొద లగునవి చేర్వాదులు. చేరు మొద లగుధాతువులకు పరముగా గడ అనుప్రత్యయము వచ్చును. 'గడ' అనుకృత్ప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదికములు అయిన ఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రము ననుసరించి స్త్రీసమము లగును. కావున ప్రథమైకవచనము లోపించును.

చేరు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'గడ' అనుప్రత్యయము వచ్చి, చేరుగడ అని కాగా, ఈప్రాతిపదికము స్త్రీసమము కావున 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే ప్రథమైకవచనము లోపించును. చేరుగడ.

'చేర్వాదులకు' అనుటచే చేరు మొద లగువానిలో చేరనిధాతువునకు 'గడ' అనుప్రత్యయము రాదు. పోరు, చెడు మొ.

**16. ఇకి కోర్వాదుల కగు.**

**కోరికి-పూనికి-పోలికి-మనికి-వినికి. చూడు చూచున కగు - చూడికి.**

కోరు (ఆది) మొద లగునవి కోర్వాదులు. కోరు మొద లగుధాతువులకు పరముగా 'ఇకి' అనుప్రత్యయము వచ్చును. 'ఇకి' అనుకృత్ప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదిక లయిన ఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రము ననుసరించి స్త్రీసమములు అగును. కావున వీనిపైని ప్రథమైకవచనమునకు లోపము వచ్చును.

కోరు అనుధాతువుపయి ప్రస్తుతసూత్రముచే 'ఇకి' అనుప్రత్యయము వచ్చి కోరు + ఇకి అని ఉండగా, 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, కోరికి అనుకృదంతప్రాతిపదికరూప మేర్పడును. ఈశబ్దము స్త్రీసమము కావున 'స్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అనుసూత్రముచే ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును. కోరికి.

'కోర్వాదులకు' అనుటచే కోరు మొద లగువానిలో చేరనిధాతువునకు 'ఇకి' ప్రత్యయము రాదు. చేరు-మీఱు మొ.

## 17. వువర్ణకంబు మన్వాదుల కగు.

**మను–మనువు. కాచు–కావు. కొలుచు–కొలువు. చచ్చు–చావు. తడయు–తడవు. నిలుచు–నిలువు. నొచ్చు–నోవు. పూచు–పూవు. ప్రుచ్చు– ప్రువ్వు.**

మను (ఆది) మొద లగునవి మన్వాదులు. మను మొద లగుధాతువులకు పరముగా 'వు' అనుప్రత్యయము వచ్చును. 'వు' ప్రత్యయము చివర కలిగి కృదంతము లయి, ప్రాతిపదిక లయినయాశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రమును అనుసరించి స్త్రీసమములు అగును. స్త్రీసమత్వమును అతిదేశించిన సామర్థ్యమును అనుసరించి, ఉదంతము లైనను స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు' అని ప్రథమైకవచనము లోపించును.

మను అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'వు' అనుప్రత్యయము వచ్చి 'మనువు' అని అగును. ఈకృదంతప్రాతిపదికము స్త్రీసమము అగుటచే దీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. మనువు.

'మన్వాదులకు' అనుటచే మను మొద లగువానిలో చేరనిధాతువునకు 'వు' ప్రత్యయము రాదు. చను, కను మొ.

## 18. అవర్ణకంబు గీఱ్వాదుల కగు.

**గీఱ–ఊఁద–ఎండ–కాయ– చదియ–తునియ– పరియ–పాయ–పిడుచ–మీట–ముడియ–వదర–వ్రయ్య.**

గీఱు (ఆది) మొద లగునవి గీఱ్వాదులు. గీఱు మొద లగుధాతువులకు పరముగా 'అ' అనుప్రత్యయము వచ్చును. 'అ' ప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదికము లయిన ఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనుసూత్రముచే స్త్రీసమము లగును. కావున ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును.

'గీఱు' అనుధాతువుపయి ప్రస్తుతసూత్రముచే 'అ' ప్రత్యయము వచ్చి, గీఱు+అ అని యుండగా 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, 'గీఱ' ఇని అగును. ఇది స్త్రీసమము కావున దీనిపైని ప్రథమైకవచనమునకు 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనుసూత్రముచే లోపము వచ్చును. గీఱ.

'గీఱ్ఱాదులు' అనుటచే గీఱు మొదలగువానిలో చేరనిధాతువునకు 'అ' ప్రత్యయము రాదు. మీఱు, కోయు మొ.

**19. అకవర్ణకంబు మాఱ్ఱాదుల కగు.**

**మాఱు – మాఱకము. అమ్ము – అమ్మకము. అంపు – అంపకము. పంచు – పంపు – పంపకము. వండుడకారంబు టకారం బగు. వంటకము. త్రోము – త్రోమకము. అద్దు –అద్దకము.**

మాఱు (ఆది) మొద లగునవి మాఱ్ఱాదులు. మాఱు మొద లగుధాతువులకు పరముగా 'అక' అనుప్రత్యయము వచ్చును. అక ప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదిక లయినఈశబ్దములు 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనుసూత్రము ననుసరించి క్లీబసమములు అగును. క్లీబసమత్వమువలన మువర్ణకము మొద లగుకార్యములు కలుగును.

'మాఱు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'అక' అనుప్రత్యయము వచ్చి, మాఱు+అక అని యుండగా 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనుసూత్రముచే సంధి జరిగి, మాఱక అని అగును. ఈప్రాతిపదికము క్లీబసమము. కావున ప్రథమైకవచనమునందు 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనుసూత్రముచే మువర్ణకము వచ్చి, మాఱకము అని అగును.

అకప్రత్యయము పర మగుచుండగా వండుధాతువులోనిడువర్ణమునకు ట వర్ణ మగును. వండు+అక – వంటకము.

'మాఱ్ఱాదులు' అనుటచే మాఱు మొద లగువానిలో చేరనిధాతువునకు అకప్రత్యయము రాదు. మాఱు, దిద్దు మొ.

**20. డువర్ణకం బాఱ్ఱాదుల కగు నగునపుడు పకారంబు చయల కగు.**

**ఆఱు–ఆఱుడు, అమ్ము–అమ్ముడు, అల్లు–అల్లుడు, ఎక్కు–ఎక్కుడు, క్రుమ్ము–క్రుమ్ముడు, చోపు–చోపుడు, త్రొక్కు–త్రొక్కుడు, త్రోచు–త్రోపుడు, దంచు–దంపుడు, దాఁచు–దాఁపుడు, దిగు–దిగుడు, దోఁచు–దోఁపుడు, పెంచు–పెంపుడు, పేయు–పేపుడు, ప్రాఁకు–ప్రాఁకుడు, మాయు–మాపుడు, రాచు–రాపుడు ఇత్యాదులు.**

ఆఱు (ఆది) మొద లగునవి ఆఱ్ఱాదులు. ఆఱు మొద లగుధాతువులకు పరముగా 'డు' అనుప్రత్యయము వచ్చును. 'డు' ప్రత్యయము పరముగా ఉండగా ధాతువు చివర ఉన్నచకారపుపొల్లుయొక్కయు, యకారపుపొల్లుయొక్కయు

స్థానమున పకారపుపొల్లు ఆదేశముగా వచ్చును. డుప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదిక లయినఈశబ్దములు 'అచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనుసూత్రము ననుసరించి స్త్రీసమము లగును. స్త్రీసమత్వమును అతిదేశించినసామర్థ్యముచే ఉకారాంతము లయినను వీనిపైని ప్రథమావిభక్తి ఏకవచనము లోపించును.

'దంచు' అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే డుప్రత్యయము వచ్చి (దంచు+డు) ధాతువుచివరిచకారమునకు పకారము రాగా, దంపుడు అని అగును. ఇది స్త్రీసమము కావున 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అను సూత్రముచే ప్రథమావిభక్తిఏకవచనము లోపించును. దంపుడు. ఇట్లే మాయు – మాపుడు మొ.

'ఆఱ్వాదులకు' అనుటచే ఆఱు మొద లగువానిలో చేరనిధాతువునకు డుప్రత్యయము రాదు. మీఱు, మఱచు మొ.

'చయలకు' అనుటచే ఇతరహల్లులకు పకారము రాదు. ఆఱు – ఆఱుడు, త్రొక్కు – త్రొక్కుడు మొ.

**21. ఉవర్ణకం బడుక్వాదుల కగు.**

**అడుకు – అంటు – ఒప్పు – ఒఱగు – ఒసఁగు.**

అడుకు (ఆది) మొద లగునవి అడుక్వాదులు. అడుకు మొద లగుధాతువులకు పరముగా 'ఉ' అనుప్రత్యయము వచ్చును. అడుకు+ఉ – అడుకు అనువిధముగా ఉప్రత్యయము వచ్చినను రాకున్నను రూపము ఒకేతీరుగనె కన్పించును. అయినను ఉప్రత్యయము చేయకున్న అది ధాతు వగును. దానిపై లడాదులు చేరును. ఉప్రత్యయము చేసిన అది కృదంత మయి ప్రాతిపదిక మగును. కావున ప్రథమ మొద లగువిభక్తులు చేరును. అందుకయి ఉప్రత్యయము విధింపబడినది. ఉప్రత్యయము చివర కలిగి, కృదంతము లయి, ప్రాతిపదికము లయినఈ శబ్దములు 'అచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును' అనుసూత్రముచే స్త్రీసమము లగును. ఇవి ఉదంతములు అయినను స్త్రీసమత్వమును అతిదేశించిన సామర్థ్యముచే ప్రథమావిభక్తిఏకవచనము లోపించును.

అడుకు అనుధాతువుపై ప్రస్తుతసూత్రముచే 'ఉ' ప్రత్యయము వచ్చి, అడుకు+ఉ అని యుండగా 'అంద్వవగాగమంబులం దప్ప–' అనుసూత్రముచే సంధి జరిగి 'అడుకు' అని అగును. ఇది స్త్రీసమము కావున 'స్త్రీలింగంబులప్రథమైక వచనంబునకు లోపంబగు' అనుసూత్రముచేత

ప్రథమైకవచనము లోపించును. అడుకు, ఇట్లె 'చిరుగు' మొ.

'అడుక్వాదులు' అనుటచే అడుకు మొద లగువానిలో చేరనిధాతువునకు ఉప్రత్యయము రాదు. వండు, తిను మొ.

**22. వడిప్రభృతు లి ట్లెఱుంగునది.**

**వడి : కొలువడి-గెలువడి-నడవడి. వ్యతిరేకంబున - లేవడి.**

**వి : తనివి - తెలివి - విరివి.	అవు : తగవు - నగవు - ఉఱవు.**

**ఇ : చేయి, వ్రాయి.	కలి : కనుకలి. వినుకలి.**

**ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.**

'కవర్ణకం బలుగ్వాదులకు' 'ఇమివర్ణకంబు కలుగ్వాదులకు' మొద లగువిధముగా 'వడి' మొద లగుఆయాప్రత్యయములు ఆయాధాతువులకు వచ్చును.

1. కొలుచు మొద లగు ధాతువులకు 'వడి' అనుప్రత్యయము వచ్చును. కొలుచు+వడి అనుచో 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవ లకు లోపం బగు' అని చువర్ణము లోపించి, కొలువడి. ఇట్లె గెలుచు+వడి-గెలువడి, నడచు+వడి-నడవడి .

2. తెలియు మొద లగుధాతువులకు 'వి' అనుప్రత్యయము వచ్చును. తెలియు+వి 'ఇటం గృత్కగత' - అనుసూత్రముచే యువర్ణము లోపించి, తెలివి. ఇట్లే విరియు+ వి - విరివి మొ.

3. తగు మొద లగుధాతువులకు 'అవు' అనుప్రత్యయము వచ్చును. తగు+అవు అనుచో 'అంద్వవగాగమంబులం దప్ప' అనుసూత్రముచే సంధి జరిగి, తగవు అని అగును. ఇట్లే నగు - నగవు మొ.

1. చేయు మొదలగు ధాతువులకు 'ఇ' అను ప్రత్యయము వచ్చును. చేయు+ఇ అనుచోట సంధి జరిగి చేయి. ఇట్లె వ్రాయు+ఇ-వ్రాయు మొ.

5. కను మొద లగుధాతువులకు 'కలి' అనుప్రత్యయము వచ్చును. కను+కలి. కనుకలి - ఇట్లె వినుకలి మొ.

ఈకృత్ప్రత్యయములు చివర గలిగినప్రాతిపదికములు స్త్రీసమములు కావున ప్రథమైకవచనము లోపించును.

వడి మొద లగుఆయాప్రత్యయములు ఏయేధాతువులకు కలుగునో మహాకవుల వ్యవహారమునుండి గ్రహింపవలయును.

**ఇది కృదంతపరిచ్ఛేదము**

# ప్రకీర్ణకపరిచ్ఛేదము

## 1. పదాద్యంబులు ఋ(ఌ)వర్ణంబులు రలతుల్యంబులు.

**అతఁడు ఋషి. ఇట సంధి లేదు. ఆఋషి. ఇట యడాగమము లేదు. వచ్చె ఋషి, వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి. ఇట ద్రుతమునకు లోపసంశ్లేష స్వత్వములు.**

పదాద్యములు అనగా పదముయొక్క మొదట నున్నవి. 'రల' అనుచో అకారము ఉచ్చారణసౌకర్యమునకయి చేర్పబడినది. పదము మొదట ఉన్న ఋకారము రేఫముతో సమాన మైనది. (అచ్చయిన 'ఌ')కారము లకారముతో సమానము.

'అతడు+ఋషి' అని యుండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి రావలసియున్నది. ఇచట పర మైన ఋకారము అచ్చే అయినను ఈసూత్రము ననుసరించి రేఫతో తుల్య మైనది. రేఫము హల్లు కావున 'అచ్చు పరం బగునపుడు' చెప్పిన సంధి ఇచట రాదు. అతఁ దృషి అని కాదు. 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనుసూత్రమున యడాగమము కూడ 'పరం బయినస్వరమునకు' చెప్పబడినది. ఇచట పర మయినఋకారము హల్లు (రేఫ)వంటి దగుటచే దానికి యడాగమము కూడ రాదు. అతఁడు ఋషి అని అట్లే ఉండును.

'పదాద్యంబులు' అనుటచేత పదమునందు మొదట కాక ఇతరస్థలములం దున్న ఋకార(ఌ)కారములు రేఫలకారములతో తుల్యము కావు. 'కృపానిధి' అనుచోట ఋకారము రెండవవర్ణము. ఇది రేఫవంటిది కాక అచ్చుమాత్రము అయినది. కావున 'కృ' అనునది సంయుక్తాక్షరము కాదు. (రేఫవంటిది అయిన, క్; (ఋ) ర్ అను హల్లులు సంయోగము కలది అగుటచే సంయుక్తవర్ణ మగును) కావున ఆ+కృపానిధి అనుచో 'త్రికంబు మీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనుసూత్రముచే ద్విత్వము వచ్చి, అక్కృపానిధి అని అగును. ఇట్లే పితృవాక్యము మొద లగుచోట ఋకారముతో గూడిన హల్లువలన దానికి ముందరివర్ణము గురువు కాదు.

**2. ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగురులుడులముందటి యేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు.**

**నల్లేరు–నల్లెరు. పల్లేరు–పల్లెరు. పెన్నేరు–పెన్నెరు. మానేరు–మానెరు. ఆడేలు–ఆడెలు. కుందేలు–కుందెలు. తోఁడేలు–తోఁడెలు. నాఁగేలు–నాఁగెలు. నేరేడు–నేరెడు. మారేడు–మారెడు. పూరేడు–పూరెడు. తంగేడు–తంగెడు.**

మూడు గాని అంతకంటె ఎక్కువ కాని అక్షరములు కలిగినశబ్దమునందు చివరిఅక్షరమునకు ఉత్తమము అని పేరు. మూడు లేదా అంతకంటె ఎక్కువ అక్షరములు కలిగిన అచ్చతెలుగుపదములలో చివరిఅక్షరము లగు రు, లు, డు అనువానికి పూర్వమునం దున్న 'ఏ' కారమునకు హ్రస్వము (ఎ) వికల్పముగా ఆదేశముగా వచ్చును.

నల్లేరు అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే ఏత్వమునకు హ్రస్వము వచ్చినచో 'నల్లెరు' అని అగును. విభాష అనుటచే హ్రస్వము రానిపక్షమునందు నల్లేరు అని యుండును.

'ఆచ్ఛికపదంబులందు' అనుటచేత సంస్కృతసమము లయినశబ్దములందు ఈకార్యము లేదు. సుమేరువు. క్రమేలము. మొ.

'పదంబులం' దనుటచేత సమాసము మొద లైనఅనేకపదములనడుమ ఈకార్యము లేదు. మిన్నేరు, కెంగేలు మొ.

'ఉత్తమంబులు' అనుటచే మూడుకంటె తక్కువ అక్షరము లున్నపదములలో ఈకార్యము జరుగదు. లేరు, కేలు, పేడు మొ.

'రులుడుల' అనుటచే ఇతరవర్ణములకు ముందర ఈకార్యము లేదు. ఐరేని.

'ఏత్వమునకు' అనుటచేత ఇతరదీర్ఘమునకు హ్రస్వము రాదు.

**3. ఊయేల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు.**

**స్పష్టము.**

ఎఏఒఓ అనునాలుగువర్ణములకును వక్రములు అని సంజ్ఞ. వీనిలో ఎఏ అనునవి రెండును తాలవ్యము లగువక్రములు. యాకు అనగా యకారమునకు అనియు, త్రిక్క అనగా తప్ప అనియు అర్థము. నామము అనగా ప్రాతిపదిక. నామములయందు 'ఊయెల, పయ్యెద, తాయెతు' అనుమూడింటిలో తప్ప వేఱొక ప్రాతిపదికలో యకారము ఎ, ఏ అనుఅచ్చులతో కూడియుండదు.

ఊయేల అనుచోట ఏకారముతో గూడియు, పయ్యెద తాయెతు (ఊయెల)

అనుచో ఎత్వముతో కూడియు తెలుగున యకారము ప్రాతిపదికలయం దున్నది. బోయెత అనుఇం కొకటి తద్ధితాంత మగుప్రాతిపదిక కలదు.

'నామంబులందు' అనుటచే క్రియాపదములందు యకారము ఎ(ఏ) కారముతో కూడియుండవచ్చును. పోయెను, ఆయెడును మొ.

'తాలవ్య' అనుశబ్దముచే యకారము ఓష్ఠ్యము లైన 'ఒఓ' అనువక్రములతో కూడియుండవచ్చును. అయ్యో. ఇట్లే తాలవ్యవక్రములకంటె ఇతరము లయిన అచ్చులతో కూడినయకారము ఉండుటలో బాధ లేదు. కాయ, వాయు మొ. 'ఆయెఱుక, ముయ్యేడు అనువిధ మైనచోట్ల సంధికార్యమువలన వచ్చిన యకారము పదాదిస్వరముతో కూడియున్నది. అట్టివానికి విరోధము లేదు.

**4. ఊయేలయూయాలలచాఁపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు.**

**ఉయేల - ఊయెల - ఊయేల. ఉయాల - ఊయల - ఊయాల.**

**వక్ష్యమాణంబు యద్విత్వంబు. ఉయ్యేల-ఉయ్యెల. ఉయ్యాల-ఉయ్యల.**

చాఁపు అనగా దీర్ఘము. కుఱుచ అనగా హ్రస్వము. ఒండె అనగా వికల్పము. ఊయేల ఊయాల అనుశబ్దములందు కలదీర్ఘములలో ఒక్కొక్కదానికి వికల్పముగా హ్రస్వము వచ్చును.

ఊయేల అనుశబ్దమునందు మొదటిదీర్ఘమునకు హ్రస్వము వచ్చినచో ఉయేల అని అగును. రెండవదీర్ఘమునకు హ్రస్వము వచ్చినచో ఊయెల అని అగును. విభాష అనుటచే హ్రస్వములు రానిపక్షమునందు ఊయేల అని యుండును.

ఇట్లే ఊయాల అనుశబ్దమునందు మొదటిదీర్ఘమునకు హ్రస్వము వచ్చినచో ఉయాల. రెండవదీర్ఘమునకు హ్రస్వము వచ్చినచో ఊయల. హ్రస్వములు రానిచో ఊయాల. 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అనుసూత్రముచే ద్విత్వము వచ్చినపక్షమున ఉయ్యేల మొ.

'ఊయేల ఊయాలల' అనుటచే వేరొకశబ్దమున కిచట హ్రస్వము లేదు. గయాళి.

'ఒండొంటికి' అనుటచే ఒక్కొక్కదీర్ఘమునకు ఒక్కొక్కపర్యాయము హ్రస్వము వచ్చును. అనగా రెండుదీర్ఘములకును ఒకేపర్యాయము హ్రస్వము రాదు, కావున ఉయెల(ఊయేల) ఉయల (ఊయాల) అని కావు.

**5. పయ్యెద పయ్యద.**

'ఊయేలపయ్యెదతాయెతులం ద్రిక్క యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు'

అనుసూత్రమును అనుసరించి 'పయ్యెద' అని ఎత్వముతో కూడినయకారముతో 'పయ్యెద' అనురూప మంగీకరింపబడియున్నది. దానితోపాటు పయ్యెద అను శబ్దమునకు 'పయ్యద' అనియు రూప ముండును. పయ్యెద అనుశబ్దములో నడుమ నున్నయకారము పైని ఎత్వముయొక్క స్థానమున వికల్పముగా హ్రస్వ మగుఅకారము ఈసూత్రముచే నిపతింపబడినది. అత్వము వచ్చినపుడు 'పయ్యద, పయ్యదను' ఇత్యాదిగ రూపము లగును. వికల్పముగా నిపతించుటవలన అత్వము రానిపక్షమునందు ఎత్వము అట్లే యుండి, పయ్యెద, పయ్యెదను ఇత్యాదిగనె రూపము లుండును.

**6. ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు.**

**ఉయ్యేల-ఊయేల. ఊయేల-ఊయెల-ఊయాల-ఊయల-ఆయె-ఏలిదము-ఓయ-ఓయారము-కోపు (ధనురగ్రము)-జాజర-తేనియ-తీయము-తేప(ప్లవము)-తేను-తోయలి-దీవియ-నూవు-నోవి-నోవు-పూవు-పేయ-మోక(అంకురము)-మోటిక-మోపు-వీయుము ఇత్యాదు లూయేలాదులు.**

ఊయేల (ఆది) మొద లగునవి ఊయేలాదులు. ద్విర్వచనము అనగా ద్విరుక్తి. ఒండె అనగా వికల్పము. ఊయేల మొద లగుశబ్దములయందు మొదటిఅచ్చునకు పై నున్నహల్లునకు వికల్పముగా ద్విత్వము వచ్చును.

ఊయేల అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే యకారమునకు ద్విత్వము రాగా ఊయ్యేల అని అగును. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనుసూత్రముచే మొదటిఅచ్చునకు హ్రస్వము రాగా, ఉయ్యేల అని అగును. 'ఒండె' అనుటచే ద్విత్వము ఒకపక్షమునందె. కావున వేరొకపక్షమునందు ద్విత్వము రాకుండగా, అపుడు హ్రస్వమును రాదు కావున ఊయేల అని యుండును.

'ఊయేలాదులు' అనుటచే ఊయేల మొద లగువానిలో చేరనిశబ్దమునందు ఈకార్యము లేదు. తాయెతు. తయ్యెతు అని కాదు.

'తొలియచ్చుమీఁదిహల్లునకు' అనుటచే రెండవది మొద లగుఅచ్చులపై ఉన్న హల్లులకు ద్విత్వము రాదు. ఊయెల్ల ఇత్యాదిగా నుండవు.

**7. అకారంబుక్రిందిఅకారంబునకుం దుదినులులక్రిందినలలకును లోపంబు బహుళంబుగా నగు.**

**అట్టు - అటు, గొట్టియ - గొటియ, కన్ను - కను, నన్ను - నను, పల్లు - పలు, విల్లు - విలు.**

'క్రింది' అనగా వెనుకటి అని అర్థము క్రిందటిరోజు, క్రిందటేడు మొ. శకటరేఫము ద్విత్వముతో నున్నపుడు అందలిమొదటిఅకారమునకు బహుళముగా లోపము వచ్చును. అట్లే శబ్దముచివర నున్న న్ను, ల్లు అనువర్ణములయందు మొదట నున్ననకారమునకును, లకారమునకును బహుళముగా లోపమువచ్చును.

అఱ్ఱు – అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే ఱకారమునకు ముందు ఉన్నఱకారమునకు అనగా మొదటిఱకారమునకు లోపము వచ్చి, అ(ఱ్)ఱ్ ఉ– 'అఱు' అని అగును. బహుళము అనుటచే లోపము రానిపక్షమునందు అఱ్ఱు అని ఉండును. ఇట్లే కన్ను – కను. పల్లు – పలు మొ.

'క్రిందిఱకారంబునకు, క్రిందినలలకు' అనుటచే ఱ,న,ల, అనునవి ద్విరుక్త ములు కానిచో ఈలోపమునకు అవకాశమె లేదు. వేఱు, పేను, కాలు మొ.

'నులులక్రింది నలలకు' అనుటచే ఇతరఅక్షరముల క్రిందినలలకు లోపము ప్రసక్తి లేదు. చిన్కు, విండ్లు. మొ.

'తుదినులుల' అనుటచే 'న్ను ల్లు' అనునవి శబ్దమునడుమ నున్నచో లోపము రాదు. అన్నువ – వెల్లువ.

'ఱకారంబుక్రింది' అనుచో ఇట్లు 'తుది' అనుశబ్దము చేర్పకుండుటచే శబ్దమున నడుమ నున్నను ద్విరుక్తశకటరేఫములో మొదటిది లోపించును. గొఱ్ఱియ– గొఱియ.

'నులుల' అనుటచే శబ్దముచివర నున్న ద్విరుక్తము లగునలలు సైతము ఉత్వముతో కూడియున్నపుడే ఈలోపము. కావున కన్నె, పిల్లి మొదలుగా ఇతర స్వరములతో కూడియున్నపుడు క్రిందినలలు లోపింపవు.

'ఱకారంబు క్రింది' అనుచో ఉత్వము గూర్పక సామాన్యముగా ఱకార మని చెప్పుటచే ద్విరుక్త మైన శకటరేఫముపై ఏఅచ్చు ఉన్నను మొదటిరేఫము లోపించును. గొఱ్ఱియ – గొఱియ.

'బహుళము' అనుటచే కొన్నియెడల ఈలోపమునకు అప్రవృత్తి; గొఱ్ఱె – బఱ్ఱె, చెన్ను, పెల్లు మొ.

**8. అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు.**

**అకట–అక్కట. అక్కట–అట్టిక–అట్టుక–అట్టె–అయ్యారె–అయ్యో అవ్వారి–ఇట్టి–ఉప్పవడము–ఉమ్మి–ఎక్కసక్కియయు–ఎక్కసెక్కియము ఎక్కిరింత–ఎడ్డ–ఎన్నిక–ఎమ్ముక–కజ్జాయము–కట్టా–కట్టిక–కప్పురము**

**కమ్మటము – కమ్మతము – కువ్వాడము – కొట్టిక – కొమ్ము – కొయ్యగూర గయ్యాళము – గిజ్జిగాఁడు – గుజ్జరాతి – చిట్టి – చిన్న – చిమ్మట – చెన్నఁటి చెప్పుము – చెప్పుఁడు – చెమ్మట – చెల్లియలు – జవ్వాజి – జాబిల్లి – తమ్మటము తమ్ములము – తల్లి – తమ్మికి – తువ్వర – తెల్ల – దవ్వు – దివ్వియ – నవ్వు – నిద్దర నివ్వరి – నివ్వాళి – నువ్వు – నెట్టిక – నెమ్మలి – పవ్వళించు – పిన్న – పుల్లియ – పువ్వు పెద్ద – పొట్టి – ప్రాకెన్న – ప్రెగ్గడ – బెగ్గడు – బొమ్మ – బొమ్మికము – బొమ్మిడికము బొమ్మిడీకము – మజ్జ – మత్తాబు – మల్లారము – ముక్కు – ముద్దియ – మెట్టిక మొక్కరము – మొగ్గరము – మొల్లాము – రడ్డి – లొట్టిపిట్ట – వట్టి – వయ్యాళి – సన్నియ సవ్వడి – సివ్వంగి – అట్టు – ఇట్టు – ఎట్టు – అప్పుడు – ఇప్పుడు – ఎప్పుడు – అన్ని ఇన్ని – ఎన్ని – కొన్ని – మిమ్ము – మమ్ము – తమ్ము – అమ్మ – అక్క – అవ్వ – అయ్య – అప్ప అచ్చోటు – ఇచ్చోటు – ఎచ్చోటు – అచ్చటు – ఇచ్చటు – ఎచ్చటు. ఇత్యాదు లక్కటాదులు.**

అక్కట (ఆది) మొద లగునవి అక్కటాదులు. జడ్డ అనగా ద్విత్వము. ఒకే హల్లు రెండుసార్లు ఉచ్చరింపబడినపుడు అందు రెండవసారి ఉచ్చరించినహల్లు 'జడ్డ' అనబడును. అక్కట మొద లగుశబ్దములలో ద్విరుక్త మైనహల్లు గలచోట రెండవహల్లునకు వికల్పముగా లోపము వచ్చును.

'అక్కట' అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచేత జడ్డ అయినకకారము లోపింపగా, అకట అని అగును. విభాష అనుటచే లోపము రానిపక్షమునందు అక్కట అని ద్విత్వము అట్లె ఉండును.

'అక్కటాదులు' అనుటచేత అక్కట మొద లగువానిలో చేరనిశబ్దమునందలి జడ్డకు లోపము లేదు. నల్లేరు.

'జడ్డకు' అనుటచే తదితరమునకు లోపము రాదు. అక్కట అనుచో టకారము కాని మరి యొకహల్లు కాని లోపింపదు.

## 9. జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. అట్టైతె – కన్నదరె – నన్నడిగె – పల్లొత్తె – విల్లందె.

జడ్డక్కరము అనగా ద్విత్వము కలిగినఅక్షరము. ద్విరుక్త మయినహల్లుతో తరువాతిపదము మొదటిఅచ్చు వచ్చి కలియునపుడు ద్విరుక్త మయినహల్లులో రెండవహల్లు(జడ్డ)కు లోపము రాదు. 'అకారంబుక్రిందిఅకారంబునకుఁ దుదినులులక్రిందినలలకు లోపంబు బహుళంబుగా నగు', 'అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు' అనుసూత్రములచే రావలసినలోపము – మీదిఅచ్చు సంధివలన పరపదాదిస్వరముతో కూడుసందర్భమున రాదు.

అఱ్ఱు+ఎత్తె అనుచో 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే సంధి నిత్యముగా వచ్చును. కావున ద్విరుక్త మగుహల్లు రెండవ పదము మొదటిఅచ్చుతో నిత్యముగా కలియును. కావున 'ఱకారంబుక్రింది ఱకారంబునకు' అనుసూత్రముచే రావలసినలోపము ప్రస్తుతసూత్రమును అనుసరించి పైవిధముగా సంధి జరుగుసందర్భమున (సంధిని వివక్షించినపుడు) రాదు. అఱ్ఱెత్తె అని ద్విత్వము అట్లే యుండును. కావున అఱెత్తె అనువిధ మైన జడ్డ లోపించినరూప ముండదు.

'జడ్డక్కరముతో' అనుటచే పదాదిస్వరము జడ్డ కలిగినశబ్దమునందు ఇతర మైనహల్లుతో కూడునట్టిసందర్భమున ఈనిషేధము లేదు. కావున జడ్డ లోపింప వచ్చును. తమ్ముల మున్నది – తముల మున్నది.

'పదాదిస్వరంబు' అనుటచే పరపదాదిహల్లుతో కూడుసందర్భమున ఈ నిషేధము లేదు. జడ్డ లోపించును. విల్పూని. ఇచట జడ్డ నిత్యముగా లోపించుచున్నది. విలుపూని, విల్లుపూని, విలు, విల్లు అనువిధముగా ఉండుటలో బాధ లేదు.

'పదాదిస్వరంబుతో కూడుచో' అనుటచే పరపదాదిని స్వర మున్నను దానితో కూడనిసందర్భమునందు అనగా సంధి జరుగని (సంధిని వివక్షింపని) సందర్భములో ఈనిషేధము లేదు. యథాశాస్త్రముగా జడ్డ లోపించును. నన్నున్+అడిగె. సంధి చేయకుండుటయందు నన్ను నడిగె, నను నడిగె అని యుండును. ఇట్లే ఎన్ని యున్నవి, ఎని యున్నవి మొ.

**10. హాదులయు నీలుగు లోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగా నగు.**

**హడపము – ఆడపము. హరిదళము – అరిదళము. హలఁది – అళది. నీలుగు – ఈలుగు, నీలుగు నెగయు పొందు పొనరు. పూనుపొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.**

హకారము ఆదియందు కలిగినశబ్దములు హాదులు. హకారము మొదటి కలిగినశబ్దములందును, నీలుగు మొద లగుశబ్దములందును మొదటిహల్లునకు బహుళముగా లోపము వచ్చును.

'హడపము' అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే మొదటిహల్లు (హకారపు పొల్లు) లోపింపగా 'అడపము' అని అగును. 'బహుళము' అనుటచే లోపము

రానిపక్షమునందు 'హడపము' అని హకారము అట్లే ఉండును. ఇట్లే నీలుగు-ఈలుగు. మొ.

'హాదులు' అని సామాన్యముగా చెప్పుటచే హకారము మొదట నున్నశబ్దములందు అన్నిటియందును మొదటి దగుహకారమునకు లోపము సాధారణముగా వచ్చును. ఈలోపము ఆచ్ఛికశబ్దములందే. కావున సంస్కృతసమములందు లేదు. హయము, హీనము. మొ.

నీలుగు లోనగునవి' అనుటచే నీలుగు మొద లగువానిలో చేరనిశబ్దమున ఈలోపము లేదు. పూను, పొదవు మొ. కొన్నిశబ్దములలో మొదట నున్నవేర్వేరు హల్లులు లోపించుటచే అట్టివి ఒకగణముగా నీలుగు లోనగునవిగా చెప్పబడినవి.

'తొలిహల్లునకు' అనుటచే మొదటిది కానిహల్లునకు లోపము లేదు. అడపము. ఈలుగు మొ.

## 11. ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకుం హ్రస్వంబు విభాష నగు.

**ఆరాటము - ఆరటము. ఆరాటము - కక్కూఱితి - కేళాకూళి - కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెండారము - బంగారము- బేహారము వీటతాటము - సంతోషము.**

ఆరాట (ఆది) మొద లగునవి ఆరాటాదులు. ఇవి అన్నియు ఆచ్ఛికశబ్దములె. ప్రథమము(మొదటిది)కంటె వే రైనది ప్రథమేతరము. ఆరాటము మొద లగు శబ్దములలో మొదటిఅక్షరమునందలిది కానిదీర్ఘమునకు వికల్పముగా హ్రస్వము వచ్చును.

'ఆరాటము' అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే 'రా' అనురెండవ అక్షరమందలిదీర్ఘమునకు హ్రస్వము రాగా, ఆరటము అని అగును. విభాష అనుటచే హ్రస్వము రానిపక్షమునందు 'ఆరాటము' అని దీర్ఘ మట్లే ఉండును.

'ఆరాటాదుల' అనుటచేత ఆరాటము మొద లగువానిలో చేరనిశబ్దమునకు ఈకార్యము లేదు. జోహారు, జోహరు అని యుండదు.

'ప్రథమేతరదీర్ఘంబునకు' అనుటచే మొదటిఅక్షరమునందు దీర్ఘ మున్నను దానికి హ్రస్వము రాదు. ఆరాటము 'అరాటము' అని కాదు. 'కొమారుఁడు కొమారిత' అనుచో 'మా' అనుఅక్షరమందలిదీర్ఘము మొదటిఅక్షరమునందలిది కాదు. కావున ప్రథమేతరదీర్ఘ మయి ప్రస్తుతసూత్రముచే హ్రస్వము నందును, కొమరుఁడు, కొమరిత మొ. అందువలననే సూరి వీనిని ఓయారాదులలో కాక ఆరాటాదులలో చేర్చెను.

**12. ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.**

**ఒయారము - ఓయారము. ఓయారము-కేళాకూళి-కోలె-గూడారము గోరువంక (పక్షి)-జోహారు-నీలుగు-పేఁడ-బేహారము (దీర్ఘమధ్యంబు) - మాఱు-మూలుగు-మోఱకు-వీటతాటము-వీడియము ఇత్యాదులు.**

ఓయారము మొద లగునవి ఓయారాదులు. ఇవి అన్నియు ఆచ్ఛికశబ్దములు. ఓయారము మొద లగుశబ్దములలో మొదటి(అక్షరమునందలి)దీర్ఘమునకు వికల్పముగా హ్రస్వము వచ్చును.

'ఓయారము' అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే మొదటిదీర్ఘమునకు హ్రస్వము రాగా, ఒయారము అని అగును. విభాష అనుటచే హ్రస్వము రాని పక్షమునందు ఓయారము అనిదీర్ఘము అట్లె ఉండును.

'ఓయారాదులు' అనుటచే ఓయారాదులలో చేరనిశబ్దమునందు హ్రస్వము రాదు. దీర్ఘము నడుమ నున్న బేహారము (పలుమారు మొ.) అనునదే ఓయారాదులలో ఉన్నది. 'ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు నగు' అనుసూత్రముచే హ్రస్వము వచ్చిన (నడుమ హ్రస్వము కలిగిన) బేహరము అనునది ఓయారాదులలో లేదు. కావున అందు తొలిదీర్ఘమునకు హ్రస్వము లేదు. బెహరము అని కాదు. ఇట్లె నాగేలు, తోడేలు మొ.

'తొలిదీర్ఘంబునకు' అనుటచేత మొదటిది కానిదీర్ఘమునకు హ్రస్వము లేదు. ఓయారము - ఒయారము అగును. కాని ఓయరము అని కాదు.

**13. అడంగ్వాదులడాకు ణకారంబు విభాష నగు.**

**అడఁగు-అణఁగు. అడఁగు-కడఁగు-చిల్లాడము-తడగము-నాఁడెము-పోఁడి-మిడుఁగు-వడఁకు-మిడుఁగుఱు ఇత్యాదు లడంగ్వాదులు.**

అడంగు మొద లగునవి అడంగ్వాదులు. ఇవి ఆచ్ఛికశబ్దములు. 'డాకు' అనగా డకారమునకు అని అర్థము. అడఁగు మొద లగుశబ్దములలోనిపొల్లు డకారముయొక్క స్థానమున పొ ల్లయిన 'ణ'కారము వికల్పముగా ఆదేశముగా వచ్చును.

'అడఁగు' అనుశబ్దమునందలిడకారపుపొల్లునకు ప్రస్తుతసూత్రముచేత ణకారపుపొల్లు ఆదేశము కాగా, అణఁగు అని అగును. 'విభాష' అనుటచే ణకారము రానిపక్షమునందు అడఁగు అని డకారముతోనే రూప ముండును.

'అడంగ్వాదులు' అనుటచేత అడఁగు మొద లగువానిలో చేరనిశబ్దమునందు ణకారము రాదు. పడు, చెడు మొ. నాణెము, పోణి అనుచో ణకార మాదేశ

మైనపుడు సంస్కృతసమేతరము లయినతెలుగుశబ్దములందు పరుషసరళములకు ముందే బిందు వుండును. (సంజ్ఞ. 16) కావున ఇచట స్థిరము పర మగుటచే బిందువునకు లోపము గలుగును.

**14. దక్కు లోనగువానిదాకు డకారంబు విభాష నగు.**

**దక్కు - డక్కు. దక్కు-దగ్గరు-దాఁగు-దాఁకలి-దిగు-దిగ్గియ-దూయు దెందము-దెప్పరము-దెప్పు-దొంగ-దొప్ప ఇత్యాదులు.**

'దా'కు అనగా దకారమునకు అని అర్థము. దక్కు మొద లగుశబ్దములలోని దకారపుపొల్లుయొక్క స్థానమున వికల్పముగా డకారపుపొల్లు ఆదేశముగా వచ్చును.

'దక్కు' అనుశబ్దమునందలిదకారమునకు ప్రస్తుతసూత్రముచే డకారపుపొల్లు ఆదేశము కాగా, డక్కు అని అగును. విభాష అనుటచే డకారము రానిపక్షమునందు దక్కు అని దకారముతో రూప ముండును.

'దక్కు లోనగువాని' అనుటచే దక్కు మొద లగువానిలో చేరనిశబ్దమునందు డకారము రాదు. దయ్యము, దగ మొ.

**15. ఏతాదులకు ముపర్ణకంబు పరం బగునపుడు దీర్ఘంబు విభాష నగు.**

**ఏతము - ఏతాము. ఏతము-కళ్లము-గాలము-గుడ్డము-గోణము-గోతము-జాజము-జుంజము-జోతము-తణగము-బొండ్లము-మండము లాతము-వీణము. ఇత్యాదులు.**

ఏత మొద లగునవి ఏతాదులు. ఇవి క్లీబసమములు. దీర్ఘము ఏకాల్లు (ఒకే వర్ణము) కావున విధించినదానిలో (ఏతాదులలో) చివరివర్ణముస్థానమున వచ్చును. ప్రథమావిభక్తి ఏకవచన మయినమువర్ణము పరముగా ఉండగా ఏత మొద లగుశబ్దములందలి చివరిహ్రస్వ మయినఅకారమునకు వికల్పముగా దీర్ఘము వచ్చును.

'ఏత' అనునది క్లీబసమము. కావున ప్రథమావిభక్తి ఏకవచనమునందు 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనుసూత్రముచే 'ము' ప్రత్యయము వచ్చి, ఏత+ము అని యుండగా ప్రస్తుతసూత్రముచేత దీర్ఘము వచ్చి 'ఏతాము' అని అగును. విభాష అనుటచే దీర్ఘము రానిపక్షమునందు 'ఏతము' అనియె ఉండును.

'ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' అనుసూత్ర తాత్పర్యమును అనుసరించి ఇచట ముపర్ణకము పర మగునపుడు చెప్పినకార్యము ముగాగమము పర మైనను వచ్చును. ఏతాముల, గోతామును మొ.

'ఏతాదులకు' అనుటచే ఏత మొదలగువానిలో చేరనిశబ్దమునకు ఈకార్యము లేదు. సున్నము – సన్నము మొ.

'మువర్ణకంబు పరం బగునపుడు' అనుటచే 'మ్ము ంబులు' పర మైనపుడు దీర్ఘము రాదు. ఏతమ్ము. గోతంబు మొ.

**16. పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.**

**ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు. ప్రానుపడె–ప్రాన్పడె. మినువడె–మిన్వడె. వత్తురువారు– వత్తుర్వారు. కారుకొనియె – కార్కొనియె. రాములు – రాముల్. వనములు– వనముల్.**

పదము చివర ఉన్నవి పదాంతములు, సంయుక్తము అనగా వే రొక హల్లుతో కూడియున్నది. అట్లు కూడియుండనిది అసంయుక్తము. పదము చివర ఉన్నవియును, వే ఱొకహల్లుతో కూడియుండనివియును అయిన 'ను, లు, రు' అనువర్ణములయందలి హ్రస్వ మగుఉకారమును (హల్లు గాని అవసానము గాని పర మయినపుడు) బహుళముగా లోపము వచ్చును. 'నులురు'లు ఉత్వముతో కూడినవి. పదాంతమునందు ఉన్నవీనికి అచ్చు పర మయినపుడు 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనుసూత్రముచే నిత్యముగా సంధి యగును. కావున అచ్చు పర మయినపుడు ఉత్వలోపప్రసక్తి లేదు. అందుచే హల్లు, అవసానము పర మయినపుడు నులురులయందలిఉకారము లోపించు నని అర్థ మగుచున్నది.

రాములు అనుశబ్దమునందు చివరిఉకారమునకు ప్రస్తుతసూత్రముచే లోపము రాగా, 'రాముల్' అని అగును. బహుళము అనుటచే లోపము రానిపక్షమునందు రాములు అని యుండును. ఇట్లె ప్రాను+పడె=ప్రాన్పడె. వత్తురు+వారు= వత్తుర్వారు మొ.

'పదాంతంబు లయి' అనుటచే పదమున ఇతరస్థలములలో ఉన్న 'నులురు'ల యత్వమునకు లోపము లేదు. నుదురు.

'అసంయుక్తంబులు' అనుటచే వే రొకహల్లుతో కూడియున్నపుడు నులురుల ఉత్వమునకు లోపము రాదు. కొడవండ్లు, ఆంధ్రు మొ.

'నులురు' అనుటచే ఇతరవర్ణములందలిఉత్వమునకు లోపము రాదు. ఆకు, ప్రేగు మొ.

'బహుళము' అనుటచే నురులయందలిఉత్వము అవసానమునందు లోపించుట అరుదు. ప్రత్యయము కాని రువర్ణమునకు అవసానమున ఈలోపము లేదు.

**17. ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.**

**కినుక - కిన్క. కానుక - కాన్క. చిలుక - చిల్క. కాలువ - కాల్వ.**

**అడుగు-అడ్గు. కడుపు-కడ్పు. పెరుగు-పెర్గు. కూరుకు-కూర్కు.**

సంస్కృతసమముకంటె వే రయినతెలుగుభాష ఆచ్ఛికము. అచ్చతెనుగు పదములో నడుమ నున్న 'నులుడురు' అనువర్ణములయందలిహ్రస్వ మైన ఉకారమునకు బహుళముగా లోపము వచ్చును.

కినుక అనుశబ్దమునందు ప్రస్తుతసూత్రముచే ఉత్వము లోపింపగా, 'కిన్క' అని అగును. బహుళము అనుటచే ఉత్వము లోపింపనిపక్షమునందు కినుక అని యుండును. ఇట్లే చిలుక – చిల్క, కడుపు – కడ్పు, పెరుగు – పెర్గు మొ.

'ఆచ్ఛికంబుల' అనుటచే ఈలోపము సంస్కృతసమములందు లేదు. వినుతి, అరుణము మొ.

'పదమధ్యంబుల' అనుటచే పదము మొదట గాని, చివర గాని ఉన్నప్పుడు ఈలోపము రాదు. నురుగ, పేడు మొ.

'నలడరల' అనుటచే నలడర అనువానికంటె వే రయిన హల్లుమీద ఉన్న ఉత్వమునకు లోపము రాదు. చిగురు, తుమురు మొ.

'ఉత్వంబునకు' అనుటచే ఉత్వంబుకంటె వే రయినఅచ్చునకు 'నలడర'ల పైని గూడ లోపము లేదు. నూనియ, ఆలము, నాఁడెము మొ.

'బహుళము' అనుటచేత తళుకు – తళ్కు, మిణగురు – మిణ్గురు మొదలగుచోట్ల నలడరలకంటె వే రయినవర్ణములందును అరుదుగా (అన్యకార్యముగా) ఉత్వలోపము గుర్తింపవచ్చును.

**18. లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.**

**కలికి - కల్కి. ములికి - ముల్కి. బుడిపి - బుడ్పి. పొలఁతి - పొల్తి.**

లాఁతి యనగా ఇతరము, చెప్పగా మిగిలినది. 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' అనుపూర్వసూత్రము 'నలడర' అనువానిపై నున్న హ్రస్వ మయినఉకారమునకు లోపము చెప్పినది. కాగా అచ్చతెనుగుభాషలో పదములనడుమ కలిగిన నలడరలపై

ఉన్న హ్రస్వ మగుఉకారముకంటె వే రయినఅచ్చునకు సయితము లోపము వచ్చుట అరుదుగా కానవచ్చుచున్నది.

'కలికి' అనుశబ్దమునందు లకారముపై నున్న ఇత్వమునకు ప్రస్తుతసూత్రముచే లోపము వచ్చి, 'కల్కి' అని అగును. ఇట్లే బుడిపి –బుడ్పిమొ.

'లాఁతియచ్చునకు సహితము' అనుటలో కినుక–కిన్క ఇత్యాదిగా నలడరలపై ఉత్వము లోపించుట ప్రసిద్ధ మగుట అనువదింపబడినది.

'ఒకానొకచో' అనుటచే ఉకారేతరస్వరమునకు లోపము వచ్చుట అరుదు. అనగా కొన్నిశబ్దములందు మాత్రమే కలుగును. కావున తేనియ, పేలిక మొద లగుశబ్దములలో ఉకారేతర మగుఅచ్చు లోపింపదు. 'ఆచ్ఛికంబులం బద మధ్యంబుల' అనుపూర్వసూత్రమునుండియె 'పదమధ్యంబుల' అనుఅర్థము సిద్ధించును. కావున ఈసూత్రమునందలి 'నుడినడుమ' అనుదళము స్పష్టతకె. మాటమొదట గాని, చివర గాని ఉన్నఉత్తుకంటె వే రయినఅచ్చునకు లోపము రాదు. నివురు, గాలి మొ.

పూర్వసూత్రము ననుసరించి ఈకార్యము ఆచ్ఛికశబ్దములందే. కావున సంస్కృతసమములలో ఈలోపము రాదు. హరితము, పలితము, మొ.

'కానంబడియెడి' అనుటచే 'లాఁతి అచ్చు' లోపించుట కవిప్రయోగములం దున్నచోట్లనె గుర్తింపవలెను. అట్లు లోపించుట అరుదు కావున అచ్చు లోపింపని 'కలికి' అనురూపము కవిప్రయోగముల ననుసరించి ప్రసిద్ధములే అగుటను గుర్తింపవచ్చును.

## 19. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు.

**అబ్బురము – అబ్రము. అబ్బురము–కప్పురము–అప్పుడు–ఇప్పుడు ఎప్పుడు–చప్పుడు–నెత్తురు ఇత్యాదులు.**

అబ్బురము మొద లగునవి అబ్బురాదులు. అబ్బురము మొద లగుశబ్దముల యందలిహ్రస్వ మైనఉకారమునకు వికల్పముగా లోపము వచ్చును.

అబ్బురము అనుచో ప్రస్తుతసూత్రముచే ఉత్వము లోపించి (అబ్‌బ్‌రము) మీదిహల్లుతో కూడునపుడు ద్విరుక్త మగుహల్లులో ఒకటి లోపించి, అబ్రము అని అగును. విభాష అనుటచే ఉత్వము లోపింపనిపక్షమునందు 'అబ్బురము' అని ఉండును.

నలడరాదులలో ఉత్వలోపము సామాన్యముగా నుండుటచే 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని

ప్రత్యేకముగా సూత్రింపబడినది. ఇతరస్థలములలో వేర్వేరు హల్లులపై కొన్ని కొన్ని శబ్దములందు మాత్రమే ఉత్వలోపము కానవచ్చుటచే అట్టిశబ్దములను అన్నింటిని 'అబ్బురాదులు' అని ఒకగణముగా ఏర్పరచి అందు ఉత్వలోపము చెప్పబడినది. ఇచట సూరి అన్నియు ద్విత్వముతో ఉన్నవానినే చూపెను. అట్టినియమము సూత్రమునందు లేదు. కావున తళుకు మొద లగునవి అబ్బురాదులలో చేర్చుకొన్నచో ఇచట ఉత్వలోపము ప్రాప్తింపగలదు.

'అబ్బురాదులందు' అనుటచే అబ్బురము మొద లగువానిలో చేరనిశబ్దము నందు ఈసూత్రముచే ఉత్వలోపము రాదు. నిక్కువము, తమ్ములము మొ.

**20. చుక్పరకరువర్ణంబునకు ముందఱి దువర్ణంబునుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు.**

**అదురుచు - అద్రుచు. ఎదురుచు - ఎద్రుచు. పదురుచు - పద్రుచు.**

చుక్కు (చుగాగమము) పరముగా కలిగినరువర్ణము చుక్పకరువర్ణము. 'చుగాగమం బాచ్ఛికంబునకు (క్రియ. 73) అనుసూత్రముచే ఇచట చుగాగమము వచ్చును. అట్టి చుగాగమమునకు పూర్వమునం దున్న 'రు' వర్ణమునకు (రుచు) పూర్వమునం దున్న దువర్ణము(దురుచు)నందలి హ్రస్వ మయినఉకారమునకు వికల్పముగా లోపము వచ్చును. (ద్రుచు). అట్లు దువర్ణమునందలి ఉత్వము లోపింపగా దానికి పూర్వమునం దున్నఅక్షరము గురువు కాదు. ఉత్వము లోపించినపుడు దకారము పై నున్నరేఫముతో సంయుక్త మగును. సంయుక్తమునకు పూర్వమునందలివర్ణము గురువు కావలయును. కినుక - కిన్క మొ. కాని యిచట మాత్రము దకారరేఫలసంయుక్తవర్ణము పర మైనను పూర్వమున నున్న (హ్రస్వ) వర్ణము గురువు కాక లఘువే అగును. 'ఎద్రిచినకాలపాశమున నీగతి నీమది క్రోధవల్లికం బద్రిచినవారు' మొ.

'అదురుచు' అనుశబ్దమునందు దకారముపై నున్నఉకారమునకు ప్రస్తుత సూత్రముచే లోపము రాగా, 'అద్రుచు' అని అగును. ఇందలి 'అ' అనువర్ణము సంయుక్తపర మైనను లఘువే అగును. 'విభాష' అనుటచే ఉత్వము లోపింపని పక్షమునందు 'అదురుచు' అని యుండును.

'చుక్పరక' అనుటచే చుగాగమముకంటె వే రైనప్రత్యయము మొ.వర్ణము పర మైనపుడు ఈకార్యము లేదు. అదురుచున్నది, ఎదురుచున్ మొ. అద్రుచున్నవాఁడు ఇత్యాదిగా కావు. ఇట్లె అదిరించు మొదలుగా ఇంచుగాగమము పర మైనపుడు ఉత్వలోపము లేదు.

'రువర్ణంబు' అనుటచే రువర్ణము పరముగా లేనిచో ఈకార్యము లేదు. వదులుచు (వదిలిచెను) పగులుచు (పగిలిచెను) మొ.

'దువర్ణంబు' అనుటచే దువర్ణముకంటె ఇతరవర్ణమునందు ఈకార్యము లేదు. చిగురుచు, ఇగురుచు మొ. ఇట్లె అదిరెను – అద్రెను మొద లగురీతిగా కావు.

## 21. జూదాదులదాకు జకారంబు విభాష నగు.

**జూదము–జూజము. జూదము–అవుదు–జవాది–జాది–జాదు–విరవాది.**

జూద మొద లగునవి జూదాదులు. ఇవి ఆచ్ఛికశబ్దములు. 'దా'కు అనగా దకారమునకు అని అర్థము. దకారమునకు వర్ణనిర్దేశమునందు దీర్ఘము వచ్చినది. 'జూద' మొద లగుశబ్దములయందలిదకారపుపొల్లు స్థానమున జకారపుపొల్లు వికల్పముగా ఆదేశముగా వచ్చును.

'జూద(ము)' అనుశబ్దమునందలిదకారమునకు ప్రస్తుతసూత్రముచే జకారపు పొల్లు ఆదేశము కాగా, జూజ (ము) అని అగును. జూజములు మొ. విభాష అనుటచేత జకారము ఆదేశము కానిపక్షమునందు 'జూదము' అని దకారము అట్లే యుండును.

'జూదాదుల' అనుటచే జూదము మొద లగువానిలో చేరనిశబ్దమునందు ఈకార్యము లేదు. అదురు, చెదురు మొ.

'దాకు' అనుటచే ఇతరవర్ణము లట్లే ఉండును. జూజము.

## 22. నిందయం దామ్రేడితంబునాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు.

**కుంభకర్ణుఁడు – గింభకర్ణుఁడు. రావణుఁడు – గీవణుఁడు.**

అత్యంతము మొద లగువిశేషార్థములందు శబ్దము రెండు (మొ.) సార్లు ఉచ్చరింపబడును. అపుడు వానిలో రెండవ దైనశబ్దమునకు ఆమ్రేడితము అని పేరు. 'హ్రస్వదీర్ఘములకు గిగీ లగు' అనుచో యథాక్రమముగా హ్రస్వమునకు గి, దీర్ఘమునకు 'గీ' అగును. నిందార్థమునందు రెండుసార్లు ఉచ్చరింపబడిన శబ్దములో రెండవదాని మొదటిఅక్షరము హ్రస్వ మైనచో ఆఅక్షరముస్థానమున 'గి' అనునదియు, దీర్ఘ మైనచో దానికి 'గీ' అనునదియు ఆదేశముగా వచ్చును.

కుంభకర్ణుఁడు నిందయందు ఇది ద్విరుక్త మై, కుంభకర్ణుడు+కుంభకర్ణుడు అని యుండగా రెండవ దైన 'కుంభకర్ణ' శబ్దములో మొదటివర్ణము 'కు' అనునది (ఉకారము) హ్రస్వము కావున దానిస్థానమున ప్రస్తుతసూత్రముచే 'గి' అనునది ఆదేశ మై గింభకర్ణుడు అని అగును.

రావణుఁడు అనుచో (రా) దీర్ఘము కావున రావణుడు గీవణుడు అనువిధముగ (దీర్ఘ మైన) 'గీ' అనునది ఆదేశముగా వచ్చును.

'నిందయందు' అనుటచే నిందార్థము లేనపుడు ఈకార్యము లేదు. హరి హరీ, కృష్ణ కృష్ణ మొ.

'ఆమ్రేడితంబు' అనుటచే కుంభకర్ణుడు గింభకర్ణుడు అనుచో మొదటిశబ్దము నందు ఈకార్యము లేదు.

'ఆద్యక్షరంబునకు' అనుటచే అచ్చుతో గూడినహల్లు(ల)తో కూడ మొత్తము భాగమునకు, గి, గీలు వచ్చును. కుంభకర్ణుఁడు అనుచో క్+ఉ-కు అను మొత్తమునకు 'గి' ఆదేశము.

## 23. పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు.

పాదము అనగా పద్యమునందలిపాదము. 'ప్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు' అనుచో యథాక్రమముగా ప్రథమాక్షరము వళియు, ద్వితీయాక్షరము ప్రాసయు అని అర్థము. పద్యమునందు అన్ని పాదములందును మొదటిఅక్షరమునకు 'వళి' అనియు, రెండవఅక్షరమునకు 'ప్రాసము' అనియు వ్యవహారము.

'శ్రీలతకుం బ్రాఁ కయి' ఇచట మొదటి దగుటచే 'శ్రీ' అనుఅక్షరమునకు 'వళి' అని సంజ్ఞ. రెండవది అయిన 'ల' అనుఅక్షరమునకు ప్రాసము అని పేరు. ఇట్లే అన్నిపాదములందును వళిప్రాసలు గుర్తింపదగును.

శాస్త్రమును ముగించుసందర్భమున, శాస్త్రాంతరమునందు ప్రవేశము కల్గునట్లు చేయుట ఒకసంప్రదాయముగా పెద్దలు చెప్పుదురు. ఇచట వ్యాకరణశాస్త్రమును ముగించు సందర్భమునందు తెలుగుఛందస్సున ప్రధానము లయిన వళిప్రాసలను ప్రస్తావించి ఛందశ్శాస్త్రమునందు ప్రవేశమును కల్పించుచు చిన్నయసూరి ఆసంప్రదాయమును ఆదరించె నని పెద్దలఅభిప్రాయము.

## 24. యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫంబులు పొరయవు.

యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబులు. లఘువులు అయిన యలవ అనువానికి అలఘువు లైన యలవ అనువానితో (యథా క్రమముగా) మైత్రి కలదు. కాని లఘురేఫమును ఆలఘురేఫమును అట్లు కలియవు. "పాదంబునం బ్రథమద్వితీయాక్షరంబులు వళిప్రాసంబులు నాఁబడు" అనుపూర్వ సూత్రమును అనుసరించి ఇచట 'మైత్రి' అనగా వళిప్రాసలవిషయమునందలి

మైత్రి అని గ్రహింపవలయును. యతియందును, ప్రాసయందును లఘు యకారమున కలఘుయకారముతోను, లఘులకారమున కలఘులకారముతోను, లఘు వకారమున కలఘువకారముతోను మైత్రి కలదు.

యతి : భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుగ,

ప్రాస : ఆయజుని తండ్రి ఫణిరాజశాయి యనఁగ.

రేఫములకు అనగా లఘురేఫమునకు (ర) అలఘురేఫమునకును (ఱ) యతి యందు గాని, ప్రాసయందు గాని మైత్రి లేదు. అనగా సాధుశకట రేఫములకు యతి గాని ప్రాస కాని చెల్లదు. కాని కవులు వీనికి యతిప్రాసమైత్రిని కుదుర్చుచునే యున్నారు. తిక్కనయు 'ఱాతిపయి నుప్పు గొనుట రాత్రి' అని యతిమైత్రి కుదిర్చెను.

## 25. రేఫంబులు లఘ్వలఘువులం దక్కుం గలవిశేషంబులు నార్య వ్యవహారంబులం దెలియుట శ్రేయంబు.

'యవలంబు లఘ్వలఘువులు మైత్రిం బొరయు, రేఫంబులు పొరయవు' అనుపూర్వసూత్రము ననుసరించి యతియందు గాని, ప్రాసయందు గాని లఘురేఫ(ర)కు అలఘురేఫ(ఱ)కును పరస్పరము మైత్రి లే దని చెప్పబడినది. కాగా లఘువు, అలఘువు అయినరేఫలయొక్క స్థితి ప్రసక్త మగుటచే ఈసూత్రము చెప్పబడినది.

లఘురేఫము ఎచ్చట నుండునో అలఘురేఫము ఎచ్చట నుండునో మొద లగు'బాలవ్యాకరణము'నందు చెప్పబడనివిశేషము లైనఅంశములను పెద్దల వ్యవహారమునుండి తెలియుట మంచిది. బాలవ్యాకరణము భాషకు సామాన్య మైనలక్షణము మాత్రమె చెప్పిన దనియు ఇందు చెప్పక విడిచినఅంశములును కల వనియు అవి పెద్దలకావ్య, లక్షణవ్యవహారములనుండి తెలిసికొనదగు ననియు అభిప్రాయము. బాలవ్యాకరణ ఆరంభముననే 'దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు లక్షణము గానఁ బూర్వకవులలక్ష్యములను లాఁతిలక్ష్మములఁ గాంచి తక్కులక్షణ మెఱింగికొనుఁడు చతురమతులు' అని సూరి ఈఅంశమును చెప్పియున్నాడు.

సాధుశకటరేఫలవిషయము యతిప్రాసలకు సంబంధించి ఛందశ్శాస్త్రము నకును చెందిన దగుటతోపాటు లఘురేఫ కలిగినశబ్దములు, అలఘురేఫ కలిగిన శబ్దములఎఱుకవిషయమున శబ్ద(వ్యాకరణ)శాస్త్రమునకు సంబంధించియున్నది. శాస్త్రాంతరము(ఛందశ్శాస్త్రము)నందు ప్రవేశము కల్పించుటతోపాటు వ్యాకరణశాస్త్రమున చివర చెప్పినఈలక్షణము ఈవ్యాకరణశాస్త్రముతోను

సంబంధించినది అగునట్లుగా పేర్కొనుట ఉచితముగా నున్నది.

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రక్షచతే' అని మహాభాష్యమునందు పేర్కొన్నదానికి తగినట్లుగా ఇచట శాస్త్రాంతమున 'శ్రేయంబు' అను మంగళవాచక మైనశబ్దముతో సూరి తనబాలవ్యాకరణమును ముగించుట సంప్రదాయానుగుణమై సముచితముగా నున్నది.

**ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము**

**శ్రీస్తనాఞ్చిత కస్తూరీపఙ్కసఙ్కలితోరసే ।**
**పఙ్కజాక్షాయ నాథాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥**

**బాలవ్యాకరణము సంపూర్ణము**

# అకారాదిసూత్రానుక్రమణిక

(కార. 30) అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబున కేని విశేషణంబు లన్నింటి కేని మీఁద సముచ్చయార్థకంబు విభాషం బ్రయోగింపఁబడు.

(క్రియ. 112)అయ్యది పరం బగునపుడు చువర్ణంబు లోపించు.

(తద్ధి. 9) అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకం బగు.

(తద్ధి. 17) అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు.

(తద్ధి. 28) అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది.

(ఆచ్ఛి. 34) అఱ్ఱు మొద లగుశబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు.

(కృత్. 18) అవర్ణకంబు గీఱ్ఱాదుల కగు.

(సంధి. 20) అవసానంబునందు ద్రుతస్వరంబున కేని, ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు.

(క్రియ. 106)అస్త్యర్థంబునందు లజీ మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు.

(సమా. 4) ఆఈఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు.

(సమా. 21) ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయి యనుశబ్దంబులు విభాష నగు.

(క్రియ. 90) ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు.

(తత్స. 30) ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమంబు విభాష నగు.

(క్రియ. 88) ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు ప వ లగు.

(క్రియ. 103)ఆచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.

(ప్రకీ. 17) ఆచ్ఛికంబులం బదమధ్యంబులనలదరలయుత్వంబునకు లోపంబు విభాష నగు.

(ప్రకీ. 2) ఆచ్ఛికంబులం దుత్తమంబు లగురులుడులముందటియేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు.

(క్రియ. 54) ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు.
(కృత్. 16) ఇకి కోర్వాదుల కగు.
(తత్స. 44) ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు.
(క్రియ. 92) ఇచ్చునకు సర్వంబున కీ యగు.
(కృత్. 2) ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు.
(తద్ధి. 2) ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు.
(ఆచ్ఛి. 24) ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.
(సంజ్ఞ. 6) ఇతరము లగుహల్లులు స్థిరములు.
(తత్స. 45) ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు.
(క్రియ. 85) ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయుత్వంబున కిత్వం బగు.
(కృత్. 4) ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు.
(ఆచ్ఛి. 23) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు.
(తద్ధి. 18) ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు.
(ఆచ్ఛి. 29) ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగా నగు.
(తత్స. 27) ఈధాతుయుష్మదర్థంబులమీఁదివానియుత్వంబున కిత్వంబు రాదు.
(తద్ధి. 16) ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు.
(కార. 34) ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు.
(కార. 10) ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు.
(కార. 11) ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు.
(తద్ధి. 10) ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు.
(తత్స. 29) ఉకారబుకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు.
(తత్స. 50) ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకంబు బహుళంబుగా నగు.
(తత్స. 48) ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు.
(కార. 18) ఉకారాంతజడంబునకు నవర్ణకం బగు.

(తత్స. 68) ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు.
(సమా. 16) ఉత్తరపదం బగుచోటశబ్దము టాక్షరమునకు లోపంబు విభాషనగు.
(సంధి. 1) ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు.
(తద్ధి. 4) ఉత్వంబున కత్వంబు ఙికంబు పరం బగునపు డగు.
(క్రియ. 13) ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు.
(కార. 23) ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు.
(సంధి. 54) ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు.
(సంధి. 33) ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు.
(తత్స. 35) ఉదంతసంస్కృతనామంబుమీఁదిసంబుద్ధిడుజునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు.
(తద్ధి. 35) ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు నుగాగమం బగు.
(క్రియ. 46) ఉన్నకలజినవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు.
(క్రియ. 117) ఉన్న కల న వర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు.
(క్రియ. 14) ఉన్నశబ్దంబు పరం బగునపు డుండుధాతువునకు లోపం బగు.
(కార. 7) ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు.
(క్రియ. 30) ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు.
(కృత్. 21) ఉవర్ణకం బడుక్త్వాదుల కగు.
(ప్రకీ. 3) ఊయెల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు.
(ప్రకీ. 4) ఊయేలయూయాలలచాఁపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు.
(ప్రక్ణీ. 6) ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు.
(సంజ్ఞ. 4) ఋఋ(ఌ,ౡ)విసర్గఖఛఠథఫఘఝఢధభజఞశషలు సంస్కృత సమంబులం గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు.
(తత్స. 52) ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు.
(తత్స. 73) ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు.
(తద్ధి. 26) ఎఁడువర్ణకంబు పరం బగునపుడు లివర్ణంబు లోపించు.
(క్రియ. 28) ఎడుతలద్రుతంబున కచ్చు పరం బగునపుడు మకారం బగు.

(క్రియ. 34) ఏదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజునకు వుజి రుజి యగు.
(సమా. 10) ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు.
(కార. 37) ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను.
(తత్స. 55) ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు.
(ప్రకీ. 15) ఏతాదులకు మువర్ణకంబు పరం బగునపుడు దీర్ఘంబు విభాషనగు.
(సంధి. 5) ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు.
(తత్స. 65) ఐకారం బీతుల్యంబు.
(ఆచ్ఛి. 17) ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు.
(కార. 21) ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు.
(తత్స. 74) ఒకానొకచో మహత్త్వంబున మతుప్తకారంబున కానాదేశంబు విభాష నగు.
(కార. 27) ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు.
(తత్స. 14) ఓ యామంత్రణంబునం దగు.
(ప్రకీ. 12) ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు.
(తత్స. 16) ఓరి యోసి మైత్రియందుం గలవు.
(తత్స. 15) ఓ శబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబులందు యిసిరివర్ణంబులు విభాష నంతాగమంబు లగు.
(ఆచ్ఛి. 16) ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు.
(ఆచ్ఛి. 38) ఔపవిభక్తికములతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.
(కార. 12) కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు.
(కార. 13) కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు.
(తత్స. 66) కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు.
(క్రియ. 36) కజివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు.
(క్రియ. 39) కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు.
(సంజ్ఞ. 5) కచటతపలు పరుషంబు లని, గజడదబలు సరళంబు లని

(తద్ధి. 14) కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.
(తత్స. 6) కు యొక్క లోపల షష్ఠి.
(సంధి. 12) కుఱు చిఱు కడు నడు నిడు శబ్దంబుల అడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు.
(తత్స. 28) కువర్ణకంబు పరం బగునపు డుకారఋకారంబులకు నగాగమంబగు.
(కృత్. 6) కువ వర్ణకం బడంగ్వాదుల కగు.
(ఆచ్ఛి. 9) కూఁతుశబ్దముప్రథమైకవచనమునకు రువర్ణం బగు.
(సమా. 15) కృతహ్రస్వం బగుచోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు.
(తత్స. 34) కృతోత్కం బగుసంస్కృతనామంబుసంబుద్ధిడుఙునకు లోపంబు విభాష నగు.
(కృత్. 1) కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.
(సమా. 3) కొండొకచో సమాసంబులందు నామ్వాదికనుమ్వాదులనువర్ణంబు పఙ్ పవర్ణంబు లగు.
(క్రియ. 53) కొనుధాతువు పరం బగునపు డిగాగమంబు బహుళంబుగా నగు.
(ఆచ్ఛి. 6) కొన్నిడుమంతంబులబహువచనలకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారంబు నగు.
(సంధి. 21) కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి.
(తత్స. 4) కొఱకు కయి చతుర్థి.
(సంధి. 8) క్త్వార్థం బయినయిత్తునకు సంధి లేదు.
(సంధి. 6) క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.
(క్రియ. 52)క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తంబగు.
(సంధి. 38) క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.
(తత్స. 18) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు.
(క్రియ. 89) ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు.
(కృత్. 15) గడ చేర్వాదుల కగు.
(క్రియ. 123)గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త

యగునది ప్రేరణంబునం గర్మం బగు.

(సమా. 12) గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమం బగు.

(క్రియ. 50) గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వర ద్విస్వరంబులయించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.

(తత్స. 19) జిత్తు బిందుపూర్వం బగు.

(తత్స. 20) జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు.

(క్రియ. 95) జీత్తు పరం బగునపుడు వానివువర్ణంబు విభాషను లోపించు.

(తత్స. 58) చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.

(క్రియ. 94) చావునోవులు చచ్చునొచ్చుల కగు.

(తద్ధి. 3) చిన్నాదులకు ఱికవవర్ణకం బగు.

(ప్రకీ. 20) చుక్పరకరువర్ణంబునకు ముందఱిదువర్ణంబునుత్వంబునకు లోపంబు విభాష నగు. నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు.

(క్రియ. 75) చుక్పువర్ణంబులు పరంబు లగునపు డిత్వంబున కుత్వం బగు.

(క్రియ. 73) చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబునం దగు.

(క్రియ. 108) చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు.

(క్రియ. 43) చువర్ణంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు.

(క్రియ. 55) చువర్ణకంబు పరం బగునపు డన్వాదుల కుత్వలోపం బేని నుస్థానంబున బిందు వేని విభాష నగు.

(క్రియ. 81) చెడునకుం జుక్పుగాగమంబులును డా కలఘురేఫంబు నగు.

(ఆచ్ఛి. 10) చెయువుబహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు.

(తత్స. 3) చేత తోడ తృతీయ.

(తత్స. 10) చేత తోడ లోపల వర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు.

(సంధి. 43) చేత తోడ వలనల కిత్వంబు సమాసంబునం దగు.

(కార. 3) చేత వర్ణకంబు కర్త కగు.

(క్రియ. 41) చేదర్థంబునందు వృత్తం బగుభావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతం బగు.

(క్రియ. 119) చేదర్థయోగంబున లృట్టులకు లి ట్టగు.

(క్రియ. 57) చేదాద్యర్థనాంతం బయినయుండున కున్నాదేశంబు విభాష నగు.

(తత్స. 79) జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు.
(కార. 22) జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.
(కార. 24) జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు.
(ప్రకీ. 9) జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.
(ప్రకీ. 21) జూదాదులదాకు జకారంబు విభాష నగు.
(కృత్. 7) ట వర్ణకం బాడ్వాదుల కగు నగుచో నంతలోపం బగు.
(క్రియ. 35) టవర్ణకంబు భావంబునం దగు.
(ఆచ్ఛి. 36) టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు.
(ఆచ్ఛి. 31) టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు.
(ఆచ్ఛి. 37) టివర్ణంబు పరం బగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వం బగు.
(కృత్. 8) టువర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు.
(తత్స. 20) డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు.
(తత్స. 23) డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనము పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు.
(తత్స. 25) డుమంతంబుమీఁదినువర్ణంబునుత్వంబున కిత్వం బగు.
(తత్స. 11) డుమువున లేకవచనంబులు.
(తత్స. 1) డుమువులు ప్రథమ.
(కృత్. 20) డువర్ణకం బాళ్వాదుల కగు, నగునపుడు పకారంబు చయల కగు.
(తత్స. 13) తక్కినవి యుభయంబులు.
(కృత్. 5) తజ్వర్ణకంబు చేయ్వాదుల కగు.
(సమా. 3) తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు.
(క్రియ. 5) తద్ధర్మాదులందు లా ట్టగు.
(తద్ధి. 1) తనవర్ణకంబు త్వార్థంబునం దగు.
(సంధి. 27) తలఁబ్రాలు మొద లగుసమాసంబుల ద్రుతంబునకు లోపంబులేదు.
(కృత్. 10) తవర్ణకం బావులించు లోనగువాని కగు.
(తద్ధి. 19) తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు

లోపసంశ్లేషంబులు విభాష నగు.
(సంధి. 16) ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు.
(సంజ్ఞ. 13) ద్రుతప్రకృతులు గానిశబ్దములు కళ లనంబడు.
(సంజ్ఞ. 12) ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు.
(సమా. 24) ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు.
(సంధి. 15) ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలు బహుళంబుగా నగు.
(సమా. 18) ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁ గాదు.
(సమా. 13) ద్విరుక్తం బగుహల్లు పరంబగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు.
(సమా. 9) ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు.
(కార. 31) ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయిపదం బనుప్రయుక్తం బగు.
(క్రియ. 1) ధాతువునకు.
(క్రియ. 118)ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు.
(సంజ్ఞ. 11) నకారంబు ద్రుతంబు.
(తద్ధి. 6) నవర్ణకంబు గుణవచనంబు లగునల్లాదుల కగు.
(తత్స. 54) నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు.
(క్రియ. 11) నామయుష్మదస్మదర్థములందుం బ్రథమమధ్యమోత్తమంబు లగు.
(ప్రకీ. 22) నిందయం దామ్రేడితంబునాద్యక్షరంబులకు హ్రస్వదీర్ఘములకు గిగీ లగు.
(సమా. 20) నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.
(క్రియ. 65) నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు.
(కారక. 16) నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు.
(క్రియ. 115)నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు. నుజికి విభాష నగు.
(తత్స. 2) నువర్ణంబు ద్వితీయ.
(క్రియ. 97) నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరంబు లగునపుడు రుచులకు

లోపంబు బహుళంబుగా నగు.
(తత్స. 63) నౌ శబ్దంబునకు నావ యగు.
(ఆచ్ఛి. 5) పగతాదులబహువచనలకారంబునకు రేఫం బగు.
(కార. 14) పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు.
((క్రియ. 109)పడుజీ కొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు.
((క్రియ. 49) పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు.
((క్రియ. 82) పడునకుం జుక్కును, డా కలఘురేఫంబు నగు.
((క్రియ. 51) పద్వాదులనవర్ణకంబున కత్వంబును, గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు.
((క్రియ. 46) పద్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు.
((ప్రకీ. 16) పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.
(ఆచ్ఛి. 33) పదాద్యం బగుహ్రస్వంబుమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు.
((ప్రకీ. 1) పదాద్యంబులు ఋ(ఌ) వర్ణంబులు రల తుల్యంబులు.
((ప్రకీ. 5) పయ్యెద పయ్యద.
(కృత్. 9) పవర్ణకంబు తిరియ్వాదుల కగు.
((ప్రకీ. 23) పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు.
((క్రియ. 101)పిలుచు మొద లగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు.
(తత్స. 21) పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబుతుది యత్వంబున కుత్వం బగు.
(తత్స. 22) పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు.
(కృత్. 11) పువర్ణకంబు మాయ్వాదుల కగు.
(తత్స. 62) పృథ్వీవాచి భూశబ్దంబునకు భువి యగు.
(సంధి. 30) పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు.
(తద్ధి. 5) పేర్వాదుల కిమి వర్ణకం బగు.
((క్రియ. 98) పోవునకు దుజ్ముత్తులు ముజుం బరంబు లగునపుడు వులోపంబుం

బొదపదలును విభాష నగు.

(సంధి. 13) ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు.

(కార. 33) ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు.

(సంధి. 2) ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులం దున్నయుకారంబునకు సంధి వైకల్పికముగా నగు.

(సంజ్ఞ. 2) ప్రాకృతమునకు వర్ణములు నలువది.

(కార. 1) ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు.

(క్రియ. 84) ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు.

(క్రియ. 87) ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు.

(కృత్. 14) బడి యేల్వాదుల కగు.

(ఆచ్ఛి. 3) బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.

(ఆచ్ఛి. 31) బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు.

(ఆచ్ఛి. 22) బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులతుదియక్షరంబునకు లోపంబు విభాష నగు.

(ఆచ్ఛి. 20) బహువచనంబు పరం బగునపుడు చేనుపేనుమీనుశబ్దముల నువర్ణంబు లోపించు.

(ఆచ్ఛి. 21) బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు.

(ఆచ్ఛి. 13) బహువచనంబు పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతము లయిన డలరల కలఘులకారంబు బహుళంబుగా నగు.

(ఆచ్ఛి. 12) బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.

(ఆచ్ఛి. 14) బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు.

(సమా. 22) బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి.

(సమా. 23) బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁదిమేనునకు బోఁడి యగు.

(తత్స. 87) భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు.

(కార. 26) భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానిముందు

విశేషణంబుల కయిపదంబును బహుళంబుగా ననుప్రయుక్తం బగు.

(కారక. 28) భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు.

(కార. 32) భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు.

(క్రియ. 4) భావిని ౡ ట్టగు.

(క్రియ. 17) భూతంబునం దిగాగమం బగు.

(క్రియ. 114) భూతంబున లజికి లిడంతం బగునగుధాతు వనుప్రయుక్తం బగు.

(క్రియ. 3) భూతంబున లి ట్టగు.

(తద్ధి. 8) మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

(తత్స. 70) మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు.

(సంధి. 7) మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగు.

(సంధి. 47) మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపంబు విభాష నగు.

(తత్స. 37) మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు.

(క్రియ. 31) మధ్యమముడుజులు ముజు నాఁబడు.

(తత్స. 83) మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాష నగు.

(తత్స. 86) మహతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు.

(ఆచ్ఛి. 4) మహత్తు లగుమగాదులకుం గయిరాదులకును డుజగు, నుత్వంబు గాదు.

(తత్స. 78) మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు.

(తత్స. 81) మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు.

(తత్స. 76) మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు.

(తద్ధి. 25) మానార్థంబున కేకత్వంబునం దెఁడు వర్ణకం బగు.

(తద్ధి. 24) ముక్కు లోనగువానికిం దదభావద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడి వర్ణకం బగు.

(క్రియ. 89) ముజ్‌జీత్తులు ముత్తు నాఁబడు.

(క్రియ. 60) ముజు పరం బగునపుడు కో శబ్దంబు కొనునకు బహుళంబుగానగు.

(క్రియ. 61) ముజు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియు నగు.

(తత్స. 72) ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు.

(తత్స. 42) ముపర్ణకంబునకు మాముడి యేనిం, బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు.

(తత్స. 41) ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు.

(సంజ్ఞ. 17) యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు.

(సంజ్ఞ. 18) యరలవలు లఘువు లని, యలఘువు లని ద్వివిధంబు లగు.

(ప్రకీ. 24) యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు, రేఫంబులు పొరయవు.

(తద్ధి. 21) యువతివిటీరజస్వలలు గుబ్బెతమిండతముట్టుతలు నాఁబడుదురు.

(సమా. 11) యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరం బగునపుడు దుగాగమంబు విభాష నగు.

(క్రియ. 71) రంజాదులయించుక్పకారంబునకు సబిందుకంబు కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు.

(తత్స. 47) రలడోపధనవార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు.

(క్రియ. 62) రువర్ణకంబు పరం బగునపుడు సున్నమీఁదితదడలయుత్వంబునకు లోపంబు విభాష నగు.

(ప్రకీ. 25) రేఫంబులు లఘ్వలఘువులుం దక్కుం గలవిశేషంబులు నార్య వ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు.

(తత్స. 64) రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు.

(ప్రకీ. 7) ఱకారంబుక్రిందిఱకారంబునకుం దుదినులులక్రిందినలలకు లోపంబు బహుళంబుగ నగు.

(ఆచ్ఛి. 8) ఱేప్రభృతులబహువచనమునకు ముందు డు ఱగు.

(క్రియ. 8) లకారంబునకు డుబ్రువురునుము ఙ్ఞాగు

(క్రియ. 48) లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు.

(సంజ్ఞ. 22) లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు.

(ప్రకీ. 18) లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.

(క్రియ. 102) లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి.

(క్రియ. 22) లాట్టురుఙ్ఞు పరం బగునపుడు దుగాగమం బగు.

(క్రియ. 22) లాట్టురుఙ్ఞు పరం బగునపు డెదగాగమంబును బ్రథమనువర్ణకంబు పరం బగునపు డెడుగెడిగాగమంబులు నగు.

కర్త్వస్త్రీవద్భావంబులు విభాష నగు.
(క్రియ. 27) విధియందు లూట్టునకు మాఱుగా నది యనుతచ్ఛబ్దంబును, ముందు నుగాగమంబు నగు.
(అచ్ఛి. 35) విభక్తి పరం బగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు తివర్ణంబగు.
(కార. 19) విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు.
(తత్స. 75) విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు.
(సంధి. 50) విసర్గంబున కనుకరణంబున లోపం బగు.
(కృత్. 17) వువర్ణకంబు మన్వాదుల కగు.
(తత్స. 49) వువర్ణేతరవిభక్తి పర మగుచో నుకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు.
(తత్స. 56) వృద్ధాదులడుజునకు లోపంబు విభాష నగు.
(తత్స. 82) వేధ పురోధ పురోధసుఁడు.
(క్రియ. 107) వ్యతిరేకంబున వలచున కొల్ల విభాష నగు.
(క్రియ. 32) వ్యతిరేకంబున ముఱు పరం బగునపుడు కుఱి యగు.
(క్రియ. 7) వ్యతిరేకంబున లఱి యగు.
(క్రియ. 47) వ్యతిరేకతృవర్ణకార్థంబున నిఱి యగు.
(క్రియ. 37) వ్యతిరేకభావంబున మిఱి యగు.
(సంధి. 48) వ్యతిరేకమధ్యమమువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.
(క్రియ. 83) శబ్దపల్లవం బగుపడున కించుక్కు విభాష నగు, నగుచో డాకు లఘురేఫం బగు.
(తత్స. 15) శేషషష్ఠికి యొక్కయు నగు.
(సంధి. 34) షష్ఠీసమాసంబునం దుకారఋకారంబుల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు.
(అచ్ఛి. 25) సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు.
(సంధి. 3) సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు.
(కార. 8) సంప్రదానంబునకుం జతుర్థి యగు.
(క్రియ. 33) సంప్రార్థనంబున ముఱున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు.
(తత్స. 33) సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు.
(తత్స. 36) సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు.

(సమా. 8) సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు.
(తత్స. 80) సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు.
(సమా. 2) సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు.
(తత్స. 60) సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు. సంస్కృతసమాసంబునఁ గావు.
(క్రియ. 69) సృజికి నిర్మితిని గుణంబు లేదు.
(తత్స. 17) స్త్రీతిర్యగ్జడంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు.
(తత్స. 57) స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు.
(తత్స. 85) స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు.
(కార. 20) స్త్రీసమంబు లగువిశేషణంబులయు ముపర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.
(సమా. 6) స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు.
(క్రియ. 67) స్పృశికి గుణంబు విభాష నగు.
(తత్స. 59) స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁ బడు.
(తత్స. 67) హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు.
(ప్రకీ. 10) హాదులయు నీలుగు లోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగా నగు.
(సంజ్ఞ. 14) హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును.
(అచ్ఛి. 32) హ్రస్వముమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు.

00000 ఇతి శమ్ 00000